# సాహిత్యం–సత్త్వదర్శిని

డా. జె. కనకదుర్గ

జంకదు ప్రచురణలు,
గుంటూరు.

సాహిత్యం-సత్త్వదర్శిని

ప్రథమ ముద్రణ : జులై 2021

ప్రతులు : 500

ప్రచురణ :
జంకదు ప్రచురణలు,
గుంటూరు.

ప్రతులకు చిరునామా:
**డాక్టర్ జె.కనకదుర్గ**
ఇంటి నెం.5-35-18, 3వ లైను, 18వ క్రాస్ రోడ్డు,
బ్రాడీపేట, గుంటూరు.
ఆంధ్రప్రదేశ్-522002
చరవాణి-9491140299
E mail id-jankadu1953@gmail.com

ముద్రణ :
శ్రీశ్రీప్రింటర్స్, విజయవాడ
srisriprinter.vja@gmail.com
Ph : 9490634849

వెల : రు.150/-



# డాక్టర్ జంధ్యాల రామకృష్ణ

(సీనియర్ సైంటిస్ట్)

31.12.1949 - 15.1.1980

50 ఏళ్ళక్రితమే స్త్రీకి ఉన్నతవిద్య, ఉద్యోగం ఉండాలని నన్ను ప్రోత్సహించిన సహృదయుడు, బాబా అణు సంస్థలో సీనియర్ సైంటిఫిక్ ఆఫీసర్‌గా పనిచేస్తూ అకాలమరణం పొందిన మాఅన్నయ్య డాక్టరు జంధ్యాల రామకృష్ణ స్మృతికి "సాహిత్యం-సత్త్వదర్శిని" అనే ఈ గ్రంథాన్ని అంకితమిస్తూ.....

- డాక్టర్ జంధ్యాల కనకదుర్గ



# సత్యదర్శిని-సత్త్వదర్శిని

డాక్టర్ పాపినేని శివశంకర్
కేంద్రసాహిత్యఅకాడెమీ అవార్డుగ్రహీత

రోజూచూసే సూర్యోదయమేగదా! ఇవాళ కొత్తగా చూసేదేమిటి అనుకొంటే ఆ మనిషి ఆ పూటతో గిడసబారిపోయినట్టే. ఎప్పుడో తూకంవేసిన సాహిత్యమేగదా ఇవాళ కొత్తగా కనిపెట్టేదేమిటి అనుకొంటే ఆ విమర్శకుడు ఆ రోజుతో తనకు తాను ఫుల్ స్టాప్ పెట్టుకొన్నట్లే. చాలమంది విమర్శకులు ఎన్నడో రాసిన, ఎవరో రాసిన సంగతుల్నే/ ఉదాహరణల్నే తిరగేసి, మరగేసి చెప్తూ మన జ్ఞాపకశక్తిని బలిష్టం చేస్తూంటారు. ఆ తీరున వాళ్ళు తమకు తాము సౌకర్యంగా ఫుల్ స్టాప్ పెట్టుకోవటం మనకు తెలుస్తూనే ఉంటుంది. కొంతమంది స్త్రీవాద విమర్శకులు కూడా ఇందుకు అపవాదంకాదు. ఇంతకూ నేను చెప్పదలచిన సంగతేమిటంటే యితరులు చెప్పని ముచ్చట నువ్వేమన్నా చెప్పావా అని.

ఇదిగో, ఇక్కడే ఈ జంధ్యాల కనకదుర్గ (జం.క.దు.) ఆ పని చేసింది. ఇతరులు చదవనిదాన్ని పనిగట్టుకొని చదివింది. ఇతరులు చదివినదాన్ని ఇంకో మూలనుంచి చూసింది. ఆడకూతురు గనుక ఆడచూపే చూసింది. అయితే ఆ చూపులో వంకరతనం లేదు; సరళతే ఉంది. ఉష్ణోగ్రత లేదు; నులివెచ్చదనమే ఉంది. మగవాడిపై పగలేదు; వగ మాత్రమే ఉంది.

చరిత్ర రచనలో గాని, సాహిత్య పరంపరలో గాని కొన్ని కొన్ని ఖాళీలు మిగిలిపోతుంటాయి. కొన్నిప్రశ్నలకు సందేహాలకు సమాధానాలు అప్పటికి దొరకవు. సరికొత్త ఆధారాల వలన, పరిశీలనల వలన, పరిశోధనల వలన ఆ సందేహాలకు జవాబులు దొరికి, ఆ ఖాళీలు పూరించబడుతుంటాయి. ఈ క్రమంలోనే కొత్త విశ్లేషణలు, మూల్యాంకనాలు ఈ మధ్య సాహిత్యరంగంలో

సాగుతున్నాయి. సాహిత్య పునర్ విశ్లేషణ, మూల్యాంకన క్రమంలో ఈ రచయిత్రి కొన్ని సందేహాలకు చిత్తశుద్ధితో సమాధానాలు వెతికింది ఈ వ్యాససంపుటిలో.

సాహిత్యాన్ని సత్యదర్శినిగానేకాక సత్త్వదర్శినిగా కూడా దర్శించింది కనకదుర్గ. ఈ సత్త్వం స్త్రీ సత్త్వంకూడా. పురాణాలు, కావ్యాలు, కథల్లో చీకటి కోణం అట్టడుగునపడి కాన్పించని నిగూఢసత్యాలను సాహసించి వెలికితీసింది ఈ రచయిత్రి. అందులో అణగారిన స్త్రీమూర్తుల 'భయంకర బాధల పాటల పల్లవి' విన్పించింది. ఈ ఇరవై వ్యాసాలు చదువుతుంటే ఇంతకాలంగా మనం మామూలుగా చదువుతూ వస్తున్న సాహిత్యంలోనే యిన్ని స్త్రీసంబంధ నిగూఢ విషయాలు దాగున్నాయా అని ఆశ్చర్యం కలిగింది.

"గాథాసప్తశతిలోని బాధాతప్తసతుల్ని" చూస్తే చాలు కనకదుర్గ అవగాహన తెలుస్తుంది. పురుషస్వామ్య దృక్పథంలో వెలువడిన ప్రాచీన అలంకార శాస్త్రం గాథాసప్తశతిలోని గాథల్ని శృంగారప్రధానమైనవిగా, ధ్వనిసిద్ధాంతానికి లక్ష్యాలుగా గ్రహించింది. అయితే అందులోని ఎక్కువ గాథలు స్త్రీలవ్యధలను ప్రతిబింబించాయని ఈ రచయిత్రి విశ్లేషించింది. బహుభార్యాత్వం, అన్య సంబంధాలు, లైంగికపీడనలు, కుటుంబసంబంధాల్లో డొల్లతనాలు, ప్రేమకరువైన కాపురాలు– ఈ అనేక విషయాలలోని అసమనైతికసంస్కృతిలో గాయపడ్డ స్త్రీహృదయగాథలు కరుణరసానుభూతిని కల్గిస్తాయని సోపపత్తికంగా వివరించింది.

"స్త్రీనాయకంబైన చెడునంద్రు భూమి" అంటూ "పల్నాటిచరిత్ర"లో నాగమ్మ నాయకురాలిని గురించి పలువ్యాఖ్యానాలున్నాయి. ఆమెను "కుటిలురాలు" గానే ఆ చరిత్ర పరిగణించింది. అయితే దాని చాటున "నాయకురాలు నాగమ్మ" అనే జనప్రవాదమే ఆమె నాయకత్వ ప్రతిభకు నిదర్శనమని కనకదుర్గ నిర్ధారించింది. ఆమెను కుటిలురాలుగా కాక రాజభక్తి పరాయణురాలుగా గుర్తించింది. ఆమెలోని ధీరగుణాన్ని పైకెత్తి ప్రదర్శించింది.

లోకంలో "పల్నాటిచరిత్ర"గాని, దానిని ఆదరించిన లోకం గాని బ్రహ్మనాయుడు పక్షంగానే కనపడతాయి. దానికి భిన్నంగా రచయిత్రి ఆ 'దూఱు'(నింద) పడిపోయిన నాయకురాలు పురుషదురహంకారాన్ని ఎదిరించటంలోని ధీరగుణాన్ని ప్రశంసించింది.

అట్లాగే కాకతీయ రుద్రమదేవిని నారీశక్తికి ప్రతీకగా గుర్తించింది ఈ రచయిత్రి. 'ప్రపంచ చరిత్రలో యుద్ధాలు చేసిన ప్రథమరాణీ విజేతగాను, మహిళల పరాక్రమశక్తికి ప్రతీకగాను నిలిచింది' అనికొనియాడింది. ఆ ఊపులో రచయిత్రి ఇంకాస్త ముందుకుపోయి, 'ఎఱ్ఱన, పోతన, నాచనసోమనలు తమ కావ్యాలలో రాణి రుద్రమదేవి పరాక్రమశక్తిని సత్యభామపాత్రకు ఆపాదించారు' అని నిర్ధారించింది. ఈ సందర్భంగా ఆమె పోతన 'భాగవతం'లో, ఎఱ్ఱన 'హరివంశం'లో, నాచనసోమన 'ఉత్తరహరివంశం'లో సత్యభామ నరకాసురుడితో తలపడ్డ సన్నివేశాలను ఉదాహరించింది. నిజమే, ఆ కవులు వర్ణించిన సత్యభామ యుద్ధం ఆ కథలకు మూలమైన సంస్కృత హరివంశంలో లేదు. అవి ఆ కవుల స్వకపోలకల్పితాలే. సందేహంలేదు. అయితే ఆ కల్పనలకు రాణి రుద్రమదేవి యుద్ధ విజయగాథలే మూలమని తీర్మానించటం అంత తేలిక కాదు. ఎందుకంటే రుద్రమదేవిది చరిత్ర మార్గం. కవులది పౌరాణిక రచనామార్గం. ఎఱ్ఱన, పోతన, నాచనసోమనలు స్థానిక చరిత్రనుండి స్ఫూర్తి పొందారని చెప్పటానికి సరైన ఆధారంలేదు. ఆధారంలేనప్పుడు అది నిర్ధారణకాజాలదు. చక్కని ఊహమాత్రమే అవుతుంది.

'సుభద్రాపరిణయం' తాళ్ళపాక తిమ్మక్క వ్రాయలేదని తాపీ ధర్మారావు వంటి పండితులు అభిప్రాయపడినా, వేటూరి ప్రభాకరశాస్త్రి, ఆరుద్ర తిమ్మక్క కర్తృత్వాన్ని సమర్థించారు. మంజరీద్విపదలో రచించిన ఆ కావ్యాన్ని తరచి చూస్తే అందులో స్త్రీహృదయస్పందనని గుర్తించవచ్చు. ఆడపిల్లల సోకులు, బొమ్మలపెళ్ళిళ్ళు, పెళ్ళివేడుకలు, అప్పగింతలు, మగవారిపోకిళ్ళపై విసుర్లు– ఈ అంశాలే అందుకు నిదర్శనాలు. కవయిత్రి సుభద్రను తెలిగింటి ఆడబడుచుగా

అలంకరింప జేసిందని, సుభద్ర మనోభావాలు తెలుగుపడుచులు తమలోకి తాము తొంగి చూసుకునేటట్లు చేసిందని సరిగ్గా గుర్తించింది. రుక్మిణి సుభద్రకు అప్పగింతలు పెడుతూ ఇట్లా చెపుతుంది:

> "పొలతి నమ్మగరాదు పురుషులనెపుడు
> పలురీతి కృష్ణసర్పములై యుండ్రు"

ఆ అప్పగింతలు జానపదగేయాల్లోని వాటికి భిన్నంగా మగవాళ్ళ పోకిళ్ళపట్ల జాగ్రత్తగా ఉండమని చెపుతున్నవి కనుకనే ఆధునికయుగంలో లైంగికభద్రత కరువైన ఆడపిల్లలకు 'సుభద్రాకల్యాణం' 'కన్యకాభద్రగీత' కాగలుగుతుందని రచయిత్రి ఆశించింది. నిజానికి ప్రాచీనసాహిత్యంనుంచి ఈ ఆధునిక అన్వయాలనే మనం కోరుకోవలసింది.

తరిగొండ వెంగమాంబ సాహిత్యచరిత్రలో మట్టిలో మాణిక్యంవంటిది. సంప్రదాయ బ్రాహ్మణకుటుంబంలో పుట్టిన వెంగమాంబ బాలవితంతువు. అయితే బ్రాహ్మణాచారంపై తిరగబడి బొట్టు, గాజులు, తాళిబొట్టు, రంగులదుస్తులువంటి వేటినీ తొలగించలేదు. యోగాభ్యాసం చేసింది. విష్ణుపారిజాతం, చెంచునాటకం మొదలైన యక్షగానాలు, నృసింహశతకం, శ్రీవేంకటాచలమాహాత్మ్యము మొదలైన పద్యకృతులు, ద్విపద వాసిష్ఠరామాయణము, గోపికానాటకం (గొల్లకలాపము)– ఇట్లా అనేకరచనలు చేసింది. తరిగొండలో వెలసిన నృసింహస్వామిపై రచించిన 'నృసింహశతకము' గురించి కనకదుర్గ అనేక విశేషాలు తెలియజేసింది. ముఖ్యంగా స్త్రీలు గుట్టుగా చెప్పుకొనే మూడ్రోజుల ముట్టు పేరుతో వారిని విడిగా ఉంచి, పాపం అంటూ స్నానాలు చేయించే ఆచారాన్ని విమర్శించి ప్రస్తావించటంలో వెంగమాంబ ఆధునిక దృక్పథం వెల్లడి అవుతుంది.

సత్యం శంకరమంచి 'అమరావతి కథలు' తెలుగు కథాసాహిత్యంలో ప్రాంతీయచిత్రణకు పాదులు తీసాయి. (అయితే అవి ప్రాంతీయభాషలో ప్రతిఫలించలేదు.) 'వరద' లాంటి కథలుచదివితే కృష్ణానది వరద బీభత్సం

నేపథ్యంలో ప్రస్ఫుటమైన కులమతాతీత మానవత్వాన్ని రచయిత గుర్తించిన తీరు మనసుకు హత్తుకొంటుంది. భూస్వామ్యం, పెట్టుబడిదారీ వ్యవస్థల్లో నలిగిపోయే సామాన్యజీవుల మూల్గుల్ని ఆ కథలు వాస్తవికంగా, కరుణాత్మకంగా చిత్రించాయి. ఈ రచయిత్రి ఆ కథలు కొన్నింటిలో ద్యోతకమయ్యే మహిళా సాధికారతత్వాన్ని పసిగట్టింది. భర్త మరణానంతరం స్త్రీలు బొట్టు పెట్టుకోరాదనే ఆచారాన్ని ప్రశ్నించే తీరున రాసిన 'పూల సుల్తాన్', 'టపా రాలేదు బొట్టు చెరగలేదు' కథల్ని రచయిత్రి ప్రస్తావించినప్పుడు నా కవిత 'బొట్టుతో పాటు' గుర్తొచ్చింది. అమరావతి కథల రచనాకాలం నాటికి (1978) తెలుగునాట స్త్రీవాదం జాడలేదు. కనుక ఆ విధంగా ఆ కథలు ప్రత్యేకమైనవని రచయిత్రి సరిగ్గా అంచనా వేసింది.

పదిమాటలు మాట్లాడితే ఏదో ఒక సామెత మన నోటినుంచి వెలువడాల్సిందే. అయితే ఆ సామెతల్లో దాగిన స్త్రీ వివక్షగురించి పట్టించుకోం. ఈ రచయిత్రి పట్టుకొంది. 'తెలుగు సామెతలలో సమిధలు–చైతన్యదీప్తులు' అనే విశ్లేషణాత్మక వ్యాసమే నిదర్శనం.

"సాహిత్యంలో సహజీవనం–నవజీవనం" అనే వ్యాసం నాకెంతో ఆశ్చర్యం కల్గించింది. సాధారణ స్త్రీవాదానికి భిన్నంగాసముచిత ప్రతిపాదనలు చెయ్యటమే అందుకు కారణం. రంగనాయకమ్మ, ఓల్గా మొదలు స్త్రీవాదులు పెళ్ళి అనేది ఒక తంతుగా మారిందని, కుటుంబ చట్రంలోస్త్రీకి వెసులుబాటు లేకుండా పోయిందని విమర్శించారు. పెళ్ళికి బదులు సమానావగాహనతో సహజీవనం ఆరోగ్యకరమైన సంబంధాలకు దారి తీస్తుందని ప్రతిపాదించారు. "అయితే ఏ స్థాయిలో పెళ్ళి, కుటుంబం మహిళలపీడనకు గురి చేస్తుందని భావించారో, అదే స్థాయిలో ప్రస్తుత సమాజంలో సహజీవన సంస్కృతికి మహిళలు బలి అవుతున్నారు. సాహిత్యంలో సత్ఫలితాలిచ్చిన సహజీవన సంస్కృతి సమాజంలో విఫలంగా కన్పడుతోంది." అని కనకదుర్గ విచక్షణతో నాణానికి రెండోవైపు చూపించింది."స్వీయనియంత్రణ కలిగి ఏకనిష్ఠమైన, ఏకకాల లైంగిక

సంబంధాలు స్థిరంగా ఉండగలిగే సామాజిక సంస్కృతిని ఏర్పరచుకోవాలి. సామాజిక బాధ్యత లేని స్త్రీపురుషస్వేచ్ఛాయుత సంబంధాలు సమాజానికి అనర్థదాయకంగా పరిణమిస్తాయనే ఆలోచనకూడా అవసరం – అని తెగేసి చెప్పేసింది. స్వేచ్ఛపేరుతో సమాంతర ప్రేమల్ని, అనేకలైంగిక సంబంధాల్ని, స్వలింగసంపర్కాల్ని సమర్థించేకాలంలో ఈ రచయిత్రి మాటలు ఎంతవరకు మింగుడుపడతాయో చూడాలి.

ఇంకా 'వసుచరిత్ర' కావ్యంలో ప్రతిఫలించిన పురుషాధిపత్యం గురించి, స్త్రీల సాహిత్యంలో దేశభక్తి గురించి, మరెన్నో విషయాల గురించి కనకదుర్గ చేసిన ప్రతిపాదనలు మన ఆలోచనల్ని ప్రేరేపిస్తాయి.

సామాజికసంస్కృతికి నూతన విలువల్ని సంతరింప చేయటమే గుణాత్మక విమర్శ కర్తవ్యమని తొలివ్యాసంలోనే కనకదుర్గ ప్రకటించింది. మానవసంబంధాల అభివృద్ధే దాని పార్యంతికఫలం. ఈ కర్తవ్యాన్ని తన గుణాత్మక విమర్శద్వారా రచయిత్రి సక్రమంగా నిర్వర్తించింది. రచయిత్రుల్లో విమర్శకులు తక్కువ. తక్కువలో తక్కువ. కనుక ఇటువంటి సద్విమర్శనాత్మక రచనలు ఎంత విరివిగా వస్తే అంతగా మన సాహిత్యలోకం సంపద్వంతమవుతుంది.

ఇంతకీ ఈ "జంకని", వడి గల మాటల కనకదుర్గ ఎం.ఏ.చదువులో నాకు రెండేళ్ళు సీనియర్ విద్యార్థిని అని ఆలస్యంగా తెలిసింది. సతీర్థులం అన్నమాట. మహాపండితులైన ఓరుగంటి నీలకంఠశాస్త్రి, ఎస్వీ.జోగారావు, కొర్లపాటి శ్రీరామమూర్తి, బొడ్డుపల్లి పురుషోత్తం మాకు సమానంగా గురువులు. వారినుంచి మాకు తెలుగుభాషా సాహిత్యాలపట్ల వల్లమాలిన ప్రేమ, శ్రద్ధ అలవడ్డాయి. వాటిని సార్థకం చేస్తున్నందుకు ఆమెను మరీ మరీ అభినందిస్తాను. తన రచనాశైలిని స్థిరపరచుకొంటూ, వాక్యనిర్మాణ సారళ్యాన్ని మెరుగుపరుచు కొంటూ ఈ ఋజుమార్గంలో మరింత ముందుకు వెళ్ళగలదని ఆశిస్తున్నాను.

**– డాక్టర్ పాపినేని శివశంకర్**



**డాక్టర్ మృణాళిని**

ఏ సాహిత్యాన్నయినా పునర్మూల్యాంకనం చేయడం పాఠకుల/విమర్శకుల హక్కు. ఎందుకంటే రచయిత ఒకరే. రచన ఒకటే. కానీ పాఠకులు అనేకం. రచయిత ఒక కాలంలోనే జీవించివుంటాడు.

కానీ పాఠకులు అనేక కాలాల్లో ఉంటారు. అందుకే ఏ రచనకైనా కొత్త వ్యాఖ్యానం, కొత్త విమర్శ రావడం ఎప్పటికీ ఆహ్వానించదగ్గవే. 1980 దశకంలో స్థిరపడిన అస్తిత్వ ఉద్యమాలు తమ కార్యక్రమంలో ముఖ్యభాగంగా చేసుకుంది ప్రాచీన సాహిత్య విమర్శ. ఆ కోవలో ఇప్పటివరకూ వచ్చిన స్త్రీవాద విమర్శకు మరో విలువైన చేర్పుగా చెప్పదగింది జంధ్యాల కనకదుర్గ గారి 'సాహిత్యం - సత్యదర్శనం'. 21 వ్యాసాలున్న ఈ గ్రంథంలో హాలుడి గాథాసప్తశతి నుంచి ఓల్గా యశోబుద్ధ వరకు నిశితమైన పరిశీలనలు, ఆలోచనలు రేకెత్తించే ప్రతిపాదనలు కనిపిస్తాయి.

తెలుగు సాహిత్య విమర్శలో సంప్రదాయ సాహిత్యాన్ని స్త్రీవాద దృష్టితో విశ్లేషించిన వారిలో కాత్యాయనీ విద్మహే, జానపద సాహిత్యాన్ని స్త్రీవాద దృష్టితో విశ్లేషించిన వారిలో రావి ప్రేమతలను ముందుగా చెప్పుకోవాలి. వీళ్లిద్దరి సాహిత్య వారసత్వాన్ని అంది పుచ్చుకున్నారా అన్నట్టుగా సాగుతుంది కనకదుర్గ విమర్శ. తన విమర్శ 'సామాజిక చలన సూత్రాల ఆధారంగా చేసే గుణాత్మక విమర్శ' అని చాలాసార్లు రచయిత్రి స్పష్టం చేశారు. అంటే తన విమర్శనాపద్ధతిని ఆమె ముందే నిర్వచించుకున్నారు. ఎటువంటి రచననైనా స్త్రీ దృష్టికోణం నుంచి చూసి, తన అభిప్రాయాలను సూటిగా, ఘాటుగా వ్యక్తం చేస్తారు. చాలావరకు, తన భావోద్వేగంతోనూ, తార్కిక విశ్లేషణతోనూ పాఠకులను ఒప్పించగలుగుతారు.

ఇందులోని వ్యాసాల్లో ప్రధానమైన దృష్టికోణం పితృస్వామ్య వ్యవస్థలో లైంగిక సంబంధాలకు, స్త్రీలలోని లైంగిక అభద్రతకు సంబంధించింది. భారతంలోనైనా, సుభద్రాకల్యాణంలోనైనా, గాథాసప్తశతిలోనైనా, వసుచరిత్రలో నైనా ప్రధానంగా ఈ దృష్టినుంచే విమర్శ సాగింది. 'గౌరవంగా కనిపించే వైవాహిక సంబంధాల్లోనూ, బలాత్కారాలుగా పేర్కొనకపోయినా బలాత్కారాలే అయిన (మత్సగంధి, శుక్తిమతి) సన్నివేశాల్లోనూ స్త్రీల పట్ల జరిగిన అన్యాయాన్ని రచయిత్రి నిలదీసి ప్రశ్నిస్తారు.

ప్రతి ప్రాచీన కావ్య చర్చలోనూ, ఆ సన్నివేశాలను ఆధునిక సమాజంతో అన్వయం అన్వేషించి చెప్పడం ఒక ప్రత్యేకత. వసుచరిత్రను ఎందుకు చదవాలి అంటే అందులోని శ్లేష కోసం, సంగీతాత్మక రచన కోసం అని పండితులు చెప్తారేమో కానీ వసుచరిత్ర చదివితే స్త్రీలు తమ జీవితాలకు పొంచివున్న ప్రమాదాలను మరింత బాగాఅర్థంచేసుకుని, తీర్చిదిద్దుకోగలరని చెప్తారు ఈమె. సుభద్రాపరిణయం చక్కని గానయోగ్యమైన మంజరీ ద్విపద లో తొలి తెలుగు కవయిత్రి రాసిన కావ్యమని అందరూ సరిపెట్టుకుంటే, పురుషుల స్వార్థపరత్వాన్ని గురించి హెచ్చరించే తొలికావ్యమని అంటారు కనకదుర్గ. 'రవి గాంచని చోట కవి గాంచును' అన్న నానుడిని విస్తరిస్తూ, 'కవి గాంచని చోట విమర్శకుడు గాంచును' అని చెప్పాల్సి వస్తుంది కనకదుర్గ విశ్లేషణను చూసినపుడు.

గాథాసప్తశతిలోని 'కథ'లను స్థూలంగా చూసినపుడు, స్త్రీల కామవాంఛలకు సంబంధించిన గాథలే ఎక్కువగా ఉన్నట్టు అనిపిస్తుంది.కానీ కామవాంఛగా కనిపించే దాని వెనక ఉన్న విషాదాన్ని, స్త్రీలు చెప్పిన గాథల్లో పితృస్వామ్య సంస్కృతికి బలైన వారి వేదనను గుర్తించి సోదాహరణంగా చెప్పారు కనకదుర్గ.

'పల్నాటిపోరు– పలుగాకుల హోరు' వ్యాసం నాగమ్మ ఎలా పితృస్వామిక సాహిత్య సామాజిక చరిత్రలో 'విలన్' అయిందో నిరూపిస్తుంది. ఈ విషయంపై సుప్రసిద్ధ జానపద పరిశోధకురాలు డా. రావి ప్రేమలత సాధికారతతో రాసిన వ్యాసానికి ఇది కొనసాగింపులా అనిపిస్తుంది. (కనకదుర్గ గారు ప్రేమలత వ్యాసం చదివిందీ లేనిదీ తెలీదు). సామెతల్లో స్త్రీ వ్యతిరేకత, స్త్రీలను కించపరచడం అన్నది కూడ రావి ప్రేమలత, కురుగంటి శ్రీలక్ష్మి వంటి జానపద పరిశోధకులు ఇదివరకు తడిమిన తోవలే. దీనికి కనకదుర్గ గారు సైద్ధాంతిక ప్రాతిపదికను అందించి చేసిన విశ్లేషణ మరింత సమగ్రతను చేకూర్చింది.

తరిగొండ వెంగమాంబ ఆచరణలోనూ, రచనలోనూ 'తొలి స్త్రీవాదే'. ఈ విషయాన్ని మరోసారి గుర్తు చేశారు ఈమె. ఇద్దరు మహిళా శతకకర్తల గురించి రాసిన వ్యాసాలు (దార్ల సుందరమ్మ, వేమూరి శారదాంబ) కొత్త విషయాలను ప్రతిపాదిస్తాయి. శతక కర్తలుగా స్త్రీలను ఇంత లోతుగా చర్చించిన వారు నాకు తెలిసి ఎవరూ లేరు. విమర్శను, పరిశోధననూ సమానంగా అందించిన రచన ఇది. ఈ రెండు వ్యాసాలు, స్త్రీల కవిత్వంలో దేశభక్తి వంటివి

పరిశోధనాత్మకాలే. దేశభక్తి అంటె జాతీయోద్యమంలో రాసిన వారితో ఆగిపోక, సమకాలీనంగా రాస్తున్న కవయిత్రులను కూడ పస్తావించడం ఈవ్యాసానికి సమగ్రత చేకూర్చింది. దేశభక్తి అన్న పదానికి సరికొత్త నిర్వచనం ఇచ్చిన విశ్లేషణ ఇది.

భాగవతం, హరివంశాల్లోని సత్యభామ చిత్రణ, రుద్రమదేవి రేకెత్తించిన స్ఫూర్తి వల్లనేననడంలో కొంత అత్యుత్సాహం కనిపించినా, శమంతకమణి కావ్యంలో బేతవోలు రామబ్రహ్మంగారు తీర్చిదిద్దిన జాంబవతి పాత్ర విషయంలో ఆమె ఉత్సాహం రమణీయంగానూ, సహేతుకంగానూ ఉంది. ఏ కవి అయినా స్త్రీని 'హైలైట్' చేసి రాస్తే కనకదుర్గగారికి పండగే. అందుకే మనం చెప్పుకునే పురాణకథలో ఉయ్యాలలో బిడ్డగా ఉన్న జాంబవతిని రామబ్రహ్మంగారు ఒక సాహసవంతురాలైన యువతిగా చూపినపుడు ఆమె ప్రశంసలను నిర్ద్వంద్వంగా అందుకున్నారు. జైమిని భారతంలోని ప్రమీల చిత్రణలో, అమరావతి కథల్లో ఎందరో మహిళల చిత్రణలో ఇది వరకూ ఎవ్వరూ గమనించని ఎన్నో లోతులను తవ్వి తీయడం వెనక ఈ ఆనందమే ఉంది.

సాహిత్యంతో పాటు, సమాజాన్ని, సామాజిక పరిణామాలను ఎంతో సునిశితంగా గమనించే కనకదుర్గగారు ఈ వ్యాసాల్లో ఒక్క సాహిత్య విమర్శకురాలిగానే కనిపించరు. ఒక సామాజిక, చారిత్రక శాస్త్రవేత్తగా కూడ కనిపిస్తారు. బహుశా ఈ సామాజిక లక్షణం కొంత ఎక్కువ పాలుండడం వల్లనేమో, కనకదుర్గగారి భాష, వాక్య నిర్మాణం కొంత అసంతృప్తిని కలిగిస్తాయి.

ఎంతో విలువైన విషయాలను ప్రతిపాదించిన రచనలో సంక్లిష్ట వాక్యాలను తగ్గిస్తే ఇంకా బాగుండేది. చెబుతున్న విషయంలో ఎంతో సత్తువ ఉన్నపుడు, భాషను ఇంకాస్త సుబోధకం చేసివుంటే మరింత పఠనీయంగా ఉండేది. సృజనాత్మక రచనల్లో అస్పష్టత, అయోమయం ఫర్వాలేదు కానీ, విమర్శలో వాక్యం సరళంగా ఉంటే తప్ప సామాన్య పాఠకులకు ఎక్కదు. ఈ విమర్శన గ్రంథం సామాన్య పాఠకులకు కూడా అవసరమైంది కనకే ఈ సూచన!

శోధన, అధ్యయనం, నిబద్ధత, బహువిషయపరిజ్ఞానం, నిర్భీతి వంటి మంచి విమర్శక లక్షణాలు పుష్కలంగా ఉన్న కనకదుర్గ తను ఎత్తిన ఈ స్త్రీవాదపు ఖడ్గాన్ని ఎప్పటికీ దించవద్దని కోరుతూ,

**– డాక్టర్ మృణాళిని**



డాక్టర్ జంధ్యాల కనకదుర్గ

## 'సాహిత్యం-సత్త్వదర్శిని'

నిరంతర తెలుగుసాహిత్య విద్యార్థినిగా పెరిగిన ఆలోచనలతో చేసిన విమర్శలో ఒక గుణాత్మకతను గుర్తించటం జరిగింది. కావ్యగత కథావస్తుగమనంలో సహజత్వానికి భిన్నమైన వక్రతగా సంక్లిష్టత ఏర్పడినప్పుడు నిర్దేశితమైన సామాజికవ్యవస్థయొక్క ప్రయోజనం సిద్ధించగల విషయపరిణామం అవగాహన వచ్చింది. సాహిత్యం ఆ యా కాలాలనాటి సమాజప్రతిఫలనం కాబట్టి, కథావస్తుగమనంలో ఒక వక్రత కనపడినప్పుడు అక్కడల్లా నాటి సమాజాన్ని నిర్దేశించిన సాంస్కృతిక శక్తులను గుర్తించటం జరిగి, వాటికున్న ఆర్థిక-రాజకీయ స్వభావాన్ని గ్రహించటం జరిగింది. తత్ఫలితంగా సత్యావిష్కరణ స్పష్టమై సాహిత్యపు నూతన విలువలను అవగాహన చేసుకోవటం జరిగింది. దానినే ఒక గుణాత్మక విమర్శగా భావించి, ఆ దృష్టితో చేసిన పరిశోధనలో నూతనవిలువలనే జ్ఞానకాంతులప్రసరణ లక్ష్యంగా సాగిన వ్యాసాలనుకూర్చి **'సాహిత్యం-సత్త్వదర్శిని'** అనే పుస్తకరచనను పాఠక సహృదయులకు అందించాలనుకోవటం జరిగింది. కావ్యరచనా కాలక్రమాన్ని పాటిస్తూ ఈసంపుటిని ప్రచురణకై కూర్చటం జరిగింది. ఇక్కడ సత్త్వం అంటే సాహిత్యాంశంలోని జ్ఞానప్రకాశనం అని అర్థం. సాహిత్యం ఒక ఊటబావి. ఎప్పటికప్పుడు అందులోని సాహిత్యాన్ని అందుకుంటూ, అందుబాటులో ఉన్నదాన్ని ఆశ్రయించటం జరిగింది. తెలుగుసాహిత్యాన్ని అన్వేషించే కొద్దీ లభ్యమయ్యే సాహిత్యం ఇంకా మిగిలేఉంటుంది.

ఈవ్యాస సంపుటికి మునుపే 2010 లో 'తెలుగు సాహిత్యం-మహిళా చైతన్యప్రస్థానమ'నే పుస్తకంలో పత్రికలలో ప్రచురించబడిన స్వీయరచనలైన విమర్శను, వ్యాసాలను పొందుపరచి గ్రంథాన్ని పాఠకులకు అందించటం జరిగింది. అందులోని కొన్ని విషయాలు దీనిలో 'గుణాత్మక విమర్శ' అనే శీర్షిక

క్రింద ప్రస్తావనకు రావటం జరిగింది. దానికి కొనసాగింపుగా 2013 నుండి వివిధ పత్రికలలోను ప్రచురింపబడిన స్వీయరచనలను ఆయా పత్రికాధిపతుల సౌజన్యంతో ఈగ్రంథంలో పొందుపరచటం జరిగింది.

ఆ క్రమంలో 2014లో నవ్యాంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు, చారిత్రకమైన ధరణికోటయే నేటి రాజధానియైన అమరావతి కేంద్రంగా వచ్చిన సాహిత్యాన్ని పరిశీలన చేయటం జరిగింది. క్రీ.శ. 1వ శతాబ్దం నాటి ఆంధ్రశాతవాహనుల నాటి సాంఘికచరిత్ర ప్రతిఫలించిన గాథాసప్తశతి కావ్యాన్ని అధ్యయనం చేయాలనే అభిలాష కలిగి, ప్రాకృత, సంస్కృత, తెలుగుఅనువాదంగల గ్రంథం లభించటంతో పరిశీలించటం జరిగింది. వాత్స్యాయనుని కామశాస్త్రం ప్రకోపింపచేయటంతో నాటి గ్రామీణ జీవితంలో శృంగార రసానుభూతికి ప్రాధాన్యత పెరిగింది. వాణిజ్య వర్తకులు పాదచారులై చేసిన దూరప్రయాణంలో, సాగువిరామ సమయంలోనూ రైతులు ప్రక్క ఉళ్ళకు వెళ్ళటంచేత అన్యస్త్రీసంబంధాలు పెట్టుకొనే జీవనవిధానం చోటుచేసుకోవటం జరిగింది. తత్ఫలితంగా నాటి ఆంధ్రసామ్రాజ్యంలో స్త్రీలందరూ తమబాధలను ఎవరితో చెప్పుకోవాలో తెలియక గాథల రూపంలో చెప్పుకున్న వాటియొక్క నమోదు(రికార్డు)యే గాథాసప్తశతి అని అర్థంఅయింది. పైకి శృంగార కావ్యంగా భావింపబడ్డా, శూన్యమనస్కులైన కుటుంబ స్త్రీల కన్నీటిలోని అంతర్గత సత్యం సహృదయుల్ని కదిలించక మానదు. 12వ శతాబ్దం నాటికే ఒక స్త్రీ రాజనీతిజ్ఞురాలైతే పితృస్వామ్యం దానిని 'కుటిలత్వంగా' ప్రచారం చేయటంలోని కుట్ర 'పల్నాటియుద్ధమ'నే చారిత్రక కావ్యంలో అర్థమవుతుంది.

ఆ క్రమంలోనే కథాగమన వక్రతలో భాగంగానే ఎర్రన, పోతన, నాచన సోమనలు చేసిన సత్యభామ పరాక్రమ వర్ణనల సందర్భంలో, 13వ శతాబ్దపు చారిత్రక స్త్రీయైన రుద్రమదేవియొక్క భౌతిక శక్తియుక్తులు పరోక్షంగా ప్రతిఫలించిన సాహిత్యంగా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. దీనికి ముందే 13వ

శతాబ్దానికి మహారాష్ట్రకవి జైమిని సంస్కృతంలో వ్రాసిన "అశ్వమేధపర్వమ"నే భారతంలోకూడా ప్రమీల వంటి స్త్రీశక్తుల విలక్షణత్వం కన్పడుతుంది. దీనినే పిల్లలమర్రి పినవీరభద్రుడు జైమిని భారతమను పేరన తెనిగించాడు. ఇందులోని స్త్రీపాత్రల సంభాషణలలో లోకభిన్నత్వపు వక్రత గోచరిస్తుంది. అయితే అందులోనే పితృస్వామ్యసంస్కృతికి విసిరిన సవాళ్ళు అర్థమవుతాయి. తొలితెలుగు కావ్యయిత్రి అయిన తాళ్ళపాక తిమ్మక్క భారత కథావస్తువును తీసుకొని సుభద్రకు పదహారణాల తెలుగు పడుచుదనాన్ని రంగరించి కన్యకా ప్రేమికులకు ఉన్న పరిధిని తెలియచేసే భద్రగీతగా వ్రాసిన విషయం అర్థమైంది.

తొలి శతకకర్తయైన తరిగొండ వెంగమాంబ భక్తి ప్రవత్తులకంటె కూడా ఆందోళనలు లేని స్థిరమనస్తత్వానికై జ్ఞానానుభూతినిపొందే యోగమార్గాన్ని ఒక స్త్రీగా చెప్పటంతోపాటు కుటుంబ సంబంధాలలోని అంతర్గత హింసాప్రవృత్తిని నిర్భయంగా బయటపెట్టింది.

ఆధునిక కాలంలోని కందుకూరి వీరేశలింగం గారి 'ఆఁడు మళయాళం'లో జైమిని భారతపు ఛాయలు కనబడినా, పితృస్వామ్యం తిరగబడితే సత్యం ఎలా ఉంటుందో ప్రాదేశికయాత్రలో భాగంగా తెలియజేయటం మానవ సంస్కారానికి బాటలు వేయటంగా అర్థం అయింది. అలాగే భారతదేశ స్వాతంత్ర్య సాధనలో మరుగున పడిన ఎంతోమంది స్త్రీల ఉద్యమసాహిత్య చైతన్యం తెలుగు సాహిత్యపు శూన్యంలోనుండి ఉద్భవించిన నీలోత్పలాలవలె స్పష్టమై స్త్రీలు ముందుండి ప్రజలలో దేశభక్తిని నింపిన సత్యం అర్థం అయింది. ఆ క్రమంలోనే స్త్రీల దృష్టిలో సాహిత్య ప్రమాణాలను పేర్కొనటం జరిగింది.

1978 నాటి సాంఘిక జీవనవిధానాన్ని ప్రతిఫలింపచేస్తూ అమరావతిలో పుట్టి పెరిగిన సత్యం శంకరమంచి వ్రాసిన 'అమరావతి కథ'లలో నాటిస్త్రీలు స్వేచ్ఛకై తపనపడి స్వతంత్ర వ్యక్తిత్వాలను కోరుకొన్న అస్తిత్వపు ఉనికి స్పష్టమైంది.

ప్రపంచీకరణ సందర్భంలో విస్తృతమైన స్త్రీల చైతన్యస్థాయి స్త్రీలు ఎదగటానికి గాని, స్వీయ వ్యక్తిత్వాలను రూపొందించుకోవటానికి గాని ప్రధాన అడ్డంకిగా ఉన్న, పెళ్ళిని, కుటుంబాన్ని విమర్శకు పెడుతూ ఆర్థికస్వాతంత్రం, సాధికారికతకై వేసిన అడుగుల పరిణామంలో సహజీవన సంస్కృతి చోటుచేసుకున్న సాహిత్యం వచ్చింది. విద్యావంతులు, ఆత్మగౌరవం, ఆర్థిక స్వాతంత్రం, స్వీయ చైతన్యం గలవారి విషయంలో సహజీవనం సఫలమవుతుం దనుకున్నా, సమాజంలో నిరక్షరాస్యత, ఆర్థికలోటుగల స్త్రీలవిషయంలో అదొక సాంస్కృతిక లైంగిక దోపిడీగా మారిన వక్రతగా విషాదాంతమై చీకటి నీడలు పరచుకున్న సత్యం బోధపడింది.

నిస్వార్థమైన ప్రేమ, మానవత్వంగల కుటుంబ సంబంధాలలో స్త్రీలు, పురుషులు సహకరించుకుంటూ పోతే అదే జ్ఞానమార్గమై సత్యమార్గన్ని బోధించటాన్ని ఓల్గా వ్రాసిన 'యశోబుద్ధ' లో గోచరిస్తుంది. మహిళా స్వేచ్ఛా చైతన్యంతోపాటు మహిళాసామర్థ్య నిర్మాణం ఏర్పడటం అనివార్యం. పల్లెల్లోనే గాక పట్టణాలలోను జనం మాతృభాషాభిమానంతో వాడే సామెతలలోని లింగ వివక్ష పితృస్వామ్య సంస్కృతిని కొనసాగిస్తుందనే సత్యం తెలిసి అటువంటి నుడికారాలు స్త్రీల అభివృద్ధికి ద్రోహం చేస్తున్నాయనే గ్రహింపు గలిగింది. ఈ సందర్భంగా రావి ప్రేమలతగారి రచనలను చదవనందుకు విచారిస్తున్నాను. ఎవరి ఆలోచన వారిదే. విమర్శకురాలిగా రచయిత స్వీయజ్ఞానపరిధిలో తట్టిన సత్యావిష్కరణను తెలియచేయాలనే తపనతో పాఠకులముందుకు ఈ రచనను తేవటం జరిగింది.

నా అభ్యర్థనను స్వీకరించి ఈ ప్రయత్నాన్ని ప్రోత్సహిస్తూ ముందు మాటలు వ్రాసి పుస్తకానికి మరింత విలువలను సంతరింపజేస్తూ పాఠకచైతన్యం కలిగించిన కేంద్రసాహహిత్య అకాడెమి పురస్కార గ్రహీత, కథకులు, కవులు, విమర్శకులు బహుగ్రంథరచయిత శ్రీ పాపినేని శివశంకర్ గారికి, అభివందనల ఆత్మీయకృతజ్ఞతలు.

తీరికచేసుకొని కష్టపడి చదివి ఈరచనకు మరింతగా విలువ కలిగేవిధంగా నిష్పక్షపాతంగా రచనాంశాలను మెచ్చుకొంటూనే అవసరమైన సూచనలను చేసిన బహుగ్రంథ రచయిత్రి, పరిశోధన విద్యార్థులకు ప్రచోదకశక్తి, ప్రాక్పశ్చిమ ఖండాలలోని విద్యార్థులకు బోధనావారధి, శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, పూర్వఆచార్యులు మృణాళిని గారికి కృతజ్ఞతాభివందనాలు.

కావ్య పఠనానికి వీలుగా గ్రంథాలను అందుబాటులో ఉంచి అనుమతిచ్చిన అన్నమయ్య గ్రంథాలయం గుంటూరు వ్యవస్థాపక నిర్వాహకులు లంకా సూర్యనారాయణగారికి గౌరవపూర్వక కృతజ్ఞతాభివందనాలు. ఈప్రక్రియలో సహకరించిన జీవితసహచరులు శ్రీ ఎమ్.వి.శాస్త్రి, తదితర కుటుంబసభ్యులకు, పత్రికా యాజమాన్యాలకు, సాంకేతిక సహకారులకు, ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహకరించిన సాహిత్యమిత్రులకు కృతజ్ఞతలు చెప్పటం నాకర్తవ్యం.

ఈ పుస్తకాన్ని చదివే పాఠకుల అవగాహన కోసం అవసరమైన సాహిత్యాంశాలను విపులీకరించి యివ్వటం జరిగింది. పాఠకచైతన్యానికి ముందుగా కృతజ్ఞతలు.

గ్రంథాన్ని చూడగానే, పాఠకులకు చదవాలనిపించే విధంగా పుస్తకాన్ని మెప్పుపొందే విధంగా సకాలంలో ముద్రించి యిచ్చిన శ్రీశ్రీ ప్రింటర్స్ అధినేత శ్రీ విశ్వేశ్వరరావుగారికి ధన్యవాదాలు చెప్పుకోవటం నా బాధ్యత.


**డాక్టర్ జంధ్యాల కనకదుర్గ**

**విశ్రాంత ప్రిన్సిపాల్.**

*(సింగరేణి కాలరీస్ మహిళా డిగ్రీ కళాశాల, కొత్తగూడెం,)*

# విషయ సూచిక

# 1. తెలుగు సాహిత్యం-గుణాత్మక విమర్శలో మానవ సంబంధాల అభివృద్ధి

సాహిత్యమర్మాన్ని విశదీకరించిచెప్పేది 'విమర్శ'. ఇది రచయితయొక్క రచనాంశాలకు పాఠక మనోచైతన్యానికి వారధి వంటిది. చారిత్రకంగా నన్నయాదుల కావ్యావతారికలలో ప్రాణం పోసుకున్నది విమర్శ. సాహిత్య ప్రయోజనాన్ని శబ్దార్థ జ్ఞానసౌందర్యాన్ని గురించి నన్నయ చెబితే, ఆధునిక కాలంలో కట్టమంచి రామలింగారెడ్డి ఆలోచనలో అది కావ్యతత్త్వానుశీలన రూపాన్ని పొందింది. అంతే కాదు సామాజిక ప్రయోజనదిశగా కూడ సాగింది. అత్యాధునిక కాలంలో సాహిత్య విమర్శ మానవసంబంధాల అభివృద్ధి కారకంగా కొనసాగుతోంది. సాహిత్య సమీక్షకులు రచయిత దృక్పథాన్ని వారివారి దృష్టితో చూడటంతో ఆత్మాశ్రయంగా ఉండే అవకాశముంది. కాని విస్తృతార్థంగల విమర్శ అనేది సృజనకు ప్రోద్బలకమైన నాటి సామాజికాంశాలను విశ్లేషణకు పెడుతుంది. అంతేకాదు, నేటి మానవ సంబంధాలలో అవి ఏవర్గంవారి ప్రయోజనాలకు అనుకూలంగా ఉన్నాయో సాపేక్ష ప్రమాణాలతో నిర్ధారించగలుగుతుంది. ఇతిహాసపు చీకటికోణాల అట్టడుగున దాగిన సత్యాన్ని వెలికితీసి ఒక దర్శనాన్ని ఇవ్వగలుగుతుంది. అందుకే కావ్యాంతర్గత తత్త్వాన్ని పరిశీలించే సహృదయ ప్రవృత్తి విమర్శకులకు ఉండాలి. రచయితకు ఉన్న సామాజిక దృక్పథపు ప్రయోగంలోని సాహిత్యాంశానికి విమర్శ వినూత్న సాహిత్య దర్శనాన్ని అందిస్తుంది. అప్పుడే విమర్శ పాఠకునిలో పఠనాసక్తిని, భావనాశక్తిని పెంచి

విచక్షణా జ్ఞానాన్ని, తదనుభూతిని కలిగించగలిగి సాహిత్య ప్రయోజనకారి అవుతుంది. ప్రాచీన సాహిత్య విమర్శలతో పాటు ఆధునిక సాహిత్యంలోని కవిత్వం, నాటకం, నవల, కథల వంటి ప్రక్రియలను భిన్నదృక్పథాలతో విమర్శించిన సిద్ధాంతగ్రంథాలు వచ్చాయి.

సంప్రదాయ సాహిత్యవిమర్శ అయినా ఆధునికసాహిత్య విమర్శ అయినా దానిధ్యేయం మానవసంబంధాల అభివృద్ధిని ఆకాంక్షించేదిగా ఉండాలి. రచయిత దృక్పథాన్ని రచనాకాలంనాటి సామాజిక మానవసంబంధాలలోని సంక్లిష్టతలను విశ్లేషణచేసి, అవి సమాజసంబంధాల పటిష్ఠతకు దారితీసేవిగా ఉన్నాయా లేవా అనే దానిని విమర్శ విచక్షణకు పెడుతుంది. ఒకవేళ ఆ సంక్లిష్టతలే నేటికి కొనసాగుతుంటే నిర్మాణాత్మక దృష్టితో వాటి నివారణదిశను సూచించ గలుగుతుంది. నేటి సామాజిక పురోగమనానికి ఆ సాహిత్యం ఏమేరకు దోహదకారి కాగలుగుతుందో తెలియజేస్తూ విలువలను సంతరింప జేయటమే విమర్శ చేసే ముఖ్యమైన పని. సాహిత్యానికి సార్వకాలిక పాఠకులు ఉంటారు.

సాహిత్యంలో కథావస్తుగమనంలో సంక్లిష్టతలు వక్రతల రూపంలో ఉంటాయి. ఆ వక్రతలలో మరుగునపడి ఉన్న సత్యాన్ని వెలికితీసి, సాహిత్యపు విలువలను నిర్ధారించే క్రమంలో నిష్పాక్షికంగా అవి నేటి మానవసంబంధాల అభివృద్ధికి అనుకూల లేదా ప్రతికూల ప్రయోజనాన్ని అందిస్తున్నాయో అనేదానిని 'గుణాత్మక విమర్శ'. తెలియజేస్తుంది. ఇక్కడ వస్తువంటే కథాంశం. కథావస్తు గమనంలోని వక్రత, అంటే ఆ కథావస్తుగమనం లోకంలో మానవసంబంధాలలో సహజపరిణామంగా ఉండే జీవనకథాంశంలోకి పాఠకహృదయాలను తీసుకొని వెళ్ళకుండా, భిన్నమై అసంగతమైన అనుకోనిరీతిలో సంక్లిష్టంగా పక్కదారిలోకి వెళ్ళటంగా అర్థమవుతుంది. అప్పుడు అక్కడ ఒక శూన్యత చోటుచేసుకోవటం జరుగుతుంది. ఆ శూన్యతలోకి తొంగిచూసినప్పుడు కథను నడిపించే శక్తులు అర్థమవుతాయి. సాధారణంగా కథావస్తుగమనం కార్యకారణసంబంధంతో ఒక రుజువైన మార్గంలో వెళ్ళటం పరిపాటి. అలా వెళ్ళకుండా సంక్లిష్టతనొంది ఒక

స్వార్థప్రయోజనాన్ని ఆశించి, అకారణంగా, అసంగతంగా వంకర (వక్రత) తిరిగి, పక్కదారిలో వెళ్ళటాన్నే 'కథావస్తుగమన వక్రత'గా భావించాలి. అటువంటి సందర్భాలలో మరుగునపడిన సత్యాన్ని వెలికితీసి నూతనవిలువలను గుర్తింప చేసేటట్లు చేయటమే గుణాత్మకవిమర్శ. ఆ సత్యాన్ని వెలికితీసి, మానవసంబంధాల విలువలను నిర్ధారించటమే విమర్శకు ఉన్న గుణాత్మకత.

ఆధునిక కాలంలో దీని అవసరం ఎంతైనా ఉంది. ఈ గుణాత్మకవిమర్శ పరిణామశీలమైన సామాజిక చలనసూత్రాలకు అనుగుణంగా ప్రభావితమవుతున్న మానవసంబంధాలను విశ్లేషిస్తుంది. అవి అభివృద్ధి నిరోధకంగా ఉంటే, వాటి లోపాలను వెలికితీసి, సాహిత్య పాఠకులలో నిర్మాణాత్మక దృష్టిని కలిగించి, మనోచైతాన్యాన్ని రగిలిస్తుంది. ఇది నిత్యనూతనమైన సాహిత్య విమర్శనాప్రక్రియ. అభివృద్ధి నీడన, పీడన ఉన్నట్లే సామాజిక చలనసూత్రాలకు అనుగుణమైన 'కథావస్తు విషయగమన వక్రత' గలచోట లోపభూయిష్ఠమైన మానవసంబంధాలు స్పష్టమౌవుతాయి. అందమైన భవనాలవంటి సాహిత్యంలో వక్రతలు గల సాలెగూళ్ళుంటాయి. అవి అనుభవంలోకి వచ్చినప్పుడే విషపూరితం అనిపిస్తాయి. ఆ వక్రతలనబడే సాలెగూళ్ళు సామాజికసంస్కృతి చుట్టూ అల్లుకుని ఉంటాయి.

ఈ వక్రత సామాజిక చలనసూత్రాల ప్రభావంతో ఏర్పడిన జీవన సంస్కృతిలో నిబిడీకృతమై ఉంటుంది. ఆ క్రమంలోనే చాపక్రింద నీరులాగా ఉన్న సామాజిక మానవ సంస్కృతీ మూలాలనుకూడా అన్వేషించాల్సిన అవసరం ఉంటుంది.

నేటికీ నరనరాలలో జీర్ణించుకున్న తరతరాల జీవనసంస్కృతి ఈనాటి మానవ జీవనాన్ని అడుగడుగునా నడిపిస్తున్న విషయం అనుభవైకవేద్య విషయమే. చారిత్రక మానవ సంస్కృతికి నిధినిక్షేపాల వంటివి రామాయణ, భారతేతిహాసాల వంటి కావ్యాలు. కాలానుగుణ పరిణామశీలమైన ఆర్థిక-రాజకీయ చలన సూత్రాలకు అనుగుణంగా రూపాంతరం చెందుతున్న జీవన సంస్కృతిలో అంతస్సూత్రంగా ఉన్న చారిత్రక సంస్కృతి మానవసంబంధాలను

ప్రభావితం చేయగలుగుతుంది. అది ఏవర్గం వారికి అభివృద్ధి కారకమో లేదా ఏవర్గం వారి యొక్క అభివృద్ధికి నిరోధకాంశంగా ఉందో ఈ 'గుణాత్మకవిమర్శ' స్పష్టం చేయగలుగుతుంది. కాబట్టి నేటికీ కొనసాగుతున్న చారిత్రక సంస్కృతి యొక్క మూలాలను అన్వేషించాల్సిన క్రమంలో ఈ గుణాత్మకవిమర్శ ప్రధాన భూమికను వహిస్తుంది. సాహిత్యంలో ఈ 'వస్తువిషయగమన వక్రత' – 'గుణాత్మకవిమర్శ' పరస్పర ప్రచోదకాలుగా ఉండి మానవసంబంధాల అభివృద్ధి కారకమైన చైతన్య దర్శనాన్ని సాహిత్య ప్రయోజనంగా సిద్ధింపజేస్తుంది. అందుకే ఆధునిక కాలంలో కూడ సంప్రదాయ సాహిత్యంలోని వస్తువిషయగమన వక్రతను అర్థం చేసుకోవటానికి ఈగుణాత్మక విమర్శను ప్రధాన సాధనంగా చేసుకుని నూతన దృక్కోణ చైతన్యాన్ని సంతరించుకుంటే ఆధునికకాలంలో మానవ సంబంధాల అభివృద్ధి సజావుగా జరుగుతుంది.

రాజరికపు వ్యవస్థకు పితృస్వామ్యానికి అవినాభావసంబంధం ఉంటుంది. ప్రాచీన సాహిత్యం రాజాశ్రయంగా ఉండి నవవిధ రసానుభూతులు కూడా పితృస్వామ్య ప్రయోజనాన్నే ఆకాంక్షించినట్లు అర్థం అవుతుంది. సాహిత్యంలో స్థూలంగా రాజ్యంలోని ఆర్థిక–రాజకీయసంబంధిత విషయాలుగా తగాదాలు, యుద్ధాలు కన్పడినా, సూక్ష్మస్థాయిలో ఆ సాహిత్యం సామాజిక కుటుంబపు పితృస్వామ్య సంస్కృతీ పరిరక్షణ ధ్యేయంగానే ఉన్నట్లు ఈ గుణాత్మక విమర్శ వల్ల అర్థం అవుతుంది. అంతే కాదు ఒకొక్కప్పుడు ఈ పితృస్వామ్య కుటుంబ సంస్కృతిని ఆధారంగా చేసుకుని ఆర్థిక–రాజకీయాలకు సంబంధించిన స్వార్థ ప్రయోజనాలను సాధించినట్లుకూడ అర్థంఅవుతుంది. ఇటువంటి మానవ సంబంధాలు ప్రతిఫలించిన వస్తు విషయగమనంలో చోటుచేసుకున్న వక్రత వ్యక్తుల చర్యలు, ఆలోచనలు, సంఘటనలలో ఉంటే, దానిని స్పష్టం చేయగలశక్తి ఈ గుణాత్మక విమర్శకు ఉంటుంది. ముందుగా కథావస్తువిషయాలను పూర్వాపరాలతోసహా విశ్లేషించి నాటి సామాజిక చలన సూత్రాలకు అనుగుణంగా విమర్శకు పెట్టినప్పుడు వస్తువిషయగమనంలోని సంక్లిష్టమైన వక్రత

స్పష్టమవుతుంది. తత్ఫలితంగా ఏర్పడిన నిర్మాణపు దృక్కోణంనుండి నూతన దర్శనాన్ని కలిగించి పాఠకుల మనోచైతన్యాన్ని వికసింపచేయటానికి సాహిత్యపు అనుకూల/ప్రతికూల విలువలను గుణాత్మకవిమర్శ సంతరింపజేస్తుంది.

సామాజికమానవ సంబంధాల అభివృద్ధి విలువలను నిర్ణయించడం ధ్యేయంగా ఈగుణాత్మక విమర్శనాప్రక్రియ సాగుతుంది. ఉదాహరణకు రామాయణ, భారత రచనలను తీసుకుంటే క్రమానుగతంగా రామరావణ యుద్ధం, కౌరవపాండవుల యుద్ధం స్థూలంగా అర్థమయయ్యే విషయం. చారిత్రక మూలాన్వేషణ చేస్తూ వస్తువిశ్లేషణ జరిగి సామాజిక చలన సూత్రాలతో విమర్శకు పెట్టినపుడు పితృస్వామ్య కుటుంబ సంస్కృతియే ఆర్థిక-రాజకీయాంశంగా రూపాంతరం చెందిందని అర్థమవుతుంది. అది సామాజిక మానవసంబంధాలకు నిరోధకంగా, మహిళాపీడనకరంగా ఉన్నదనే దానిని వస్తు విషయగమనంలోని వక్రత స్పష్టం చేస్తుంది. రామాయణంలోని బహుభార్యాత్వపు సంస్కృతి మూలకారణంగా గల ఆ వక్రత రాజైన దశరథుడు రాముడ్ని జ్యేష్ఠుడిగా చేసుకోవటానికై, చిన్నతనంలోనే భరతుడ్ని అతని మాతామహుడి ఇంటికి పంపించటంలో కనపడుతుంది. తన వారసుడిగా రాముడ్ని నిర్ణయించాలను కోవటంలోనే ఉంది. దశరథుడికి మునుపే మనుస్మృతి జ్యేష్ఠుడిని గురించిచెబుతూ కేవలం పెద్ద భార్య కొడుకే జేష్ఠుడు అవ్వాల్సిన అవసరంలేదని, చిన్న భార్యయొక్క కొడుకు అతనికంటే పెద్దవాడు అయితే కూడా అతడు జ్యేష్ఠుడు కావచ్చుని రకరకాలుగా చెప్పబడింది. అంతే కాదు, అప్పటికే పెద్ద కొడుకు సమర్థుడు కాకపోతే చిన్న కొడుకును రాజ్య వారసుడ్ని చేసిన విషయం రామాయణంలోని దశరథుడియొక్క పూర్వపు రాజులవంశచరిత్రలో చెప్పబడింది. అంటే వారసత్వానికి మెసులుబాటు ఉంది. అందుకే పిల్లలు పుట్టాలని తపనపడ్డ దశరథుడు రాముడు పుట్టినరోజే పుట్టిన భరతుడిని సమర్థుడిగా పెంచాలని అనుకోక అతడిని కేకయరాజ్యంలో పెరిగేటట్లు చేసాడు. ఎందుకంటే తనను రణసమయంలో రక్షించిన తన మూడవ భార్య, భరతుని తల్లియైన కైక సమర్థతను అణచటం

కోసమేకాక, ఆ తల్లికొడుకైన భరతుడు రాముడికి పోటిగా పెరుగుతాడని భావించటంలో విషయవక్రీకరణ ఏర్పడింది. ఈ విషయం దశరథుడు పాయసాన్ని అసమవిభజన చేయడంలోనే ఉంది. గడియారం లేని రోజుల్లో మంత్రసానులు క్షణాలను లెక్కపెట్టటంలో పొరపాటుపడటానికి ఆస్కారంఉంది. రాముడు పునర్వసు నక్షత్రం చివరి పాదంలోనూ, ఆ వెంటనే వచ్చిన పుష్యమి నక్షత్రపు మొదటిపాదంలో భరతుని పుట్టుక ఉండటంతో పుట్టుక వార్త మంత్రసానుల ద్వారా తెలియటంలోని ఒక్కక్షణం వ్యవధి జేష్ఠత్వ నిర్ణయంలో సందేహాన్ని కల్గించక మానదు. ఒక్క క్షణం ముందువెనుకలుగా చెప్పబడే అవకాశం ఉండటంతో జన్మనక్షత్ర పాదాలలోని ఆ ఒక్కక్షణానికి సంబంధించిన తేడా ఆధారంగా జ్యేష్ఠుడి నిర్ణయం జరిగింది. భరతుడ్ని కైకదగ్గర పెరగనీయ కుండా మాతామహుడి దగ్గర పెరిగేటట్లుచేసి మాతాశిశు సహజసంబంధాలను దూరంచేయటమేకాక, రాముడికి రాజ్యంలోని ప్రజలతో సత్సంబంధాలుండేటట్లు చేసిన దశరథుని నిర్ణయంలోను ఆ వక్రత బహిర్గతమవుతుంది. ఆ వక్రతయే సమర్థురాలైన కైకను రాజమాతను కానీయకుండా చేసింది పితృస్వామ్య రాజ్యసంస్కృతియే. ఇటు కుటుంబంలోనూ అటు రాజ్యంలోను కైక దుష్టురాలిగా భావింపబడటమేకాక ఆవనవాసం, సమాజంలో మానవసంబంధాల అభివృద్ధికి అవరోధంగా మారిందని అన్పించక మానదు.

ఈ గుణాత్మక విమర్శవల్లనే భారతంలోని ద్రౌపదీ స్వయంవర ఘట్టంలో ధర్మరాజు తన ఆర్థిక-రాజకీయ స్వార్థ ప్రయోజనాలకై పితృస్వామ్య సంస్కృతిని ఆధారం చేసుకొన్నట్లు అర్థమవుతుంది. స్వయంవరం ఘట్టంలో అర్జునుడు మత్స్యయంత్రాన్ని కొట్టడం, వెంటనే ధర్మరాజు చివ్వున బయటకు వెళ్ళటం జరిగింది. సభలో జరిగిన అర్జునకర్ణాదుల యుద్ధానంతరం ఆ సభలోనే సాక్షీభూతుడైన కృష్ణుడు ద్రౌపదిని అర్జునునిపత్నిగా ప్రకటించాడు. ద్రౌపది తాను అర్జునునిపత్నిగా కాలినడకన విప్రరూపంలోఉన్న భీమార్జునులవెంట అత్తగారింటికి రావటం క్రమానుగతంగా జరిగింది. స్వయంవరానికి వెళ్ళిన

కొడుకులరాకకై ఎదురు చూస్తున్న కుంతికి అంతకు ముందే బయలుదేరిన ధర్మరాజు నకులసహదేవులు, అదే సమయానికి ఇంటికి చేరుకొని ఐదుగురు కలిసి నమస్కరించేటట్లు చేయటంలోను, స్త్రీని 'భిక్ష' అని భీముడనటం, కుంతి ఐదుగురి ప్రక్కన ఉన్న ద్రౌపదిని గుర్తించలేకపోవటం జరిగింది. భిక్షను సమానంగా వినియోగింపమని తల్లి అన్నటువంటి లోకవిరుద్ధమైన మాటను తాను నిజంచేస్తానంటూ ధర్మరాజు ముందుకు వచ్చి, అల్లరి బ్రహ్మపని (బ్రహ్మ చైయిదం) అంటూ నెపంపెట్టి తమ ఐదుగురికి ద్రౌపది యందు ప్రేమ కలిగిందని తమ్ముళ్ళమనసులను చదివినట్లుగా అంటాడు. ఈ సంఘటనల పరంపరలో ఒక పొసగనితనం, ఒక శూన్యత చోటుచేసుకుంది. అక్కడే కథావస్తువిషయ గమనంలోని వక్రత రూపంలో సంక్లిష్టత ఉన్నట్టు స్పష్టం అవుతుంది. ఆ వక్రత ఏమిటంటే, ధర్మరాజాదులు సభనుండి ముందే బయటకు వచ్చి బయలు దేరినప్పటికీ స్త్రీయైన ద్రౌపదియొక్క నడక వేగంకంటెకూడ తక్కవ వేగపు నడకతో ధర్మరాజు, నకులసహదేవులు నడిస్తేనే కదా వారందరు ఒకేతడవుగా యిల్లుచేరుకొనే అవకాశం ఉంటుందనే సందేహం కలగకమానదు. ఇదే కథాగమనంలో పొసగనితనమనే వక్రత. ఆ విధంగానే ధర్మరాజు తాను ద్రౌపదిని పెళ్ళిచేసుకోవాలనుకొని బ్రహ్మమీద నెపంపెట్టటంలోను అవసరమైనప్పుడు ప్రత్యక్షమయ్యే వ్యాసుడు పంచేంద్రయోపాఖ్యానంతోపాటు ద్రౌపది పూర్వజన్మలోని ఇంద్రసేన యొక్క తపస్సులోని పునరుక్తి దోషాన్ని ఆధారం చేయటంలోనూ వక్రతలు అర్థమయి శూన్యం, సందేహం, అస్పష్టత గోచరిస్తుంది. ఈ వక్రతలే ధర్మరాజుకి ఆర్థిక-రాజకీయ ప్రయోజనాన్ని కలిగించటానికి ఉపకరించాయని తరువాత ఆశ్వాసంలోని దుర్యోధనుడు మాటలలో నిరూపింపబడినదిగా తెలియచెప్పేది ఈ గుణాత్మకవిమర్శయే.

స్త్రీని ఒక జీవిగాకాక వస్తువుగా చెప్పబడటం, చూడటంవంటి వస్తువిషయాలలోని వక్రతలను గుణాత్మకవిమర్శ వల్ల అర్థమయి సత్త్వదర్శనం కలుగుతుంది. గుంపుసంబంధాల తరువాత మహిళల పీడనానివృత్తిగా, మానవ

నాగరికతలో భాగంగాను ఏర్పరచుకొన్న కుటుంబసంస్కృతికి భిన్నంగా బహుభర్తృత్వపు సంస్కృతిని పునరుజ్జీవం కావింపబడటంలో భారతకథాంశం ఆర్థిక–రాజకీయ ప్రయోజనాంశంగా మారి కుటుంబసంబంధాలు, మానవ సంబంధాల అభివృద్ధిని తిరోగమనదిశగా మళ్లేటట్టు చేసినట్లు అర్థం అవుతుంది. ఎందుకంటే అర్జునుడు మాత్రమే తనకు అల్లుడైతే వైవాహిక సంబంధాలతో బలాన్ని పెంచుకోవాలనుకొన్నాడు ద్రుపదుడు. అదే సందర్భంలో కేవలం అర్జునుడు మాత్రమే ద్రౌపదిని పెళ్ళి చేసుకొంటే, ధర్మరాజుకి అర్థ, అంగబలం తగ్గే అవకాశం ఉంటుంది. దుర్యోధనుడ్ని జయించి ఆ రాజ్యాన్ని హస్తగతం చేసుకొనే అవకాశం తనకు తగ్గటం జరుగుతుందనే అంచనాలు వేయటంచేతనే ధర్మరాజు తానుకూడా ద్రౌపదిని పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు. దీనికి మునుపు భీముడు హిడింబని చేసుకొన్నప్పుడు ధర్మరాజు ఇలా అనకోలేదుకదా. అందుకే వెనువెంటనే వచ్చిన ఆశ్వాసంలో ధర్మరాజుయొక్క బలాబలాలను నిర్ణయించే క్రమంలో దుర్యోధనుని మాటల్లో ఆ విషయం నిరూపింపబడుతుందికూడా. ఈ వక్రతలు పితృస్వామ్య కుటుంబ నిర్మాణంలోని వైవాహిక సంస్కృతిని ఆసరా చేసుకొన్న ధర్మరాజు యొక్క ఆర్థిక–రాజకీయ స్వార్థప్రయోజనాలు గుణాత్మక విమర్శవల్ల మాత్రమే అర్థం అవుతాయి. ధర్మరాజు యొక్క రాజకీయ స్వార్థం కోసం మానవ సంబంధాలలో మహిళా సంస్కృతి బలి అవటమే గాక, ఆ వివాహఘట్టంలోని వక్రతలే తరువాత యుద్ధాలకు దారితీయటంతో, లోపభూయిష్ఠమైన మానవసంబంధాలకు సంకేతాలనిచ్చినట్లుగా భారతకథ అర్థంఅవుతుంది. నేటికి ఈ వైవాహిక సంబంధ పరిణామాలు రాజకీయాలలో బలాబలాలను నిర్ణయిస్తున్నట్లు అర్థం అవుతున్నాయి.

ద్రౌపదియెడల ధర్మరాజుకు ప్రేమఏర్పడి పెళ్ళిచేసుకున్నాడను కోవటంలోని డొల్లతనం ధర్మరాజు మాటల్లోనే అర్థంఅవుతుంది. స్వర్గారోహణ పర్వంలో ద్రౌపది చచ్చిపోయినపుడు బ్రతికినన్నాళ్ళు ఐదుగురు పతులలో అర్జునుడంటేనే ద్రౌపదికి మిక్కిలి మక్కువ ఉండటంచేతనే ఆమె ముందుగా చచ్చిపోయిందని ధర్మరాజు

అనటంలోనే పితృస్వామ్యపు ప్రవృత్తి నీడన ఉన్న మహిళా పీడన సంస్కృతి అర్థంకాకమానదు. అందుకే భారతయుద్ధానికి ప్రధానభూమికగా ద్రౌపది స్వయంవరఘట్టంలోని 'కథావిషయగమనవక్రతలే' యుద్ధాలకు దారితీసి మానవసంబంధాలను విచ్ఛిన్నం చేయగలిగాయి అనేది గుణాత్మక విమర్శవల్ల మాత్రమే అర్థం అవుతుంది. ద్రౌపదికి సద్యోవస్త్రదానం చేయగలిగిన కృష్ణుని, దుర్యోధనుడంటే మక్కువ కలిగిన యాదవ నాయకుడైన బలరాముని పాండవుల వైపు నిలబడేటట్లు చేయటంకోసం వీలుగా అర్జునుడు సుభద్ర వెంటపడటం కూడా గుణాత్మక విమర్శవల్ల అర్థమవుతుంది.

సాహిత్యంలో సాంస్కృతికప్రయోజనాన్ని ఆశించటంచేతనే కవులు మూలకథకు మార్పులు చేర్పులు చేస్తుంటారు. మునుపు సంస్కృత, తెలుగు కావ్యాలలో యుద్ధం చేయని సత్యభామ, 13వ శతాబ్దానికి చెందిన కాకతీయ రాణియైన రుద్రమదేవి యుద్ధాలు చేసిన తరువాతనే తెలుగులోని హరివంశాలలో, భాగవతంలో సత్యభామ యుద్ధం చేయటమనేది కనపడుతుంది. దానినొక చారిత్రిక భౌతిక వాస్తవికతగా గుణాత్మక విమర్శ తెలియజేసింది. సత్యభామ చేతిలో చేవచచ్చి నిరాయుధుడై తర్జనభర్జన పడుతున్న నరకాసురుని చివరి క్షణంలో కృష్ణుడు చంపి విజయాన్ని సాధించినట్లు చెప్పబడింది. పితృస్వామ్య సంస్కృతి నాటి మహిళాశక్తిని అణచివేయటానికి మహిళాభివృద్ధిని అడ్డుకోవటంగా ఆ సంఘటన అర్థమవుతుంది. నేటికీ ఆ యా కావ్యాలలో ప్రధానకథా వస్తువుగా పాఠకులను ఆకర్షింపజేస్తుంది కాబట్టి ఆ సంఘటనపై గుణాత్మక-విమర్శవల్లనే సరియైన అవగాహన ఏర్పడుతుంది. నరకాసురుడు కృష్ణునిపై బాణాలనువేస్తే కృష్ణుడు మూర్ఛపోతాడు. ఆ సమయంలో రణానుభవశూన్యయైన సత్య ధనుస్సును అందుకొని నరకాసురుడ్ని నిరాయుధుడ్ని, విరథుడిని, నిస్సహాయుడ్ని చేసి చివరిబాణంతో పూర్తిగా నరకాసురుడ్ని చంపబోతుంది. అదే సమయంలో కృష్ణుడు మూర్ఛనుండి తేరుకొంటాడు. రణభూమిలో సంక్లిష్టమైన వక్రత ఏర్పడే విధంగా కంఠాభరణాన్ని యిచ్చి, అసంగతంగా కృష్ణుడు ఆమెకు నిత్య శత్రువునైన

సవతి రుక్మిణిని సత్యభామకు గుర్తుకు తేవటంలోనే ఆ వక్రత ఉంది. నరకాసురుడ్ని పూర్తిగాచంపమని కృష్ణుడు సత్యభామతో చెప్పవలసినతీరును కథాగమనంలో పాఠకులు ఆశించే సందర్భంలో ఆమెకు కంఠాభరణమిచ్చి రుక్మిణిని గుర్తుకు తేవటంలోనే ఆ పొసగనితనం, సంక్లిష్టత ఉంది. అదే కథావస్తుగమన వక్రత. ఎందుకంటే సత్యభామకు లోకకంటకుడైన నరకాసురుని కంటే, ఆమెకు నిత్యశత్రువైన రుక్మిణిని గుర్తుకు తెచ్చేసరికి, ఆమె మనసును ఎదురునిలబడ్డ శత్రవునుండి మరిలింపజేసి, రుక్మిణివైపు మళ్ళింప జేయటంలోనే ఆ వక్రత ఉంది. ఆమెచేత యుద్ధంమాన్పించి తాను చివరి బాణాన్ని వేసి నరకుడ్ని చంపి ఆ విజయాన్ని తాను పితృస్వామ్యానికి వీలుగా తరతరాలకు కైవశం చేసుకోవటం లోనే ఆ వక్రత ఉంది. కాని ఈ విషయం పాఠకుల మనస్సులో ముద్రవేసినది మాత్రం సంస్కృత భాగవతంలోనిదివలె దివ్యత్వమైన విషయంగానే. ఆ వక్రతయే మహిళాశక్తిని అణచింది. ఇది గుణాత్మక విమర్శవల్ల అర్థమయ్యే విషయం.

భాగవతంలో కూడా అష్టభార్యల వివాహానంతరం కృష్ణుడు రుక్మిణి మందిరానికి వచ్చినపుడు మౌనంగా సేవచేస్తున్న రుక్మిణితో కృష్ణుడు 'నవ్వులాటకు' అన్నానంటూ రుక్మిణిని ఇప్పుడైనా "రాజేంద్రులను దగులుకొమ్ము" అనే మాటల్లో వక్రత ఉంది. తాను అష్టభార్యలను వివాహమాడినందుకు రుక్మిణి భావాన్ని తెలుసుకోగోరివచ్చిన కృష్ణుడు ఎదురు దాడిలో భాగంగా ఆమె ప్రాతివ్రత్యానికి నవ్వులాటగా పరీక్ష పెట్టానంటూ అపూర్వము, అప్రియమైన మాటలతో అగౌరవపరచిన సందర్భములోను వక్రత ఉంది. జ్ఞానదీపం అడుగున ఉన్న నీడలాగా అజ్ఞానం అంటూ భాగవతంలోని కృష్ణుని చుట్టూ అల్లిన సామాజిక భావాలలో ఆ వక్రత ఉంటుంది.

తిమ్మన వ్రాసిన 'పారిజాతపహరణం' అనే ప్రబంధంలో బహుభార్యాత్వపు సంస్కృతిని ప్రతిఘటించే చైతన్యంగల సత్యభామచేత పుణ్యకవ్రతం చేయించిన సందర్భాలలోనూ వస్తువిషయగమన వక్రత స్పష్టమవుతుంది. పారిజాత పుష్పాన్ని రుక్మిణికి ఇచ్చినందుకు సత్య చచ్చిపోతానంది. ఆ మనస్తత్వాన్ని నిర్ధారణ

చేసుకోవటానికి పారిజాతపుష్పం కోసం సత్యను తీసుకొని వెళ్ళేటప్పుడు కృష్ణుడు పరిసరాలను వర్ణిస్తూ ఒక తుమ్మెదకూ రెండు కమలాలమధ్యన ఉన్నస్పర్థను చెప్పి ఒక కమలం చావాలను కొంటుందని చెప్పి సత్యభామ యొక్క చైతన్య స్థాయిని అంచనావేస్తాడు. పారిజాతపుష్పం యొక్క ప్రభావాన్ని ఆధారం చేసుకొని సత్యభామ చైతన్యాన్ని అణచటం జరిగింది. రుక్మిణికి ఇచ్చినప్పుడు పారిజాతపుష్ప ప్రభావిత వర్ణనలోనూ, ఇంద్రవనం నుండి సత్యాకృష్ణులు తెస్తున్నప్పుడు పారిజాతపుష్ప ప్రభావాన్ని చెప్పటంలోని వక్రతను గుణాత్మక విమర్శ చేసినప్పుడు అర్థమవుతుంది. ఎందుకంటే ఆపారిజాతపుష్ప ప్రభావమే రుక్మిణి సత్యభామల మధ్య చిచ్చుపెట్టగలిగింది. బహుభార్యాత్వపుసంస్కృతి ఆచరణలో సజావుగా ఉండటానికై భార్యాభర్తల మధ్యన ఏర్పడిన వివాదాన్ని కృష్ణుడు నారదునితో సంప్రదించటంలోను, పుణ్యకవ్రత ఆచరణలోను పితృస్వామ్యపు ప్రయోజనాన్ని కలిగించే వక్రత ఉంది. నారదుని సలహాతో పుణ్యకవ్రత రూపంలో బహుభార్యాత్వపు సంస్కృతిపట్ల సత్యభామయొక్క బహిరంతర చైతన్యాన్ని అణచి వేయటానికై ఆమెకు మనోవైజ్ఞానిక చికిత్స చేయటంజరిగింది. దానివల్లనే ఆ సంస్కృతిపట్ల ఆమెకున్న వ్యతిరేకతను అణిచివేయటంగా అర్థమవుతుంది. అందుకే ఆ కావ్యంలో చివరన తిమ్మన నారదుని నోటనే కృష్ణుడు 'సత్యభామ శుకకేళీ పంజరంలా' విరాజిల్లాడని చెప్పటంలోనే ఆ వక్రత నిరూపింపబడుతుంది. పితృస్వామ్య సంస్కృతి పరిరక్షణక్రమంలో ఇటువంటి వక్రతలే మహిళలను అణచివేస్తుంటే స్త్రీ-పురుషుల మధ్య మానవసంబంధాలు నశిస్తాయని అర్థమవుతుంది.

ఆధునికసాహిత్యంలో సామాజికసంస్కృతి రూపంలో ఉన్న కథావస్తువులోని వక్రతలను అందులోని పాత్రల పరంగా విమర్శింప చేయటంలోనే ఎక్కడికక్కడే ప్రతిఫలించిన మానవసంబంధాలలోని లోపాలు స్పష్టమవుతాయి. సంస్కృతీరూపంలో ఉన్న సాలెగూళ్ళ అల్లికలు పాత్రల విమర్శలో ఎక్కడికక్కడే అర్థమవుతాయి. ఆధునిక సాహిత్యంలోకూడా ఈ కథావస్తుగమన వక్రతలు ఉన్నచోట ఈ గుణాత్మకవిమర్శ మిక్కిలి ప్రయోజనకరంగా ఉంటుంది.

సాహిత్య పరిశోధనానుభవం నుండి పుట్టినదే ఈ గుణాత్మక విమర్శ. ముఖ్యంగా ప్రాచీనసాహిత్య కథాంశాలలోని అంతరార్థాన్ని వెలుగులోకి తెచ్చి మానవసంబంధాల అభివృద్ధికి నిరోధకమైన వక్రతలయెడ హెచ్చరికలు చేస్తూ గుణాత్మకవిమర్శ సాహిత్య పాఠకులలో మనో చైతన్యాన్ని కలిగిస్తుంది. మానవసంబంధాలలోని అనుకూల/ప్రతికూల విలువలను నిర్ధారిస్తూ నిర్మాణాత్మక దృక్పథాన్ని పెంపొందిస్తూ ఈగుణాత్మకవిమర్శ ప్రజాస్వామిక దృక్పథాన్ని కల్గించ గలుగుతుంది. తత్ఫలితంగా సాహిత్యపువిలువలు స్పష్టమై లోపభూయిష్ఠమైన మానవసంబంధాలలో వక్రతలు కూడా అర్థమై సరిదిద్దుకుంటే ప్రజాస్వామిక సమాజం, కుటుంబసంబంధాలు పురోగమన దిశగా ప్రస్థానిస్తాయి. నేటి భౌతిక జీవనవిధానాలకు అనుగుణంగా అనుశ్రుతంగా మార్పుకు లోనవుతున్న జీవనసంస్కృతిని, మానవసంబంధాలను అభివృద్ధికరమైన బాటలో నడిచేటట్లు చేయగలిగే ఈ గుణాత్మక విమర్శను ప్రస్తావించటంకోసం సాహిత్య సింధువులోని బిందువులను మాత్రమే ఉటంకించటం జరిగింది. గుణాత్మక విమర్శనాప్రస్థానం పాఠకచైతన్యానికి పదునుపెట్టి సానుకూల దృక్పథాన్ని ఏర్పరచి మానవ సంబంధాలను అభివృద్ధి పరచగలిగితే దేశాభివృద్ధి దానంతటదే జరుగుతుంది.

*– 'మిసిమి' మాసపత్రిక మార్చి 2019.*

## 2. "గాథాసప్తశతి" లో బాధాతప్తసతులు

క్రీ.శ. 1వ శతాబ్దానికి చెందిన ఆంధ్రశాతవాహనరాజు అయిన హాలునిచే సంపుటీకరింపబడిన "గాథాసప్తశతి" అనే గ్రంథం నాటి వ్యవహారిక భాషయైన ప్రాకృతభాషతో మౌఖికంగా, పాటల్లాగా చెప్పుకోబడిన గాథల సమాహారం. ముందుగా రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు తెలుగులోకి అనువదించారు. తర్వాత దీనిని శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య తెలుగులోకి అనువదిస్తూ నాటి ప్రాకృత భాషలోని గాథలను, సంస్కృతీకరించబడిన గాథలను కూడా అనుబంధంగా చేసి పొందుపరచిన పుస్తకం అందుబాటులో ఉండటంతో దాని ఆధారంగా ఈ వ్యాసం వ్రాయటం జరిగింది. రెండు అనువాదాలలోనూ భావం ఒకటిగానే ఉంది. అందుకే ఆ గాథలలోని భావాలను గ్రహించి చెప్పటం జరిగింది.

కవుల, కవయిత్రుల గాథలను ఇతమిత్థంగా చెప్పలేని అనామక గాథలెన్నో వుండటంచేత స్థలాభావాన్ని దృష్టిలో పెట్టుకొని గ్రంథవిషయానికే ప్రాధాన్యత నివ్వటం జరిగింది. వాటిలో హాలుడు స్వయంగా వ్రాసిన గాథలు కొన్ని ఉన్నాయి. రాళ్ళపల్లివారి అనువాదానికి ముందుమాట వ్రాసేక్రమంలో కట్టమంచి రామలింగారెడ్డిగారు మరియు దీవి సుబ్బారావు వంటి వారు పేర్కొన్న రచయితలతోపాటు 11 మంది కవయిత్రుల పేర్లతో వ్రాసిన 16 గాథలు ఉటంకించబడ్డాయి.

హాలుడు (1-1) నాందిస్తుతిగా గౌరీదేవి యొక్క కోపముఖాన్ని సంక్రమించటానికై సాయం సంధ్యాసమయంలో పూజార్థంగా చేస్తున్న జలాంజలికి

ప్రణామంచేస్తున్నట్లు చెప్పి కుటుంబ స్త్రీల కోపాన్ని అంతా గౌరీముఖంలోనే స్ఫురింపచేయటం జరిగింది. 700 గాథలలో చాలవరకు భర్తలయొక్క అన్యసంబంధాలపట్ల (1-56) కుటుంబస్త్రీలకు కలిగిన కోపమే అది. కుటుంబానికి మూలస్తంభాలైన ప్రేమ, నమ్మకం (1-71) భర్తల యెడ సడలంచేత స్త్రీలు అభద్రతకు గురిఅయి (1-72, 3-36) ఆందోళనచెంది మానసిక వ్యథను పొందటం స్పష్టమవుతుంది.

కృష్ణా, గోదావరి, నర్మదానదీ తీరప్రాంతాలకు విస్తరించిన నాటి ఆంధ్ర సామ్రాజ్యంలోని స్త్రీలు తమ భావోద్వేగాలను అజ్ఞానభద్రపీఠమైన (2-64) ఆ పల్లెటూర్లో ఎవరికి చెప్పుకోవాలో తెలియక కుమిలిపోయి తోటి స్త్రీలతో పంచుకోవటం జరిగింది. ఆ క్రమంలోనే పడుచువారు ప్రధాన భూమికగా గల ఈ కథలు (7-48) పుట్టినట్లు ముగిసినట్లుగా వారి మాటల్లోనే అర్థమవుతుంది. ఆనాటికే అక్షరాస్యులైన స్త్రీలు కొంతమంది ఉన్నప్పటికీ (3-44, 5-50, 6-71) ఉద్వేగభరితులైన స్త్రీలు తమ మానసిక వ్యథను సహబాధితులైన మహిళలతో పంచుకొన్న ప్రయత్నాలే స్త్రీ, పురుష రచయితల చేతులలో గాథలై ప్రచారం పొందాయి. అవి రాజైన హాలుని చెవులకు కూడా సోకినట్లు అర్థం చేసుకోవచ్చు. హాలుడు స్త్రీల బాధలను తీర్చలేకపోయినా సహృదయంతో గాథల్లోని స్త్రీల భావాలను సాహిత్యంలో నమోదుచేయటానికి సంపుటీకరించటం జరిగింది. ఈ గాథలలో కొన్ని పురుషుల భావాలు కూడా చోటుచేసుకోవటంతో స్త్రీ-పురుష సంబంధాలలోని తాత్త్వికతను అర్థంచేసుకునే ప్రయత్నం జరిగింది. హాలుడుకూడా అవతారికలో (1-2) అమృతప్రాయమైన ప్రాకృత ప్రబంధార్థాన్ని గ్రహించగలిగి మన్మథతత్త్వానికి సంబంధించిన "మీమాంసన క్రియాచింత"ను పాఠకులు చేయగలుగుతారని భావించాడు. అంటే మన్మథ భావం యొక్క తత్వంను దాని పరిధిని అర్థం చేసుకుంటూ పలుమార్లు ఆలోచించ మనటంగా భావించాలి. అందుకే ఇది ఒక శృంగారగ్రంథంగా ప్రసిద్ధిపొందింది. కాని మహిళలు తమబాధలను గాథలలో చెప్పుకుంటే వాటిని హాలుడు అప్రయత్నంగానే లిఖిత పూర్వకంగా నమోదు చేసాడు. ప్రజావ్యవహారంలో ముక్తకాలుగా (విడివిడిగా)

చెప్పబడిన ఈ గాథలు కోటిదాక ఉన్నాయని (1-3) చెప్పబడినా హాలుడు 700 ముక్తకాలను సంపుటీకరించటం జరిగింది. పితృస్వామ్యం వీనిని శృంగారరసాత్మకమైన ధ్వనిలక్షణ గాథలుగా భావించినా ఎక్కువగాథలు స్త్రీల వ్యథను ప్రతిబింబించాయి. పైపెచ్చు "పాటపాడు నెపముపై వేనికొరకు నీవింత తమకమేచనేడ్చె" దిపుడు, వచ్చిరాక దుఃఖవశమున నక్షరక్రమము తప్పి వెడలు గద్గదముల" (4-34) అని దూతిక చేత ఆమె దుఃఖాన్ని విరహ దుఃఖంగా భావింపబడేటట్లు చేయటం పాఠకుల హృదయాలను మరల్చే ప్రయత్నంగా భావించాలి. కుటుంబంలోనూ సమాజంలోనూ ఉన్న స్త్రీ-పురుష సంబంధాలలోని అసమనైతిక సంస్కృతివల్ల (5-96) మహిళలు బాధాతప్త హృదయులుగా వారి వ్యథను సందర్భానుసారంగా ధ్వనిపూరకంగా, ప్రశ్నారూపంగా, దృష్టాంతాలుగా, వ్యక్తీకరించటంతో ఈ గాథలు కరుణ రసానుభూతిని కలిగిస్తాయి.

పితృస్వామ్య కుటుంబాలలోని అసమనైతిక సంస్కృతి (3-20, 6-95) స్త్రీలను పంజరాలలోని పక్షులుగా చేస్తే, పురుషులకు మాత్రం స్వేచ్ఛాయుత కామ సంబంధాలకు వీలుగా బహుభార్యాత్వపు సంస్కృతి ఆచరణలో ఉండేదని (1-54) "అనురాగప్రియుడు దాని అధరరాగంబెల్ల నపహరించి రాత్రియందు జూడు మరియ మరల నుదయమందు సవతుల కనుల సంక్రమించి కాననయ్యె" (2-6), (2-52,3-12) "కొత్త పెళ్ళికూతుకూటమి కొరకు గుక్కిళ్ళు మ్రింగు వరుని ఉల్లమునకున్ పట్టలేదు మొదటి భార్య సంగతి సమాసన్నమైన పెండ్లి సమయమందు" (5-79) అంటూ వ్యక్తం చేసిన గాథలు ఉన్నాయి. అంతేకాదు నాటి సామాజిక సంస్కృతి వేశ్యావ్యవస్థను (1-21, 2-56, 5-74, 6-17) అభివృద్ధి చేసింది. నాటికి పూర్వం బౌద్ధభిక్షుకులైన యువకులు నిర్వీర్యులుగానూ, నిష్కాములుగాను తయారవటంతోపాటు అడపాదడపా జరిగే యుద్ధాలవల్ల కలిగిన జననష్టాన్ని పూరించటానికి ప్రజాభివృద్ధి జరగాల్సిన సందర్భాన్ని పురస్కరించుకొని వారిలో కామోద్దీపనకై వాత్స్యాయనుడు 1వ శతాబ్దంలో కామశాస్త్రాన్ని వ్రాయటం జరిగి ఉండవచ్చు. దానిలో పురుషుల శృంగారేచ్ఛకు అనుగుణంగా అన్యస్త్రీలను లోబరచుకునే విధానాలను తెలియచేస్తూ, దానికి

అవసరమైన దూతికా వ్యవస్థను ప్రతిపాదించి వారి ద్వారా స్త్రీల దగ్గర అన్యపురుషుల ప్రస్తావన తెచ్చేటట్లు చేయటం, స్త్రీలను ప్రలోభాలకు గురిచేయటం వంటివి చెప్పబడ్డాయి. తత్ఫలితంగా కుటుంబంలోని పురుషులు ధార్మిక/ఏకస్త్రీ నిష్ఠయైన శృంగారపు పరిధులను దాటి దేశాటనలో భాగంగా శృంగారాన్ని వృత్తిలో భాగం చేసుకోవటమే గాక చనిపోయే చివరి క్షణంలో కూడా "ఆయములను వ్రచ్చు వేళున్ గూడ వల్లభాభీముఖంబుగానే నిలుచుఁ బల్లెఱేని చూపు" (5-49) అని చెప్పటం జరిగింది. కామప్రవృత్తితో "పెఱవెలంది రతుల మరిగి తిరుగువాని" (1-44) అని ఉండటంచేతనే నాటి స్త్రీలు ఆ పల్లెలో "ఎవని మోముఁజూతు మెవనితో మంచి సెబ్బరలను మేము చెప్పికొందుమింక నవ్వుకొందు మెవనితో నజ్ఞాన భద్రపీఠమైన పల్లెటూర" (2-64) అంటూ తామున్న పల్లెను అజ్ఞాన భద్రపీఠమని భావించడం జరిగింది.

శాతవాహనుల కాలంలో పరిశ్రమల అభివృద్ధి జరిగి వాణిజ్య సంబంధాలు విస్తృతమయ్యే క్రమంలో పురుషులు దేశాటన చెయ్యాల్సిన అవసరం ఏర్పడింది. పాదచారులుగా దేశాటన చేసే క్రమంలో పురుషులు చాలరోజులపాటు కుటుంబాలకు దూరంగా ఉండాల్సి రావడంతో (1-35) పథికులుగా గ్రామాలలో అన్య స్త్రీలతో సంబంధాలు ఏర్పరచుకుకునే (1-21, 6-82) ఆనవాయితీ ఏర్పడింది. హాలికులు కూడా సాగుచేయని కాలమైన వేసంకాలంలో (7-10) "మదము కనులగప్పి" దేశదేశాలు తిరగటంతో (6-86) కుటుంబ స్త్రీల వైవాహిక జీవితాలలో అభద్రత చోటుచేసుకోవటమనేది సహజ పరిణామయింది. అందుకే గాథాసప్తశతిలో కుటుంబ స్త్రీలు బాధాతప్తజీవికలుగా వ్యథనొందటం (3-22, 4-83) స్పష్టమవుతుంది.

పితృస్వామ్య కుటుంబాలలో ఒకవైపు బహుభార్యాత్వపు సంస్కృతికి (2-46, 2-52, 5-20, 5-79), బాధితులైన స్త్రీలు తమలో తామే బాధను దిగమింగుకుంటూ (4-13) భార్యభర్తృ సంబంధాలలోని అసమనైతిక సంస్కృతిని "ననుదాని పేరు పెట్టుకొని యే పిలువనిందు" (2-31) అంటూ

సహించారు. కాని అన్యస్త్రీల కామ సంబంధాలతో "క్రొత్త భోగినీదత్తంబులగు వాయినముల రుచికి మరిగి" (7-3) "మదము కనులగప్పి మగవారు దేశదేశాల తిరుగు తప్పు" (6-86) అని భావించి కుటుంబంలో తమ జీవికకు "పలువెలదుల వలచు నాతని ప్రేమ అయిదునాళ్ళవరకె" (1-72) ఉంటుందని భావించారు. దాని వల్ల తమకు అభద్రత ఏర్పడుతుందనే భావనతో బాధపడుతూ స్త్రీలు తమ నిరసనగళాన్ని ఈ గాథలలో వ్యక్తం చేయటం స్పష్టమయింది. అందుకనే తమ భర్తలు దూరతీరాలకు పయనమవుతున్న వేళ భార్యలు భర్తల ఎడబాటుకు గురిఅవుతున్నట్లుగా భావించేవారు. వేసం కాలంలో (7-11) స్త్రీలు తమ భర్తలు మదము కనులగప్పి (6-86) దేశాటనకు బయలుదేరి వెడితే అక్కడ అన్యస్త్రీల సంబంధాలు పెట్టుకోవటానికే వారంతా వెళుతున్నారని భార్యలు భావించారు. భర్తలు తమదేశాటనను గురించి ముందుగా భార్యలకు చెప్పరు. ఊళ్ళో లోకుల వల్ల భర్త ఊరికి వెళ్ళే విషయం భార్యలకు తెలుస్తుందంటే "కటిక మనసువాడు కాంతుడు రేపూరికేగు ననుచు లోకులనగ వింటి" (1-46, 2-11) అని వ్యక్తం చేసారంటే భార్యాభర్తలమధ్యనున్న మానసిక అంతరాన్నేగాక ఒకే ఇంట్లోనే ఉంటున్న భార్యభర్తల ఎడబాటును దానంతట అదే స్పష్టంచేస్తోంది.

భర్త దేశాటనం వెడితే అతడ్ని వదిలిపెట్టి ఎలా ఉండగలమనీ, కామేచ్ఛగల పథిక సమాజంలో తమ జీవికకు భద్రత ఉండదనీ భావించి ఎడబాటుకు గురి అయినట్లుగా (6-2) విలపించేవారు. పతిదేశాటన విషయం (2-11) విష ప్రాయంగా భావించి, రేపు భర్త దేశాటనకి బయలుదేరుతాడంటే తెలవారకపోతే (1-46) బాగుండునని అనుకునేవారు. ప్రతి వేసంకాలంలో భర్త దేశాటనకు బయలుదేరితే భార్య (7-11) చిక్కి సగమవుతుంది. భర్తను వదిలి ఎలా బ్రతకాలి అని అర్థంకాక పతి వియోగంతో బ్రతికే స్త్రీలను అడగటానికి (1-47) ఇల్లిల్లు తిరుగుతుంది. పతి వియోగం మనస్సును ఱంపపు కోత కోస్తుంటే (2-53) దుఃఖంతో ఏడుస్తున్న ఆమె కన్నీటిధార నూలుపోగు దారంలా ఉందట. అంతేకాదు దీపం వెలిగిస్తున్నప్పుడు కూడా దుఃఖంతో ఏడుస్తున్న ఆమెకన్నీటి ధారకు ఆ

దీపం ఆరిపోతుందేమోనని "అనుంగు ప్రియుని దలచుకొన్న బొర్లి వెల్లువై పారు" (3-22) తుంటే ముఖాన్ని పెడగా పెట్టి దీపం వెలిగిస్తోందట. ఇంకా కరుణానికి పరాకాష్ఠ అయిన స్థితిలో "తన తనూజుఁబ్రోచు కొనుచుండ శిరమొడ్డి కప్పు చూఱునుండి కాఱు నీటి కంతెలేని పాంథునాలు వానినిఁదన కంటినీటుదడుపు చుంటుగనదు" (7-21) అనేది పాంథుని భార్య దుఃఖానికి అద్దం పడుతుంది. దీనిని బట్టి ప్రోషిత (దేశాటనం వెళ్ళినవారు) భార్యలు నిరంతరం దుఃఖపడ్డారని అర్థం చేసుకోవచ్చు. వానాకాలం వచ్చినా యింటికి రాని భర్త కోసం ఏడుస్తుంటే కప్పుచిల్లు నుండి జారుతున్న వానతో ఇల్లు తడుస్తుంటే కప్పు ఉన్న మిగిలిన భాగం భార్య కన్నీటితో (6-46) తడుస్తోందని చెప్పటం మనసులను నీరుగార్చక మానదు. ఆమె ఏడుస్తోందంటే అతడు దేశాటనకు వెళ్ళి అన్యస్త్రీతో సంబంధాలు పెట్టుకోవటం అనేదానికి సాక్షిగా ఆమె కన్నీళ్ళలో (6-73) ఆతని తప్పులు ప్రతిబింబిస్తున్నాయట. ఆజన్మాంతరబుద్ధికాబట్టి వంకీలుగా ఉన్న జుట్టును సాఫీచేయలేని విధంగా ఆతని బుద్ధికూడా వేసంకాలం రాగానే "మరల నూరేగన్ దలబెట్టుకుంటివటరా కటిక గుండెవాడా" (3-73) అంటూ ప్రతిసారీ అతడు భార్య కాళ్ళమీదపడి క్షమించమని అడిగినా తిరిగి మళ్ళీ దేశాటనకు బయలు దేరుతాడని క్షమించనని అంటుంది. దేశాటన అనంతరం కొంతమంది ఊళ్ళోకి వచ్చికూడా యింటికి రాని భర్త కోసం అన్వేషిస్తూ (2-36) కాషాయరంగు చీరకట్టి వాయినాలు యిచ్చే రూపంలో యిల్లిల్లూ తిరుగుతూ "నీవు కంటఁబడక పోవనువాసఁజెంగావిరంగు చీరెఁగటిధరించి వాయనమ్ములిల్లు వరుసగాఁ బంచెను కదర! యీవురాక కటికవాడ" (4-28) అని భావించారంటే అలా వెదుకుతున్న స్త్రీలున్నారని అర్థం. వాయనాల సంస్కృతికి మూలాలను తెలియజేసింది. మానవజాతిలో మాయామర్మాలు లేని ప్రేమలుండవుగాబట్టి ఎడబాటుతో బ్రతకగలగాలని (2-24) స్త్రీలు భావించటం కనబడుతుంది. భార్యాభర్తల మనసులు ఒకటైతే దూరతీరాలలో ఉన్నా ఎడబాటుగా ఉండదని భావిస్తారు.

కుటుంబంలో భార్యాభర్తృ సంబంధాలకు పునాది ప్రేమ. ప్రేమకు ఆలంబన మనసు. అందుకే స్త్రీలు కామేచ్ఛతో అన్యసంబంధాలు పెట్టుకునే భర్తలకు తమమీద ప్రేమ లేదనీ, వారికి మంచి మనసులేదనీ బాధపడటం కన్పడుతుంది. స్త్రీలు ముఖ్యంగా భర్తయొక్క మనస్సును "హృదయమును గ్రహించునెడన్ జాలు గోర్కెలుతీరనప్పటికిన్ దీరినట్లు" (1–61) గా స్త్రీలు భావిస్తే పురుషుడు స్త్రీల శరీరాన్ని కోరుకున్నట్లుగా గాథలు అర్థమవుతాయి. (8–13). మంచితనంతో మరులు కల్గినవారికి చెలిమి రక్తికట్టుతుంది గానీ వేఱు మనసు కలవారికి మనసిచ్చినందున జనం నవ్వుతారని (1–41) భావిస్తుంది. మంచి మనసు గల భర్తతో "తృప్తి తీరకుండా వీక్షింపన్ దగి మంచితనముతోడ మనస్సు మనస్సుగలసి కష్టసుఖముల రీతిగాజూచుకొనువారి పొందుదొరకుటన్ పుణ్యమునన్" (1–99) అంటూ కష్టసుఖాలు పంచుకోగలిగితే బాగుంటుందనీ, అంతరంగానికి అనుకూలంగా లేని భర్త "అంతరంగమునకు అనుకూల బడదేమి నాప్తుడే ననాప్తుడగుట నిజము" (4–5) అని అతడు ఆప్తుడుకాడనీ, భర్త పట్టించు కోకపోతే మనసు ముక్కలవుతుందనీ (3–4) మంచిమనసు లేక తీయని మాటలతో కనికరం చేసేటప్పుడు కలిగే బాధ, అతడు చేసే తప్పు పనులప్పుడు కూడా కలగదని "మంచి మనసు లేక మమున్దీయమాటలన్ గనికరించునప్పుడున్ కలిగిన బాధ కలుగదెప్పుడు పలుమారు నీతప్పు లెన్ని గన్న నమ్ము" (4–53) అనీ, భర్త తిరస్కార దృషితో పట్టీపట్టనట్లుండి మనసును చంపేస్తున్నాడనీ "పట్టీపట్ట నట్లుపరచి నా యంతరంగంబు సమూలము గన్ బెకల్చివైచే రతిలేని నీ తిరస్కార పునయనార్థ దృష్టి" (2–46) అని అనేకవిధాలుగా స్త్రీలు బాధపడతారు. భర్తకు మంచి మనసు లేనపుడు తన మనసు బాధపడి కాలిమసైపోయినా సరే అతనికి (5–1) ఇన్ని నీళ్ళు వదిలివేయటం సమంజసమని భావించింది. మనసు అర్థం చేసుకోకుంటే కోరికలు తీరినా తీరనట్లేనని (1–61) భావిస్తున్నది. భర్తను భార్య ద్వేషించదు కాబట్టి (6–10) ప్రణయాన్ని చంపినా మనసు విరగదని అంటుంది.

స్త్రీకి అటు పుట్టింట్లో స్థానంగాని, ఇటు సామాజిక వ్యాపకాలుగాని ఉండే అవకాశాలు లేవు కాబట్టి తన ప్రేమంతా రంగరించి భర్తయందే తన ప్రాణాన్ని నిలుపుకుంటుంది. అందుకే భర్త కూడ అదే స్థాయిలో "ఎంతపాటి వలపు నీవు భరింతువో అంత నాకొసంగుమంతె చాలు" (1–71) అని తనమీద ప్రేమ చూపించాలనుకుంటుంది. ఇద్దరిలో ఎవరికి ప్రేమ తగ్గినా కష్టాలుంటాయని చెబుతుంది. అయితే అతనిలో ఆ ప్రేమ ఉండాలంటే అతనికి మంచి హృదయం ఉండాలనీ, అప్పుడే ప్రేమ స్నేహంగా మారుతుందనీ (1–41) భర్తతో స్నేహం లేనప్పుడు సంపద ఉన్నా అనవసరమని (4–16) భావిస్తున్నది. కష్టాలలో భార్యను వదలిపెట్టకుండా ఉండటమే గొప్పసిరి అని, "చేత సిరియే సిరి యాపదలన్ దన్నున్ బాయకుండు నతడే ప్రాణసఖుడు సద్గుణములే రూపసంపత్తినాధర్మ కారణంబునదే జ్ఞానమనగా" (3–51) అనీ అటువంటి అతడ్ని భార్యదృష్టిలో జ్ఞానవంతుడిగా నిలబెడుతుందని భావిస్తుంది. భార్యాభర్త లిరువురు ఒకళ్ళ ముఖంలోకి ఒకరు చూసుకుంటూ ప్రేమలో మునిగిపోయే దంపతులే ఈ జగత్తులో ధన్యులనీ "దానిమోమున్ జూచు దయితుండదియు వానిన్ జక్కగాన్ చూచి మరులన్ జొచ్చుచుండ నిరువురును దలంచిరిట్టి దంపతులీ జగాన ధన్యులు" (5–98) అనిభావిస్తుంది. ప్రేమ అనేది మాటమాత్రంలోనే మటుమాయ మవుతుందనీ, స్త్రీలను ప్రేమతో చూస్తే వారి మనస్సులో కలిగే భావనలతోనే (7–50) పురుషులకు మంచి జరుగుతుందనీ, ప్రేమ అనే పదానికి అక్షరాలు (5–50) ఒకటేగానీ దాని ఉచ్చారణలోనే ప్రేమ రకరకాలుగా ఉంటుందని చెబుతుంది. పరస్త్రీలను ఇష్టపడే వాని ప్రేమ అయిదునాళ్ళ ముచ్చట (1–72) అనీ, భర్త ఎన్ని తప్పులు చేసినా బాధ ఉండదు కానీ, ప్రేమలేకుండా తీయని మాటలతో నమ్మించాలని ప్రయత్నించినపుడు (4–53) ఎక్కువ బాధ కలుగుతుందని చెప్పి మాటలో ఒకటి మనసులో ఒకటిగా "మంచి మార్గాన్ని ఎన్నుకున్నావనీ," (1–32) అనీ నాటకాలాడే భర్తతో అంటుంది. దేశాటనకు వెళ్ళినా అన్యస్త్రీలెదురైనా భార్య నెవరు మర్చిపోరో అతని చెలిమి చేయాలనీ, అతడే నమ్మకస్తుడని భావిస్తుంది. దేశాటనకు వెళ్ళిన భర్తమీద నమ్మకంలేకనే

“ఒట్టిపెట్టి ప్రేమనొప్పించు గతిపట్టె” (6-18) అనీ ప్రేమను ఒప్పించుకుని ఒట్టు పెట్టించుకునే గతి స్త్రీకి పట్టిందనీ చెబుతుంది. భర్తయందు భార్యకు ఎక్కువ ప్రేమ ఉండబట్టే సంశయించ గలుగుతుంది గానీ లేకపోతే భర్తను నిందించగల సాహసం (6-8) స్త్రీ చేయగలదా అని వ్యంగంగా చెబుతుంది. అయితే క్షమించమంటూ కాళ్ళమీద పడే భర్తను నమ్మమని (4-90) దూతిక చెప్పినా ససేమిరా అంటూ అతని మనసు నుండి వచ్చే మాటల పోకడే వేరుగా ఉంటుందనీ. పెదవులతో పల్కి బూటకాలాడుతారని (5-51) అతని మీద అపనమ్మకాన్ని వ్యక్తపరుస్తుంది.

భర్తకు తనమీద ప్రేమ లేదనీ, అతనికి మంచి హృదయం లేదనీ, నమ్మకం లేని వ్యక్తి అని భావించి అతని మీద కోపం తెచ్చుకుంటుంది. ఆ కోపాన్ని ప్రదర్శించే మార్గంగా తనకు చేతనైన పరిధిలో అలకవహిస్తుంది. కొంతమంది స్త్రీలకు ఆ అలక ఎంతో సేపు ఉండేది కాదు (1-74), ఒకవేళ ఎక్కువసేపు అలిగినా అతడు తన అలక తీర్చేవాడు కాడని తన ఆశ అడియాస అయ్యేదనీ (1-17) అంటుంది. ఒకవేళ భర్త కాళ్ళమీద పడి బతిమిలాడినా కొంతమంది స్త్రీలకు నమ్మకం లేక మళ్ళీ భర్త దేశాటనకు వెడతాడనీ భావించటంతో మానవతులైన (2-47, 5-32) స్త్రీలకు ఆ కోపం పోయేది కాదట. (2-29) దానితో అతడు మళ్ళీ దేశాటనకు వెళ్ళేంతవరకు ఒక ఊరిలోనే ఉన్నా వేరుగా ఉండేవాడు. అంతేకాదు ఆమెకు ఎంత అలక (కోపం) కల్గినా ప్రాణాలు మాత్రం విడువననీ “నీ యెడలనే మనస్సు నిలిపి చచ్చియును నీపాల మరలన్ బడగ వలయునెడో యలుకలిప్పుడెంత యలమిన నాప్రాణములున్ విడువనోరి” (4-75) అని చెబుతంది. దానికి కారణంగా చివరిక్షణంవరకు అతని మీద కోపంతో అతడ్నే తలుచుకుంటూ చస్తే మళ్ళీ అతనికే భార్యగా పుట్టాల్సివస్తుందనీ అంటుంది. అంటే భార్యా భర్తల సంబంధం జన్మజన్మల బంధంగాకాక వచ్చే జన్మకి ఆ భర్త వద్దనే భావన నాటికే స్త్రీలలో కలిగిందని అర్ధమవుంతుంది. భర్త చేత కన్నీటితో ప్రేమను ఒప్పించుకోవటానికి ఒట్టు పెట్టించుకునేగతి పట్టిన భార్యకికక కోపం ఎందుకని (6-18) భావిస్తుంది. స్త్రీలు కోపంతో అసలు

మాట్లాడక పోయినా పరవాలేదుకానీ, పట్టీపట్టనట్లు మాట్లాడితే తమకు చాలా బాధగా ఉంటుందని (6-64) భర్తలు భావిస్తారు. దోషాలు చేస్తూకూడా భర్తలు భార్యమీద ద్వేషంతో కోపం తెచ్చుకునేవారని (5-88) అర్థమవుతోంది. ఒక స్త్రీ తన భర్త "రేయి రిక్త పక్కన్జేసి మోసగించినప్పుడు పొడిమెదు బాధ నీవనుభవించి యున్న నలుగవిట్లు" (1-26) అని అలిగిన భర్తకు తన బాధను తెలియజేస్తుంది. అర్ధరాత్రి మోసగించి పోయినప్పుడు తాను పడ్డ బాధ భర్తకు తెలిస్తే అతడు ఇలా అలగడని అంటుంది. అలక తీరాలని భర్త కాళ్ళ మీదపడపితే ఆమె అతని గడ్డాన్ని వదలి పెడితే ఆమెకు కోపం పోయినట్లుగా (2-88) భర్త భావిస్తాడట. అందుకే భార్య అలక వహిస్తే మరోమార్గం లేక ఆమె కాళ్ళమీద పడి క్షమించమని అడుగుతాడు. ఆ సందర్భాన్ని గురించి దూతిక (4-90) "ప్రేమకు చరమసీమ" అదేనని క్షమించమని ఇల్లాలికి చెబుతుంది. దేశాటన నుండి తిరిగివచ్చి భార్యతో ఒక్కమాటైన మాట్లాడకుండా కాళ్ళ మీద పడ్డ భర్త జుట్టును కాలి బొటనవ్రేలితో "నా యడుగులందున్ బడగా నతని జుట్టు కాలి బొటనవేలన్ గమించి గట్టిగన్ వేసి ఈడ్చునాటి సుఖంబు నెప్పుడున్ దలంతు" (2-8) పెనచి గట్టిగా అతడ్ని యీడ్చి వేయాలనే భావన ఆమెకు సుఖాన్నిస్తున్నదని చెప్పింది. భర్త చాలాసేపు అనునయించిన తర్వాత భార్య ప్రసన్నురాలైనా అతని తప్పులను నెమరువేసు కొంటూ లెక్కపెడుతుంటే ఈ "తడవు నీ యొనర్చు తగని పనుల హస్తయుగళ వేళలనెంచఁ జాలకెంత సేపొ గోల ఏడ్చె" (3-77) అని లెక్కపెడుతూ ఆమె చేతివేళ్ళు సరిపోక ఏడ్చిందట. అంటే పదే పదే దేశాటన రూపంలో అన్య సంబంధాలు పెట్టుకోవటం, తిరిగివచ్చి భార్య కాళ్ళమీద పడటం ప్రతిసారీ జరిగే దృశ్యాలు గాను, దానికి భార్యలు దుఃఖపడటం స్పష్టంగా గాథలలో దృశ్యం మానమవుతుంది. భార్య తన పాదాలమీద భర్త పడ్డప్పుడు భార్య దీపాన్ని మరింత పెద్దది చేసి చూడటం "అడుగులందు వాడుపడియుండునెంతగాఁ దీర్చివెలుగు చున్న దీవెవత్తి నెక్కఁద్రోచెనత్త, యేమందునికఁదాని నడతఁజూచి నాకు నవ్వువచ్చె" (3-64) అని మరొక స్త్రీ చెప్పిందంటే భర్త కాళ్ళమీద పడటం భార్యకిష్టమైన విషయంగా అర్థం అవుతుంది.

అయితే భారతనారి పతివ్రతగా ఉండటమే ఆమెయొక్క జీవితాశయంగా పెంచబడతుంది. కాబట్టి పగలంతా కోపంగా ఉండి భర్తతో మాట్లాడకపోయినా యింటిపని ముగించుకుని రాత్రి భర్త కాళ్ళ దగ్గరపడుకునే ఆమె పద్ధతి (3-26) భర్తకు చాలా యిష్టమనీ, పైగా గొప్పగా దాన్ని ఇతరులతో భర్త చెప్పుకోవటం కన్పడుతోంది. కాని అదే సమయంలో లోపల మాత్రం నన్ను ముట్టుకోకని (2-92) అలకతో మాట్లాడే భార్య అతడికి గుర్తుకువస్తుందట. భార్యల విషయంలో పితృస్వామ్య సంస్కృతి పరిరక్షణలో భాగంగా భర్తల డాంబికం. కుహనాతత్వం అర్థమవుతుంది.

కొంతమంది స్త్రీలు తమ భర్తలు కాళ్ళమీద పడి క్షమించమని అడిగినపుడు "చేసిన తప్పులకా, చేస్తున్న తప్పులకా, చేయబోయే తప్పులకా క్షమించాలి" (1-90) అని భర్తను నిలదీయటం కనబడుతుంది. పైపెచ్చు సుడిగుండాలవంటి కష్టాలు భర్తకు తెలియాలంటే (2-57) చపలచిత్తంగల స్త్రీ లభించినప్పుడు మాత్రమే తెలుస్తుందని చెబుతుంది. భర్త రాక కోసం నిరక్షరాస్యులైన గ్రామీణ కుటుంబ స్త్రీలు రోజులు లెక్కపెట్టుకోవటంలో భాగంగా (2-70) గోడమీద గీట్లు రాసి తుడుపు కోవటం చేస్తూ అతనికోసం ఎదురుచూస్తుంటారనీ (3-6, 3-6, 4-7) అర్థం అవుతుంది.

భర్తలపై అలకవీడని భార్యలకు దూతికలు ఉద్భోధచేస్తూ యవ్వనంలో (1-45) ఈ పంతం వద్దనీ, భర్తకు అవసరమైతే అన్య స్త్రీ సంగమానికి (1-84) భార్యయే దూతికగా మారుతుందనీ, భర్తపై అలక వహిస్తే ఆమెకు మరింతమంది సవతులేర్పడుతారనీ (2-52) మగవాళ్ళను వదలిపెడితే వాళ్ళెక్కడైనా బ్రతకగలరనీ (3-27) కాళ్ళమీద భర్త పడ్డాడంటేనే అతని ప్రేమకు అది (4-90) పరాకాష్ఠస్థానమనీ, అతడు కోపంతో వెడుతుంటే ఆపలేని అలక (5-32) ఎవరి మీద అనీ, భార్యలు సుఖపడాలంటే కాళ్ళమీద పడ్డ భర్తలను ఆదరించి (7-50) ప్రేమించాలనీ లేకపోతే భర్తలు ఇల్లు వదిలి శాశ్వతంగా దూరమవుతారని (2-63). దూతికలు చెప్పటం జరిగేది. ఎక్కడి మాటలు అక్కడే

తీయగా మాట్లాడు దూతికలు (2-81) అగ్నికి ఆజ్యం పోసినట్లుగా పురుష ప్రయోజనాలకు వీలుగా ప్రవర్తించి పబ్బం గడుపుకుంటూ జీవనాన్ని సాగించే వారని అర్థమవుతుంది. నాయకులకు సహాయంగా ఉండి నాయికతో జతగూర్చే దూతికా వ్యవస్థ (1-30) మిత్రవర్గానికి (2-68) సేవక వర్గానికి (2-74) చెందినదై పురుషుల భోగలాలసతకు, వాంఛాశక్తికి అనుకూలంగా ఉండి అందమైన స్త్రీల గురించి చెప్పటమే (1-45) గాక స్త్రీల దగ్గరకు పురుషుల తరుపున రాయబారాలు నడిపిన దూతికలుగా (7-50) గాథాసప్తశతిలో కన్పడతారు. సుమారుగా 1వ శతాబ్దానికి చెందిన వాత్స్యాయనుడు తన కామశాస్త్రంలో ఇటువంటి దూతికా వ్యవస్థను పేర్కొన్నాడు.

భర్తల తిరుగుళ్ళలోని అర్థాన్ని గ్రహించిన వారి భార్యలు కుటుంబ సంబంధాలలోని డొల్లతనాన్ని గుర్తించి స్త్రీలు తమ జీవితాన్ని ప్రశ్నకు పెట్టుకోవటం కనబడుతుంది. భర్తకు అన్యస్త్రీ సంబంధాలపై మోజు తగ్గించే మార్గంగా స్త్రీలు తామే భర్తలకు దగ్గరై వారినెలా తృప్తి పరచాలో తెలియటం లేదని (5-76) పెళ్ళయిన కొత్తల్లో జిడ్డు మొహంతో ఉన్నా కూడా భార్యను యిష్టపడేవాడనీ ఇప్పుడు (6-19) సింగారం చేసుకున్నా పట్టించుకోవటం లేదనీ భావిస్తుంది. స్త్రీలకు భర్తల యెడ కోరికలుండకపోవటం చేతనే భర్తలు అడ్డదారులను తొక్కుతారని భావించే (పితృస్వామ్యానికి చెంపపెట్టుగా) భార్యలు తమ సహజమైన శృంగారభావనలు వ్యక్తీకరిస్తే (7-61) కులట అని నిందిస్తారనే భయం ఆమెకు ఉండేదట. అన్యస్త్రీ సంబంధాలతో భర్త భార్యను పట్టించుకోవటం లేదనీ (5-41), ఒకవేళ అతడు దగ్గరకు వచ్చినా, "ముట్టుకొనకుఁకంపుగొట్టు దాని? (1-51) అని అతని దగ్గర అన్యస్త్రీల కంపు కొడుతోందని భార్య భావించేది. అతని తిరుగుళ్ళు గుర్తుకు (1-44) వచ్చేసరికి ఇక భార్యలకు కోరికలు తీరే మార్గమే లేదు అని భావించింది. పొలంపనులకై వానాకాలంలో మాత్రం ఇంటి దగ్గర ఉండే భర్తలు పొలంపనికై బురదలో నడిచి అలసిపోవటం (4-24) వల్లగానీ, లేక శృంగారానికి పనికిరాని (4-47) శరుడైన భర్తలవల్ల గాని కోరికలు నెరవేరటం లేదని స్త్రీలు భావించారు. "భర్త దేశాటనకు వెళ్ళినా గాని పథికుల

రాకపోకలు ఉన్నాకూడా కుటుంబ స్త్రీలు అన్యసంబంధాలు పెట్టుకోవటానికి ఇష్టపడేవారు కాదనీ (1-35), (1-36) ప్రౌఢాంగన మాటల్లో స్పష్టం అవుతుంది. ఒకవేళ స్త్రీలు ఎక్కడన్నా చెడిపోయినా దానికి కారణంగా భర్త దేశాటన రూపంలో అన్య స్త్రీసంబంధాలు (2-97) పెట్టుకోవటానికే చేసిన పథికుల ప్రయత్నాలు, యవ్వనం, మధుమాసం కారణాలుగా భావించమంటుంది.

స్త్రీలకు వారి శరీరాల మీద (1-26, 1-25) మనస్సులమీద (1-41, 1-61, 1-90) స్పష్టమైన అవగాహన ఉండేది. భర్త కాముకత్వాన్ని, లైంగిక హింసను తన శరీరం తట్టుకోలేకపోవటాన్ని (1-55), వేళాపాళా లేని శృంగారాన్ని (4-100) స్త్రీలు నిరసించటం కన్పడుతుంది. స్త్రీలు వంట చేస్తూ పొగకు ముఖాలకు మసి పట్టినా వారి శ్రమను గుర్తించని భర్తలు వారి శరీరాలను శృంగారభావాలతోనే చూసేవారని అర్థం అవుతుంది. (1-13, 1-14), పుష్పవతిగా ఉన్నప్పుడు కూడా స్త్రీలను బాధపెట్టేవారని (5-13, 6-29) అర్థం అవుతుంది. భర్త యింట్లో లేనప్పుడు పథికులు ప్రయత్నం చేయటం, (7-67) కన్పడుతుంది. ఇంట్లో మరుదులు కూడా తమ జోలికి వస్తుంటే "మంచి మనసులేని మఱందికిఁ బవలెల్ల గులవధూటి యింటిగోడమీద వ్రాయబడిన కౌసలేయుఁగొల్చు సుమిత్ర కొడుకు చరితలెల్ల నుడుపుచుండు" (1-35, 1-28) అని తమ జోలికి రావటానికి ప్రయత్నించినప్పుడు ఇంటిగుట్టు బయటపెట్టటం ఇష్టంలేక మంచి మనసు లేని మరిదికి బుద్ధి చెపుతూ వదినను మాతృభావంతో చూసిన లక్ష్మణుడు బొమ్మలను గోడమీదచూపించి వారి చరితలను చెబుతూఉండేవారనీ, అలా ఆత్మరక్షణ చేసుకునేవారని అర్థం అవుతోంది.

గర్భవతి ఐన భార్యను భర్త పట్టించుకోకుండా (1-92) దేశాటనకు బయలుదేరేవాడు. భర్త ఎక్కడ అన్య సంబంధాలు పెట్టుకుంటాడోఅనే భయంతో స్త్రీ గర్భభారపు కష్టంకంటే కూడా అతనితో నిధువన క్రీడ జరపనందుకు (5-83) బాధపడటం కన్పడుతుంది. భార్యకు జ్వరం వచ్చిందని కబురు చేస్తే భర్త దేశాటన ముగించుకుని యింటికి రాగా జ్వరం తనకు ఉపయోగకరంగా

ఉందని ఆ భార్య "కుశలమరయు నతనిన్ గొనివచ్చితిన్ దుర్లభుండైనను దవ్వు నుండి జ్వరము యిటులుపకరించితిప్పుడు" (1-50, 1-51) అని భావించటం కన్పడుతుంది.

పేద కుటుంబాలలో భర్తల అన్య సంబంధాలు తక్కువగా ఉన్నాయనీ, వర్గ స్వభావం లైంగికసంస్కృతిలో యిమిడిఉన్నదనీ అర్థంఅవుతుంది. (7-71) స్త్రీలు సంతానార్థమే కుటుంబంలో స్త్రీ-పురుష సంబంధాలను భావించేవారు. (6-25, 2-82) భద్రగిరి, వింధ్యపర్వత ప్రాంతాలకు చెందిన గిరిపుత్రికలైన బోయ, శబర, ఎరుక, చెంచిత స్త్రీలకు షరతులున్నా (2-27, 6-97) వారు తమ భర్తల యొక్క అన్య స్త్రీ సంబంధాల విషయంలో చాలా అప్రమత్తతతో (7-64) ఉన్నట్లుగా అర్థం అవుతుంది. అదే విధంగా వీరభటుల పత్నుల విషయంలో విటులు ఆ భర్తలకు భయపడి జాగ్రత్తగా ఉండే వారనీ (1-37, 6-76) అర్థం అవుతుంది. సామాజిక కుటుంబంలో ఉన్న అసమనైతిక సంస్కృతి ఆచరణలో ఉండటం వల్ల పురుషుల భోగలాలసత, స్వేచ్ఛాయుత కామ సంబంధాలు సమాజంలో విమర్శకు గురి అయినట్టు కనపడదు గానీ "తిరిగెదేని యిట్లు తిరుగుము సౌభాగ్యగుణమదమున నీవు గోష్ఠమునందు స్త్రీలలోని మంచి చెడులు విచారింప నీవు చాలు వాఁడవేని" అని చర్చించే అర్హత ఉందా అని ఆమె అన్నదంటే స్త్రీల మంచి చెడులను మాత్రం పాలనాసభలలో (5-47) చర్చించేవారుకానీ, పరిపాలనలో పితృస్వామ్య అసమనైతికసంస్కృతిని పరిరక్షణ చేసేవారని అర్థం అవుతుంది. పురజనులు, దూతికలు స్త్రీలమీద నిఘా పెడ్తూండేవారు. ప్రోషిత భార్య తన కుమారుడు చెట్టు మీద మామిడికాయ కావాలన్నప్పుడు ఆమెకు అందకపోయే సరికి ఆ దారినపోతున్న వ్యక్తిని కాయకోసిమ్మని అడిగినందుకు పౌరుడొకడు దానిని చూసి (6-98) ఆమెను 'వైరిగృహిణి'గా వర్ణించి ప్రవాసంలో ఉన్న ఆమె భర్తకు తెలియచేసాడట.

ఆనాటి స్త్రీలు భర్తలతో సమస్థాయి సంబంధాలు కోరుకుంటూ "ఎంతపాటి వలపు నీవు భరింతువో అంత నాకొసంగుమంతె చాలు" (1-71)

అంటూనే కుటుంబ సంబంధాలలో భర్తలు చేసిన పనినే భార్యలు చేస్తే ఎలా ఉంటుందనీ ప్రశ్నించటం జరిగింది. నీకులాగా తిరిగే భార్య నీకు వస్తే ప్రేమలో ఉండే కష్టాలు నీకు అర్థం అవుతాయనీ, భర్త ఎలాంటి పనులు చేస్తాడో, ఎట్లా పలుకుతాడో "ఎట్లు చేయుచుండు ఎట్లు పలుకుచుండు, ఎట్లు చూచుచుండు నీవల్లే తాను నేర్చుకొనెడిదానికిన్ బవలిప్పుడు కడచుచున్నదంత పొడవుగాన్" (4–78) అంటూ ఎట్లా చూస్తాడో అలాగే తాను అన్ని నేర్చుకుంటూ భార్య గడపాలనుకుంటుందట. అందుకే ఒక అత్త కొడుకుతో "ఆదరము వివేకము వైదుష్యములు నున్న కొలది మిగులన్ జూడగల కులీన కాంతలకు విరక్తి ఎంత కలిగిన దాని పొలకువైనఁ జూడఁగలమె? సుతుఁడ!" (3–66) వివేకవైదుష్యం గల స్త్రీకి విరక్తి కలిగితే ఆమెను నీవు సమీపించలేవని హెచ్చరిక చేస్తుంది.

పురుషులు స్త్రీల నొక భోగ వస్తువుగా (5–13) భావించి ఆమె శరీరాలకు ప్రాధాన్యత నివ్వటంచేతనే అంతగా అన్య స్త్రీ సంబంధాలకు అలవాటు పడినట్లు (1–56, 1–72, 6–82) అర్థం అవుతుంది. అందుకే గ్రామణి కూతురైన బాలికను చూసి ఆనాటి కాముకులు పిల్ల ఈడేరితే ఇంకా ఎంత అందంగా (5–10) ఉంటుందో అనుకోవటం, స్నానం చేస్తూన్న విగతవస్త్రయైన స్త్రీని చూసి ఒకడు మిత్రులతో ఆమె శరీరాన్ని (2–25) వర్ణించి చెప్పటం పురుషుల కాముకత్వానికి మచ్చుతునకగా భావించవచ్చు. అందుకే భర్త చచ్చేటప్పుడు యముడు వచ్చిన సమయంలో కూడా చుట్టూ ఉన్న తన భార్యల సౌందర్యం వైపే (5–49) చూడటం కన్పడుతుంది. కామెర్ల కళ్ళతో చూసే పురుషులకు, స్త్రీలు భర్త శవం మీదపడి ఏడుస్తుంటే ఆమె శృంగార దృష్టితోనే భర్త శవాన్ని కౌగిలించుకుంటదనీ (5–7) అనిపించేదట.

దేశాటనకు వెళ్ళిన భర్తలు కుటుంబాలలోని భార్యలను పట్టించు కోకుండా స్వార్థంతో తమ సుఖాలను తాము వెదకుకొని అన్య స్త్రీ సంబంధాలను అనుభవించారని అర్థం అవుతుంది. దేశాటనకు వెళ్ళిన భర్తల మీద భార్యలకు ప్రేమ, నమ్మకం పోయి మనసు కలతపడి ఉన్మాదులుగా మారిన స్త్రీలు

(3–96, 4–59, 6–18) కన్పడితే కొంతమంది స్త్రీలు చావాలనుకున్నారు. బ్రతికున్న భర్తకు దూరమవటంతో మునుపు తాము అతనితో అనుభవించిన సంసారసుఖాలన్నీ తలచుకుంటూ "యిప్పుడతనిన్ బాసి మున్ననుభవించిన సుఖములన్ దలచుకొనెడి నాకు వధ్యపటాహఘోష వలె విననయ్యెన్" (1–29) అని మరణమృదంగంగా భావించారు. దేశాటన తరువాత తిరిగి వస్తాడనుకుంటే యింటికి రాకుండా ఆ ఊళ్ళోనే వేరేగా ఉన్న భర్తకు దూరంగా ఉండటం కంటే కూడా (1–43) ఆ స్త్రీ చావాలనుకున్నది. భర్త అలా అన్య స్త్రీ సంబంధాలకై దేశాటన చేస్తుంటే ఏమీచేయలేని స్త్రీకి నదిలోపడి చచ్చే (3–31) తెగింపు వస్తుందని భావించారు. నిత్యం భర్తమీద పెంచుకున్న ప్రేమతో భార్య విరహదుఃఖాన్ని అనుభవించటం కన్నా నిస్సహాయ స్థితిలో మరణ వినోదాన్ని యిష్టం చేసుకొని (4–42) చావటం నయం అనుకుని కొంతమంది స్త్రీలు భావిస్తే కొంతమంది స్త్రీలు మాత్రం తాము ఎందుకు చావాలని భావించి (6–11) భర్తలు అన్య స్త్రీలను అందంగా ఉన్నారని భావించినపుడు అందంగా లేని భార్యలు చావాలా? అని ప్రశ్నించారు.

స్వీయ చైతన్యం గల స్త్రీ అసలు ప్రేమలేని, మంచి హృదయం లేని భర్తకు నీళ్ళొదలి, "మొదట వధువు నీళ్ళు వదలే వేడుకల నొయ్యారములకు, నవ్వులాటలకును, మునుకలిడుచున్ బిదపన్ దన కుటుంబ భరమ్ము దానే నిర్వహింపన్ బూనుకొనియె" (7–6) అని చెప్పినట్లుగా వేడుకులకు, వయ్యారాలకు స్వస్తి పలికి తమ కుటుంబభారాన్ని తామే మోయాలనుకుంటుంది. "మదము కనులన్ గప్పి మగవారు దేశదేశాల తిరుగుతప్పు సర్వమొక్క భామినందో, యిర్వురో, మువ్వురో చచ్చిపోవుదాక విరహంబులును బోవు" (6–86) అని అంటుంది. మగవారు దేశదేశాలు తిరగకుండా ఉండాలంటే భార్యలుగా తమలో ఇద్దరో ముగ్గరో ఆత్మ బలిదానం చేస్తే గానీ భర్తల అన్య స్త్రీ సంబంధాలకు విరుగుడు ఉండదనీ భావించి, అదే పరిష్కారం అని సూచించి, మనసులేని భర్తతో కాపురం చేయటం అనవసరమని తీర్మానం చేసారు. కాని అతడు చేసిన తప్పులనే తిరిగి మళ్ళీ దేశాటనరూపంలో చేస్తున్నాడు కాబట్టి

అతడ్ని క్షమించాల్సిన అవసరం లేదని భావించారు. అతడు ఉన్న ఊరిలోనే విడిగా ఉన్నా తన స్థిరచిత్తాన్ని మార్చుకోని మానవంతులైన స్త్రీలు ప్రాణనాధుడెంత బతిమాలుచున్నను నొకయూర నిరువురున్నన్ గూడన్ బెంచుకొనియన్ గినుకన్ బ్రియుడు బ్రోషితుడగునంతదాక మానవంతురాలు (2-29) అని భావింప బడినవారు కూడా ఉన్నారని అర్థం అవుతుంది..

పతియే ప్రత్యక్షదైవంగా భావించమని చెప్పిన కుటుంబసంస్కృతిలో ఒదిగినస్త్రీ తన భర్త జుట్టును కాలివేలితో పెనచి ఈడ్చుకుపోవాలనుకునేంత స్థితిలో కోపాగ్నికి గురి అవటానికి కారణం కుటుంబంలోని అసమనైతిక సంస్కృతి అని స్పష్టమయింది. మనసులు కలసి కష్టసుఖాలను పంచుకుంటూ భార్యాభర్త లిద్దరు ముఖముఖాలలో ప్రేమను పెంచుకుంటూ జీవించుటమే అసలైన దంపతీ సంబంధాలనీ, భర్తలు స్వేచ్ఛాయుత సంబంధాలవల్ల వారికి భార్యల మీద యిష్టం తగ్గి, స్త్రీలకు ఎడబాటును కల్పిస్తే స్త్రీలు తమకు చిన్నప్పటి నుండి యిష్టమైన తమ పుట్టింటివారితోను ఉండే వీలు లేక, తమంటే యిష్టం లేని వారితోనూ ఉండలేక తాము రెండు విధాలుగా కష్టాలు పడుతున్నట్లు (1-24) భావించారు. స్త్రీలకు ఆకలి బాధను (4-83), గర్భభారాన్ని (5-83) మోయటం కంటే కూడా భర్త దేశాటనయే తమను ఎక్కువగా బాధనిస్తుందని భావించారు (7-50). స్త్రీలు తమ గోడును ఎవరితో చెప్పుకోవాలో తెలియక అజ్ఞానభద్ర పీఠమైన ఆ పల్లెటూరిలో తమ జీవితాలకి భద్రత లేదని భావించారు. ప్రోషిత భర్తృక అయిన పేదరాలికి ఒక సంపన్నురాలైన స్త్రీ తన భర్త తనకు వశుడిగా ఉన్నా ఆమెకు ధైర్యం చెప్పి బ్రతుకు మీద ఆశ కల్పించటం(1-39) స్త్రీకి స్త్రీయే మిత్రురాలనీ, స్త్రీల బాధలు స్త్రీలకే అర్థం అవుతాయని స్పష్టం అవుతుంది. పురుషులు స్వేచ్ఛాయుత కామ సంబంధాల్లో మునిగియుండి భార్యలను పట్టించుకోవటం లేదని బాధపడటం కంటే కూడా భార్యలు తమను ఆదరించి వలచే వ్యక్తిని చూసుకుంటే వారికి సుఖం కల్గుతుందనీ చెలికత్తె (7-50) చెప్పటం జరిగింది. వీరి బాధలను హాలుడుగానీ, గౌరీవల్లభుడు గాని (5-67) తీర్చ సమర్థులని

భావిస్తారు. సంధ్య వార్చాలని శివుడు జలభరాంజలి యందు గౌరీ మొహం కనబడేసరికి మంత్ర జపం కూడా మరచి మోవిని అటుఇటు కదిపాడని ముగిస్తూ (7–100) పురుషులు భోగలాలసతో ధార్మిక కర్మాచరణలను కూడా మరచిపోయారని, ఆనాటి ముగింపు పద్యంతో హాలుడు సమాజస్థితి అర్థం అయేటట్లుగా చేసాడు.

కవయిత్రులు వ్రాసిన 16 గాథలలో అణులచ్ఛి (3–28), (3–74) అనే 2 గాథలలోను, వేశ్యల మనోభావాలను తెలియచేస్తే 3–76 గాథలో అణులచ్ఛి స్త్రీ శృంగారేచ్ఛను తెలియజేసింది. 3–63 గాథలో, బెజ్జా రచించిన 6–84, రోహ రచించిన 7–24 అనే 3 గాథలు వర్ణనలకు పరిమితమయ్యాయి. పితృస్వామ్య సంస్కృతికి లోబడి స్త్రీలు సర్దుకుపోతూ బ్రతకాలని చెప్పిన రోహ 2–63, ససిప్పహ 4–4 చెప్పిన 2 గాథలలో భర్త రాకకై ఎదురుచూసిన స్త్రీలు చిత్తభ్రాంతికి లోనవటం, చచ్చిపోవాలను కోవటాన్ని తెలియజేస్తే అసలుద్ధి అనే రచయిత్రి గాథలో (2–77) స్త్రీ తన విరహాన్ని తెలియజేయటం కనబడింది.

అయితే "జండర్" స్పృహతో వ్రాసినవి 6 ఉన్నాయి. ఈ ఆరింటిలో స్త్రీల మనోవేదన విషయంలో కవయిత్రుల భావాలు ఒకే రకంగా ఉన్నాయి. ఏ రచన అయినా సమాజభావాలకు ప్రాతినిధ్యం వహిస్తుందనేది నిర్వివాదాంశము. కవయిత్రులలో నాథా అనే ఆమె (1–41) "మంచితనముతోడి మరులు కలిగిన వారి చెలిమి రక్తిగట్టఁగలదు గాని, వేరు మనసు కలుగు వారికి మనసిచ్చు వారిన్ జూచి నవ్విపోరే జనులు అని చెప్పింది. రేవా అనే ఆమెయొక్క గాథలో" చేసినవియో లేక చేయుచున్నవో, చేయునున్నయవియో చెప్పు "నిజము వేనిసైచుమనెదు" నీనేరముల సిగ్గు బొగ్గలైన వాడా! పోకలాడ! (1–90) అని భర్త యొక్క తప్పులను నిగ్గతీసినట్లును, మాధవి అనే రచయిత్రి "భార్య అలక వహిస్తే భర్త ఆధికారంతో కాక సేవా భావంతో ఉండాలంటూ" (1–91) చెప్పటం జరిగింది. వథావహీ (1–70), అసలుద్ధీ (2–78), చెప్పిన గాథలలో వర్షాకాలం వచ్చినా, ఇంటికి రాని భర్తకై ఎదురుచూస్తూ ఉన్న దుఃఖితమతులైన స్త్రీలను గురించి చెప్పటం జరిగింది.

రేవా చెప్పిన గాథలో డబ్బుకు ఆశపడి పురుషులకు రాయబారిగా వచ్చిన దూతిక ఒక భార్య కోపాన్ని పులకింతగా భావిస్తూ చెప్పటం (1-85) కనబడుతుంది. అణులచ్చీ చెప్పిన (3-74) గాథలో స్త్రీల మనోవేదనలను తెలియ చేస్తే, పహాయి (1-86), రేవా (1-87) వ్రాసిన గాథలలో కోపంతో అలిగి, కొట్టవచ్చిన భార్యలను పురుషులు సంభాళింపచేయటాన్ని వ్యక్తం చేసారు.

క్రీ.శ.1 శతాబ్దానికి చెందిన ఆంధ్రరాజ్యంలోని మహిళల జీవనం గాథాసప్తశతిలో ప్రతిఫలించటంతో వారెంతటి బాధాతప్తసతులో అర్థమయింది. భార్యాభర్తల మధ్యన సంబంధాలు ఎలా ఉంటే కుటుంబనిర్మాణం సజావుగా ఉంటుందో తెలియజేసారు. ఆరోజుల్లోనే వారు కుటుంబాలలోని అసమనైతిక సంస్కృతిపట్ల తమ నిరసన గళాన్ని వినిపించే క్రమంలోనే సమాజంలోని తమ తోటి స్త్రీలతో సహానుభూతిని పొందాలనుకున్న విషయం స్పష్టమైంది. అందుకనే పితృస్వామ్యం సంసారాన్ని గుట్టుగా ఉంచాలనే సామెతలను పుట్టించింది. కుటుంబాలలో భర్తలు కుటుంబ పరిధి దాటి సమాజంలో స్వేచ్ఛాయుత కామ సంబంధాలు పెట్టుకోవటంతో మహిళల మనసులు కుంగిపోవమేగాక కుటుంబ నిర్మాణానికి మూలస్థంభాలైన ప్రేమ నమ్మకం లేకపోవటంతో కుటుంబనిర్మాణం బీటలు వారటంగా అర్థమవుతుంది. భార్యల మనసులు కుంగిపోవటానికి పురుషుల కాముకత్వం, భోగలాలసత కారణమయింది. అందులో స్త్రీలు కుటుంబంలో ఉన్నాకూడా బహుభార్యాత్వపు సంస్కృతివల్ల భర్తకు దూరంగా ఉండాల్సిరావడంతో, తమకు భర్తకు ఉన్న మానసిక అంతరానికి కుమిలి ఎడబాటును కొంతమేర సహించగలిగినా, మరోదారిలేక ఎలాగో ఒకలాగా కుటుంబంలో జీవించవచ్చని భావించారు. కాని పురుషులు దేశాటన రూపంలో అన్య స్త్రీ సంబంధాలు పెట్టుకుంటుంటే కలిగే ఎడబాటువల్ల కుటుంబాలలో తమ జీవనానికే భద్రత లేదని భావించారు. అటు పుట్టింట వారికి దూరమై, ఇటు భర్త తమకు దూరమవటంతో తమ కష్టాలు చెప్పుకునేందుకు "కాముకత్వమనే అజ్ఞానభద్రపీఠమైన ఆపల్లెలో" ఎవరికి చెప్పుకోవాలో

తెలియక తమ బాధలు తీర్చే నాథులే కరువై నిస్సహాయస్థితిలో ఆందోళన చెంది మానసికరోగులుగా మారారు. మరికొంతమంది స్త్రీలు తెగింపుతో చావాలనుకున్నారని అర్థమవుతుంది. అయితే అది సమస్యకు పరిష్కారం కాదని వివేక వైదుష్యంకల స్త్రీలు తమ వ్యక్తిత్వాలకు విలువనిచ్చుకునే దిశగా మానవంతులుగా నిలచి భర్తలతో మాట్లాడకుండా ఉండేవారనీ, అదే ఊళ్ళో భర్త ఉన్నా తాము విడిగా ఒంటరిగా ఉండటానికి నిశ్చయించుకోవటం కన్పడింది. అంతేగాదు ఆత్మవిశ్వాసంతో ఒయ్యారాలు మాని కుటుంబ భారాన్ని తమ నెత్తిమీద పెట్టుకుని భరించాలనుకుంటూ కుటుంబ సంక్షేమానికి పూనుకోవాలనుకోవటం నేటి మహిళలకు అటువంటి సమస్యల పట్ల తెచ్చుకోవలసిన చైతన్యానికి స్ఫూర్తిమంతంగా, కరదీపికలుగా నాటి స్త్రీలు స్పష్టమవుతారు. "గాథాసప్తశతి" గ్రంథంలో వ్యక్తమయినట్లుగా కుటుంబాలలోని అసమనైతిక సంస్కృతి అనే వక్రతల వల్ల కలిగే మహిళల మానసిక వ్యథను అర్థం చేసుకొని స్పందించగలిగితే అటు పితృస్వామ్యం తమ తప్పులను సరిదిద్దుకోగలుగుతుంది. అలా పురుషుల తప్పులను కేవలం చట్టాలతోనే గాక సాహిత్యం ద్వారా చైతన్యపరచాల్సిన బాధ్యత ప్రజాస్వామ్యానికి ఉంటుందనేది అందరూ ఆమోదించే విషయం.

*– ఆంధ్రజ్యోతి దినపత్రిక–'వివిధ' 26.09.2016*

# 3. పల్నాటిపోరు - పలుగాకుల హోరు

సమాజంలో అతి తెలివితేటలుగల స్త్రీని గురించి చెప్తూ 'ఆవిడా! నాయకురాలు నాగమ్మ' అని అనడం వినపడే విషయమే. 12వ శతాబ్దానికి చెందినదని చెప్పబడుతున్న నాగమ్మను నేటికీ చెప్పుకుంటున్నారంటే ఆమెను గురించి తెలుసుకోవలసిందే. 'నాగమ్మ' అనే ఆమెను 'నాయురాల్' అని పేర్కొనటం జనశ్రుతిగా చెప్పబడటం 'పల్నాటివీర చరిత్ర'లో కనబడుతుంది. పల్నాటి ప్రాంతంలోని వీరగాథా గేయ సాహిత్యంలో ఈ 'పల్నాటి పోరు' వినబడుతుంది. పల్నాటియుద్ధం క్రీ.శ. 1180 ప్రాంతంలో జరిగిందని భావింపబడటానికి కారణం దీనిలో యుద్ధానికి సంసిద్ధుడైన నలగామరాజు చారిత్రకవ్యక్తిగా గుర్తింపబడటమే. ఇతడు క్రీ.శ. 1134-40 వరకు పల్నాటిని పరిపాలించిన, హైహయ వంశస్థుడైన అనుగురాజు యొక్క పుత్రుడనీ, అనుగురాజు వెలనాటిచోడుడైన రెండవ గొంకరాజు యొక్క పుత్రికయైన మైలాంబను వివాహమాడాడని చరిత్రవల్ల తెలుస్తుంది. వారికి సామంత మండలేశ్వరుడిగా ఉన్న అనుగురాజును తర్వాత ఆతనిపుత్రుడైన నలగామరాజు రాజ్యమేలినట్టును, గొంకరాజు తనప్రతినిధిగా దొడ్డమనాయుని గురజాల మండలంలో పెట్టినట్లును ఆంధ్రుల చరిత్ర తెలియజేస్తోంది. అయితే పల్నాటియుద్ధం మాత్రం జనశ్రుతిలోని వీరగాథా సాహిత్యంలో వినబడుతోంది గానీ దీనికెటువంటి శాసనాధారాలు లేవని కూడా పైన పేర్కొన్న ఆంధ్రులచరిత్ర పుటలలో తెలియజేయబడింది. క్రీ.శ.1179

ప్రాంతంలో కర్ణాటక సేనలకు వెలనాటి చోడులకు మధ్యన ‘కొచ్చర్లకోట’ (నేటి ప్రకాశంజిల్లాలోని దర్శి) అనే పల్నాటి ప్రాంతంలో యుద్ధం జరిగినట్లు చరిత్ర చెబుతోంది. బహుశ దానికి పల్నాటి యుద్ధానికి సామ్యం ఉందేమో ఆలోచించాలి.

12వ శతాబ్దం నుండి ప్రజల నాలుకలమీద నాట్యమాడుతూ వచ్చిన ‘కోడిపోరు’ అనే భాగాన్ని, శ్రీనాథకృతంగా చెప్పబడిన ‘బాలచంద్రయుద్ధం’ అనే మరొక విభాగాన్ని కలిపి ఉమాకాంత కులశేఖరులవంటి పండితులచేత పరిష్కరింపజేసి అక్కిరాజు రమాపతిరావు మరియు సుందరరామకృష్ణ గారి సంపాదకత్వంలో కారెంపూడి వీరాచారపీఠంవారు 1984 లో ‘పల్నాటివీరచరిత్ర’ అనే ద్విపద కావ్యాన్ని ప్రచురించారు. ఈగ్రంథమాధారంగా ‘పల్నాటివీరచరిత్ర’ కథావస్తువును తీసుకోవటం జరిగింది. అనుగురాజుకు ముగ్గురు భార్యలుగా విజ్జలదేవి, శ్రీసిరాదేవి, మైలాంబ ఉన్నట్లును, విజ్జలదేవి యొక్క పుత్రులైన పెదమల్లి, చినమల్లి, బులిమల్లి దేవులున్నట్టును, మైలాంబకు అనుగురాజుకు నలగామరాజు అనే పుత్రుడు ఉన్నట్లును, అనుగురాజు చనిపోతూ తన పుత్రచయాన్ని దొడ్డమ నాయకుని కుమారుడైన బ్రహ్మనాయునికి అప్పగించి చనిపోయినట్టును ‘పల్నాటివీరచరిత్రమ’నే కావ్యంలో అర్థం అవుతుంది. బ్రహ్మనాయుడు వెలమ వంశస్థుడు. నాల్గవవర్ణమునకు చెందిన వెలమలు రాజులకు సేవచేస్తున్నప్పటికి విక్రమాదిశౌర్యములు ఉండటంతో రాజులతో సమానంగా వారిని సంభావిస్తారని (13/90 పంక్తులు) బాలచంద్రుని మాటల్లో అర్థంఅవుతుంది. ‘జనశ్రుతిలో’ నాగమ మాత్రం నాయకురాలనే అర్థంలో నాయురాల్ అని చెప్పబడుతుందిగాని మంత్రిణిగా చెప్పబడలేదు.

బ్రహ్మనాయుని ఆధ్వర్యంలో అనుగురాజు కొడుకైన నలగామరాజు తాను గురజాల మండలాన్ని ఏలుతూ, సవితి తమ్ముడైన పెదమల్లి దేవునకు ‘మాచెర్ల’ భూమినిచ్చి ‘సదయతో’ ఏలుకొమ్మని ఇచ్చినట్లుగా నలగామరాజు మాటల్లో (4/150 పంక్తులు) అర్థం అవుతుంది. ఇది క్లుప్తంగా రాజుల పరిపాలనకు సంబంధించిన విషయం. బ్రహ్మనాయుడు మాచెర్లలో పెదమలి దేవుని మంత్రిగా

పెత్తనం వహిస్తూంటాడు. వెలమలు రాజులతో సమానులే కాబట్టి నలగామరాజు రాజ్యంమీద కూడా బ్రహ్మనాయుడు తనకు పెత్తనం ఉంటే బాగుంటుందని భావించి ఉండవచ్చు. నలగామరాజు దగ్గర నాగమ అనే స్త్రీ సలహాదారుగా ఉంటుంది. 'ఆమె నెప్పుడూ మంత్రి' అని ఎవరూ భావించలేదు. ఆమె సాధారణ స్త్రీయైతే పట్టించుకోవల్సిన అవసరంలేదు. రెడ్డికులస్థురాలిగా భావింపబడిన ఆమె మిక్కిలి సమర్థురాలు. అర్థశాస్త్రవేత్తగా, అశ్వవిద్యా నిపుణురాలుగాను పల్నాటి వీరచరిత్రమనే గ్రంథంలో అర్థం అవుతుంది. కాని ఈమెను కోడిపోరు ఘట్టంలో 'కుటిలురాలి'గా 'కన్నమనీడు', 'గోపు' అనే బ్రహ్మనాయుని అనుయాయులు పేర్కొనటం జరిగింది. (1900–1910 పంక్తులు) అర్థశాస్త్రవేత్తగా శత్రువుల ఉద్దేశాన్ని కనిపెట్టి సామదాన దండోపాయాలతో అణచాలనీ, అవసరమైతే రాజ్యసంరక్షణకు కుట్రలు చేయాలనీ, విషప్రయోగం చేసైనా శత్రువులబారినుండి రాజును, రాజ్యాన్ని సంరక్షణ చేయాలనే కౌటిల్యుని రాజనీతిని అర్థం చేసుకొన్న నాగమ్మకు రాజభక్తి కూడా ఎక్కువే. నలగామరాజు దగ్గర ఈమె మంత్రిణికాక పోయినా రాజు ఏయే సమయాలలో ఎలాంటి నిర్ణయాలు తీసుకుంటూ ప్రవర్తించాలో సలహాలిస్తూ ఉంటుంది. నలగామరాజు కొలువులో (963 పంక్తి) మంత్రులు ఉన్నట్టు అర్థం అవుతుంది. అయినా 'యారవెల్లి నాయురాల్ మిక్కిలి నమ్మినబంటు లాదిగా కొలువంగ' (965) రాజు కొలువై ఉన్నాడట. ఈమెకు మంత్రి పదవి లేకపోయినా రాజుకు ఈమెమీద నమ్మకం యెక్కువ ఉందంటేనే నాగమ్మ ఎంతటి శక్తిమంతురాలో అర్థం అవుతుంది. స్త్రీ సమర్థురాలు, శక్తిమంతురాలైతే భరించలేని తత్వం పితృస్వామ్య సమాజానికి ఉండటం సహజం. అందుకే స్త్రీ రాజకీయ వ్యవహారంలో భాగస్వామురాలైతే అందరూ ఆమెను దుష్టురాలంటూ సందర్భం వచ్చినప్పుడల్లా ఆమెపై విరుచుకుపడతూ 'హోరు' పెట్టటం పల్నాటి వీరచరిత్రలో అర్థం అవుతుంది. 'ఆ హోరు' ను అర్థం చేసుకోవటాన్ని రెండుభాగాలుగా ఉన్న 'పల్నాటివీరచరిత్ర' కథావస్తువును తెలుసుకోవాలి. మొదటి భాగమైన కోడిపోరులో బ్రహ్మనాయుడు 'కోడి మేడమ'నే పేరుతో గురజాలకు వెళ్ళటం జరిగింది. కోడిపోరులో 'కోడి చచ్చేవరకు

ఆడవలసిందే' అనే (1610-1613 పంక్తులు) బ్రహ్మనాయుని మాటల్లోని అంతర్యాన్ని గ్రహించిన నాగమ్మ రెండవరోజు తిరిగి 'కోడిపోరును' ఏర్పాటు చేద్దామని చెప్పి 'ఓడినవారు భూమిని వదిలిపెట్టి వెళ్ళిపోయేటట్లుగా' పందెం కాయగా దానికి బ్రహ్మనాయుడు ఒప్పుకుంటాడు. బ్రహ్మనాయుని కోడి ఓడిపోయేటట్లుగా నాగమ్మ కట్టుబోతుచేత యంత్రతంత్రాలను ఉపయోగింపచేసి కోడిపోరులో గెలుపును నలగామరాజుకు కలిగేటట్టు చేసేసరికి బ్రహ్మనాయుడు 'ఏన్నాళ్ళలో మాచెర్లను వదిలిపెట్టి వెళ్ళిపోతామ'ని చెప్పి వెళ్ళిపోతాడు. అయితే ఆతని అనుయాయియైన కన్నమనీడు, కోడితమగము క్రింద పాతరేసి పెట్టిన శూలాన్ని చూసి నాగమ్మ మోసం చేసిందని భావించి నాగమను, 'కుటిలురాల'ని (1900-1910 పంక్తులు) దూషించగా, మరొక అనుయాయియైన 'గోపు' నాగమను గురించి 'కుటిలంపు జీవి, కొండేలమారి, కలపనగంప, కలహాలమూట మానని పెనురోగి, మాయలజోగి, అలజిళ్ళ పెదదుంప, అంగడిగంప, నీచులపంట, నీరులోపలిగంట' (1903-1910) అని నిందిస్తాడు. 'నయమాడి యిట్లేల నాయకురాల!' కట్టుబోతులచేత కోడిని చంపించావని తిడుతూ, అక్కడున్న నలగామరాజుతో 'నాయకురాలు తీర్పరి యయ్యె తగు పాపమునకు పాపంబులెల్ల నీపాలనే వచ్చె' అని అంటాడు. మరియు 'విషము నమ్మించి పంచె, తమగంబుపడిపన్ని ధర్మంబు మరచి' (1918-1920) పాతర పెట్టించిందనియు కపటతతో, అధర్మంబుతో 'గోపు' అనే అతడు తాను తెచ్చిన కోడిపుంజును చంపించినదని అంటాడు. "స్త్రీ బుద్ధివినువాడు చెడును తథ్యంబు (1925-1930) నామాటలు తలపోసి నలగామరాజ! మీదు విచారిం చుమీ యీామె మాట మాటగా వినకుమీ మైలమకామ'. 'ఆడు తీర్పరి మాటలాల కింపకుము" అని అనేసరికి నాగమ్మ, "బ్రహ్మనాయుడు రాచపట్టులలోను నెవ్వరం పెననుచు నిచ్చెపత్రంబు" (1938) అని అడుగుతుంది. "ఆడుదానవు నిన్నునని యెడిదేమి మగటిమి మాటలు మాటిమాటికిని చెప్పంగ నేటికి చేసి చూపెదను మగుడజుమీ" (1952-1955) అని ఆ గోపు అనగా నాగమ్మ తరపున లెంకలు గోపు మీదకు వచ్చి పోరాటం చేసేసరికి గోపు చనిపోవటం జరుగుతుంది.

గోపుకు ముందునుంచి స్త్రీనాయకత్వాన్ని సహించలేని తత్వముంది. అందుకే కోడిపోరుకు బయలుదేరుతూ పశువులమీదవేసే పుల్లరి, తలపన్ను కట్టలేక గొల్లలందరూ బాధ పడుతున్నారనీ, బ్రతకటం కష్టమనీ 'నలగామ రాజ్యము నమ్మితిమైన నాతి గుణములె లెస్స నడవడికింక' (642) అనీ 'నాయురాలికి ప్రీతినడుపంగలేము స్త్రీ నాయకంబైన చెడునండ్రు భూమి' (682) అంటూ మాట్లాడిన 'గోపు' మనస్తత్వంతో స్త్రీలు రాజ్య పరిపాలనా విషయాలో భాగస్వాములవటం ఇష్టం లేనితనం స్పష్టమవుతుంది. నాగమ 'నాయురాల్'గా అని జనశ్రుతిలో వినబడటం అంటేనే ఆమెను ప్రజలు 'నాయకురాలిగా' అంగీకరించారని అర్థం అవుతుంది. బ్రహ్మనాయుడు కోడిపోరు రూపంలో చిచ్చు పెట్టాలనుకున్న అతని ఆంతర్యాన్ని నాగమ్మ గ్రహించి అతడ్ని అణచటంకోసం కోడిపోరులో యంత్రతంత్రాలను ఉపయోగించి రాజును కాపాడిన ధీర అనిఅర్థం అవుతుంది. నాగమ్మకున్న అభిప్రాయాన్ని బలపరచే సంఘటనగా కోడిపోరుకు వస్తున్న బ్రహ్మనాయుడ్ని దారిలో కలిసిన రెడ్లు, కోమటుల (1140) మాటల్లో కూడా అదే అర్థం అవుతుంది. 'జయాపజయాలు ఏవంక నొరుగునో' అని 'పందెంబుగాదు కార్యంబు మానివేసితివేనియు మల్లభూపతి, రాజ్యంలో నున్న రాజులందరునూ ప్రజలునూ మిక్కిలి పరిణమించుదురు ఏరీతిగానైన నీ 'కోడిపోరు వలదు' (1152-1157) అని ప్రజలు చెప్పటంలోనే బ్రహ్మనాయుని ఆంతర్యం అర్థం అవుతుంది. అంతేగాక వారితో బ్రహ్మన్న కోడిపోరనే బాసపత్రాన్ని వ్రాసి అప్పటికే గురజాలకు పంపాననీ, 'గురజాలకేగి పొందైన కార్యంబుపూని చేయింతు' నంటాడుగానీ, కోడిపోరును వదిలిపెట్టడు.

నాగమ్మ 'కుటిలురాలు' అని ఆమెను నిందించేముందు బ్రహ్మనాయుని ఉద్దేశంలోని 'పోరు'ను అర్థం చేసుకోవటానికి వీలుగా పెదమల్లిదేవుని తల్లియైన విజ్జలదేవి బ్రహ్మనాయునితో అన్నమాటలే బలమైన ఉదాహరణలుగా గ్రహించాలి. గ్రంథారంభంలోనే విజ్జలదేవి బ్రహ్మనాయుని పిలిచి 'ఓపుత్ర! కామరాజును మలిదేవరాజును నీకు వీరును వారును వినుమొక్కరూపు' అని 'బుద్ధిగాచెప్పి'

(3/7 పంక్తులు) పంపిందంటేనే బ్రహ్మనాయునికి నలగామరాజంటే పడదనీ అతని రాజ్యాన్ని పెదమల్లి దేవునికి కట్టబెట్టి మొత్తం రాజ్యం మీద తానే పెత్తనం వహించాలనే దుర్బుద్ధి ఉన్నట్లుగా గ్రహించవచ్చు. అంతేగాక కోడిమేడమునకు వెడుతున్నాననే విషయాన్ని కొలువున్న రాజుతో చెప్పగా మలిదేవరాజు బ్రహ్మన్నతో 'కుంతము ముట్టరాదని' చెప్పటంచేతనే బ్రహ్మనాయుడు తాను (865 పంక్తులు) 'కొంతంబుముట్టనను మాటను నానవిడిచిన యదిమదితలచి' నట్లుగా బ్రహ్మనాయుడి మాటల్లోనే చెప్పబడిం దంటే 'కోడిపోరు' వంకన వెళ్ళి యుద్ధంచేసే తలంపు బ్రహ్మనాయుడికి ఉన్నట్లు స్పష్టం అవుతోంది. అంతేకాదు బ్రహ్మనాయుడు అనుగురాజుకు శ్రీసిరాదేవితో జరిగిన పెళ్ళి సమయంలో కూడా ఆమె తండ్రియైన భీమజెట్టికున్న గొల్లబంటుల బలానికి ఆశ్చర్యపడి పెళ్ళికి కట్నకానుకల కంటె చాలమంది గొల్లబంటులను కోరుకొన్నాడనీ, ఆతడు గొల్లబంటులను (450-460) ఇవ్వకపోతే రాజుకు ఎంతో మంది స్త్రీలతో పెళ్ళిచేయించి సిరాదేవికి సవతులను తెస్తానని బ్రహ్మనాయుడు బెదిరించి మరీ గొల్లబంటు బలగాన్ని తెచ్చుకున్న విషయాన్ని 'గోపు' బ్రహ్మనాయుడ్ని ఎత్తిపొడుస్తూ మాట్లాడిన మాటల్లో అర్థం అవుతుంది. బ్రహ్మనాయుడు పెళ్ళి కెళ్ళినా 'పోరు-బలగం' మీదనే ఆతని దృష్టి నిరంతరం ఉంటుందని అర్థం అవుతుంది. కాబట్టి 'కోడిపోరు' నెపంతో గురజాలను కబళిం చాలనుకొన్న బ్రహ్మనాయుడి బుద్ధిని కనిపెట్టిన నాగమ్మ నలగామరాజుని కాపాడే ఉద్దేశ్యంతోనే శత్రువైన బ్రహ్మనాయుని అణచటానికి రాజనీతిజ్ఞతను ప్రదర్శించిం దని అర్థమైనపుడు ఆమె కుటిలురాలిగా గాక రాజభక్తి పరాయణురాలిగా స్పష్టం అవుతుంది. కోడిపోరులోని బ్రహ్మనాయుడి యొక్క కుటిలత్వాన్ని ముందుగానే గ్రహించింది కాబట్టి నాగమ్మ వ్యూహంలో భాగంగా చతురంగ బలాల్ని సిద్ధం చేయించటం ఆమెచాతుర్యానికి, రాజ్యసంరక్షణా దృష్టికి నిదర్శనంగా భావించాలి. ఈ సందర్భంలోనే ఆమె యొక్క అశ్వవిద్యా నైపుణ్యం అర్థమయ్యేవిధంగా అశ్వాల మనస్తత్వాన్ని, నడకను ఒక స్త్రీగా అంచనావేయ గలగటం వంటి విషయాలు తెలుసుకొంటే 12వ శతాబ్దం నాటి స్త్రీశక్తికి జేజేలు పలకాలనిపిస్తుంది.

బ్రహ్మనాయునికి భోజనపు ఏర్పాట్లు చేసిన నాగమ్మ ఆ భోజనంలో విషం కలిపినా బ్రహ్మనాయుడు మంత్రించిన తులసితీర్థం జల్లేసరికి విషం విరుగుడయిందని చెప్పటం జరిగింది. ఆ మాటల్లో ఎంత నిజముందోగానీ, నాగమ్మ వెరగంది కట్టుపోతురాజును పిలిపించటం జరిగింది. 'మంత్రాలకు చింతకాయలు రాల్తాయా' అనేది సందేహాస్పదమైన విషయమేగానీ, నాగమ్మ కౌటిల్యుని అర్థశాస్త్రాన్ని బాగా తెలుసుకోవటంచేతనే శత్రువును అణచటానికి విషప్రయోగం చేసిందన్నా కూడా ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు. ఆ మర్నాడు జరిగే 'కోడిపోరు' ప్రారంభంలో నాగమ్మ "ఈ మరి పందాన నెవ్వరేమైన గెలిచిన వారమే గెలిచినవార మోడినవారమే యోడినవారమింతియె యీమాటనిక త్రిప్పమనుచు నాయుని నొడంబరచి నాయకురాలు చాటించెనామాట జనులెల్ల నెరుగ" (1810-1815) అని చెప్పిన దాంట్లో రాజ్యబహిష్కరణ యొక్క కాలనిర్ణయం చేయలేదు. కాని కోడిపోరులో ఓడిన అనంతరం నాగమ బ్రహ్మనాయుడితో 'ప్రజలందరూ ఎరుగుభూమిబాసిపొమ్మను' (1875) అనగా బ్రహ్మనాయుడు తనంతట తానే 'ఏన్నాళ్ళనాటికి నీ భూమి విడిచి కదలిపోయెదమ'ని చెబుతాడు. అంటే చాటింపులో కోడిపోరులో గెలుచుకున్న భూమిని తిరిగి యిచ్చే నియమంలేదు. దీనితో కోడిపోరు ముగుస్తుంది.

'బ్రహ్మనాయుడు-నాగమ్మ'ల మధ్యవైరంగా 'కోడిపోరు' కన్పడుతుంది. బ్రహ్మనాయుడిది పెత్తనమైతై నాగమ్మది రాజభక్తి అనీ ఆమెదే విజయమని అర్థం చేసుకోక తప్పదు. కోడిపోరు తర్వాత గోపును చంపిన రాహుత్తులను (గుర్రపురౌతు) చంపటానికి కన్నమనీడు రాగా ప్రజలు బ్రహ్మనాయుడే మాచర్ల కెళ్ళకుండా గురజాల మీద యుద్ధానికి దిగాడని భావించి అలా మాట్లాడుకుంటున్న వారి మాటలు విన్న నాగమ్మ రాజుతో ఆ విషయమే చెబుతుంది. బ్రహ్మనాయుడు నలగామరాజు మీద ఏనాడైనా దండెత్తివస్తాడనే ఆమె ఆలోచన స్థిరపడింది. ఆమెయొక్క ఆలోచన కనుగుణంగానే బ్రహ్మనాయుడు దండెత్తిరావటంతో పల్నాటి వీరచరిత్ర రెండవ భాగం మొదలవుతుంది. పల్నాటి వీరచరిత్ర రెండవ భాగం 26 ప్రకరణముల విభాగాలతో కూడిన ద్విపద పంక్తులతో శ్రీనాథకృతమని

పేర్కొనబడింది. అది శ్రీనాథకృతమా? కాదా అనే మీమాంస కంటె ఆ సాహిత్యంలోని పల్నాటి రాజకీయాలను కథావస్తువుగా అర్థంచేసుకోవాలి. 'కోడిపోరు' అనంతరం పెదమలిదేవరాజు, బ్రహ్మనాయుడు వంటి వారు మాచెర్ల భూభాగాన్ని వదిలి వనాలు, గిరులు తిరిగి మేడపిలో ఉన్నట్లుగా కావ్యంలో అర్థం అవుతుంది. కొన్నాళ్ళకు బ్రహ్మనాయుడు మాచెర్ల రాజ్యాన్ని తిరిగి పొందాలనుకొని, అనుగురాజు అల్లుడును కొమ్మన భూమీశుని కొడుకునుయైన అలరాజును దూతగా పంపించగా ఆ అలరాజు చనిపోవటం జరుగుతుంది. నలగామరాజే అలరాజును చంపించాడని భావించిన బ్రహ్మనాయుడు మేడపిలో రణభేరి మ్రోగించి కొడుకును చంపిన ప్రతీకారవాంఛ కలిగిన కొమ్మనతోపాటు, కన్నమనీడును, మన్నెనాయకులను (2/31) కలుపుకొని, గురజాలకు వస్తూ దారిలో కంభానికి పూజచేసి కారెంపూడిని చేరుకొని 'భట్టు' అనేవ్యక్తిని నలగామరాజు దగ్గరకు రాయబారిగా పంపిస్తాడు. భట్టు నలగామరాజు కొలువుకు వెళ్ళగా అక్కడ 'రాజువెనకాల అతని తమ్ముడైన (వరుసకు) నరసింగరాజును ఒక ప్రక్కన నమ్రతతో ఉన్న నాగమ్మ (3/155) ఆసీనులై ఉండగా' భట్టు రాజుతో 'అన్నదమ్ములు ఐకమత్యంతో భూమిని ఏలుకుంటే పారతంత్ర్యం, స్వాతంత్ర్య హీనత ఉండదనీ', చెప్పగా నలగామరాజు తాను 'సదయ'తో (4/150) పంచియిచ్చిన భూమిని ఏలుకోమని చెప్తున్న మాటలు వింతగ అనిపించి నాగమ్మ నలగామరాజును ప్రక్కకు పిలిచి, 'బాలరాజును బ్రహ్మనాయుడు కదనంబు చేయ' (4/156) వచ్చారని 'మగటిమి విడనాడి మానంబుదూల పంచి భూమినొసంగ పంతంబుగాదు కయ్యంబు చేయుట ఘనవిచారంబు', 'ఇద్దరురాజులై యేర్పడరేని అవనిలోపల నాజ్ఞ కమరికయౌనే సిరిపొత్తు చేయుట చెల్లును గాని, ఆజ్ఞపొత్తిచ్చుట అది నీతిగాదు' (4/162-168) అని బ్రహ్మనాయుడి ఉద్దేశాన్ని స్పష్టం చేస్తుంది. నలగామరాజు ఆ రాజనీతిని 'ఆత్మలోదెలిసి' కొని 'బవరంబొనర్చిన పట్టిబంధించి రణబలిపెట్టింతు రణభూమియందు (4/191-195) ప్రాణముల్ వలసిన బాలరాజులను తిన్నగ దోడ్కొని తిరిగి పొమ్మంచుపటు బుద్ధిగా జెప్పు బ్రహ్మనాయునికి' అని చెప్తాడు.

దానికి భట్టు స్పందిస్తూ 'అల్లుడైన అలరాజును చంపినందుకు అవతలి పక్షంవారు కోపంతో ఉన్నారని' చెప్పి 'నిన్ను నీతమ్ముని నీకైనవారి నీదునాగమ్మను నీకూర్మి సఖుల శిక్షింతురో రాజ సిద్ధమీమాట' (5/45–48) అని చెప్పగా 'నాగమ మండి పడి పయనమై దండెత్తి వత్తుమునేము' (5/65) అని యుద్ధాన్ని నిశ్చయించింది. అంతేకాదు రాజుతో నాగమ్మ "నీవు రాబనిలేదు నృపకులశ్రేష్ఠ! నన్ను బలమునంపు నాయుని గెలిచి మన్నీలవీరుల మగటిమిదూల్చి మేదినీ భర్తను మేడపి పురికి వట్టి చేతులతోడ బంపగజూతునని" (5/106–112) చెప్పగల ధైర్యస్థైర్యాలుగల స్త్రీ నాగమ్మ అని అర్థమవుతుంది.

నలగామరాజు ఎదిరిబలమును అంచనావేస్తూ బ్రహ్మన్న నాటకవిధమున ప్రతిమలనాడిస్తున్నాడని తలచి తనవైపు బలాన్ని అంచనావేయాలనుకున్న సమయాన నాగమ 'నయయుక్తి మెరయ' (5/155–168) అప్పనముపెట్టు మన్నెవారలకు కబురుచేయమనగా నలగామరాజు నానాదేశముల రాజులకు కబురు పంపిస్తాడు. తనకు ఇవ్వాల్సిన కప్పపుసొమ్మును తీసుకోనని యుద్ధంలో పాల్గొనమని రాజులకు లేఖను పంపగా స్వార్థంతో రాజులందరూ నలగామరాజు వైపు చేరుతారు. అటు బ్రహ్మనాయుడితో పాటు, కొమ్మనకు తన కొడుకును చంపిన పగ, ప్రతీకారవాంఛ ఉంది. నలగామరాజు యుద్ధభూమియైన కారెంపూడిని చేరుకోవటానికి వెడుతుంటే దారిలో రెడ్లు, కోమటి జనం అడ్డుపడి 'వైరంబు మీకేల...... పగలేక యేలుట బలిమి మీకెల్ల ప్రజలకు సుఖమౌను' (7/40) అని అనగా మలిదేవరాజు రణము చేయగ దరలి రమ్మని కబురు పంపాడనీ, బంధుమిత్రాదులను పారద్రోలి వేగమే వస్తానని వారిని ఇండ్లలో జాగ్రత్తగా ఉండమని చెప్పి నలగామరాజు కదనరంగానికి వెడతాడు. అక్కడ మన్నెగాండ్రందరు రాజున్న సభకు చేరుకుంటారు. సభలో 'రాజువెన్కకు జేరి రమణి నాగమ్మ కార్యఖడ్గముల ప్రజ్ఞావిశేషముల తెలుపుచు కూర్చుండె ధీరతతోడ' (7/115–120) అని చెప్పటమే నాగమ్మ ధీరతకు నిదర్శనం. యుద్ధకార్య, ఖడ్గముల ప్రజ్ఞావిశేషాలను రాజుకు తెలియజేస్తోందంటే నాయకురాలెంతటి వ్యూహనిపుణురాలో ఖడ్గవిద్యా విశారదురాలో కూడ అర్థం

అవుతుంది. స్త్రీలు యుద్ధభూమిలో నిలబడటం స్త్రీల ధీరత్వానికి మచ్చుతునకగా భావించాలి. పైపెచ్చు యుద్ధానికి సహాయంగా వచ్చిన రాజులందరికి వసతిని చూపించటానికి (7/165) అశ్వంబునెక్కి నాగమ్మ వెళ్ళిందంటే ఆమె కార్యనిర్వహణా చాతుర్యానికి జోహార్లు చెప్పాల్సిందే. బ్రహ్మనాయుడు పంతంతో బెదిరించటానికి యుద్ధానికి వచ్చాడుగాని ఎదుటి పక్షపు బలం ఎక్కువనే భావన ఉండటంతో వీరులను యుద్ధానికి తొందరపడవద్దని మూడుమాసాలపాటు కాలమయాపన చేసినట్లుగా బాలచంద్రుని మాటల్లో అర్థం అవుతుంది. కోడిపోరుకుగానీ, కయ్యానికిగానీ బ్రహ్మనాయుడే ముందుగా కాలుదువ్వాడనేది అర్థమయ్యే విషయమే. బ్రహ్మనాయుడు తనని విష్ణుమూర్తి అవతారంగా అందరూ భావించేటట్లు చేసాడని కావ్యంలో అర్థం అవుతుంది. ఇరుపక్షాల మధ్య ఏర్పడిన కలహానికి కులవైరమనే రంగుపూసారు. అంటే అన్నదమ్ములైన రాజుల మధ్యన ఏర్పడిన కలహంలో బ్రహ్మనాయుని పక్షాననిలబడ్డ కొమ్మన భూమీశుని పగ ఒకప్రక్కన ఉండగా మరొకవైపు నలగామరాజు పక్షాన చేరిన వివిధ దేశాల రాజులు ఉండటంతో అదికుల వైరమనే ప్రచారం జరిగింది. దీనితో పల్నాటియుద్ధంలో బ్రహ్మనాయుని పాత్రలేదనే అర్థం వచ్చేటట్లుగా ప్రచారం జరిగింది. కాని పల్నాటియుద్ధంలో అంతర్లీనమైన విషయంగా బ్రహ్మనాయుడు ఇరుపక్షాల రాజ్యాలమీద పెత్తనం వహించాలను కోవటం అర్థంఅవుతుంది.

బ్రహ్మనాయుడు యుద్ధానికి వస్తూ యుద్ధం చేయగల సమర్థత కలిగిన తనకొడుకైన బాలచంద్రుని యుద్ధానికి రమ్మనమని చెప్పలేదంటే బ్రహ్మనాయుని యొక్క స్వార్థబుద్ధి స్పష్టమవుతుంది. ఆ బాలచంద్రుడు కూడా సరైన వ్యక్తిత్వం లేనివాడు. అతడిది చిన్న పిల్లలకుండే ఉద్రేకపూరిత మనస్తత్వం కాబట్టి తల్లిని బొంగరాలు కొనిపెట్టమని వేధించటం, ఆమెను నిందించటం కనబడుతుంది. అంతేకాక యువకుడిగా ఆతని వేశ్యాసంపర్కంతో, పుట్టింట్లోనే ఉన్న భార్యను చూడాలనుకోకపోవటం చూడగా అతనెంత వేదాంతం చెప్పినా అది దంతవేదాం తంగానే అర్థం అవుతుంది. ఊళ్ళో స్త్రీజనం చెప్పగా బ్రహ్మనాయుడు యుద్ధానికి వెళ్ళాడని తెలిసి బాలచంద్రుడు యుద్ధానికి బయలుదేరి నల్లగొండ చేరి తనతోటి

వీరులకోసం ఎదురుచూస్తూ బసచేసాడు. కొమ్మనపగ, బ్రహ్మనాయుని అధికారవాంఛ, వారిపక్షమందలి యువశక్తిని గ్రహించిన నాగమ్మ స్వార్థంతో సహాయపడతామంటూ వచ్చిన స్వార్థపరరాజుల యౌద్ధత్యం నిలబడుతుందో లేదో అని అంచనావేసి యుండటం వల్లనే యుద్ధం ప్రారంభం కాకమునుపే బహుశ నాగమ్మ సంధికై కోటకేతురాజును పంపించాలని నిర్ణయానికి వచ్చింది. అందుకే నాగమ 'సమబుద్ధిని తెచ్చుకొని' (18/105-115) 'బాహుపరాక్రమ ప్రభువులైన వీరులు రాజులు వెలయ శోభిల్లు కొల్వులోనికి పోయి కూరిమిమీర సమరంబుగాకుండ సంధియౌనట్లు మాటాడి అటుమీద మాచెర్ల భాగమేలు కొమ్మని చెప్పుమింకొకమాట నాయునివద్దకు నరసింగుదెచ్చి కులవైరమడతుము కోరిమీ రంద రొక్కటి కమ్మనియొప్పించిరండు మగడి పోవలయును మనదేశమునకు' (18/104-114) అని చెప్పిపంపిస్తుంది. ఇక్కడ కులవైరమనే ప్రచారంలో 'ప్రాణానికి ప్రాణంసరి' అనే అర్థంలో అలరాజు ప్రాణానికి నలగామ రాజుకు వరుసకు తమ్ముడైన నరసింగరాజును పణంగాపెట్టి కులవైరాన్ని తీర్చాలను కోవటం జననష్టం గాకుండా చూడాలనుకోవటం జరిగింది. అన్నదమ్ముల ఎవరి భూభాగం వారు ఏలుకోవటమే బాగుంటుందని ఆమె దృష్టియే ఇక్కడ 'సమబుద్ధి'గా అర్థం చేసుకోవాలి. నాగమ్మ అర్థశాస్త్ర (దండనీతిశాస్త్రం) నిపుణురాలు కాబట్టి బలాబలాలను అంచనావేసి 'పోరు నష్టం పొందులాభం' అని భావించి రాజుకు గురజాల మండలాన్ని పోనీయకుండా చేయాలనే దృష్టితోనే 'సంధి'కి రాయబారం పంపించినట్లుగా అర్థం అవుతుంది. నాగమ్మ రాజభక్తి మీద నలగామరాజుకు నమ్మకం ఎక్కువ. కాబట్టి నాగమ్మయే అలానిర్ణయించి ఉంటుంది. బాలచంద్రుని రాకతో సంధికార్యం (19/135) విచ్ఛిన్నమైపోతుందని పెదమలిదేవరాజుకు భయం ఏర్పడింది. అందుకే బాలచంద్రుడు వచ్చినా చూసి మొగం త్రిప్పు కుంటాడు. దానితో తుందుడుకు స్వభావం కల బాలచంద్రుడు తానువీరుడనని చెప్పి రాజును నిందించటం చేసేసరికి కన్నమ బాలచంద్రుడ్ని గర్వపడవద్దని చెబుతాడు. బాలచంద్రుని అడ్డగిస్తూ బ్రహ్మనాయుని పక్షానికి చెందిన గండుకన్నమనీడు మాట్లాడుతూ పెదమలిరాజు పక్షమందు తప్పంతా

దట్టమై నిల్చెనని చెబుతూ పగవారి చర్యల భావం బెరింగి (20/151–170) 'కులవైరమును దీర్చుకొనుటకు మనము వచ్చుచూ తగవుకు వసుధతలేంద్రు తెచ్చుట యొక తప్పు', త్రిపురాంతకమున కలహం రాకుండానే 'కలను కంబంబు తర్లింప రెండవ తప్పనీ', యుద్ధానికై 'కంకణధారణ కాంచ మూడవది' అనీ 'తెగింపుతో రణభూమిలో దిగుటనాల్గవదనీ 'తరిమి శత్రులువచ్చి తార్కొన్న పిదప కలయ విచారించు కార్యమైదవదనీ', చెబుతూ, ఎదుటిపక్షం అనగా నలగామరాజు పక్షంలోనూ పంచాపరాధములున్నవనీ, 'సరిరాజ్యమోర్వక సంగ్రహబుద్ధి కోడిపోరున గెల్చుకొనుట మొదటిదనీ, వనులకు (అడవులకు) పంపుట రెండవది, జామాతను చంపుట మూడవదనీ, భట్టును మనవారు పంపించినప్పుడు వెళ్ళదోలించిన విధము నాల్గవదనీ, కూటువమూకల గూర్చుకవచ్చి గర్వించినిల్చిన కార్యమైదవది' అని చెప్పి ఇరుపక్షాలలోనూ లోపాలుండగా రాజును నిందించట మెందుకని బాలచంద్రుని అదిలిస్తాడు. కాని బాలచంద్రుడి తరపున వచ్చిన యోధులకిది నచ్చక యుద్ధం చేయాలంటే, కొమ్మరాజు వచ్చి బాలచంద్రునితో యుద్ధమనవసరమని చెబుతూ 'సంధికార్యంచేసి శత్రులచేత పరగజొచ్చిన వాడే బాలుడు సువ్వే', అంటూ అతనితో అలరాజువంటివాడవని చెప్తూ, 'ఎదుటిపక్షంవారు వచ్చిమనల జూచి వారని భీతి బిరుదులు త్యజియించి పిరికిపారుచును అనుజుని లోబడి అర్థించి నపుడే క్షత్రియజాతికి చచ్చుటసుమ్ము, చలమున బోరాడసారస్యమేమి, చేతికిచ్చిన శత్రుచెలగి వధింప పలుపాతకంబని పల్కెవేదంబని' (21/70–80) చెప్పి కొమ్మన బాలచంద్రుని బుజ్జగించి యుద్ధం మాన్పించాలని చూసాడు. కాని బాలచంద్రుడు తననితాను అభిమన్యుకింద పోల్చుకుంటూ 'మైలమకాముని మరియంగచేసి, నాయకురాలు నయహీనచేసి' (23/145) పంతం తీర్చుతా నంటాడు. కులపగ తీరే విధంగా నరసింగరాజును చంపుతానంటూ రణభూమికి బయలుదేరుతుంటే బ్రహ్మనాయుడు కొడుకుకు రణనీతిని చెప్తాడు. నలగామరాజు పక్షంవారితో యుద్ధంచేసిన బాలచంద్రుడు నరసింగభూపతి తల అంటూ మరొక వీరుని తలను తెచ్చి తండ్రికి చూపించగా బ్రహ్మనాయుడు కొడుకు నరసింగు తలను గుర్తించనందుకు బాలచంద్రుని

తెలివిని విమర్శిస్తాడు. బాలచంద్రుడు తిరిగి యుద్ధానికి వెళ్ళి నరసింగురాజు తలను కోసి తెచ్చి బ్రహ్మనాయునికి చూపించి 'దుఃఖంతో' తానాపని చేసినందుకు అపరాధినికాననీ, పాపం లేదంటూ, "మిమ్ముగట్టంద్రాళ్ళు మీరె తెచ్చితిరి మీపాలిమృత్యువు మెలత నాగమ్మ, (26/40) అలరాజుజంపిన ఆ పగదీర్చపట్టి చంపితిగాని", అంటూ ఆ తలను నరనాథుని యెదుట పెడతాడు. ఆ సందర్భంలో బ్రహ్మనాయుడు బాలచంద్రునితో "రమ్మని నిను పిల్వరాజంపలేదు వచ్చియూరక యున్నవాడవుకావు" అంటూ మాట్లాడేసరికి బాలచంద్రుడు బ్రహ్మనాయుని కాపట్యాన్ని గుర్తించి "వెడవెడ యేడ్పులిగచాలింపు, కొల్వులో మామామ కొమ్మభూపతికై అలరాజు పగకయి అప్పగించితిరి, నీస్వభావమింక నేమి వర్ణింతు పోగొట్టితిరి కోడిపోరున భూమి, నిను నమ్మివచ్చిన నీమేనమరిది ప్రాణంబు కొన్నట్టి పాపాత్మకుడవు, చెలువు చూడగబంప చెవులరాయనను చంప కర్మడవయి చంపించితీవు, ఘనవేంక జోదును కలనికి బంపి మందలో చంపితి మాయమొనర్చి" (26/100-110) అని బ్రహ్మనాయుడి బండారమంతా బయటపెడ్తాడు. కొడుకు ఇంకా ఎక్కువ యేమి మాట్లాడుతాడనో ఏమో అని బ్రహ్మనాయుడు బాలచంద్రునితో 'యుద్ధం మధ్యలో వెన్నిచ్చివచ్చావంటూ' పల్కేసరికి బాలచంద్రుడు తిరికి యుద్ధానికి వెళతాడు. ఇక్కడ కులపగకై నరసింగభూపతి తలకోసికొచ్చి రాజుకు చూపించా లనుకున్నాడు. కాని బాలచంద్రుడు యుద్ధంలో వెన్నిచ్చి రాలేదని మనకందరికీ తెలుసు. తనను బయటపెట్టినటువంటి కొడుకుకు శిక్షపడేవిధంగా వీరమరణం రావాలని కోరు కున్నాడేమోగానీ, ఆ తర్వాత కొనసాగిన యుద్ధంలో బాలచంద్రుడు వీరమరణం పొందుతాడు. పల్నాటియుద్ధం ముగుస్తుంది.

నాగమ్మ కుటిలత ప్రచారమైనంతగా బ్రహ్మనాయుడు చేసిన దుష్టపు పనులు వెలుగులోకి రాకపోవటంచేతనే అతనొక మర్యాద పురుషోత్తముడిగా జనులు భావించారు. సామాజికసంస్కృతిలో భాగంగా స్త్రీరాజకీయ వ్యవహారాలలో భాగస్వాములు కావటం యిష్టంలేని విషయంగా అర్థంఅవుతుంది. గండకన్నమనీడు ఇరుపక్షాలనున్న తప్పొప్పులును బయటపెట్టాడు గానీ,

నాగమ్మని వేలెత్తి చూపలేదు. కాని బ్రహ్మనాయుని పక్షంలోనివారు రాజుకోసం నాగమ్మ రాజకీయ వ్యవహారాలలో భాగస్వామియైనందుకే ఒక స్త్రీని 'కుటిలురాలు' అని శాశ్వతంగా స్త్రీలోకానికి ముద్రను వేయటం జరిగింది. గోపు మరియు బాలచంద్రుని యొక్క మాటల్లో బ్రహ్మనాయుని స్వభావం అర్థమయింది. నాగమ్మ ముందు కొచ్చిన ప్రతిసందర్భంలోనూ ఆమె రాజుకోసం, రాజ్యసంరక్షణకు తన అర్థశాస్త్ర, ఖడ్గ, అశ్వవిద్యాపటిమనుపయోగించిన ధీరోదాత్తగా స్పష్టమవుతుంది. నాగమ్మ స్థానంలో పురుషుడు ఆ పనులు చేస్తే ఆతడ్ని గొప్పమంత్రిగా పొగిడేవారు కాని స్త్రీగా నాగమ్మ సమర్థత చూపించి నందుకు వీలున్నప్పుడల్లా స్త్రీని నయవంచకురాలు, కుటిలురాలని, ఘోషపెట్టటం, దాన్ని వలదని ఎవ్వరూ ఖండించకపోవటం పితృస్వామ్యపు సంస్కృతికి బలాన్నిచ్చే విషయంగా భావించాలి. అంతేగాదు సవతి తమ్ములమధ్య పోరుగా పల్నాటి యుద్ధానికి మూలకారణంబైన పితృస్వామ్యంలోని బహుభార్యత్వపు కుటుంబ సంస్కృతిని నిరసించక పోగా, ఆడలేక మద్దెలమీద పడ్డట్టు, వీరత్వంలేక ఆడదాని మీదపడటంగా అర్థం అవుతుంది. అంటే స్త్రీయొక్క సమర్థతను ఎదుర్కొన లేక లింగవివక్షతో ఆమెను నిందించటం స్పష్టమవుతుంది. ఆమె అశ్వవిద్యానైపుణ్యానికి (1219 పంక్తి మొదటి భాగం) ముస్లిం రాహుత్తులు కూడా సలాము చేసారు. 12వ శతాబ్దం నాటికే జనశ్రుతిలో స్త్రీలు రాజకీయాలలో మేధోపరంగానూ, పరాక్రమవంతులు గాను గుర్తింపబడటం నాటికది గొప్ప స్త్రీశక్తి. కాని పితృస్వామ్యం అటువంటియుద్ధ విద్యానిపుణురాలి యొక్క ఉనికిని తట్టుకోలేక ఆమెనొక 'కుటిలస్త్రీ' గా వీలున్నప్పుడల్లా ఎవరికివారు నిర్వచించటం, పల్నాటి పోరులో పలుగాకుల హోరుగానే వినిపిస్తుందనటం సత్యదూరంకాదు. కన్నమ, గోపు, బాలచంద్రుడి మాటల్లో నాయకురాలు నిందింపబడుతుంది. బాలచంద్రుడు నాగమ్మను 'నయహీనత'గా భావించాలనుకోవటాన్ని ఆనాటి యువతలో కూడా స్త్రీశక్తిని సహించలేనితనమే కనబడుతుంది. పిశాచాలు మాత్రం తమకాహారం దొరికి నందుకు నాగమ్మ తమకాంక్షను తీర్చిందని సంబరపడటం కావ్యంలో కొసమెరపు. మనుషులుగా మెచ్చకపోయినా వారి ఆత్మలు సంతృప్తి పడటంగా అర్థం

చేసుకోవాలి. పల్నాటివీరచరిత్రకు శాసనాధారం లేకపోయినా జనశ్రుతి మరియు సాహిత్యధారాలతోనే అర్థంచేసుకోవాలి. నేటికీ ఇరుపక్షాలవారి చిహ్నాలుగా బ్రహ్మ నాయుడిమంటపం, నాగమ్మగుడిని చెప్పుకోవటం చరిత్ర ఆనవాళ్ళుగా మిగిలాయి. 'నాగమ్మ'కు గుడికట్టి పూజించారంటేనే ఆమెయొక స్త్రీ శక్తియనీ, రాజ్య సంరక్షణకై అవతరించిన అవతారమూర్తిగాను భావించటం అర్థం అవుతుంది.

సరైన చారిత్రక శాసనాధారాలుగానీ, ఇతమిత్థమైన కవికృతి అనే విషయంలోనూ, సందేహాత్మక చర్చలు జరుగుతున్నా పల్నాటివీరచరిత్రలో గుర్తించవలసిన 'స్త్రీశక్తి' ప్రధానమైనది. ఆనాటికి నవీనమైన భిన్నమైన సాంస్కృతిక విషయంగా పల్నాటివీర చరిత్రము అర్థమవుతుంది. కావ్యంలోని రెండవ భాగం శ్రీనాథుడు రచించాడంటే అనుగురాజు కాలానికి 200 ఏళ్ళు దాటిన తరువాతగా రచింపబడినదని భావించాలి. జనశ్రుతిలో కోడిపోరు, పల్నాటి యుద్ధానికి సంబంధించిన వీరగాథలు ఎప్పుడు చోటుచేసుకున్నాయో కాలనిర్ణయం చేయలేని పరిస్థితి. రుద్రమ పరిపాలనకు (1262–95) చారిత్రకాధారం ఉంది. ఆమె ఒక వీరనారి అని అందరూ అంగీకరించిన విషయమే. ఆమె రాజరికపు కుటుంబంలోని వ్యక్తిగా, వారసత్వంగా రాణి అయింది. కాని రాజ్యవారసత్వంలేని సాధారణ కుటుంబస్త్రీలలో కూడా ఖడ్గవిద్య, అశ్వవిద్యావంతులైన స్త్రీలున్నారనీ, అంతేగాక కౌటిల్యునిఅర్థశాస్త్రాన్ని దండనీతి శాస్త్రాధ్యయనము చేసిన స్త్రీలున్నారనీ, అవకాశం ఏర్పడితే స్త్రీలు రాజులకు సలహాలివ్వగల స్థితిలో ఉండగలరనే వాస్తవ మైన ఊహకలగటం చేతనే ముందు వెనకలుగా బహుశ ఈ పల్నాటివీరచరిత్ర కావ్యం సృజింపబడిందని భావించవచ్చు. రాణిరుద్రమదేవి నాగమకు స్ఫూర్తియో, నాగమ్మయే రుద్రమదేవికి మూలమో తెలిసే సరైన చారిత్ర కాధారం లేదు. చిత్త సంస్కారాన్ని బట్టి నాగమ్మ సదాస్మరణీయురాలే. నేటికీ కౌటిల్యుని అర్థశాస్త్రానికి విలువనిస్తారుగానీ, అర్థశాస్త్రవేత్తయైన నాగమ్మను మాత్రం 'కుటిలురాలిగా' భావించటమే పొసగని విషయం, వక్రత కూడా. రాజకీయ వ్యవహారాలలో స్త్రీల భాగస్వామ్యం విషయంలో పొడచూపిన లింగవివక్షను స్పష్టం చేసిన కావ్యంగా పల్నాటివీరచరిత్ర అర్థం అవుతుంది.

# 4. రాణి రుద్రమ 'నారీశక్తి'- నాటి సాహిత్య ప్రతిఫలనం

సాహిత్యం సామాజిక జీవన ప్రతిఫలనం. రాజకీయ, ఆర్థిక చలన సూత్రాలకు అనుగుణంగా సామాజిక సంస్కృతి ఉంటుంది. మానవసంబంధాలను ప్రభావితంచేసే సంస్కృతీ విలక్షణత్వముంటే అది నాటి సాహిత్యంలో ప్రతిఫలించటం సహజ పరిణామం. సామాజిక భావాలకు ప్రాతినిధ్యం వహించే నాటి కవులు నాటి పితృస్వామ్యానికి యిష్టం ఉండకపోయినా స్త్రీశక్తులను తాము విన్న, కన్న అసాధారణ విషయాలను పరోక్షంగా తమ సాహిత్య సృజనలో పాత్రల పరంగా చెప్పటమే ఆ నాటి చారిత్రక భౌతిక వాస్తివికతగా భాసిల్లుతుంది. ఆకోవకు చెందిన కావ్యాలుగా ఎఱ్ఱన-హరివంశం, పోతన- భాగవతం, నాచన సోమన- హరివంశం, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు వ్రాసిన జైమిని భారతం భారతానికి మూలమైన జైమిని అనే కవి సంస్కృతంలో వ్రాసిన "అశ్వమేధపర్వమ"నే భారతం వంటి కావ్యాలు చారిత్రక భౌతిక వాస్తవిక విషయాలకు అద్దంపట్టాయి. మూలకథాం శాలు పురాణేతిహాసాలకు సంబంధించినవైనా అనువాదాలైనా  కవులు మాత్రం తమ కాలం నాటి సమాజంలోని స్పందనలను సాహిత్యంలో సందర్భానుసారంగా చొప్పిస్తున్న క్రమంలో నాటి చారిత్రక సామాజిక పరిణామాలను నమోదు చేస్తారు. దానికై వారు తమ కావ్యాలలోని పాత్రలకు నూతన భౌతిక శక్తులను సంతరింప చేస్తారు. అదే సాహిత్యంలో ప్రతిఫలించిన చారిత్రక భౌతిక వాస్తవికత. అదే చారిత్రకవ్యక్తియైన రుద్రమ దేవి యొక్క నారీ శక్తి. నారి అంటే వింటి నారి, మరియు స్త్రీ శక్తి గా భావించాలి.

13వ శతాబ్దానికి చెందిన కాకతీయ సామ్రాజ్ఞి అయిన రాణి రుద్రమ దేవి చారిత్రక వ్యక్తి. ప్రపంచ చరిత్రలోనే వారసత్వపు రాణీ హక్కును పొంది రాజ్యాన్ని పరిపాలించి, దానిలో భాగంగా యుద్ధవ్యూహాలు పన్ని, యుద్ధాలుచేసి విజయాలు సాధించిన ప్రపంచ ప్రథమ మహిళామణిగా కీర్తి సాధించింది. ఈమె ఎవరో కాదు. తెలుగు దేశాన్ని పరిపాలించిన రాణి వీరనారి. ఈమెకు మునుపే చరిత్రలో చెప్పబడిన రజియా సుల్తానా తనని తాను రాణిగా ప్రకటించుకున్నా అన్నదమ్ములు, మంత్రుల కుతంత్రాలకు బలిఅయిందిగానీ పరిపాలన సాగించ లేదు. ఓఢ్రరాజు సహాయంతో అన్నలతో యుద్ధం చేయాలని వస్తూ దారిమధ్యలోనే చంపబడింది కానీ, ఆమె తన పరాక్రమాన్ని ప్రదర్శించిన చరిత్ర లేదు. ఐరోపా చరిత్రలో క్లియోపాత్ర సహపరిపాలకురాలిగా ఉన్నా యుద్ధాలు చేసి విజయం సాధించిన దాఖలాలు లేవు. రుద్రమ దేవియే ప్రపంచ చరిత్రలో యుద్ధాలు చేసి పరిపాలించిన ప్రథమ రాణీ విజేతగాను మహిళల పరాక్రమ శక్తికి ప్రతీకగాను నిలిచింది. ఆ నారీ శక్తి తెలుగు చరిత్రలో ఒక అద్భుతము, అపూర్వము అయిన విషయము. చారిత్రక సత్యాలు సమకాలీన సమాజాన్ని ప్రభావితం చేసినప్పుడు మార్పుకు లోనవుతున్న ప్రజల మనోభావాలను ప్రతిఫలింపచేస్తూ సాహిత్య సృజన జరుగుతుంది. సమకాలీనులైన మహిళా శక్తులను వేనోళ్ల కొనియాడలేని పితృస్వామ్యంలోని కవులు వారి స్పందనలను ప్రత్యక్షీకరించలేకపోయినా, పరోక్షంగా నాటి కాకతీయ చారిత్రక వ్యక్తియైన రాణి రుద్రమదేవి శక్తి యుక్తులను పరాక్రమ శక్తిని అభినందించకుండా ఉండలేక తాము సృజించిన కావ్యాలలో సత్యభామ, ప్రమీల వంటి పాత్రల పరంగా ప్రతిబింబింపచేసారు. అదే నాటి కావ్యాలలోని భౌతిక వాస్తవికతగా ఉన్న ఒకవిలక్షణత. అది అపూర్వంగా ఉండి ఆశ్చర్యాన్ని కలిగించి ఆలోచింప చేసింది. దానిప్రభావమే ఆనాటి ఈనాటి మహిళా చైతన్యానికి పునాది కాగలిగింది.

నేటి తెలంగాణలోని ఓరుగల్లును (వరంగల్లు) రాజధానిగా చేసుకొని, కాకతీయ గణపతి చక్రవర్తియొక్క కుమార్తె అయిన రుద్రమదేవి, రుద్రదేవుని పేరుతో రాజ్యాన్ని పరిపాలించిన విషయం చారిత్రక సత్యం. క్రీ.శ. 1252 నుండి యుద్ధ విద్యలు నేర్చిన రుద్రమ 1258 నుండి గణపతి దేవుడికి రాజ్యపాలనలో

సహకారాన్ని అందిస్తూ 1269 లో రాజ్యానికి వారసురాలైంది. క్రీ.శ.1269 నుండి 1290 వరకు ఆమె పరిపాలన సాగించింది. గణపతిదేవ చక్రవర్తికి మగపిల్లలు లేకపోవటంచేత రుద్రమదేవుని రుద్రదేవునిగా మార్చి విద్యలు నేర్పించి ఆమెను తన వారసురాలిగా ప్రకటించుకున్నాడు. ఆమె వివాహిత అవటంతో చాళుక్య వంశజుడైన ఆమె భర్త వీరభద్రుడు ఆ రాజ్య సింహాసనాన్ని ఆశించి భంగపాటు చెందటంతో ఆమె వ్యక్తి గత జీవితంలో కష్టాలను ఎదుర్కొనక తప్పలేదు. అయితే రుద్రమకు వ్యక్తి జీవితంతోపాటు వ్యక్తిత్వం కూడా ఉండటంతో రాజ్యపాలన తన ప్రథమ కర్తవ్యంగా భావించింది. వృద్ధుడైన గణపతి దేవచక్రవర్తి కాలంలో ధర్మపురి వరకు దూసుకొచ్చిన యాదవ రాజులను దేవపురివరకు (నేటి మహారాష్ట్ర ప్రాంతం) తరిమికొట్ట గలిగింది రుద్రమ. అంతేకాదు అద్దంకిని ఆక్రమించిన పాండ్య రాజులను అణచివేయగలిగింది. అయితే ఒకస్త్రీ రాణి అవటం సహించలేని సామంత రాజైన అంబదేవుడు చోడ పాండ్య రాజులతో కూటమిగా ఏర్పడి త్రిపురాంతకంలో తిరుగుబాటు చేయటం చారిత్రక సత్యం. అయితే, ఆధునిక చారిత్రక పరిశోధకులు రుద్రమ ఆ యుద్ధంలో మరణించలేదనీ ఆమె వృద్ధాప్యంలో తన మనుమడైన రెండవ ప్రతాప రుద్రుణ్ని రాజ్యాభిషిక్తుణ్ని చేసిందనీ అతడు 1290లో అంబ దేవునికి రాజ్యాన్ని యిచ్చినట్లు చారిత్ర కాధారాలతో చెప్పడం జరిగింది. కాని నేడు వరంగల్ లో లభ్యమైన నాటి శిల్పాలలో గుర్రం పడిపోగా తలపాగా తొలగి విషణ్ణవదనంతో ఉన్న విగ్రహాన్ని బట్టి ఆమె యుద్ధంలోనే మరణించిందని నిర్ధారించారు. ఏది ఏమయినా రాణీ రుద్రమ మహోన్నత చారిత్రక స్త్రీ శక్తికి ప్రతీక.

రాణీ రుద్రమ శక్తియుక్తులు ఒక చారిత్రక నారీశక్తికి ప్రతీకగా భావించి నాటి సాహిత్యంలో స్త్రీపాత్రల పరంగా నమోదు కావటమే తెలుగు సాహిత్యానికొక విశిష్టతను సంతరింపచేస్తుంది. రాణీరుద్రమ సమకాలీనులైన వారుగానీ, లేదా శీఘ్రకాల తదనంతర తెలుగు కవులుగాని తాము కన్న, విన్న రాణీరుద్రమదేవి యుద్ధ నైపుణ్యాన్ని ప్రశంసించకుండా ఉండలేకపోవటంచేతనే ఆమె పరాక్రమ శక్తిని తమ సాహిత్య సృజనలోని పాత్రలలో నిక్షిప్తంచేసారు. అందుకే చరిత్రలో రాణి రుద్రమదేవి ఏయే ప్రాంతాలలో యుద్ధాలు చేసి విజయాలు సాధించిందో ఆయా ప్రాంతాలలోని కవులు ఆమె పరాక్రమాన్ని తమ సాహిత్యంలో పాత్రల పరంగా నమోదు చేసారు.

రుద్రమదేవి ఓరుగల్లును ఆక్రమించిన యాదవరాజు మహాదేవుణ్ని దేవగిరి వరకు తరిమికొట్టినట్లు చరిత్ర చెబుతోంది. కాకతీయరాజ్యానికి సరిహద్దు ప్రాంతాల లోని దేవగిరిని పాలించే యాదవ రాజుల దండయాత్రలో భాగంగా రుద్రమ సమకాలీనుడిగా భావించబడుతున్న నాటి దేవగిరి రాజ్యంలోని కవి యైన జైమిని కూడా సంస్కృతంలో అశ్వమేధపర్వమనే భారతాన్ని రచించి దానిలో ప్రమీల పాత్రపరంగా రుద్రమదేవి యొక్క నారీశక్తికి నీరాజనం పట్టటం జరిగింది. అందుకే ఈ కావ్యం స్వదేశీ, విదేశీ భాషలలోకి అనవదింపబడటమే దానికి తార్కాణము. దీనినే 16వ శతాబ్దానికి చెందిన తెలుగు కవి, ఓరుగల్లు దగ్గర ఉన్న పిల్లలమర్రికి చెందిన పినవీరబద్రుడు తెలుగులో జైమిని భారతాన్ని ముందుగా వ్రాసియుంచుకొని ఉండటం చేతనే రాజు అడిగిన మరునాడే ఆ కావ్యాన్ని అంకితం చేసినట్లు కనపడుతుంది. ప్రపంచ చరిత్రలో 13వ శతాబ్దానికి పూర్వము ప్రపంచ చరిత్రలో రుద్రమ తప్ప ఏ దేశ స్త్రీలు యుద్ధాలు చేసి విజయాలు సాధించినట్లు లేదు.

రుద్రమదేవియొక్క తదనంతర శీఘ్రకాలానికి చెందిన తెలుగుకవులు వ్రాసిన కావ్యాలలోను ఈ చారిత్రక భౌతిక స్త్రీశక్తి సత్యభామ పాత్రపరంగా స్పష్టమవుతుంది. అద్దంకి ప్రాంతీయుడైన ఎఱ్ఱన రచించిన హరివంశాన్ని, ఓరుగల్లు దగ్గర వాడైన బమ్మెరపోతన యొక్క భాగవతాన్ని, నాటి 'త్రిపురాంతక' ప్రదేశమైన కడపప్రాంతంవాడయిన నాచన సోమన రచించిన ఉత్తర హరివంశాన్ని ఓరుగంటి వారసుడును, నెల్లూరువాసి అయిన పిల్లలమర్రి పినవీరభద్రుడు తెలుగులో వ్రాసిన జైమిని భారతాన్ని ఇందుకు ఉదాహరణంగా చెప్పవచ్చు. ఈ సాహిత్యంలో ప్రతిఫలించిన స్త్రీశక్తియే నాటి రుద్రమ పరాక్రమశక్తికి ఒక చారిత్రక ఆధారంగా భావించవచ్చు.

ఎఱ్ఱన, పోతన, నాచనసోమనలు తమ కావ్యాలలో రాణి రుద్రమ దేవి పరాక్రమ శక్తిని సత్యభామపాత్రకు ఆపాదించారు. ఇది ఊహకాదు. ఎందుకంటే 13వ శతాబ్దానికి పూర్వం గల సంస్కృత కవులు గానీ తెలుగు కవులు గానీ తమ పురాణాలలోగాని కావ్యాలలో గాని సత్యభామ నరకాసురునితో యుద్ధం చేసినట్లుగా వర్ణించబడలేదు. అయితే, సత్యభామ పాత్రనే యుద్ధం చేసినట్టుగా

కవులు ఎందుకు వ్రాసారనే దానికి నిదర్శనంగా సంస్కృత భాగవతంలో సత్యభామ కృష్ణుని వెంట కేవలం రణస్థలికి వెళ్లినట్లు మాత్రమే ఉండటం చేత ఆపాత్రకే రుద్రమపరాక్రమ శక్తిని అలా ఆపాదించటం జరిగిందని అర్థం అవుతుంది. అంతేగాక కైక ఒక దుష్టపాత్రగా నిలబడి యుండటం కూడా ఒక కారణంగా భావించవచ్చు. అంతేగానీ, 13వ శతాబ్దానికి పూర్వం అటు సంస్కృతకవుల కావ్యాలలో గాని ఇటు తెలుగు కావ్యాలలో గానీ సత్యభామ యుద్ధం చేసినట్టు ఎక్కడా లేదు కాబట్టి ఆ తర్వాత వచ్చిన కావ్యాలలోని సత్యభామ పాత్రలో రుద్రమ శక్తిని నిక్షేపిస్తూ కవులు సాహిత్యంలో నమోదు చేసారనేది సత్యదూరం కాదు. అలా వారు తమ కావ్యాలలో స్త్రీ శక్తిగా చరిత్ర ప్రసిద్ధిపొందిన రాణి రుద్రమ దేవి యొక్క నారీ శక్తిని ప్రతిబింబ జేయటమే ఒక చారిత్రక భౌతిక వాస్తవికతగా భావించాలి. రాణీ రుద్రమదేవి సమకాలీన, తదనంతర కవులు సత్యభామ యుద్ధం చేసినట్టు వర్ణించటం తెలుగు ప్రజలను పరిపాలించిన మహిళా శక్తిగా రుద్రమదేవి ని అభినందించిన కారణంగానే సాహిత్యంలో రుద్రమ 'నారీ' శక్తి ఒక చారిత్రక భౌతిక వాస్తవికతకు అద్దం పట్టింది.

అప్పటివరకు ఉన్న పురుషపరాక్రమానికంటే భిన్నమైనది స్త్రీ పరాక్రమశక్తి. ఎక్కడెక్కడైతే రాణి రుద్రమదేవి యుద్ధాలు చేసి విజయాలను సాధించిందో ఆయా ప్రాంతపు కవులు ఆమె యుద్ధనైపుణ్యాన్ని విని ఉంటారు. అందుకే తమ కావ్యాల్లోని సత్యభామ పాత్రను వీరరసాత్మకంగా మలచగలిగారు. రుద్రమదేవి కళింగ గాంగులను, నెల్లూరు చోడులను, పాండ్యులు, యాదవులను జయించి ఆయా ప్రాంతాలను స్వాధీన పరచుకుంది. దీని స్ఫూర్తిగానే కాబోలు నెల్లూరు సమీపంలోని అద్ధంకికి చెందిన ఎఱ్ఱన తన 'హరివంశం'లోని ఉత్తర భాగంలోని నరకాసురవధ ఘట్టంలో తెలుగుసాహిత్యంలో సత్యభామచేత మొట్టమొదటగా యుద్ధంచేయించాడు. అందుకే ఆమె చేసిన యుద్ధాన్ని వర్ణిస్తూ

*"వీరంబాడు దనంబు నొందెననగా విక్రాంతి శాతిత్వ*
*లక్ష్మీరేఖంబచరించె నాగధృతింయాయక్షీణకృతంజెందెనా*
*ధీరోదాత్త పతిప్రియ చరణభక్తి ప్రౌఢయాతన్విదా*
*బ్రారంభించె మహారణక్రియకు నా ప్రత్యర్థి లోనుక్కునన్"* అని వ్రాసాడు.

రుద్రమదేవి రణస్ఫూర్తిని విన్న పోతన (ఓరుగల్లుకు దగ్గరలోని బమ్మెర గ్రామవాసి) తన భాగవతంలోని దశమ స్కంధంలో "మహాపరాక్రమంతో, వీరాలోక దుర్లోకయై తావేగన్ సుగుణంబు జేసె ధనువుందన్వంగి, దైత్యాంగనా గ్రీవాసంఘము నిర్గుణంబుగ రణక్రీడా మహోత్కంఠతోన్" అంటూ సత్యభామకు ఆపాదించి ఉండొచ్చు. "వీర శృంగార భయరౌద్ర విస్మయములు గలిసి భామిని" అన్నట్లుగా యుద్ధం చేసినట్లు వర్ణించారు. పోతన భాగవతంలో సత్య, నరకాసుర వర్గమైన రాక్షసులను సంహరిస్తుంది. కాని నరకుడిని యుద్ధం చేయదు. విష్ణుభక్తుడైన పోతన అలా రాయలేదు.

అంబదేవుడు అనేవ్యక్తి కడప, చిత్తూరు మండలాల్లో రుద్రమ అధికారాన్ని ధిక్కరిస్తాడు. నెల్లూరులోనూ తిరుగుబాటు చేయిస్తాడు. దాంతో కడప ప్రాంతమైన త్రిపురాంతకంలో అంబదేవుడిపై కాకతీయ సామ్రాజ్ఞి యుద్ధం చేసి అతని పీచమణిచింది. దీన్ని తెలుసుకొన్న కడపవాసియైన నాచన సోమన తన 'ఉత్తర హరివంశం'లో సత్యభామ చేత యుద్ధం చేయించి ఉంటారు. ఆ రణఘట్టంలో సత్యభామను శృంగార వీర రసస్ఫోరకంగా వర్ణిస్తూ

*"ఊచనకట్టు వంపని పయోరుహలోచన మింట మంటలన్*
*బూచిన బాణజాలమున పూర్వసుపర్వపురాణ గర్వమున్*
*వేచిన చందమున్ విపుల వీరరసంబున నాత్మచిత్తముం*
*దోచిన చందముందెలియ దోచిన నచ్చరలిచ్చుమెచ్చురే!"* అంటాడు.

నాచన సోమన 'హరివంశం' లో నిశుంభుడు విసిరిన గద ధాటికి కృష్ణుడు గాయపడతాడు. దాంతో పెద్ద గదను నిశుంభుడిపైకి విసురుతుంది సత్య. దెబ్బకు నిశుంభుడు తీవ్రగాయాలపాలవుతాడు. భూమిపైపడి హాహాకారాలు చేస్తుంటాడు. ఆ లోపల కృష్ణుడు లేచి అతన్ని చంపుతాడు. ఇక్కడా అంతిమ విజయం కృష్ణునికే దక్కుతుంది. నరకాసురునితో సత్య యుద్ధం చేస్తున్నప్పుడు కృష్ణుడు ఓ గమ్మత్తు చేస్తాడు. నరకుడు సత్య చేతిలో పూర్తిగా చావకుండా చేస్తాడు. దానికోసం సత్యకు రుక్మిణిని గుర్తుకుతెచ్చి యుద్ధ విముఖురాలిని చేస్తాడు. అంటే ఎదుటి శత్రువు మీదనున్న సత్యదృష్టిని ఆమె యొక్క నిత్యశత్రువైన

సవితిమీదకు మళ్ళింప జేయటంలోనే వ్యక్తత ఉంది. పురుషాధిక్యవిజయాన్ని నిలపాలనుకోవటం అర్థమవుతుంది. అందుకే విల్లును తాను చేతిలోకి తీసుకుంటాడు. అంతవరకు సత్యను గెలవలేనని డీలాపడిపోయిన నరకుడుకి అప్పుడు ధైర్యం వచ్చింది. ఉత్సాహంతో యుద్ధం చేస్తాడు. ఆ తర్వాత కృష్ణుడి చక్రాయుధం ధాటికి మరణిస్తాడు. ఇక్కడ కూడా కృష్ణుడే విజేత.

సత్య 'ఆత్మశక్తితో' వీరావేశంతో నరకాసురుడితో పోరాడిందని కవులు చెప్పటాన్ని విశేషంగా భావించాలి. నరకాసుర బాధితులైన మునుల మొరతో పాటు ఇంద్రసింహాసనాన్ని కాపాడే ఉద్దేశంతో కృష్ణుడు నరకుడికి ఎదురువెళ్తాడు. రాజకీయ, సామాజిక విషయమిది. కానీ సత్యభామ ఆత్మచిత్తమంతా నరకుడు చెరబట్టిన మునికన్యలు, రాజకన్యల సంరక్షణపైనే ఉంది. మహిళల రక్షణే ధ్యేయంగా పోరాడటం వల్లే ఆమె నరకుణ్ని పడగొట్టగలిగింది. నరకాసుర వధానంతరం ద్వారకలో జయజయ ధ్వానాలతో విజయహారతి పట్టించుకున్న కృష్ణుడు సత్యభామ యుద్ధ నైపుణ్యాన్ని చెప్పలేదంటే రుద్రమదేవి సమరస్ఫూర్తిని ఆనాటి తెలుగు కవులు ప్రశంసించలేక పోయారన్నది దీంతోనే అర్థమవుతోంది. ఇక్కడ పాఠకులకు రుద్రమదేవి పరాక్రమశక్తి స్ఫురణకు వస్తుంది.

సంస్కృత భాగవతంలో సత్యభామ కృష్ణునితో యుద్ధభూమికి వెళ్లినట్లు మాత్రమే ఉంది. కాని తెలుగు 'హరివంశా'ల్లో నరకాసురునితో యుద్ధంలో కృష్ణుడు గాయపడితే సత్య సపర్యలు చేస్తుంది. తర్వాత కృష్ణుని అనుమతితో నరకాసురుడిపై యుద్ధం చేస్తుంది. తన బాణాలతో నరకుణ్ని చావు అంచుల వరకు తీసుకెళ్తుంది. అయితే పితృస్వామ్య వ్యవస్థ ప్రతినిధులైన తెలుగు కవులు, నరకాసుర వధ ఘట్టంలో అంతిమ విజయాన్ని కృష్ణుడికే కట్టబెట్టారు.

13వ శతాబ్దానికి చెందిన వాడుగా చెప్పబడుతున్న మహారాష్ట్ర ప్రాంత కవియైన జైమిని 'అశ్వమేధపర్వమనే' భారతాన్ని సంస్కృతంలో రాసాడు. దీనినే 15వ శతాబ్దానికి చెందిన పిల్లలమర్రి పినవీరభద్రుడు తెలుగులో యథాతథానువాదంగా జైమినిభారతం అనేపేరుతో కావ్యాన్ని వ్రాసాడు. దానిలో అంతకు మునుపు అటు భారతీయ భాషల సాహిత్యలలోగాని, ప్రపంచ సాహిత్యంలో

గాని లేని నూతన కల్పిత పాత్రయైన ప్రమీల పాత్రను సృష్టించి, ఆమెలో రాణీ రుద్రమదేవి పరాక్రమశక్తిని నిక్షిప్తం చేయటం చేతనే, ప్రమీల అర్జునుణ్ని ఓడించగల సమర్థురాలిగా వర్ణించబడింది. మహాభారతంలో అన్ని చోట్ల విజయుడైన అర్జునుడు జైమినీ భారతంలో ప్రమీలను యుద్ధంలో జయించలేకపోతాడు. గగనవాణి సలహాగా ఆమెతో లైంగికసంబంధాలలో భాగంగా మాత్రమే ఆమెను జయించవచ్చని చెప్పటంతో ప్రమీల కోరిక ప్రకారం వైవాహిక సంబంధాలలో ప్రవేశించినట్లుగా జైమిని వ్రాసిన భారతంలో వర్ణింపబడింది. ఇందులో ప్రమీల పాత్రచేసిన యుద్ధంలో ప్రతిఫలించినది చారిత్రక భౌతిక వాస్తవికతయైన రాణి రుద్రమదేవి పరాక్రమ శక్తియే. రుద్రమదేవియొక్క శక్తి ప్రభావం, ఆనాటి మహిళలను చైతన్యం పరచటం సహజపరిమాణం. అందుకే రుద్రమమనుమడైన రెండవ గణపతి దేవుడికి కప్పంకట్టలేని పరిస్థితులో గిరిజన మహిళలైన సమ్మక్క, సారక్కలు తిరుగుబాటుచేసి రాజుసైన్యంతో యుద్ధం చేసి మరణించటం కూడ చారిత్రక సత్యం.

మధ్యయుగాలనాటి మహిళాసంస్కృతి పట్ల పీడనగా ఉన్న సతీసహగమనాన్ని నిరసించే దిశగా ఆనాటి మహిళలకున్న మనోభావాలను, నాటి స్త్రీలు తమ జీవించే హక్కును కాపాడుకోవటం గాను రాణులు, రాకుమార్తెల యొక్క ప్రతిఘటించే ఆలోచనలలో రుద్రమదేవి నారీశక్తి ప్రభావ చైతన్యం జైమినీ భారతంలోని పాత్రలుద్వారా స్పష్టం అవుతుంది. ఈ నాటి స్త్రీల చైతన్యానికి ఆనాటి రుద్రమ శక్తి ప్రభావ చైతన్యమే పునాదిగా భావించాలి.

ప్రపంచంలోని ప్రథమ కదనవిజేతయైన రాణిగా తెలుగు ప్రజలను పరిపాలించిన రుద్రమదేవియొక్క 'నారీ శక్తి' ప్రతిఫలించిన తెలుగు సాహిత్యం, రుద్రమ స్ఫూర్తి నేటి మహిళా చైతన్యానికి దిక్సూచి వంటిదిగా ప్రపంచంలోని తెలుగువారందరూ గుర్తించాల్సిన అవసరంఉంది.

– *తెలుగువెలుగు మాసపత్రిక ఏప్రిల్ 2013.*

# 5. తాళ్ళపాక తిమ్మక్క 'సుభద్రా కల్యాణం'–కన్యకా భద్రగీత

క్రీ.శ.15వ శతాబ్దానికి చెందిన తాళ్ళపాక తిమ్మక్క తెలుగులో 1163 పంక్తులు గల 'సుభద్రాకల్యాణం' అనే గేయకావ్యాన్ని మంజరీద్విపదలో వ్రాసింది. ఈ విషయాన్ని పండితులు తాళ ప్రమాణాలతో నిర్ధారించారు. ఈమె తాళ్ళపాక అన్నమయ్య భార్య. సాహిత్య చరిత్రకారులు ఈమెనే తొలి తెలుగు కావ్యరచయిత్రిగా నిర్ణయించారు. అన్నమయ్య జగన్నాథుడిగా వేంకటేశ్వరుని కీర్తిస్తే, తిమ్మక్క జగన్నాటక సూత్రధారుడిగా కృష్ణుడు సుభద్రార్జునుల వివాహాన్ని జరిపించిన ఘట్టాన్ని గేయవస్తువుగా తీసుకుంది. వివాహం అనేది లైంగిక సంబంధాలకు సంబంధించిన విషయం. దీన్ని ఆధారంచేసుకుని స్త్రీల లైంగిక భద్రతకు, స్త్రీల సామాజిక భద్రతకు ప్రాధాన్యాన్నిచ్చి కన్యకాభద్రగీతగా తిమ్మక్క సుభద్రాకల్యాణాన్ని వ్రాసినట్లు అర్థం అవుతుంది.

మధ్యయుగాలనాటి చారిత్రక, సామాజిక నేపథ్యంలో స్త్రీలులైంగిక భద్రతకై ఆత్మరక్షణ చేసుకోవాల్సిన అవసరాన్ని గుర్తించింది తిమ్మక్క. విద్యావ్యాపకం లేని ఆడపిల్లలు ఆ రోజుల్లో పాటలు పాడుకుంటూ లోకపు పోకడను అవగాహన చేసుకోవటానికిగాని, వారు తమ లైంగిక భద్రతకై మననం చేసుకొని స్వీయ చైతన్యం తెచ్చుకోవటానికి వీలుగానూ కన్యకా భద్రగీతగా తిమ్మక్క 'సుభద్రాకల్యాణం' అనే కావ్యాన్ని వ్రాసినట్టు అర్థమవుతుంది. అందుకనే పండిత భాషలోనో, వృత్త పద్యాలలోను వ్రాయకుండా హాయిగా ఆడపిల్లలు గానం

చేసుకొనే విధంగా ఉండే ద్విపద జాతి ఛందస్సులో వ్రాసింది. ఆడపిల్లలుగా పుట్టటం, పెరగటం, ఆ తరువాత పెళ్ళి జరిగి స్త్రీగా కుటుంబంలో సంతానాన్ని కనేంతవరకు ఆమె యొక్క శరీరం, మనసుచుట్టూ సమాజంలో అభివృద్ధి చెందిన భావాల సముదాయాన్ని 'లైంగికత' గా భావించవచ్చు. ఆధునిక యుగంలోనూ ఆడపిల్లలకు లైంగిక భద్రత కరువై ప్రేమపేరుతో లైంగిక దాడికి దోపిడీకి గురవుతున్న ఈ రోజుల్లోకూడా ఈ కావ్యం కన్యకాభద్రగీతిక కాగలుగుతుంది.

సంస్కృతాంధ్ర భారతాలలోని సుభద్రార్జునుల వివాహాన్ని, దాని యొక్క నేపథ్యాన్ని కావ్యవస్తువుగా గ్రహించి తిమ్మక్క సుభద్రా కల్యాణాన్ని రచించింది. ఉత్తరదేశపు సంప్రదాయంగల భారతకథా భాగానికి దాక్షిణాత్యపు సంస్కృతిని రంగరించి సుభద్రను తెలుగింటి ఆడబడుచుగా అలంకరింపజేసింది. తెలుగు యువతులు తమలో ప్రతిబింబించిన సుభద్ర మనోభావాలలోకి తొంగి చూసుకొనేటట్టు చేయగలిగింది. తిమ్మక్క జీవించిన కాలం నాటి సామాజిక వ్యవస్థలో బహుభార్యాత్వం, వేశ్యా వ్యవస్థలకు కోటగోడగా ఉన్న పితృస్వామ్య సంస్కృతి స్త్రీని ఒక భోగవస్తువుగా చూస్తున్న రోజులవి. అటువంటి సామాజిక సంస్కృతి ఉన్న రోజుల్లో స్త్రీలకు లైంగికభద్రత ఉండే అవకాశం తక్కువని భావించిన తిమ్మక్క ఒకమహిళగా స్త్రీలకు లైంగికభద్రత అవసరమని భావించింది. ప్రేమకు, మోహానికి ఉండే తేడాను తెలియజేస్తూ తన కావ్యంలో లైంగికభద్రత విషయంలో సుభద్ర ప్రవర్తనను నమూనాగా చూపించింది. ఆ విషయానికే గానయోగ్యత కల్పించి కన్యకా వేదంగా ఆడపిల్లలు పాడుకునేటట్టుచేసి వారికి ఆత్మరక్షణ విద్య అబ్బేటట్టు చేయగలిగింది.

సుభద్రార్జునుల వివాహానికి ఉన్న నేపథ్యంలో కుటుంబంలోని అసమతుల్యతగల స్త్రీ–పురుష సంబంధాలలోని 'లైంగికతనే' పునాదిగా చేసుకొని కావ్యారంభం చేసింది. "ఇంతుల కథలెంత వారికైనా చికాకు కల్గు" అంటూ స్త్రీల విషయంలో పురుషప్రవృత్తిలో కలిగే అలజడిని సూచించింది. నన్నయ్య భారతంలో ద్రౌపది వివాహానంతరం నారదుడు వచ్చి ద్రౌపదిని లోపలికి పంపించి, ధర్మరాజాదులతో ఆమె లైంగికత విషయంలో భర్తలైన పంచపాండవులు తమలో

తాము గొడవ పడకుండా ఒక ఒడంబడికను చేసుకోమని చెప్తాడు. అన్నదమ్ము లందరితో ఒకొక్కరి దగ్గర ఒకొక్కఏడాది చొప్పున ఉమ్మడి భార్యయైన ద్రౌపది మక్కువతో వచ్చి ఉండే నియమంతోపాటు ఆ దంపతులున్న మందిర సమీపానికి మిగిలిన భర్త లెవరూ వెళ్ళకూడదనీ, ఒకవేళ తెలియక వెడితే ఒక ఏడాది పాటు తీర్ధ యాత్రలు చేయాలని చెబుతాడు. అన్నదమ్ములు తమలోతామె ఒక ఒడంబడికను (సమయాన్ని) చేసుకున్నట్టు ఉంటుంది. కాని పురుషుల కామ ప్రవృత్తిపట్ల అవగాహనగల తిమ్మక్క వారిలో వారు ద్రౌపది విషయంలో ఒడంబిడిక చేసుకోలేరని భావించి ఆ నియమాన్ని నారదుడిచేత చెప్పించి ఒప్పింప చేసినట్లుగా వ్రాసింది. ఒకరోజు దొంగలబారి నుండి విప్రుని ధేనువులను కాపాడాల్సిన సందర్భంలో ఆయుధాల అవసరార్ధమై అర్జునుడు ద్రౌపది ధర్మరాజులున్న మందిరం లోకి ప్రవేశిస్తాడు. నియమోల్లంఘనం జరిగినందుకు బాధపడ్డ అర్జునుడు ఒక ఏడాది పాటు తీర్థయాత్రలు చేయటానికి బయలు దేరుతాడు. ఆ క్రమంలోనే అర్జునుడు ఉలూపి, చిత్రాంగద, సుభద్రలను వివాహాలుచేసుకునే కథాపరిణామంలో రుక్మిణి, సత్య, 'వంద', అను ఇంద్రకన్య ఆమె చెలికత్తెలు ద్రౌపది వంటి స్త్రీపాత్రలు కథలో చోటుచేసుకుంటాయి. ఈ స్త్రీ పాత్రలన్నీ 'లైంగికత'కు సంబంధించిన విషయాలలో భాగస్వాములే. స్త్రీల 'లైంగికత'ను ఆధారం చేసుకొన్న రాజకీయార్థిక అంశపు యెత్తుగడ ఇందులో కనబడుతుంది. ద్రౌపదికి సద్యోవస్త్రదానం చేయగలిగిన కృష్ణుని, దుర్యోధనుని మీద మిక్కిలి మక్కువగల బలరాముని వారియొక్క యాదవ బలమును పాండవులవైపు త్రిప్పుకోవటానికి వీలుగా అర్జనుడు తీర్థయాత్రలో భాగంగా సుభద్ర వెంటబడి పెళ్ళిచేసుకోవటం స్పష్టమవుతుంది.

తీర్థయాత్రకు బయలుదేరిన అర్జునుడు ఆ నియమకాలాన్ని తన భోగజీవితానికి అనువుగా చేసుకున్న పురుష ప్రవృత్తిని విమర్శకు పెట్టగలిగింది తిమ్మక్క. కథాసందర్భం నాటికే ద్రౌపదీ స్వయంవర విజేతయైన అర్జునుడు వీరుడిగా కీర్తింపబడటం జరిగింది, బహుభార్యత్వం జీవనసంస్కృతిలో భాగం అవటంలో వివాహితుడైనప్పటికి, ఆ వీరుడ్ని పొందాలనుకోవటం సహజంగా

స్త్రీలలో కలిగే భావాలే. అయితే స్త్రీలపరంగాఉన్న ఆ భావాల కొక పితృస్వామ్య ప్రయోజనం ఉన్నట్టు కథలో అర్థం అవుతుంది.

అర్జునుడ్ని కోరుకున్న వారిలో ఉలూపి అనే నాగకన్య అతడ్ని తన నాగలోకానికి తీసుకొనివెళ్ళి తనకున్న కోర్కెను వెళ్ళబుచ్చుతుంది. నాటికి ఆడపిల్ల తనంతట తానే 'పెళ్ళి' ప్రమేయం లేకుండా పురుషుడ్ని కోరుకోవటం ఎబ్బెట్టుగా అనిపించినా, నాగకన్యయైన ఆమె అర్జునునివంటి మానవజాతి వీరుడి సంపర్కంతో కొడుకును కనటమే ఆమె ధ్యేయంగా అర్థమవుతుంది. అందుకే అర్జునుడు ఆమెతో ఒక్కరోజు మాత్రమే గడిపినట్లునూ సద్యోగర్భంతో ఆమెకు ఇరావంతుడు పుట్టినట్లు చెప్పబడింది. జాతిరీత్యా లైంగిక సంబంధాలు పొసగని విషయమైనా అది ఆనాటి సాంకర్య పరిణామంతో వీరుడు పుట్టటం నరావతార జీవపరిణాభివృద్ధికి దోహదకారి కాగలిగిందని అర్థంచేసుకోవాలి.

నాగలోకంలో ఉలూపితో ఒకరోజు గడిపిన అర్జునుడు మరునాడే తన తీర్థయాత్రను కొనసాగించి మణిపురాన్ని చేరుకుంటాడు. ఆ పురానికి రాజైన చిత్రవాహనుడు వీరుడైన అర్జునుని ఆహ్వానించి తన తనయయైన చిత్రాంగదనిచ్చి పెళ్ళి చేస్తానని చెప్పి వారికి పుట్టిన తన దౌహిత్రుడిని ఆరాజ్యానికి వారసుడిగా చేసుకోవాలని ఉందని చెబుతాడు. ఇక్కడ చిత్రాంగద పరంగా ఎటువంటి కోరికలేదు. అర్జునుడు మాత్రం 'కోరికతోనే' చిత్రాంగదతో గడిపినట్లునూ, బభ్రువాహనుడనే పుత్రుని పొందినట్లు చెప్పబడింది. అక్కడే 13 నెలలు గడిపిన అర్జునుడు భార్యను 'దిగవిడిచి' మళ్ళీ ప్రయాణాన్ని కొనసాగిస్తాడు. 'దిగవిడిచి' అనే శబ్దాన్ని ఒక స్త్రీగా తిమ్మక్క వాడటంలోనే సమాజంలోని స్త్రీలస్థితికి అద్దం పట్టటం జరిగింది. 'దిగవిడిచి' అనే పదానికి 'మొగుడు కలదానిగా'చేసి విడిచి పెట్టటం అనే ప్రత్యేకార్థం ఉంది. అర్జునునితో ఆమె సంసారం కొనసాగలేదనీ, సమాజంలో నామమాత్రంగా ఆమె నొక 'మగడు కలదానిగా' చేసాడని భావింపజేసి పాఠక హృదయాలను కలుక్కుమనేటట్లు రచన చేసిన తిమ్మక్కకు వేవేల ప్రశంసలు చెప్పక తప్పదు.

ఇంద్రలోకపు పంచకన్యలకు శాప విమోచనం కలిగించినా వావి వరుసలు కుదరవని భావించిన అర్జునుడు దేవలోకకాంతలను మాత్రం కోరుకోడు.

తీర్థయాత్రలలో భాగంగా 13 నెలలు గడవు గడిచినా అంటే నియమకాలం అయిపోయినా తిరిగి అర్జునుడు ఇంద్రప్రస్థానికి వెళ్ళటానికి యిష్టపడక పోవటమే వక్రత. పైపెచ్చు అందగత్తెగా చెప్పబడిన సుభద్రను చూడాలనే కోరికను మనసులో పెట్టుకొని జగన్నాథుడ్ని స్మరించు కుంటాడు. తన కోరిక తీరటంకోసం వీలుగా అర్జునుడు ద్వారకా నగర ప్రవేశార్థతకై యాదవులు పూజించే యతివేషాన్ని ధరిస్తాడు. ద్వారకకు దగ్గరున్న ప్రభాస తీరానఉన్న అర్జునునిరాకలోని ఆంతర్యాన్ని గ్రహించిన కృష్ణుడు అర్జునుని మనస్సులో సుభద్ర ఉన్నదన్న విషయాన్ని గ్రహించి ద్వారకకు తీసుకొని వచ్చినట్లుగా నన్నయ్యభారతంలో ఉంది. ఆ విషయంలో తిమ్మక్క మాత్రం కృష్ణుని చేత పురుషుల కాముకప్రవృత్తిని తూర్పారబట్టిస్తుంది. "నిన్ననే సుతులగని నెఱతనమ్మునను యింత సన్యాసి వెట్లయితివయ్య యెఱుగుదుము మీ విద్య లెల్లను మేము – గరిమవేసాలెల్ల గ్రాసాలకొఱకె" అని వ్రాసి పురుషులు, నిరంతరం తమ కోరికలు తీర్చు కోవటానికి తింగరవేషాలు వేస్తారనీ స్పష్టం చేసింది. ఇక్కడ పురుషప్రవృత్తిని పురుష పాత్ర చేతనే గేలి చేయించిన దిట్ట తిమ్మక్క.

కృష్ణుడు అర్జునుని ద్వారకకు తెచ్చి రైవతకపర్వతం మీద కూర్చుండబెట్టి నగరంలో రైవతకోత్సవాన్ని ప్రకటింప జేస్తాడు. అందరూ కొండకు వచ్చి పూజించే క్రమంలోనే పూజకై వచ్చిన సుభద్ర 'వాసవీసుతుడు తనకు వరుడు కావాలని' కొండకు మొక్కుకుంటుంది. అలావచ్చిన సుభద్రను అదేపనిగా చూస్తున్న అర్జునుడ్ని కృష్ణుడు అదలిస్తున్నట్టుగా "మునీంద్ర నీకు జన్నె నలినాక్షులందు మది నిల్పగ" అని నన్నయ్య భారతంలో ఉంది, అంటే అర్జునునికి సుభద్రయందు మనసు ఏర్పడిందని అతను సుభద్రను ప్రేమిస్తున్నాడనే భ్రమ పాఠకులకు కలిగేటట్టుగా ఉంటుంది. స్త్రీవిషయంలో మనసు, ప్రేమఅనేవి పురుషుడి జీవితంలో మొదటి సారిగా తన జీవితంలో భార్యగా ప్రవేశించిన స్త్రీపై మాత్రమే ఏర్పడే అవకాశం ఉంటుంది కాని, అందగత్తెను చూడగానే తాను వివాహితుడనే

విషయాన్ని విస్మరించి ఆడపిల్లలను చూడాలనుకొనే ప్రవృత్తిలో మోహమే ఉంటుంది. పురుషులవిషయంలో ప్రేమకు, మోహానికి ఉన్న తేడాను గమనించే విధంగా తిమ్మక్క "కనుచూపినంతలో కాంక్షింప తగునా మొదల సుభద్ర పై మోహంబు నీకు వదలక యుండుట వడి యెఱుంగుదము" అని కృష్ణుని చేతనే అనిపించి ఆడపిల్లను చూడగానే పురుషులకు కలిగే రిమ్మతెవులను బయట పెట్టించ గలిగిన సాహసి తిమ్మక్క.

బలరామాదులు యతిరూపంలో ఉన్న అర్జునునితో ద్వారకకు వచ్చి చాతుర్మాస్య దీక్ష చేయమనటం, దానికై కృష్ణుడు ఆ యతిని అంతఃపురంలో ఉంచటం జరిగింది. శుశ్రూషకు అన్నట్లుగా అతడు కన్యకాభిక్షతప్ప గ్రహించ డంటూ సుభద్రను ఏర్పాటు చేసి వారిద్దరి మధ్య బంధం కలిగేందుకు వీలుగా ఏకాంతాన్ని ఏర్పాటు చేస్తాడు కృష్ణుడు. నన్నయ్య భారతంలో శుశ్రూష చేస్తున్న సుభద్ర తొందరపడి, "అర్జునుని ఎక్కడైనా చూసారా" అని అడగగానే యతి తానే అర్జునుడని చెప్పటం, ఆ తర్వాత వెంటనే కృష్ణుడు వారిద్దరికి పెళ్ళిజరిపించి నట్లుగా ఉంటుంది. కాని తిమ్మక్క సుభద్ర మాత్రం అర్జునుడే తనను తాను తెలియజేసుకునేటట్టు చేస్తుంది. ఆవిషయంలో స్త్రీలెంత నిదానంగా, నిబ్బరంగా ఉండాలో తెలియజేస్తుంది. సుభద్ర అర్జునునికి ఉపచారాలు చేస్తూ ఒకరోజు బొమ్మలాటలో భాగంగా బొమ్మల పెండ్లి జరిపిస్తూ ఉంటుంది. ఆ ఆటలనే అదనుగా భావించిన అర్జునుడు చొరవ చేసుకొని సుభద్రతో తాను ఆపెండ్లి జరిపిస్తాననీ పానుపింటికి పంపింద్దామంటూ శృంగార సంభాషణలు చేస్తాడు. సుభద్రతో సరసమాడే క్రమంలో చనువుతో ఆమె చేయి ముట్టుకోవటం, పాదాలను తాకటం, హారాలు సరిచేస్తానంటూ పయ్యెదపై చేయివేయటం వంటివి చేయటంతో ఆ యతి పోకిరీచేష్టలకు సుభద్ర భయపడింది. ఆతడి మాటలకు వెఱగందిన సుభద్ర ఆప్రాంతాన్ని వదలి పెట్టాలనుకొని అతని దగ్గర నుండి వడిగా వెలుపలికి వచ్చి కృష్ణుడి దగ్గరకు పరుగెత్తు కొని వచ్చి యతి వేసిన వేషాలన్నీ చెబుతుంది. అంతే కాదు అటువంటి వాడినా యతిగా భావించట మేమిటనీ, అతడుయతికాడనీ, 'చూఱగాడనీ' అతడ్ని అంతఃపురంలో ఉంచటమే మిటంటూ అన్నను ప్రశ్నకుపెట్టి కన్యకాభిక్ష గ్రహించే అర్హత అతడికి లేదనీ,

అతడ్ని వెంటనే పంపించమనీ, అతడ్ని పూజించననీ తెగేసి చెబుతుంది సుభద్ర. ఇక్కడ సుభద్ర పురుషులలోని మోహప్రవృత్తిని చక్కగా అంచనావేయ గలిగింది. నేటి కాలంలో చదువుకుంటున్న యువతులు ప్రియులను ఏకాంతస్థలాల్లో కలుసుకుంటూ పురుషుల వెకిలి చేష్టలనే 'ప్రేమ' భావమనుకుంటూ భ్రమకు లోనయి ఆతని శృంగారప్రవృత్తికి వీలుగా ఉండి లైంగికదోపిడికీ గురిఅవటం జరుగుతోంది. తర్వాత పెళ్ళి చేసుకోమని ప్రియుడ్ని అడిగితే అతడు నిరాకరించటం పరస్పర దూషణలు దాడులు, హత్యలు, ఆత్మహత్యల పరిణామాలే నిత్యకృత్యాలుగా మారినాయి. ఈసందర్భంగా తిమ్మక్క తీర్చిదిద్దిన సుభద్ర అంతటి ఏకాంతంలో కూడా అర్జునుని చేష్టలకు భ్రమించకుండా భయంతోనూ, ఆశ్చర్యంతోనూ, ఆప్రాంతాన్ని వదలి పెట్టి పరిగెత్తు కొని వచ్చింది. అన్నగా చెల్లెలి భద్రత విషయంలో కృష్ణుడు అర్జునుని దగ్గరకువచ్చి సుభద్రతో తొందరపడి దుర్భాషలాడద్దనీ హెచ్చరిస్తాడు. సుభద్ర అర్జునుని యందు విముఖత్వాన్ని చూపిస్తే తన రాజకీయ పన్నాగం ఫలించదని భావించిన కృష్ణుడు చెల్లిని తిరిగి యతిశుశ్రూషకు సుముఖరాలిగా చేయుటకోసం గారాబం చేస్తాడు. అర్జునుని 'మొప్పె' మాటలను ఖండించాననీ–అతడ్ని మందలించాననీ, చెప్పి ఆమె మళ్ళీ ఆతని శుశ్రూషను కొనసాగించటంకోసం కృష్ణుడు ఆ యతిని గొప్ప వాడనిచెప్పి, అతడే అర్జునుడేమో అని సందేహం వస్తోందని చెబుతాడు.

సుభద్ర కూడా ఆ యతియే అర్జునుడేమోనని నిర్ధారించుకోదలచి ఎప్పటి కంటె ఉత్సాహంగా తయారయి అతని శుశ్రూషకు వెడుతుంది. తీర్థయాత్రలో భాగంగా అర్జునుడ్ని చూడటం తటస్థించిందా అంటూ యతితో ఆమె మాట్లాడే సరికి అతడు సుభద్రతో మాట్లాడటానికి జంకినట్లుగా "పలికిన పలుకులు భావమేర్పరచి దూఱు లెక్కించెదో తోయజాక్షునకు" అంటాడు. ఆడపిల్లలతో పిచ్చిపిచ్చిగా మాట్లాడటానికి భయపడే స్థితిలో యువకులను ఉంచాల్సిన కర్తవ్యాన్ని యువతులకు బోధించినట్లుగా ఇక్కడ సుభద్ర ప్రవర్తన ఉంది. అర్జునుడు తాను రాజ ఋషినని చెప్పి మన్మథతాపమెక్కువై మూర్ఛపోతాడు. అక్కడకు వచ్చిన పెంపుడు చిలుక అర్జునునితో "బలరాముడు 'నెలిమి' దుర్యోధనునకిచ్చెదననిన

కడుతాపము పొంది కాంత నిన్నడిగె" అంటూ సుభద్ర ప్రేమను తెలియజేసింది. అర్జునుడు కూడా "యింతి నీపై మోహమెసగొని యుండ" అని చిలుక ద్వారా తనకు సుభద్రపై ఉన్న 'మోహాన్ని' తెలియజేస్తాడు. సుభద్ర అర్జునుని రూపును వర్ణిస్తుంటే ఆ యతి తానే అర్జునుడినని బయటపడి, తాను సుభద్రను పెళ్ళి చేసుకోవటానికి వీలుగా కృష్ణుడే ఈ పన్నాగాన్ని పన్నెనని చెప్పి గాంధర్వవివాహం చేసుకుందామంటూ అర్జునుడు 'తమకముతో' చేయి చాపుతాడు. సుభద్ర మాత్రం తల్లి దండ్రులు, అన్నలు మొదలైన వారు అర్హులుండగా వారి అనుమతితో పెళ్ళి జరగాలనీ, "గాంధర్వ వివాహం" చేసుకొని నీతో వచ్చేస్తే లోకం నవ్వుతుందనీ, "తెరలి యేనుగు నెక్కిదిడ్లు దూరెదరె" అని ఆతని ఇరుకుమనస్తత్వాన్ని విమర్శ చేసి వెళ్ళిపోతుంది.

ఈ సందర్భంలో సుభద్ర యొక్క నిగ్రహం, క్రమశిక్షణను ఆధునిక యువతులు ఆదర్శప్రాయంగా భావిస్తే వారు ప్రియులతో రహస్యంగా పెళ్ళి చేసుకోవాలను కోరు. స్త్రీపురుషలిద్దరూ భార్యాభర్తలుగా కుటుంబ చట్రంలోకి వారు ప్రవేశిస్తున్నారనే విషయం అందరికీ తెలియటం కోసమే 'పెళ్ళి' అనే తంతు మొదలైంది. ఆమె జీవితంలోకి గానీ, అతని జీవితంలోకి గాని వేఱెవరూ ప్రవేశించటానికి వీలు లేకుండా నలుగురికి తెలిసేలాగా పదిమంది సమక్షంలో వివాహ వేడుకలు జరిపించటం అనాదిగా వస్తున్న సంప్రదాయం అయింది. అనంతరం సుభద్ర తాను ఆవిధంగా అర్జునుని గాంధర్వ వివాహప్రసక్తిని తోసిపుచ్చటాన్ని ఆలోచిస్తూ అతడు తనను" వినయముతో చెట్టబట్టినను విడిపించుకొని మరి వేగబోయితిని-ఎలమినాతని మనసెట్లుండునొక్కో-కాక దానొడబడితే కడుచుల్కదనము" అనుకుంటూ, తాను మాత్రం నల్గురిలో చులకదనానికి గురికాక పోవటమే సరైనదని భావిస్తుంది. అందుకే ఈ సందర్భంలోని సుభద్రయొక్క విచక్షణాజ్ఞానాన్ని కన్యకలు 'సుభద్రాకల్యాణమ'నే కావ్యంద్వారా మననం చేసుకుంటే అమ్మాయిలకు లైంగిక భద్రతకు సంబంధించిన అవగాహన ఏర్పడటమే కాక పురుషుల మోహప్రవృత్తి అర్థమై, లైంగిక దోపిడీకి గురికాకుండా తమను తామే కాపాడుకోగలిగే చైతన్యవంతులు

కాగలుగుతారు. నిజమైన ప్రేమికులైతే పెద్దల సమక్షంలో 'పెళ్ళి' ద్వారా సమాజామోదం పొందిన కుటుంబ నిర్మాణంలో ఒదగగలరు.

బలరాముడు లేకుండా చూసి కృష్ణుడు అంతఃపురంలోనే సుభద్రార్జునులకు వేదోక్తంగా వివాహం జరిపించి అర్జునునికి ధనుర్బాణాలను ఇస్తాడు. బహు భార్యత్వపు సంస్కృతి ఉన్న రోజులవి. నన్నయ్య భారతంలో లేకపోయినా తిమ్మక్క తన కావ్యంలో అంపకాల సమయంలో రుక్మిణి ఆశీస్సులనందిస్తూ అర్జునునితో సత్యసంధతలో ఉండి కృష్ణభక్తి కలిగి ఉండమంటుంది. అంటే బహుభార్యాత్వం ఉన్నా సుభద్రను మోసం చేయవద్దని ఆమె భావం. రుక్మిణి సుభద్రకు అత్తగారింట్లో ఆమె ఉండాల్సిన పద్ధతిని బోధిస్తూ "భర్త చనువిచ్చాడని అతడితో పలు మాటలకు పాలుపడవద్దనీ, పురుషులను ఎప్పుడూ నమ్మరాదనీ పురుషులెప్పుడు కృష్ణ సర్పములై ఉంటారని" చెబుతుంది. అంతేకాదు "ద్రౌపదితో కూర్మితో ఉండమనీ, ఆమెను వంచన సేయకుమని" సుభద్రకు రుక్మిణి బుద్ధులుచెప్పి అర్జునునికి అప్పగిస్తుంది. నన్నయ్య భారతంలో ఈ అప్పగింతలు లేకపోయినా తిమ్మక్క సుభద్రార్జునుల వివాహ పరిణామాలను కూడా అంచనా వేయటం జరిగింది. వివాహితులైన పురుషులు మరొక స్త్రీని యిష్టపడటం జరిగిందంటే అటువంటి పురుషులను నమ్మకూడదని చెప్పింది. బహుభార్యాత్వం ఉన్నచోట సవతులపై ఈర్ష్యాసూయలు పెంచుకుంటూ పోటిపడటం కంటె కూడా సవతితో ప్రేమగా ఉంటూ ఆమెను వంచనకు గురిచేయకుండా ఉండమని రుక్మిణి తనస్వానుభవ జ్ఞానాన్ని రంగరించి చెబుతుంది.

పితృస్వామ్య కుటుబంలో పురుషుడు ఒక్కడైనా సరే భార్యలెంత మంది ఉన్నా, భార్యలు వాళ్ళల్లో వాళ్ళే ఈర్ష్యలకు లోనయేటట్టుగాచేసి విభజించే రాజనీతిని ప్రదర్శించి వారిని శత్రుసంబంధాలలోకి నెట్టి తానొక్కడైనప్పటికీ మిక్కిలి బల సంపన్నుడుగా ఉండగలుగుతాడు. కాబట్టే బహుభార్యాత్వం ఆచరణలో సజావుగా ఉండగలిగింది. అటువంటి సామాజిక సంస్కృతిని ఎదుర్కోలేని స్థితిలో ఉన్నప్పుడు స్త్రీ చేయగలిగిన ఒక మంచి పనిగా 'సవతుల ఐక్యతను' కోరుకోవటం తెలివైన పనిఅని, అదే బహుభార్యత్వపు సంస్కృతికి

విరుగుడైన ఔషధం అని తిమ్మక్క కూడా భావించినట్లునిపిస్తుంది. వీరనారి అయిన సత్యభామ వీరుడైన పుత్రుణ్ని కనమంటుంది.

సుభద్రార్జునులు ఇంద్రప్రస్థానికి వెళ్ళేముందుగా ద్వైతవనంలో ప్రవేశిస్తారు. నన్నయ్య భారతంలో అర్జునుడికి స్త్రీ అంటే గౌరవంలేని పురుషప్రవృత్తి బయటపడేవిధంగా అర్జునుడు సుభద్రతో "నిన్ను చూస్తే ద్రౌపది ఈర్ష్యా అసూయలకు లోనవుతుంది. కాబట్టి ముందుగా వెళ్ళి ఆమెను మంచి చేసుకోమని చెప్తాడు, తిమ్మక్క మాత్రం స్త్రీలను అలా తక్కువ చేయటం యిష్టపడలేదు. అలా అర్జునునిచేత చెప్పించకుండా స్త్రీలను స్త్రీలు అర్థం చేసుకోగలరు అన్నట్టుగా సవతిని చూసినప్పుడు కలిగే స్త్రీలో కలిగే భావాలను అర్థంచేసుకొన్న సుభద్రయే ద్రౌపది "ఈరసము చెందకుండా" ఉండేందుకు ముందుగా తానేవెళ్ళి ద్రౌపదిని కలుస్తానని చెప్పి ఆమెకు మ్రొక్కుతుంది. ద్రౌపదితో మిత్ర సంబంధాలలోకి వెళ్ళాలనుకుంటుంది. అప్పటికింకా సంతానవతి కాకపోయినా ద్రౌపది కూడా సవతియైన సుభద్రను "నీభర్త వీరుడైతే వీరపుత్రుడుని" కనమని దీవిస్తుంది. అందుకే ద్రౌపదియే స్వయంగా సుభద్రను అలంకరించి వారి శోభనానికి ఏర్పాటు చేసినట్లుగా చెప్పి ద్రౌపది కూడా సుభద్రతో మిత్ర సంబంధాలలోనే ఉండాలను కునేటట్లుగా తిమ్మక్క వ్రాసింది. ఎట్టి పరిస్థితులెదురైనా స్త్రీకి స్త్రీ శత్రువు కాకూడదని తీర్మానిస్తూ తిమ్మక్క వ్రాయటం ఆశ్చర్యాన్ని కల్గించక మానదు. ద్రౌపది దృష్టిలో వీరుడైన అర్జునుడు తనని స్వయవరంలో గెలుచుకొని కూడా అన్నదమ్ములందరికీ భార్యను చేసినందుకు అర్జునుని ధీరత్వంపై సందేహం ద్రౌపది కుండటం సహజం. ఆ భావాన్నే తిమ్మక్క సందర్భోచితంగా 'భర్త వీరుడైతే' అని ద్రౌపది చేత అనిపించటం పాఠకులు కూడా ఆ విషయంలో అర్జునుని వీరత్వాన్ని సందేహించేటట్లుచేసింది.

సుభద్రను భర్తగదిలోకి పంపించిన తరువాత ద్రౌపది "మనసులో తాళంగలేక-యేమి వస్తువులైన నీయవచ్చు గాని ప్రాణేశునిచ్చి మఱి బ్రతుకంగరాదు". అని భావిస్తూ సభలో తన మానభంగాన్ని కాపాడిన కృష్ణుని చెల్లెలు కాబట్టి తానొప్పుకోవాలని భావించి రాజీ పడ్తుంది. ఏ స్త్రీ అయినా/ భర్త

దగ్గర తన స్థానాన్ని మరొక స్త్రీకి యివ్వాలంటే ఎంత హృదయ వేదనకు గురి అవుతుందనే దాన్ని స్త్రీ రచయిత్రిగా తిమ్మక్క వ్రాయగలిగింది. సభలో ద్రౌపది తన (లైంగికతకు) కు భద్రత కల్గించిన కృష్ణుని చెల్లెలు కాబట్టి సుభద్రను మన్నించ గలిగింది. అంటే స్త్రీలకు భర్త కంటె కూడా లైంగిక భద్రతయే ముఖ్యమైన విషయమని నిరూపించింది. భారత కథలో ద్రౌపదీ మానసంరక్షణ ఘట్టం ఈ కథాంశంనాటికి జరగనప్పటికీ తిమ్మక్క స్త్రీగాస్పందిస్తూ స్త్రీల హృదయాన్ని ఆవిష్కరణచేస్తూ వ్రాసేక్రమంలో పూర్వాపరాలను పట్టించుకోదగ్గ విషయంగా భావించలేదమో అనిపిస్తుంది.

"సుభద్రా కల్యాణం"లో బహుభర్తృత్వం అనే గుంపుసంబంధాల సంస్కృతి స్త్రీలైంగిక భద్రతకు పొసగని విషయంగా కావ్యకథాంశాన్నిప్రారంభించి, బహుభార్యత్వం కూడా స్త్రీల లైంగికతకు గొడ్డలిపెట్టువంటి విషయంగా చెప్పికావ్యం ముగించటం జరిగింది. కన్యలందరూ పురుష ప్రవృత్తిలోఉన్న ప్రేమకి, మోహనికి మధ్య నున్న అంతరాన్ని అవగాహన చేసుకోవాలనీ అప్పుడే స్త్రీలకు లైంగిక భద్రత ఉండగలుగుతుందనీ భావించిన తిమ్మక్క, 500 సం.ల మునుపే కన్యకా భద్రగీతగా 'సుభద్రా కల్యాణం' మనే గేయకావ్యాన్ని వ్రాసి తెలుగులో మొదటి కావ్య కవయిత్రిగా సార్థకతను చేకూర్చుకుంది. పురుషుల మోహప్రవృత్తిని బయటపెట్టి, స్త్రీలు తమ లైంగికభద్రత విషయంలో జాగ్రత్తగా ఉండి ఆత్మరక్షణ చేసుకునేటట్లుగా స్ఫూర్తిని కలిగిస్తూ, నేటి యువతులు చైతన్యవంతులు కాగలిగేటట్లుగా కన్యకాభద్ర గీతాజ్ఞానాన్ని అందించిన తిమ్మక్క నేటికీ స్మరణీయురాలు.

*– మిసిమి మాసపత్రిక– ఏప్రిల్ 2018.*

# 6. జైమిని భారతంలో విలక్షణత్వం

స్వదేశీ భాషలలోనేకాక విదేశీ భాషల్లోకూడ అనువదింపబడిన 'జైమిని భారతమ'నే కావ్యానికి ఒకనూతనత్వం, విలక్షణత్వంఉంది. ఇది వ్యాసభారతం లోని అశ్వమేధ పర్వమందలి కథలకంటె భిన్నమైన నూతన కథలతో వ్రాయబడటమే దాని విలక్షణతను తెలియజేస్తుంది. కావ్యరచనాకాలంనాటి రాజకీయ, సామాజిక సంస్కృతీ సత్యాల నడుమ ప్రతిఫలించిన ఆ విలక్షణతయే కావ్యాన్ని అనేక భాషల సాహిత్య చరిత్రలో చోటు చేసుకునేటట్టుచేసింది. వ్యాస శిష్యుడైన జైమిని ఈ అశ్వమేధ పర్వమనే భారత భాగాన్ని వ్రాసాడనే ఉహాపోహలు నిరూపితంకాలేదు. చివరకు క్రీ.శ.13వ శతాబ్దానికి చెందిన 'జైమిని' అనే మహారాష్ట్రకవి "అశ్వమేధపర్వము"ను సంస్కృతంలో వ్రాసినట్లు పండిత పరిశోధకులు అభిప్రాయానికి వచ్చారు. కావ్య కథాంశాలలోని విలక్షణత కూడా ఇదే అభిప్రాయానికి ఋజువుగా నిలుస్తుంది. దీనినే 15 వ శతాబ్దానికి చెందిన పిల్లలమర్రి పినవీరభద్రుడు "జైమినిభారతమ"నే పేరుతో యధాతథంగా ఆంధ్రీకరించాడు.

మధ్యయుగాల చరిత్రలో రాజులు నిరంతరం పరస్పర యుద్ధాలతో గడపటంతోపాటు, రాజుదైవాంశ సంభూతుడనే ప్రచారం ఉన్న రోజులవి. క్రీ.శ 12వ శతాబ్దంలో ఉవ్వెత్తున ఊపందుకున్న భక్తి ఉద్యమాలతోపాటు రాజుల

ఔద్ధత్యం తగ్గేంచేవిధంగా ఎంతటి రాజులైనా దైవాన్ని శరణాగతరక్షణంగా భావించాలనే ఆలోచనలు అభివృద్ధిచెందాయి. అందుకే కావ్యంలో వీరులైన రాజులందరూ చివరకు విష్ణుభక్తులుగామారినట్లు, శ్రీకృష్ణుని శరణు కోరినట్లు అర్థం అవుతుంది. ఉత్తర భారతదేశంలో ఢిల్లీ సుల్తాన్ కూతురైన రజియాసుల్తానా సింహాసనాన్ని అధిరోహిస్తే కాస్త అటూయిటూగా దక్షిణ భారతదేశంలో రుద్రమదేవి కాకతీయసామ్రాజ్ఞిగా పరాక్రమశక్తితో విజృంభించిన రోజులవి. మహిళాపరాక్రమ శక్తియుక్తులకు ప్రతిగా పితృస్వామ్యసంస్కృతి మరింత పటిష్ఠమయింది.దానిలో భాగంగా సతీసహగమనాన్ని పకడ్బందీగా ఆచరణలో పెట్టటం జరిగింది. పితృస్వామ్యపు భోగజీవితం అసమాన నైతిక సంస్కృతిని పోషించిన ఫలితంగా స్త్రీ-పురుష సంబంధాలలో అక్రమత్వం చోటుచేసుకునే అవకాశం ఉండటంతో స్త్రీలను 'జార'లుగా భావించాలనీ, వారి లైంగికత చుట్టూ కత్తుల బోనులను ఏర్పాటు చేయాలనే భావాలను కావ్యంలోని వ్యాసుని పాత్రద్వారా ప్రచారం చేయటం జరిగింది. దీనికి నాటి కథా కావ్యాలు కూడా సాక్షీభూతాలు. అటువంటి రోజుల్లోనే స్త్రీలు తమశక్తి యుక్తులను పదునుపెట్టుకుంటూ ఆలోచనలను పెంచుకుంటూ స్వతంత్ర నిర్ణయాలు చేసుకునే స్థితిలో మహిళల సంస్కృతి వికసించటమనే ఒక విలక్షణతకు 'జైమిని భారతం' అద్దం పడుతుంది.

చారిత్రక సత్యాలు సమకాలీన సమాజాన్ని ప్రభావితం చేసినప్పుడు మార్పుకు లోనవుతున్న ప్రజల మనోభావాలను, సంస్కృతిని ప్రతిఫలింపచేస్తూ సాహిత్య సృజన జరుగుతుంది. నూతన పరిణామాలు చోటుచేసుకున్న నాటి సమాజం 'జైమిని వ్రాసిన "అశ్వమేధపర్వం" విలక్షణత రూపంలో స్పష్టమవుతుంది. సాహిత్యంలో నూతన భావాలను అంగీకరించటానికి వీలుగా జైమినికవి కావ్యానికి ఇతిహాస, పురాణ గౌరవం కలిగే విధంగా వ్యాసభారతంలోని అశ్వమేధపర్వమందలి ప్రధాన కథా ప్రారంభాన్ని ఆలంబనగా చేసుకున్నాడు. క్రమంగా నూతన కథాంశాలను విస్తరింపజేసుకుంటూ, నూతనపాత్రల సృష్టిచేయటం జైమిని భారతంలో వైలక్షణ్యంగా కనబడుతుంది. ఇందులోని స్త్రీపాత్రలు ఏవీ అంతకు మునుపున్న ఏ సాహిత్యంలో లేవు. ముఖ్యంగా నూతనమైన ప్రమీల పాత్రను సృష్టించటానికిగల చారిత్రకసత్యంగా నాటి

కాకతీయ రాణి రుద్రమదేవి కన్పడుతుంది. ఓరుగల్లుమీద దండయాత్ర చేసిన రాష్ట్ర కూటులను రుద్రమదేవి మహారాష్ట్ర వరకు తరిమికొట్టటం చారిత్రకాంశం. యుద్ధవిరామ సాయంకాల సమయంలో కవులు కూడా రాజులను వినోదానికై సాహిత్యగోష్టి జరిపించటానికై యుద్ధభూములకు వెళ్ళేవారని చరిత్ర తెలుపుతోంది. అందుకే ఆమెకు సమకాలికుడుగా భావింపబడిన మహారాష్ట్ర కవియైన జైమిని రుద్రమదేవికి ప్రతీకగా సాహిత్యంలో ప్రమీల పాత్రను సృష్టించాడని భావించవచ్చు. 13 వ శతాబ్దపు తదనంతర శీఘ్రకాలానికి చెందిన తెలుగు కవులు ఎర్రన, పోతన, నాచన సోమన వంటివారు కూడా రుద్రమదేవి పరాక్రమశక్తిని తమ కావ్యాలలోని సత్యభామ పాత్రకాపాదించి తెలుగు సాహిత్యంలో ఆమెచేత యుద్ధం చేయించారు. అంతకుమునుపు ఏ పురాణాలలో గానీ సంస్కృత తెలుగు కావ్యాలలోగానీ సత్యభామ యుద్ధం చేసినట్లు వర్ణించక పోవటమే దీనికి ఋజువుగా భావించవచ్చు. అలాగే రుద్రమదేవి సమకాలికుడుగా జైమిని కవి కూడ వ్యాసభారతంలో లేని ప్రమీల పాత్రను సృష్టించాడని ప్రమీలచేత యుద్ధం చేయించాడని భావించవచ్చు.

కురుక్షేత్ర యుద్ధానంతరం బంధువధకు పశ్చాత్తాప పడుతున్న ధర్మరాజు పాపవిముక్తికై మార్గం చెప్పమని వ్యాసుడ్ని అడుగగా అతడు అశ్వమేధయాగం చేయమని చెప్తాడు. రాజైన యౌవనాశ్వుని దగ్గర యాగ యోగ్యమైన అశ్వముందనీ, దాన్ని తెప్పించమని చెప్పగా దానికై భీముడు, వృషకేతుడు, మేఘవర్ణుడు వెళ్ళి ఆ రాజుని జయించి ఆ అశ్వాన్ని కరిపురానికి తెస్తారు. ఆయాగ నిర్వహణ క్రమంలో భాగంగా భీమార్జునులు అశ్వాన్ని బంధించిన రాజులైన నీలధ్వజ, హంసధ్వజ, తామ్రధ్వజుల వంటి మహావీరులతో తలపడటం, కొన్ని సందర్భాలలో వారు మూర్ఛస్థితికి చేరుకొన్నా కూడా శ్రీ కృష్ణ సహాయంతో ఆ రాజుల్ని జయించటం జరిగింది. ఆ క్రమంలోనే అశ్వాన్ని పట్టిన స్త్రీమండల నాయికయైన ప్రమీలను జయించలేక అర్జునుడు ప్రమీల కోరిక మేరకు, గగన వాణి ఆమెను గెలవలేమని చెప్పటం చేతను ప్రమీలను వరించి అశ్వాన్ని తీసుకొని వెడతాడు. ఆతరువాత చిత్రాంగద కొడుకైన బభ్రువాహనునితో జరిగిన యుద్ధంలో అర్జునుడు చచ్చిపోతాడు. అప్పుడు కృష్ణుడు విష్ణురూపంలో వెళ్ళి అర్జునుడ్ని

బతికిస్తాడు. విష్ణుభక్తుడు, అజేయుడైన తామ్రధ్వజుని కృష్ణార్జునులు జయించలేక విప్రరూపంలో వెళ్ళి రాజుయొక్క శరీరమాంసాన్ని కోరుకోవటం చివరకు కృష్ణుడు తనని తాను గుర్తింప జేసుకొని అశ్వాన్ని విడిపించుకొని వెడతాడు. చివరగా కుంతలదేశానికి వెళ్ళి కృష్ణభక్తుడైన వీరవర్మరాజుతోనూ ఆతని కుమారుడైన చంద్రహాసుడితోను మిత్రత్వాన్ని నెఱపి అశ్వంతో హస్తినాపురం చేరుకోవటం జరిగింది. ఆ తర్వాత అందరి రాజుల సమక్షంలో ధర్మరాజు యాగక్రతువును పూర్తిచేయటంవంటివి 'జైమినిభారతం'లోని కథాంశాలు. 'బలవంతులు దుర్బల జాతిని బానిసలు కావించార'నే రాజుల చరిత్ర ఈ కావ్యంలో కనపడుతుంది. కాని ఈ యుద్ధాల మధ్య మెరుపుల్లాంటి భామినీ ధీరత్వంకల విలక్షణ మహిళా సంస్కృతి 'చారిత్రక ప్రభాతసంధ్యలో మానవ వికాసమనే మహిళా వికసనాన్ని ప్రతిఫలింప చేయడం ఒకవిలక్షణతగా కన్పడుతుంది. అదే ఈనాటి మహిళా ప్రగతికి నాటిస్త్రీపాత్రల విలక్షణ చైతన్యం ముడిసరుకైందనే అవగాహనకల్గి ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

జైమిని భారతంలోని స్త్రీల పరాక్రమ శక్తియుక్తులు, వారి స్వతంత్ర నిర్ణయాలు, తెగింపు, సాహసం, పట్టుదల, జీవించే హక్కును కలిగిఉండాలను కోవటం, లైంగికహక్కును వినియోగించుకోవాలను కోవటం సహగమన సంస్కృతిని నిరసిస్తూ దాన్ని అధిగమించాలను కోవటం వంటి విలక్షణ చైతన్యం సాహిత్యంలో నూతన కాంతిని ప్రసరింపజేసింది. అయితే మహిళల నూతన చైతన్య శక్తిని భరించలేని పితృస్వామ్యం వారిని 'గట్టివాయిలు'గా భావించి వారిపై అపప్రథను ప్రచారం చేయటం జరిగింది. అందుకనే పితృస్వామ్య ప్రతినిధులుగా కవులు సందర్భం లేకపోయినా పనిగట్టుకొని మరీ వ్యాసుడి పాత్ర చేత కావ్యంలో 'జార' స్త్రీల లక్షణాలను చెప్పించటం 'జైమిని భారతంలో' కన్పడుతుంది.

క్రీ.శ.15 శతాబ్దానికి చెందిన పిల్లలమర్రి పినవీరభద్రుడు సంస్కృత జైమిని భారతాన్ని తెలుగులో కథమూలానువాదం చేసి సాళువనరసింహ రాయలకు అంకితమిచ్చాడు. ఇతని పూర్వికులది ఓరుగల్లు దగ్గర పిల్లలమర్రి గ్రామం. ఆతర్వాత వారు నెల్లూరు ప్రాంతానికి వలసవెళ్ళటం, ఈ రెండు

ప్రాంతాలలో విజయం సాధించిన కాకతీయరాణి రుద్రమదేవి శక్తియుక్తులను చెప్పుకోవటం, వినటం వంటివి వారసత్వంగా వచ్చి పినవీరభద్రుడ్ని ఆశ్చర్యపరచి ఉండటం చేతనే 'జైమిని భారతాన్ని' తెలుగులోకి అనువదించి రాజు అడగటానికి ముందుగానే వ్రాసిపెట్టు కొన్నట్లుగాను అందుకే, సాళువనరసింహరాయలు

*"నామది నిరతము భారత*
*రామాయణ కథలఁబ్రేమరంజిలు నందున్*
*జైమిని భారతమనగా*
*భూమినపూర్వము పురాణముల గణియింపన్"* అని అడగగానే

మరునాడే అంకితమిచ్చినట్టుగా చెప్పబడింది. రాణిరుద్రమదేవి పరాక్రమం చారిత్రక భౌతిక వాస్తవికతయైతే సాహిత్యంలో ప్రమీల పరాక్రమం భావ చైతన్యపు దీపిక. రుద్రమదేవి ప్రభావం ఆనాటి సమాజంలోని మహిళలపై తప్పనిసరిగా ఉంటుంది. ఆప్రభావమే 'జైమిని భారతంలోని' స్త్రీల ఆలోచనలలో ప్రతిఫలించింది. రాజులభార్యలుగానో, రాకుమార్తెలుగానో, రాణిగానో, భటుని తల్లిగా, మునిభార్యగా, మంత్రి కుమార్తెగా వారి వారి పరిధిలో ఒక ప్రత్యేక చైతన్యాన్ని ప్రస్ఫుటింపజేసి భావితరాల మహిళా వికాసానికి బాటలు వేయటం జరిగింది. కాని పితృస్వామ్య సమాజ ప్రతినిధులైన కవులు మాత్రం నాటి స్త్రీల చైతన్యాన్ని పితృస్వామ్య సంస్కృతికి ఒదిగేటట్లు చేసి కావ్య రచన చేసారు.

జైమిని భారతంలోని స్త్రీపాత్రలు వీరరస చైతన్య స్ఫూర్తులు. ఉత్సాహమనే హృదయస్థిత భావాన్ని చైతన్య పరచగలిగిన స్త్రీ పాత్రలవి. వారి బౌద్ధిక స్వాతంత్రం, భౌతికపరాక్రమశక్తులు కలసి వెరసి అసమనైతిక సంస్కృతిని అధిగమించా లనుకున్న మహిళల భావచైతన్య స్వభావులుగా వీరరస ప్రేరకంగా ఉన్నాయి. కావ్యంలో రాజులు చంపటమో చావటమో వంటి అమానషత్వాన్ని ప్రదర్శిస్తే స్త్రీలు సమాజంలో స్త్రీ– పురుష సంబంధాలలోని అసమసంస్కృతిని ఎదుర్కొనే చైతన్యంతోఉంటారు. స్వతంత్ర జీవితం కావాలనుకునే వ్యక్తిగత చైతన్యంగల స్త్రీ పాత్రలు తరతరాల మహిళావికాసానికి నాందీపలుకుతూ నాటి భామినులు సాధించిన వీర విజయాలుగా జైమినీ భారతం ప్రతిఫలిస్తుంది.

ఈ కావ్యంలో స్త్రీ పాత్రల విలక్షణత ప్రారంభం కథలోనే కన్పడుతుంది. సభలో స్త్రీలు ముందుకు వచ్చి మాట్లాడటం ఇష్టపడని ఆరోజుల్లో యౌవనాశ్వుని భార్య ప్రభావతి రాజసభకువచ్చి తన భర్తను చంపకుండా వదిలిపెట్టిన వృషకేతునికి తన మంగళసూత్రాన్ని కాపాడినందుకు గాను నమస్కార రూపంలో కృతజ్ఞతలు తెలుపుతుంది. అలా తెలియచేసిన సందర్భాన్ని స్త్రీలు సంస్కార వంతులుగా ముందుకురావటాన్ని తెలియజేసే గీటురాయిగా భావించవచ్చు. సభలో వృషకేతునికి కృతజ్ఞతలు రాజు చెప్పలేదు కాని రాణి ముందుకొచ్చి తన భర్తయుద్ధంలో చనిపోకుండా బ్రతికటంచేత తన మంగళసూత్రం కాపాడ బడిందంటూ అనటంలోని అంతరార్థంగా ఆమె భర్తృవిహీనగా అతనితో పాటే సహగమనం చెయ్యాల్సిన అవసరం ఆమెకు లేకుండా తాను కొన్నాళ్ళు జీవించగల సౌభాగ్యం ఆమెకు లభించటంగా అర్థం చేసుకోవచ్చు. అంటే ఇక్కడ సహగమన సంస్కృతి గల రోజుల్లో ఆమె తనకు జీవించే హక్కుపొడిగింప బడినదానికి చెప్పిన కృతజ్ఞతలుగా అర్థం అవుతుంది.

ధర్మరాజుయాగ ప్రారంభోత్సవానికి శ్రీకృష్ణుడు వస్తాడని తెలిసి యౌవనాశ్వుడు, తనతో పాటుగా తన ప్రజలందరినీ కరిపురికి తరలించమని భటుడైన సుదేవుడ్ని ఆదేశిస్తే అతను ఇంటికివెళ్ళి తనతల్లిని కృష్ణదర్శనార్థం రమ్మంటాడు. దానికి ఆమె తన మామగారి కాలంలోగాని, భర్త ఉన్న సమయంలో గానీ ఏ ధర్మకార్యాలు చేయలేదనీ, ముసలితనంలో తనకు ఆ కృష్ణ దర్శనం అనవసరమని చెప్పుతూ

*"తండ్రితరమునఁబెనిమిటితరమునందు*<br>
*వీసమంతయుఁ బుణ్యంబుఁజేసి యెఱుఁగ*<br>
*వార్ధకంబున నాకేల వట్టితొడుసు*<br>
*కృష్ణుదర్శింపకున్న నాకేమిచిక్కు"* అని అంటుంది.

అశ్వమేధయాగాన్ని చేసి ధర్మరాజాదులు పొందే సంతోషంలాంటి సంతోషాన్ని తాను తన సంసారాన్ని నిర్వహించటంలో పొందానని చెప్పటం ఒకవిలక్షణత.

*"ఏరీతి ధర్మసుతునకు*
*శౌరికి నధ్వరముఁజేయసంతసమగు నా*
*కారీతిన తప్పదు సం*
*సారము నేయునెడనిదినిజంబు కుమారా"* అని అంటుంది.

ఇక్కడ పురుషులు చేసేవి ధర్మక్రతువులైతే స్త్రీలు కర్మ ప్రధానమైన సంసార యజ్ఞాన్ని చేయటాన్ని ఒకగొప్ప బాధ్యతగా ఆత్మ విశ్వాసంతో దాన్ని భావించటంగా అర్థం అవుతుంది. అందుకే స్త్రీల ఇంటిచాకరి విలువైనదనీ, దానికి ఆర్థిక విలువల్ని నిర్ణయించమనటం నేటి భావన భక్తి భావం కంటె కర్మయోగమే గొప్పదని ఆమె అపరగీతను చెప్పినట్లుగా అనిపిస్తుంది. అటువంటి మాతృమూర్తిని ఆ భటుడు అందరి దగ్గర చెప్పి పరిహసిస్తూ రానన్నా ఆమెను బలవంతంగా బండిక్కెంచి బంధించి కరిపురికి తీసుకెళ్ళ మనటం పితృస్వామ్యపు అమానుష దౌర్జన్యానికి చిహ్నంగా భావించాలి.

యాగాశ్వాన్ని బంధించిన నీలధ్వజుడనే రాజుని గురించిన ఉపాఖ్యానంలో నీలధ్వజుని భార్యయైన 'జ్వాల' అను ఆమె స్వాభిమాని, రాజనీతిజ్ఞురాలు. అర్జునుని చేతిలో ఓడిపోయి తిరిగివచ్చిన భర్తను యుద్ధంలో వెన్నుచూపి రావటం రాజనీతి లక్షణమా అని ప్రశ్నించి,

*"పట్టినకార్యమీశ్వరుడ పట్టిపెనంగినఁజేరనీక చే*
*పట్టుట రాజధర్మమని పల్కెడు నీతిఁదొలంగి కీర్తికిం*
*బట్టగు సాహసంబు నిజబాహుబలంబును వీటిఁబుచ్చియా*
*పట్టిన వాహమున్ దిరుగ బంపిన నవ్వరె తోడి భూపతులెల్లరున్"* అంటుంది.

వీరుడికి విజయమో వీరమరణమో ఉండాలని చెప్పిన 'ధీర'. భర్త వీరుడు కాక పోతే నల్గురిలో నవ్వుబాటు అని అంటుంది. భర్త యుద్ధంలో చనిపోతే తనకు సహగమనం అనివార్యం అని తెలిసినా వీరత్వానికే ప్రాధాన్యత నిస్తుంది. తన భర్తను ఓడించిన అర్జునునిపై పగ తీర్చుకోవాలని భావించి తన సోదరుడైన కాశీరాజు దగ్గరకు వెళ్ళి అర్జునుని చంపమని అడుగగా, ఆతడు తన రాజ్యానికి

అర్జునుడు వచ్చినప్పుడు చంపుతానంటాడు. సోదరుడు కాలయాపన చేస్తున్నాడని ప్రశ్నించే సరికి అతడు జ్వాలను 'మెట్టినింటి వారిని పుట్టింటి వారిని కష్ట పెడుతున్నావని' నిందిస్తాడు. దానికి కోపమెచ్చి వెనుతిరిగి వస్తూ ఆమె పడవలో గంగా తీరందాటేటప్పుడు గంగనీళ్ళు కాళ్ళకు తగులుతాయి. గంగతో "నీ కొడుకైన భీష్ముని చంపిన అర్జునుని చంపకుండా వదిలి పెట్టిన నీవు పాపాత్మురాలివని నీ నీళ్ళుతగలటంతో ఆ పాపం నాకు అంటుతుందని" అంటూ గంగను నిందిస్తుంది. అందరూ గంగను పాప కలుష హారిణిగా స్తుతిస్తే ఈమె గంగను పాపాత్మురాలివని నిందించటం భిన్నత్వపు విలక్షణం. అప్పుడు గంగ ఆరునెలలలో అర్జునుని శిరస్సు తెగిపడ్తుందని శపించే స్థాయికి జ్వాల వీరత్వపు ప్రేరణ స్పష్టమవుతుంది. స్త్రీలకు యుద్ధవిద్యలు నేర్పించినట్లయితే స్వయంగా ఈమె అర్జునుని చంపి ఉండేదని అనిపించక మానదు. యుద్ధం చేయలేక పోయినా జ్వాల తనని తాను ఆత్మాహుతి చేసుకొని యుద్ధపరికరమైన 'బాణం'గా తయారయిందంటే పితృస్వామ్యసంస్కృతిపై ఎక్కు పెట్టేందుకే ఆమె ఆగ్నేయాస్త్రంగా మారిందని అనిపిస్తుంది. తరతరాల స్త్రీల ఆలోచనల కంటె భిన్నమైన ధీరత్వపు ఆలోచనలు కలిగియుండటమే ఈమె విలక్షణత. ఈమె ప్రతీకారకాంక్ష ఫలితమైన గంగశాపంవల్ల బభ్రువాహనుడి బాణాలవల్ల అర్జునుని శిరస్సు తెగిపడి అర్జునుడు మరణించటం భావికథలో అర్థంఅవుతుంది. కావ్యరచనాకాలం నాటి చారిత్రిక వ్యక్తి యైన ఖడ్గతిక్కన్న భార్య చానమ్మకు ప్రతీక ఈ జ్వాల పాత్ర.

నీలధ్వజుడు-జ్వాలల కూతురు స్వాహాదేవి. పితృస్వామ్య సంస్కృతిని అధిగమించే చైతన్యంగల స్త్రీ. అర్జునునితో యుద్ధానికి మునుపే తండ్రి నీలధ్వజుడు రాజకుమారుల చిత్రాలను చూపి తగిన వరుడ్ని ఎన్నుకోమంటే ఆ రాజులను నిరాకరిస్తుంది. రాజులు కూడా మానవులేనని, మానవులందరూ గర్వాంధులు, మోహమతులు, మోసకారులు అని మానవజాతి మీద తన అపనమ్మకాన్ని వ్యక్తీకరిస్తుంది. అయితే ఐశ్వర్యంకల ఇంద్రుడికిచ్చి పెళ్ళి చేస్తానంటే ఇంద్రుడి గురించి ఆమె విమర్శిస్తూ "ఆతడు కొండలను పడగొట్టినవాడు, జారుడు, తపోవిఘ్నకారి, దేవుడిగా భావించే కృష్ణుడ్ని అహంకారంతో తనతమ్ముడిగా

భావించే కృతఘ్నుడని" చెప్పి ఇంద్రుడ్ని పెళ్ళి చేసుకోనంటుంది. అన్నింటినీ పవిత్రం చేసేవాడు, పూజ్యుడును 'అగ్ని ముఖా వై దేవా' అని వేదాలలో చెప్పబడ్డ అగ్నిని చేసుకుంటానంటుంది. "పతి పరోక్షంబు నందు దద్భార్య తన శరీరమా హుతిగా విసర్జించెనేని వారి దురితంబులడంచి కైవల్య మొసంగు వహ్ని బోలంగ నొండు దైవంబుగలదె" అని అంటుంది. మిగిలిన యక్ష కిన్నెరకింపురుషల వంటి దేవతావర్గం మీద తనకు మనసు లేదంటుంది. చెలికత్తెలు నవ్వుతూ 'అగ్ని' ముఖం ఎప్పుడు నిప్పులురాల్చుతూ ఉంటుందని, అన్నింటిని తింటాడనీ మలినవర్తనుడని, ముసలివాడనీ ఏడ్పించినా వినకుండా అగ్నిని పూజించి ప్రసన్నం చేసుకుంటుంది. ఆ తర్వాత అగ్ని స్వాహాను పెళ్ళి చేసుకొని, ఆమె తండ్రికి యుద్ధంలో రక్షణగా ఉన్నాడు.

స్వాహాదేవి సాధారణ కన్యలాగా ఐశ్వర్యవంతుడును, రూపసినీ, యవ్వనుడ్నీ చేసుకోవాలనుకోలేదు. అందరూ కాలుస్తాడని భయపడే అగ్నినే తన జీవితంలోకి ఆహ్వానించాలను కోవటం తనపెళ్ళి విషయంలో ప్రలోభాలకు లొంగక స్వతంత్ర నిర్ణయిం చేసుకోవటంలో విలక్షణత కన్పిస్తుంది. అయితే ఆమె మాటల్లోని 'సహగమనాన్ని' ఆలోచిస్తే రాజులెలాగు యుద్ధాలలో మరణిస్తారని, ఆ తర్వాత రాణులు సహగమనానికి బలిఅయ్యి అగ్నిలోపడటమే కాబట్టి సూటిగా అగ్నినే భర్తగా పొందుతే ఆ గొడవవుండదనే భావం కూడా ఆమె మాటలలో స్ఫురించక మానదు. ఈమె పురాణాలలోని దక్షుని కూతురైన స్వాహాదేవి కాదు. ఈమె అగ్నిదేవుడ్ని కోరుకొన్న జైమినికవి సృష్టించిన మరో 'స్వాహాదేవి'. ఇక్కడ స్వాహాదేవి 'సహగమనమనే' పితృస్వామ్య సంస్కృతిని అధిగమించే విలక్షణ చైతన్యం గల స్త్రీగా భావింపబడుతుంది.

విప్రవర్మ అనేరాజు కూతురు 'సుమాలినీ' అనే ఆమెకూడా రాజకుమారులను వద్దని యముడ్ని పెళ్ళిచేసుకుంటానంటూ "అందర్నీ అంతం చేసేవాడు కాబట్టి అతడ్నే చేసుకుంటానం"టూ ఒక విలక్షణతను చూపిస్తుంది. అందరూ యముడంటే భయపడతారు. ఈమె భయపడకపోవటమే విలక్షణత. సతీ సహగమనమనే పితృస్వామ్యాన్ని నిరసించే విలక్షణ చైతన్యం ఈమెది. అందుకే

*"జనులకునెల్ల చావు సహజంబునరున్ వరియించి వానితో*
*ననుగమనం బొనర్చి తుదినంతకు చేబడి పుణ్యపాపసం*
*జనిత ఫలంబులంది బహుజన్మములంబడుకంటె కాలునిం*
*బెనిమిటిగా వరింతునది మిక్కిలి ధర్మమునాకు నావుడున్"*

అంటూ యముడ్నే పెళ్ళి చేసుకుంటే ఆ అవసరం ఉండదని భావిస్తుంది. ఇక్కడకూడా ఆమె మాటలోకూడా సహగమనాన్ని గురించిన ఆలోచనయే. యముడ్ని పెళ్ళి చేసుకుంటే ఆ అవసరం ఉండదని భావించింది. యముడి కంటె భయంకరమైనది సహగమన సంస్కృతిఅనీ భావించటమంటే ఈమెది కూడా సహగమన–సంస్కృతిని అధిగమించే విలక్షణ చైతన్యమని అర్థం అవుతుంది. ఈమె కూడా పురాణాలలో చెప్పబడిన యముని భార్యలలో ఒకామె కాదు. ఈ సుమాలిని అనే ఆమె జైమిని చేత సృష్టింప బడిన పాత్ర. పెళ్ళిని గురించిన ప్రస్తావన రాగానే ఈ స్త్రీలకు ముందుగా గుర్తుకు వచ్చేది 'సహగమన సంస్కృతి'. అది వారియొక్క జీవనహక్కును కబళిస్తుందనే భావనకలిగిన స్త్రీలుగా, అందర్ని కాల్చేవాడైన అగ్నిని ఒకామె భర్తగా ఎంచుకొంటే, మరొక స్త్రీ అందర్నీ అంతంచేసే యముడ్ని పెళ్ళిచేసుకొంటానని చెప్పటంలోని అంతార్థంగా 'ఏ చావు అయిన ఒకటేనే భావన అర్థం అవుతుంది. పితృస్వామ్య సమాజం నిర్ణయించిన సతీసహగమన సంస్కృతిని మాత్రం అధగమించటం కోసం విభిన్నమైన దారిని చూసుకొన్న చైతన్యం కలిగిన స్త్రీ పాత్రల విలక్షణత అర్థం అవుతుంది. రాజ్య సంస్కృతి లో భాగమై నిరంతర యుద్ధాలతోపాటు రాజ్యంలో ఉన్న సతిసహగమన సంస్కృతి రాజకుమార్తెల దృష్టిలో పెళ్ళిపీటలు అంటే వధ్యశిలగా భావించేటట్టు చేసి చావుకి పరమపదమైన అగ్నిని, యముడ్ని ముందుగానే వారు ఆహ్వానించేటట్లు చేసిందని అర్థం అవుతుంది.

అశ్వాన్ని వెదుక్కుంటూ వెళ్ళిన అర్జునునికి సౌబరి మహర్షి ఆశ్రమం దగ్గర ఒకరాయికి అశ్వం అంటుకు పోయి కనబడుతుంది. దానికి కారణంగా సౌబరిముని అర్జునునికి రాయియొక్క చరిత్రకు సంబంధించినదిగా 'ఉద్దాలకుడనే' ముని కథ చెబుతాడు. వ్యాసభారతంలో ఉన్న ఉద్దాలకునికి ఈ ఉద్దాలకునికి

పోలికే ఉండదు. జైమిని భారతంలోని ఉద్దాలకుడి భార్యచండిక. ఈ చండిక పాత్ర కూడ జైమిని కవి యొక్క నూతన సృష్టి. ఉద్దాలకుడు చండికయొక్క "బాల్యం నుంచి ఆమె తనకు తెలుసుననీ, ఏ ఒక్కరోజు మృదువుగా, మాట్లాడదనీ పరుషంగా మాట్లాడుతుందనీ" అందరికీ చెప్పుకుంటూ బాధపడ్తాడు. ఉద్దాలకుడు చెప్పినపనిని తద్భిన్నంగా చేయటం ఆమె ప్రవృత్తిగా మారింది.

*"బాల్యమున నుండి యౌవనప్రాయమైన*
*యప్పుడు తనభార్యయందు నయమొకింత*
*గానదయ్యెను వేము వెగ్గలమెరుగ*
*గలదె మాధుర్యగుణము తిక్తంబగాక"* అంటూ

ఉద్దాలకుడు తన ఇంటికి వచ్చిన కౌండిన్యుడుకి తన బాధను వెళ్ళబోసుకుంటే 'అగ్నిసాక్షిగా పెళ్ళాడిన భార్యను విడిచి పెట్టకూడదనీ' చెప్పి ఉద్దాలకుడితో "ఆమె చెడ్డపని చేయమని చెప్తే మంచిపనిగా చేస్తుంది కాబట్టి అన్ని పనులు వ్యతిరేకంగా చెప్పమంటాడు." ఉద్దాలకుడు అన్ని విషయాలలో ఆతని సలహా ప్రకారం చేస్తూ, పితృకర్మ రోజు మరిచిపోయి 'పిండాలను గంగోదకంలో కలుపు' అని చెబితే ఆమె పెంటపై పారవేస్తుంది. దానికి కోపించి ఉద్దాలకుడు ఆమెను రాయివి కమ్మని శపిస్తాడు. ఆమె భయపడుతుంటే యాగాశ్వానికై అర్జునుడు వచ్చి రాయిని తాకినప్పుడు ఆమెకు శాపవిమోచనం కలుగుతుందని చెబుతాడు.

ఆనాటినుండే భర్తలందరూ భార్యలలో ఈ చండికను చూసుకోవటం రివాజుగా మారింది. నిజానికి చండిక యొక్క నేపథ్య సంస్కృతిని ఆలోచిస్తే ఆమె భిన్నంగా, వ్యతిరేకంగా ప్రవర్తించటానికి గల కారణం అర్థంఅవుతుంది. ఆమెలోని అసంతృప్తి ఆమెను అలా ప్రవర్తింపజేస్తుందని భావించాలి. మునికి బాల్యం నుండి చండిక తెలుసంటే అమెది బాల్య వివాహమనీ, ఏ భోగజీవితం లేకుండా పెద్ద వాడైన మునికి సపర్యలు చేస్తూ గడపటం ఆమెలోని యవ్వనంపై నీళ్ళు చల్లటం వంటిదనీ, తత్ఫలితంగా ఆమె తన పరిస్థితికి బాధపడి

నిస్సహాయస్థితిలో ప్రతిఘటించి సంచరించే వ్యతిరేక ప్రవృత్తిని పెంచుకొని ఉంటుందని భావించవచ్చు. 'రాయివి కమ్మని' ఆమెను శపించగల శక్తిగల ఆ మహర్షి ఆమె మనస్తత్వానికి కారణం తెలుసుకొని చక్కదిద్దుకోలేకపోవటం అతని జ్ఞానశూన్యతగా భావించాలి. సంస్కృత జైమినిభారతంలో ఆమె శాపవిమోచనానంతరం ఉద్దాలకుడు చండికతో సంసారం చేసినట్లుగా ఉంటే, తెలుగులో పినవీరభద్రుడు మాత్రం శాపవిమోచనం తర్వాత ఉద్దాలకుడు చండికతో సంసారాన్ని అసహ్యించుకొని సన్యసించినట్లుగా కథను ముగిస్తాడు. పితృస్వామ్యం పరాకాష్ఠదశకు చేరిన మధ్యయుగాలలోని తెలుగుకవిగా ఆమె భర్తకు శాపానంతరం ఆమె మనస్తత్వం మారిందేమో అనే ఆలోచనకూడ రానీయకుండా భార్యను సన్యసింపచేసేటట్లు చేయటం పితృస్వామ్య సంస్కృతీ పరిరక్షణే పినవీర భద్ర కవి ధ్యేయంగా భావించవచ్చు. అంతేకాదు భర్త మాట వినకపోతే భార్యలకు చండికగతే పడుతుందనే హెచ్చరికగా ఈ కథ జైమిని చేత సృష్టింపబడి ప్రజలలో ప్రచారం చేయబడింది కాబట్టి నేటికీ జైమిని భారతం అనే గ్రంథం తెలియక పోయినా ఈ చండిక మాత్రం తెలుస్తుంది.

యాగాశ్వాన్ని బంధించిన మరొకరాజు హంసధ్వజుడు. అతడు అర్జునునితో యుద్ధానికి సిద్ధమవుతూ యుద్ధం చేయటానికి వెంటనే అందరినీ రమ్మనమని చెబుతాడు. అలా అత్యవసర పరిస్థితిలో యుద్ధానికి రాని వారిని కాగే నూనెలో వేసే శిక్ష అమలులో ఉండేది. ఆ వేళ రాజకుమారుడైన సుధన్వుడు యుద్ధానికి బయలు దేరుతూ చెప్పటానికి భార్యయైన ప్రభావతి దగ్గరకు వస్తాడు. ప్రభావతికి అప్పటికి సంతానం లేదేమో గానీ భర్త యుద్ధానికి వెడితే తిరిగి బ్రతికివస్తాడో రాడోనని భావించిన ఆమె తన భర్తతో సంగమ కోర్కెను తెలియజేస్తుంది. అతడది సమయం కాదంటే,

> *"అనవుడు నేటితోడ వదియాఱుదినంబులు నిండె ముందటన్*
> *దినములు లేవు పైతృకతిథిన్ ఋతుదానముసేయఁబెల్లు యా*
> *మిని కడజామునఁవిను సమీకము చేసెదనంచునిట్లు పో*
> *వనుటుచితంబౌనె నీవెఱుంగవా నిగమార్థ రహస్యధర్మముల్"*

ఆమె తనకు ఋతుకాలమనీ, ఋతుకాలధర్మము ప్రకారం సంసారం చెయ్యాలని ధర్మశాస్త్రాలు చెప్పిన విషయాన్ని గుర్తుచేస్తూ ప్రశ్నిస్తుంది. అతడు యుద్ధానికి వెళ్ళకపోతే కాగే నూనెలో పడేస్తారనీ, ఒకవేళ వెడితే ఆమె అండంపిండంగా మారే అవకాశం ఇవ్వనందుకు భ్రూణహత్యగా యముడు భావించే అవకాశం ఉందని మథన పడుతూ మదనవేదనతో ఉన్న భర్తను ఆమె లైంగిక చేష్టలతో ప్రేరేపించేసరికి రాజసుతుడు ఆమెను ఋతుకాలంలో సంగమించటం జరిగింది. ఇక్కడ ప్రభావతి యొక్క స్త్రీ పరమైన 'లైంగికత'లో భాగంగా ఆమె సంగమకోరిక పితృస్వామ్య లైంగిక సంస్కృతికి భిన్నంగా కన్పిస్తుంది. అసభ్యత అని భావించకూడదు. ఆమె తన లైంగికహక్కును వినియోగించుకోవాలని అనుకోవటంలోని అంతరార్థం గ్రహిస్తే ఆమె తన జీవించేహక్కును కొనసాగించుకునే ప్రయత్నంగా అర్థం అవుతుంది. భర్త యుద్ధంలో మరణిస్తే సహగమనం తప్పదు. అదే భార్య గర్భవతి అయితే ఆ సహగమనం నుండి మినహాయింపు ఉంటుంది. అందుకని తాను ఋతుకాలంలో భర్తను కలిసి గర్భవతి కావాలనుకుంటుంది. ఆ రకంగా చావునుండి తనను తాను రక్షించుకునే ఉపాయం ఆమెకు తట్టిఉంటుంది. దానికై ఆమె తన లైంగికహక్కును వినియోగించు కోవాలనుకునే చైతన్యమే కావ్యానికొక విలక్షణతను కల్గించింది.

నేటికీ సమాజంలో సతీసహగమనాలు తప్పని పరిస్థితిగా కొన్ని చోట్ల జరుగుతున్నాయి. కానీ ఆనాడే ఆ సంస్కృతిని ఎదిరించటానికి తన పరిధిలో తనకు తోచిన ఉపాయంతో ప్రభావతి ఆ సంస్కృతికి బలికాకుండా తనను తాను రక్షించు కోవాలనుకుంది. పితృస్వామ్య సంస్కృతిని అధగమించే చైతన్యం తెచ్చుకోవటమే ప్రభావతి పాత్ర యొక్క ధీరత్వం. అందుకే జైమినీ కవి మూల అశ్వమేధపరవంలో/జైమినీ భారతంలో భర్త మరణానంతరం ప్రభావతి గర్భవతియైనదని ఉంది. కాని తెలుగు కవి భర్త మరణానంతరం గర్భవతిగా ఆమె జీవించటం యిష్టంలేక ఆ తర్వాత విషయాన్ని వ్రాయకుండా వదలిపెట్టటం, కవియొక్క పితృస్వామ్య పరిరక్షణ ధ్యేయం మరోసారి నిరూపింపబడుతుంది.

వ్యాసభారతంలో యుద్ధాలలో విజయుడిగా భావించబడ్డ అర్జునుడు జైమినీ భారతంలో ఒక మహిళను గెలవలేక పోవటం ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది.

యాగాశ్వాన్ని బంధించిన ప్రమీల భామినీ పరాక్రమశక్తికి ప్రతీక. పురుషులను మించిన పరాక్రమం కల వీరనాయికా వైలక్షణ్యం ఈమెలో నిండుగా ఉంది. వ్యాస నన్నయ భారతాలలో ప్రమీల పాత్రలేదు. జైమిని కవి తన అశ్వమేథ పర్వమనే భారతంలో ఈ పాత్రను సృష్టించటానికి సమకాలీన రాణియైన రుద్రమదేవి పరాక్రమ శక్తిని స్ఫూర్తిగా తీసుకొని ఉండవచ్చు. భారతదేశచరిత్రలో రుద్రమదేవిని రాజులు జయించలేక వెన్నుపోటుతో ఆమెను అక్రమంగా చంపుతారు. సాహిత్యంలో మాత్రం పితృస్వామ్య సంస్కృతిని అడ్డం పెట్టుకొని అర్జునుడు ఆమె 'లైంగికతను' గెలిచినట్లుగా అర్థంఅవుతుంది. మహిళా శక్తియుక్తులను సహించలేని పితృస్వామ్య సంస్కృతి వారి శీలవిషయంలో అపప్రథను పుట్టించటం నేటికీ జరుగుతున్న చరిత్ర. మరి ఆనాడే యుద్ధవిద్యలో ఆరితేరిన స్త్రీని పితృస్వామ్యం సహించదు. ఆమెను రాణిగా అంగీకరించదు. అందుకని జైమిని కవి ప్రమీలను స్త్రీమండలానికి నాయిక అనీ, ఆమె దగ్గర ఉన్న సైన్యమంతా స్త్రీలేనని వర్ణిస్తాడు. రాజపురుషలెవ్వరూ ఆమెను యుద్ధంలో ఓడించలేకపోతారు. అందుకనే ఆమెమీద ఆమె సైన్యం మీద అపప్రథను ప్రజలు ప్రచారం చేయటం జరిగింది. స్త్రీమండలంలో స్త్రీలందరూ కామపిశాచినులుగా పురుషులను లైంగికంగా లొంగదీసుకుంటారనీ, వారితో గడిపిన పురుషులు నెలరోజుల్లో ధాతుక్షయంతో మరణిస్తారనీ ప్రచారంచేయటం జరిగినది. అయితే ఆ స్త్రీలు కూడా వారితోపాటు మరణిస్తారనీ, ఒకవేళ ఏ స్త్రీ ఐనా గర్భవతి అయితే సహగమనం చేయరనీ, అయితే వారికి ఆడపిల్లలే పుడతారనీ, మగపిల్లలు పుట్టరనీ చెప్తారు. ఆ అపప్రథకు వెరచి పురుషులెవరూ వెళ్ళరని భావిస్తారు. ఆరకంగా ఆమెతో పురుషపుంగవులు యుద్ధం చేసి ఓడిపోకుండా తప్పించు కోవటానికి పుట్టించిన పుక్కిటి పురాణం అని కథాంతం తెలియజేస్తుంది.

అర్జునుడు ప్రమీలతో హోరా హోరిగా యుద్ధం చేసినా ఆమెను గెలవలేక పోతాడు. ఆ సందర్భంలో ప్రతాపంతో ఉన్న ప్రమీల అర్జునునితో యాగాశ్వాన్ని తీసుకువెళ్ళాలంటే

*"కనుగొని నన్ను నాహవముఖంబున మార్కొని నిల్వనీకకా*
*దనిమిష సిద్ధ సాధ్యులకునైన నసాధ్యము కార్యకాంక్షనె*
*మ్మనమునఁ గల్గెనేని దురభిమానము మాని ప్రియంబెలర్పన*
*న్నెనసిన వేడ్కతోడ వరియింపుహయంబుఁబరిత్యజించెదన్"* అని మరియు

*"సోమపానంబునీయగ్రజుండొనర్చి*
*యిష్టఫల భోగముల బొందనిమ్ము నీవు*
*నిట మదీయాధరామృతం బెలమిగ్రోలి*
*యువతి మండలమున కెల్లనొడయుఁడగుము"* అని అనగా

అర్జునుడు "వనితా! నినున్వరియించిన నవశ్యము జచ్చునరుండు చచ్చియమ్మనుజుడధో గతిన్ యువతి మండలి మే గతి నేలు" అని అంటాడు. దానికి ప్రమీల

*"రణమున నాదు భీకర శరంబులనైన లసత్కటక్షవీ*
*క్షణములనైన నిన్నిపుడ చంపుట తప్పదు రిత్తచావగా*
*రణమదియేలనన్ను రతిరాజసుఖంబులఁదేల్చి తీఱినన్*
*గణనకు నెక్కఁబావకముఖంబున నీబడి నేగుదెంచెదన్"*

అని భీకరశరాలతో నైనా, కటాక్ష వీక్షణాలతో నైనా నిన్ను చంపక తప్పదని చెప్పి వ్యర్థంగా చావటం ఎందుకనీ, బావకముఖంబున నీబడి నేగుఁ 'దెంచెదన్' అని పితృస్వామ్యానికి యిష్టమైన సహగమన సంస్కృతిని తాయిలంగా చెపుతుంది. ప్రమీల యుద్ధాన్ని కొనసాగించి అర్జునుని మీద పైచేయిగా ఉంటుంది. అర్జునుడు ఆమెను చంపాలని తీవ్రబాణాన్ని వెయ్యాలనుకున్న సమయంలో గగనవాణి అర్జునునితో "పదివేలేడులు పోరిన తుది నెప్పుడు గెల్పు నీకు దుర్లభ మిప్పుడీ సుదతి వరియించి హయమును గదిలింపుము" అని అంటుంది. అర్జునుడప్పుడు ఆమెను వరించి తన హయాన్ని తీసుకొని వెడతాడు. అంటే ఆమెకోరిక తీర్చాడు. మరి కోరిక తీర్చిన తరువాత అర్జునుడు చచ్చి పోలేదంటేనే స్త్రీ మండల విషయంలోని ప్రచారం ఒక అపప్రథ అని అర్థం అవుతుంది. కోరికతో

యిష్టపడటమే పెళ్ళి కింద భావించటం, దానితో సహగమన సమ్మతిని జతచేయటం కూడా విలక్షణమే.

ప్రమీల అర్జునునితో యుద్ధానికి ముందు ఆమెను వరించమని అడగలేదు. అర్జునుడు యుద్ధం చేసినా ఆమెను గెలవ లేని సందర్భంలో ఆమె అన్నదంటే పితృస్వామ్య సంస్కృతిని సవాల్ చేయటంలాంటిదే అవుతుంది. శృంగారవీరుడిగా గణనకెక్కితే పితృస్వామ్యానికి యిష్టమైన సంస్కృతిలో భాగంగా నీతోపాటు సహగమనం చేస్తానంటుంది. ఇక్కడ స్త్రీని "అతడు వీరత్వంలో గెలివలేడనీ, 'స్త్రీలలైంగికత్వంలో భాగంగా స్త్రీల బతుకుపై అధికారాన్నిచ్చిన సతీసహగమన సంస్కృతితో మాత్రమే ఆమెను గెలవగలడనీ ఆమెమాటల్లోని వ్యంగ్యంగా అర్థం అవుతుంది. అంతటా స్త్రీల శక్తియుక్తులను చంపేటట్టు చేసేదే ఈసహగమన సంస్కృతి' అని పరోక్షంగా ఆ సంస్కృతిని విమర్శించటంగా అర్థం అవుతుంది. ఆ వ్యంగ్య విమర్శకు నిదర్శనంగానే అర్జునుడు ప్రమీలను వరించి అశ్వాన్ని తీసుకొని వెళ్ళిన తర్వాత అతడు చావడు ఆమె సహగమనం చేయదు. అంటేనే స్త్రీమండలాన్ని గురించిన ప్రచారం అపప్రథ అని నిరూపింపబడుతుంది.

పురుషుడు స్త్రీకంటె తాను ఉన్నతుడు కాలేక పోయినప్పుడు ఆమెను లైంగికంగా అధిగమించాలను కుంటాడు. అటువంటి పురుషప్రవృత్తికి ప్రమీల సవాల్ విసిరింది. ఇక్కడ ఒక స్త్రీ అధికారిణిగా అర్జునుడ్ని రాజును చేస్తానని అనటం మరొక విలక్షణత. పితృస్వామ్య సంస్కృతిపురుషుడ్ని గొప్పవాడిగా భావించేటట్టు చేస్తే ప్రమీల తద్భిన్నంగా స్త్రీలే గొప్పవారని నిరూపిస్తుంది. అంతేగాదు స్త్రీలు లైంగిక హక్కును వినియోగించు కోవాలను కోవటం పితృస్వామ్యానికి గొడ్డలిపెట్టువంటి విషయం. శారీరకంగా పరాక్రమం, శక్తియుక్తులు అధికంగా ఉండి, లైంగిక హక్కును వినియోగించు కోవాలనుకునే ప్రమీల మనో చైతన్యం, సాధారణ స్త్రీల ఆలోచనలకంటె భిన్నమై పితృస్వామ్య సమాజంలో విలక్షణంగా కన్పడుతుంది. స్త్రీలను గెలవ లేక వారి మీద అపప్రథ భావాలను ప్రచారం చేయుటంలో శాస్త్రీయతలేకపోతే ఆ అపప్రథ అసత్యమని దానంతటదే నిరూపింపబడుతుంది. ప్రమీలను వరించిన అర్జునుడు చనిపోలే

దంటేనే ఆ స్త్రీలను వరించినవారు చనిపోరని నిరూపింపబడి, చనిపోతారనేది ఒక అపప్రథ అని అర్థంఅవుతుంది. అంటే పెళ్ళి చేసుకోక పోయినా ఆ స్త్రీలను పొందిన పురుషులు ధాతుక్షయంతో నెలరోజుల లోపల చచ్చిపోతే ఆస్త్రీలందరూ సహగమనంచేస్తారని చెప్పటం హాస్యాస్పదం. ఆ అపప్రథ ప్రచారసమయంలోనూ కవి సహగమనాన్ని మరచిపోక పోవటం మహిళల దురదృష్టం. అది ఎంతటి పరాక్రమవంతులైన స్త్రీలైనా భార్యలు కాకపోయినా సహగమనం చెయ్యాలనే పితృస్వామ్యపు భావజాలం అసహ్యాన్ని కలిగించక మానదు. గర్భవతులైతే అందరూ ఆడపిల్లలే పుడతారనటం అశాస్త్రీయత, లేదా ఆ పురుషుల్లోని 'వై' క్రోమోజోం బలహీనమైనదా అనే సందేహానికి ఆస్కారమవుతుంది. కేవలం రుద్రమదేవి కాలంలో స్త్రీల పరాక్రమ శక్తులు విజృంభిస్తాయనే భయంతో వారిని అణచి వేయటానికి పితృస్వామ్యం పన్నిన పన్నాగంగా భావించాల్సి ఉంటుంది.

ఆనాటి కాలంలోనే జీవించియున్న సమ్మక్క సారక్క అనే గిరజన యువతులు యుద్ధంలో పాల్గొన్న విషయం చారిత్రిక సత్యం. కవులు రాజులతో పాటు యుద్ధాలకు వెళ్ళి సాయంకాలంలో సాహిత్య గోష్ఠి చేయటం సామాన్యంగా జరిగేది. అలాగే మహారాష్ట్ర కవి అయిన జైమిని కూడ రుద్రమదేవి రాష్ట్ర కూటులను మహారాష్ట్ర వరకు తరిమి కొట్టిన వైనాన్ని, వినటం, కనటం చేతగానీ ఆమె పరాక్రమశక్తిని ప్రశంసించకుండా ఉండలేక ప్రమీల పాత్రలో ప్రక్షిప్తం చేసిఉంటాడని భావించవచ్చు. లేకపోతే పితృస్వామ్యంలో అటువంటి స్త్రీ పాత్ర సృష్టింప బడటం భావాతీతమైనది. కాని పితృస్వామ్య రాజ్య సంస్కృతిని కాపాడే ప్రతినిధిగా కవి స్త్రీశక్తి 'లైంగికత' ముందు బలాదూర్ అని చెప్పి సంతృప్తి చెందటంగా అర్థం అవుతుంది. కాని ప్రమీల లైంగికతలో కూడా విజయం సాధించటంగానే అర్థం అవుతుంది. అన్ని చోట్ల కృష్ణుడు వచ్చి అర్జునుని కాపాడాడు కాని ప్రమీల విషయంలో అర్జునుడ్ని శ్రీ కృష్ణుడు వచ్చి కాపాడలేక పోవటమే స్త్రీశక్తి గొప్పదనే భావం కల్గుతుంది.

అశ్వాన్ని బంధించిన తామ్రధ్వజుని కథలో తామ్రధ్వజుని జయించలేని కృష్ణార్జునులు, విప్రరూపంలో వెళ్ళి తన సుతుడ్ని సింహం బారి నుండి కాపాడు

కోవటానికి, సింహం అడిగినట్లుగా రాజు యొక్క మాంసాన్ని ఇమ్మని ఒక కోరిక కోరుతారు. ఆసందర్భంలో అతని భార్య అయిన కుముద్వతి తనమాంసాన్ని ఇస్తానంటుంది. కృష్ణుడు ఆశరీరమాంసం పనికిరాదనిచెప్పి స్వయంగా రాజు యొక్క మాంసాన్ని భార్య, కొడుకులు కోసి యివ్వాలంటే కొడుకు భయపడ్డా ఆమె మాత్రం ఱంపంతెచ్చి కోస్తూ భర్త శరీరం నెత్తురోడుతున్నా భయపడకుండా ఉంటుంది. ఆ తర్వాత కృష్ణుడు తనరూపం చూపించటం. అశ్వాన్ని తీసుకోవటం జరుగుతుంది. ఈ కథలో కుముద్వతి సాహసి. తెగింపుకల స్త్రీగా విలక్షణంగా అనిపిస్తుంది. స్త్రీలంటే సుకుమార సున్నితమనుస్కులని శ్మశానాలదగ్గరకు రాకూడదనే సంస్కృతి పెట్టిన పితృస్వామ్యంలో, స్త్రీ దేనికీ భయపడదని కుముద్వతిపాత్ర ద్వారా నిరూపింపబడటమే ఒక విలక్షణత.

స్త్రీ తాను కోరుకున్న దానిని ఉపాయంతో సాధించుకోగలుగుతుందని తెలియజేసే కథ చంద్రహాస వృత్తాంతం. రాజకుమారుడైన చంద్రహాసుని చూసి యిష్టపడ్డ మంత్రి కూతురు 'విషయి' అనుపేరుగల స్త్రీ. అయితే ఆమె తండ్రి ఈరాజ్యానికి వారసుడిగా చంద్రహాసుడు మిగలకూడదని భావించి కుంతల దేశంలో పెరిగిన చంద్రహాసుడ్ని కేరళ రాజ్యంలోని కొడుకు దగ్గరకుపంపిస్తూ లేఖలో చంద్రహాసుడికి 'విషమునిచ్చి' చంపమని వ్రాస్తాడు. కాని సరోవరం దగ్గర సేదతీరుతున్న చంద్రహాసుడి దగ్గరున్న ఉత్తరం చదవిన విషయి

*'విషమాస్త్ర సూనునకు*
*న్విషమొసగన్ వ్రాసెఁదండ్రి నిర్దయుండనియ*
*వ్విషమాక్షర పంక్తి దుడిచి*
*విషయ నొసగుమనుచు వ్రాసి వేడుకతోడన్'*

'విషయి' తండ్రి బుద్ధిని అసహ్యించుకొని "విషము" అనే శబ్దంలోని 'ము' ను 'యి' గా మార్చి 'విషయి' నివ్వమని అర్థం వచ్చేటట్లు చేయగలిగి ఒక అక్షర శబ్దార్థ జ్ఞానిగా తన మేధోశక్తితో చంద్రహాసుడ్ని పెళ్ళిచేసుకుంటుంది. స్త్రీలు తమ మేధాశక్తిని సందర్భోచితంగా వినియోగించుకోవటం విలక్షణంగా కన్పడుతుంది.

అంతకుముందు సాహిత్యంలో కృష్ణుని మాటకు ఎప్పుడూ ఎదురు చెప్పని రుక్మిణి విహారంలో భాగంగా కృష్ణుడు సరోవర కమలాన్ని చూపిస్తూ దానిచుట్టు ఉన్నహంస, ఏనుగు, తేంట్లను చూపి 'కమలిని' భర్త చాటుగా పలువురితో సంబంధాలపెట్టుకుందనీ, పరోక్షంగా స్త్రీల లైంగికత మీదతన అపనమ్మకాన్ని మాటలో గ్రుమ్మరిస్తాడు. దానికి రుక్మిణి బదులిస్తూ కృష్ణుని మాటలను ఖండిస్తూ పురాణపతివ్రత పాత్రశైలిలోనే కమలానికి హంసకీ, ఏనుగుకు, తేంట్లకు సహజాత సంబంధమని కమలంలోని మకరందాన్ని తేంట్లు గ్రోలడమంటే మాతృస్తన్యపానము వంటి భావన అని చెప్పి స్త్రీప్రవృత్తి నిష్కళంకమని చెప్పి రుక్మిణి నిరూపించుటం భర్తమాటలను ఖండించటం ఆశ్చర్య కలుగుతుంది.

'జైమిని భారతమనే' కావ్యంలోని స్త్రీపాత్రల మనఃప్రవృత్తి గాని వారి పరాక్రమ శక్తులు కాని సందర్భానికి తగినట్లుగా పితృస్వామ్య సంస్కృతిని అధిగమించటంగా స్పష్టమవుతుంది. ముఖ్యంగా కావ్యంలో పరాక్రమశీలియైన ప్రమీలయేకాక మిగిలిన స్త్రీలు సతీసహగమన సంస్కృతిని నిరసిస్తూ అధిగమించటం స్త్రీ పాత్రల వీరత్వంగా భావించేటట్టు చేసి ఒక విలక్షణతను కల్గించాయి. రుద్రమదేవి సమకాలికుడైన జైమినికవి ప్రమీలలో రుద్రమదేవి పరాక్రమశక్తిని ప్రతిక్షేపించాడని స్పష్టమవుతుంది. ఈకావ్యంలో స్త్రీలు ముగ్ధలుకారు. ధీరత్వం గల్గిన చైతన్యశీలురుగా వీరముద్రికలను, నిలిపి భావితరాల స్త్రీలను ఆలోచింపజేసే ప్రేరణశక్తులు. ఈ కావ్యంలోని మహిళల ఆలోచనలలోనూ, పరాక్రమంలోను వైలక్షణ్యంతో కూడిన చైతన్యమే ప్రపంచంలోని అనేక భాషలలోనికి అనువాదాన్ని పొంది సాహిత్యాన్నీ ప్రభావితం చేయగలిగింది. కందుకూరి వీరేశలింగం గారి "అఁడుమళయాళం" రచనకు ఈ "జైమినిభారతం" స్ఫూర్తినిచ్చిందనే భావన కలుగకమానదు. జైమినీ భారత విలక్షణతయే నేటికి ఆ కావ్యాన్నికి పఠనీయార్హత కల్గిస్తుంది. నేటి మహిళల చైతన్య స్ఫూర్తిని దీప్తిమంతం చేయగలుగుతుంది.

*– 'మిసిమి' మాసపత్రిక – సెప్టెంబరు 2017.*

# 7. వసుచరిత్రంలో హాలాహలం

తరతరాలుగా మానవనాగరికతలో చోటుచేసుకున్న అమానుషత్వం నేటికీ మహిళలపై జరుగుతున్న అత్యాచారాలలో ప్రతిఫలిస్తూనేవుంది. పత్రికా ముఖంగాను, ప్రసారమాధ్యమాలలోనూ పునరావృత్తం అవుతున్నది ఈ అత్యాచారాల చరిత్రయే. స్త్రీలు అన్నిరంగాలలో అభివృద్ధి చెందాలనుకుంటున్న తరుణంలో అడుగడుగునా అడ్డంకియై అభద్రతను కలిగిస్తున్న విషయం కూడా ఇది. స్త్రీల ఆత్మాభిమానాన్ని. ఆత్మగౌరవాన్ని ఆటంకపరుస్తూ, స్త్రీలకు లైంగిక భద్రత లేకుండాజేస్తూ, స్త్రీల జీవనహక్కులకు హానికరంగా సామాజిక సంస్కృతిలో భాగమైన భోగమైన విషయంకూడా అదే. గణాంకాల ప్రకారం గంటకు ఒకటి మాత్రంగానే ఇవి వెలుగులోకి వస్తున్న విషయంగా భావించాలి. పితృస్వామ్య సంస్కృతికి పెట్టనికోటగావున్న విషయం కూడా అవటంతో దీని మూలాల అన్వేషణకై సాంస్కృతిక భావాలకు ఆటపట్టయిన సారస్వతాన్ని పరిశీలంచా లనుకొన్న క్రమంలో రామాయణ భారతాదులలోని అటువంటి విషయ ప్రస్తావనలోకి తొంగిచూడటం జరిగింది.

వివాహితులైన సీత, ద్రౌపదులు తమ భర్తల వీరత్వాన్ని చెప్పి ప్రతినాయకుల ప్రయత్నాన్ని ధైర్యంతో బెదిరించటం జరిగింది. కాని అదే భారతంలోని ఆదిపర్వంలో పూర్వీకుల వృత్తాంతంలో భాగంగా అవివాహితులైన శుక్తిమతి, మత్స్యగంధి లైంగికదోపిడికి గురైన విషయం కనపడుతుంది.

స్త్రీ–పురుష సంబంధాలలో పురుషపరంగా జరిగే బలాత్కారాన్ని పరోక్షంగా చెప్పటంకోసం కొండను పురుషుడిగాను నదిని స్త్రీగాను భావించేటట్టు చేయటం జరిగింది. అంటే మానవప్రవృత్తిని ప్రకృతిపరంగా చెప్పాలనుకోవటం జరిగింది. ఇక్కడ మానవీకరణంకంటే కూడా స్త్రీపురుష సంబంధాలకు ప్రకృతీకరణమే జరిగింది. ఎందుకంటే రాజాశ్రితకవులు పితృస్వామ్య సంస్కృతిని ఎత్తిచూపించలేని పరిస్థితి అది. భారతకథలో కోలాహలుడనే పర్వతం శుక్తిమతి అనే నదిని 'కామించి' (ఆది–3వ ఆశ్వా–26 వ.) అడ్డుపడ్డప్పుడు ఉపరిచర వసువనే రాజు వచ్చి తన కాలిగోటితో ఆ కొండను తొలగద్రోయగా, పర్వతసమాగమంవల్ల ఆనదికి గర్భం వచ్చి, ఆమెకు కవల పిల్లలు కలుగుతారు. ఆమె పుట్టిన కొడుకుకు వసుపాదుడనీ, కూతురుకి గిరిక అని పేరుపెట్టి పిల్లలను ఆ వసురాజుకే యిచ్చినట్లును, తర్వాత ఆ వసువుయే గిరికను పెళ్ళిచేసుకున్నట్లును తెలియజేయ బడింది. ఇక్కడ శుక్తిమతీ కోలాహలుల విషయంలో వివాహమనే తంతులేకుండా జరిగిన స్త్రీ–పురుషసంబంధాలలో బలాత్కారం చోటుచేసుకోవటం జరిగింది. దీనికి కొనసాగింపుగానే భారతంలో ఆ వసురాజుయొక్క వీర్యస్ఖలితఫలితంగా మానుష ప్రసవంగా మీనరూపంలో ఉన్న అద్రిక అనే అప్సరసకు పుట్టిన మత్స్యగంధి విషయంలోను ఇదే జరిగింది. ఈమెయే వ్యాసుని తల్లియైన సత్యవతి. పరాశరుడనే మునివచ్చి ఓడనడుపుతున్న సత్యవతిని ద్వీపానికి తీసుకెళ్ళమని అడిగి, అక్కడకు చేరుకొన్న తరువాత అతడు తన కోరికను తెలుపగా (ఆది–3వ ఆశ్వా. 38 ప.) ఆమె నిరసిస్తూ తన దగ్గర చేపల పొలుసుల కంపు వస్తుందనీ, పైగా సమాజసంస్కృతిలో భాగంగా కన్యాత్వదోషం ఏర్పడుతుందని చెప్పినా వినిపించుకోకుండా ఆతడు దానికి మినహాయింపునిచ్చాడు. (ఆది. 3వ ఆశ్వ. 41) తాను అంగీకరించకపోతే ఆ ముని శపిస్తాడనే భయం ఆమెకు కలిగింది. ఆ ముని అకాలతిమిరాన్ని సృష్టించి తన కోరికను తీర్చుకోవటం జరిగింది. ఆమెకది యిష్టంలేని విషయమే. ఇక్కడ కూడా ఏకపక్షవిషయికమైనది కాబట్టి దీనినీ బలాత్కారవిషయంగానే భావించాలి. దాని ఫలితమే వ్యాసునిజననం. ఆ రెండు విషయాలలోను జరిగింది బలాత్కారమే. నాడు ధర్మతత్వజ్ఞులెవ్వరూ ఖండించలేదు కాబట్టే నేటికీ జరుగుతున్న చరిత్రగా అత్యాచారాలు అర్థమవుతాయి.

క్రీ.శ. 16 వ శతాబ్దానికి చెందిన భట్టుమూర్తి లేదా రామరాజ భూషణుడనే పేరుతో ఉన్న కవి భారతంలోని వసురాజు వృత్తాంతాన్ని తీసుకొని వసురాజు గిరికలు పరస్పరం ప్రేమించుకోవటం, విరహబాధానంతరం వారి వివాహం జరగటాన్ని వివిధవర్ణనలతో శ్లేషకావ్యంగా 'వసుచరిత్రము'నే శృంగార ప్రబంధాన్ని వ్రాసాడు. వర్ణనలలో భాగంగా కవి గిరిక పుట్టుకకు కారణమైన కోలాహలుడు చేసిన బలాత్కార విధానాన్ని నమోదు చేసాడు. బహుశ పితృస్వామ్య భోగజీవితానికి దారిచూపే జనరంజక విషయంగా భావించి ఉండవచ్చునేమో కాని విజృంభించిన పురుషుని కామవాంఛ స్త్రీజీవితంలో హాలాహలాన్ని సృష్టించిన దానిని ఎవరూ పట్టించుకోలేదని అనిపించక మానదు. స్త్రీలకు లైంగిక భద్రతలేని రోజులలో రాజు రక్షకుడుగా ఉండాల్సిన అవసరాన్ని కావ్యం తెలియజేసింది.

వసురాజు పరిపాలించే రాజ్యానికి రాజధానియైన అధిష్ఠానపురానికి ప్రక్కన ప్రవహించే శుక్తిమతి అనే దివ్యనది ఒకరోజు బ్రహ్మకొలువుకు వెళ్ళివస్తున్నప్పుడు ఆమెను చూసిన హిమవంతుని పుత్రుడైన కోలాహలునికి ఆమెపై కోరిక కలిగి అడ్డగిస్తాడు. ఇక్కడ కవి ప్రకృతిపదార్థాలైన నదికి కొండకు మానవీకరణతోపాటు మానసీకరణం కూడా చేసి స్త్రీపురుష సంబంధాలలో ప్రకృతార్థాన్ని ప్రతిపాదించటం చేసాడు. పురుషప్రవృత్తిలోని కామవాంఛ స్త్రీకి యిష్టంలేక పోయినా ఆమెను పీడించి లైంగికదోపిడి చేసినట్లుగా వర్ణించటం స్పష్టమయింది. ఇసుక తిన్నెలుగల నదిని సమీపించిన కోలాహలుడు ఆమెను జఘన సౌందర్యవతిగా సంబోధించటంలోనే ఆ పర్వతపురుషుడికి స్త్రీమీద ఉన్న దృష్టి అర్థమవుతుంది. ఆ పురుషుని సంబోధనతో ఆ నదీమతల్లికగా స్త్రీరూపిణియైన శుక్తిమతిలో అలజడి ప్రారంభమై "మనోనిబిడచింతాతన్మయత్వం" కలిగిందట. (2ఆ.111 ప.) అటువంటి చింతతోనున్న స్త్రీ యొక్క మనస్సును పట్టించు కోకుండా మన్మథతాపాగ్నితో ఉన్న అతడు తనకు ఆమెతో సుఖం కలిగే మార్గాన్ని ఆలోచించి ఆమెనుపొందాలని 'నిశ్చితాత్ముడై' (2-116) నదిని సమీపించాడు.

నదీరూపిణియైన స్త్రీ అతని ఉద్దేశ్యాన్ని గ్రహించినా హిమవంతుని కొడుకుగా అతణ్ణి పూజిస్తూనే తనకు అతనికి ఉన్న భౌతికరూపమైన అంతరాన్ని తెలియజేసింది. ముందుగా లైంగికత అనేది ఆతని భౌతికత్వానికి సంబంధించిన

విషయంగా భావించింది. అందుకే అతడు కోరుకోతగ్గ అన్యమైనవి ఉన్నాయని చెప్పి తనని కోరుకోవద్దని పరోక్షంగా తెలియజేసింది. అయితే కోలాహలుడు ఆమె యొక్క 'అచ్ఛాచ్ఛ భావాన్ని, గాంభీర్యాన్ని, పరిపూర్ణత్వాన్ని' యిష్టపడుతున్నట్టు చెప్పి ఆమెతో 'నెయ్యము'ను (2-126) కోరుకొన్నట్లుగా సంభాషణ మొదలుపెట్టాడు. ఆమె యొక్క స్ఫటిక స్వచ్ఛమైన భావాన్ని యిష్టపడుతున్నప్పుడు చెబుతాడు. బ్రహ్మకొలువునుండి ఆమె వస్తున్నప్పుడు తాను చూసినా పట్టించుకోకుండా వెళ్ళావంటూ, ఆమెయొక్క వాగమృతాన్ని గ్రోలాలని నిరంతరం తలుచుకుంటున్నట్లును, తాను ఆమెకోసం చాలాదూరంనుండి వచ్చినట్లును తన కోరికను తీరిస్తే ఎప్పటికీ ఆమెదగ్గరే పడి ఉంటాననీ, వదిలిపెట్టననీ తన మన్మథబాధను పోగొట్టమని (2-129) అడుగుతాడు. ఆ మాటలకు వ్యాకులపడ్డ శుక్తిమతి 'వినయము, నయము, భయము' మనస్సులో పెనగొనగా (2-130) అతనితో తాను అల్పజీవిననీ, తనలో జడత్వమున్నదనీ, తనది క్రిందకు పడే స్వభావమనీ, తనదగ్గర చేపల పొలుసుల వాసన వస్తుందనీ, లోపలంతా బురదమయమనీ, నీటిబుగ్గ వంటిది తన బ్రతుకని చెప్పి అతనికి తనమీద అసహ్యం కలిగేటట్లుగా చేయాలనుకొంది. అతనిది ఘనమతియనీ, అలఘుగతియనీ, అభంగశీలత్వమనీ పరోక్షంగా హెచ్చరికచేసి మానసికంగా దిగజారవద్దనీ ఇద్దరికీ సాపత్యంలేదనీ, స్నేహం కుదరదని స్పష్టం చేసింది. (2-131). అంతేగాక అతడు ఎత్తైనవాడనీ తాను భూమిలోతుల్లో ప్రవహిస్తూ ఉంటాననిచెప్పి (2-132) ఇద్దరిమధ్య ఉన్న దూరాన్ని నేర్పుతో తెలియజేసింది. ఆ మాటలకు కామాంధుడికి చిన్నతనం కలిగినా తనని దయతో జూచి ఆమెయొక్క కాంతిధారలలో మునిగేట్టు చేయమనీ, "సుళ్ళలో తిప్పి కష్టపెట్తావో లేదా కౌగిలించి కోరికతీర్చి తెప్పలుదేలుస్తావో" (2-133) అని అనేసరికి ఆమెకు భయం కలిగి వెలవెలపోయిందట. మన్మథవికారంతో ఉన్న అతణ్ణి గౌరవాన్ని కాపాడుకోమనీ, జడస్థతిలో ఉన్న తనతో ఓలలాడాలనుకుంటే అతనికి అల్పత్వం ఏర్పడుతుందనీ (2-136) అతని యెడల తనకు జడస్థితియే ఉన్నదనీ చెపుతుంది. ఆతనియెడల ఎటువంటి వికారం కానీ, స్పందన కానీ తనకు కలగలేదనీస్పష్టం చేసింది. నదీ రూపిణియైన తాను తీర్థక్షేత్ర దర్శనంతో తపస్వినిగా కృశిస్తూ

గడుపుతున్నట్టు చెప్పి తన మనస్సు ఇంద్రియనిగ్రహంతో ఉంటుందనికూడా తెలియజేసింది. అతనికి కావాలంటే అప్సరస స్త్రీలున్నారని చెప్పి ఆతని దృష్టిని మళ్ళింపజేసే ప్రయత్నం చేసింది. భారతకథలోని ఆ శుక్తిమతి కంటే ఈ శుక్తిమతి లైంగికదాడిపై తన ప్రతిఘటనా స్వరాన్ని వినిపించింది కానీ ఫలితం లేకపోయింది. కామాతురుడైన కోలాహలుడు తనను సమర్థించుకోవటానికి ప్రకృతిపరంగా భౌతిక రూపసాంగత్యం లేకపోయినా ఆకాశగంగను శివుడు, కాళిందిని విష్ణువు, గంగను శంతనుడు పొందినప్పుడు వారి గొప్పదనం తగ్గిందా అని చెప్పి (2-137) నియమాలు పెట్టుకోకుండా తనను ఏలుకొమ్మంటాడు. ఆమె పద్మాలనే వస్త్రాలను పట్టుకోవటం, పాయలనే వేణులను చలింపచేయటం, తామర తూడులనే కంకణాలను కంపింపజేయటంతో ఆమె ఎగిరిపడే చేపలనే చూపులతో అలజడికి గురియై శోభావిహీనమైన ముఖంతో తత్తరపాటును చెందిందట. (2-136) దానికి కోలాహలుడు ఆమెనిలువెల్లా పొగరుతో ఉన్నట్టుగా భావించి ఆమెతో అనుకూలంగా మాట్లాడంకంటే కూడా ప్రతికూలంగా 'పరుషోద్యద్ద్రొఢిని' చూపించాలనుకొని కోపంతో తన ఆటోపాన్ని ప్రదర్శించాలని త్వరపడ్డాడు. (2-137) స్త్రీ ఒప్పుకుంటే సరి లేదా పురుషబలంతో లొంగదీసు కోవాలని అనుకోవటమే యిక్కడ బలాత్కారంగా స్పష్టమయింది.

అంతకంతకు కోలాహలుడికి మోహం, కోరిక పెరగటంతో నదీరూపిణి యైన ఆమె గట్లను ఒరుసుకుంటూ రొదచేస్తూ చెల్లాచదరయిందట. విజన ప్రదేశమవటంతో ఆమె సంగమం కావాలని మాటిమాటికి ఆమె పాదాలమీదపడ్డా (2-138) ఆమె ఒప్పుకోకపోయే సరికి నిలువెల్లా మన్మథబాణాగ్నితో రగిలిపోతూ అతడు పద్మాలనే ఆమె ఆడంబరాన్ని వారిస్తూ, చంద్రకాంతితో ప్రకాశిస్తున్న ఆమె చెలువపు తరంగమాలికలను చలింపజేస్తాడు. కోరిక తీర్చుకోవటానికై మదోన్మత్తతతో గూడిన గద్గద స్వరంతో తడబడేమాటలతో పర్వతమనే ఆ పురుషుడు అగ్గలమైన కోరికతో నది అనే స్త్రీపై దుముకుతుంటే రాలుతున్న కొండయొక్క శిలాఫలకాల చప్పుడుకి తటీవిహంగాలు చెల్లా చెదురయినాయి. కాగా మకరికలుగల ఆ నదీచెక్కిళ్ళను నొక్కుతూ, మధురా మృతాన్ని గ్రోలుతూ

నదిలో ఎగిరిపడే ముత్యములు గల పయోధర స్థలములను పట్టుకుంటూ పద్మపత్రాలనే వస్త్రాలను విహీనం జేసి దొరలుతూ అనుభవిస్తాడు. ఆమె జఘనములనే మైదానప్రాంతాలమీద ఆరోహిస్తూ తనివితీరక నదీరూపిణియైన ఆమెను 'పెద్దయు ప్రొద్దు' నిరోధించాడట. (2-139) అంటే ఆమె ఎంతసేపు బలాత్కారానికి, లైంగిక హింసకు గురియైందో అర్థమవుతుంది. స్త్రీ బలాత్కరింపబడే సన్నివేశాన్ని కావ్యంలో స్పష్టం జేయటమంటే బహుశ స్త్రీ ఒప్పుకోకపోయినా ఆమె ఎలా బలాత్కరింపబడుతుందో ఇక్కడ అర్థమవుతుంది. పితృస్వామ్యపు కవియొక్క వర్ణనలలో రసానుభూతికంటే కూడా సహానుభూతిలోని కసి కనబడి సహృదయపాఠకులలో హాలాహలాన్నే సృష్టిస్తుంది.

పక్షుల కలకలారావంతో వసురాజుకు ప్రళయం వస్తుందని అనిపించిదట. ముంపుకు గురియైన ఊరినుండి జనంవచ్చి రాజును రక్షించమని అడుగుతూ ఎక్కడనుండియో కొండ ఒకటి వచ్చి శుక్తిమతీ నదియొక్క 'అక్కునన్' (2-145) ఆర్భాటంతో వాలిందనీ, నది మిక్కిలి భయభ్రాంతులకు లోనయి (2-146) భూమిని కౌగలించుకోవటంతో మైదానప్రాంతమంతా ముంపుకు గురియైందనీ తమ బాధను తొలగించమని వసురాజుతో చెప్పుకుంటారు. ఇక్కడ వారు వక్షస్థలం అనే అర్థంలో అక్కున, భ్రాంతి అనే పదాలను వాడటంతో శుక్తిమతి యొక్క అత్యాచారపు బాధను, భయాన్ని పట్టించుకోవటం కంటేకూడా ఆమె భ్రాంతికి లోనయి వెల్లువగా వచ్చి తమ ఊరిని ముంచివేసినట్లు చెప్పడం కనపడుతుంది. వారికి ఒక స్త్రీ అత్యాచారానికి గురియైన విషయానికంటే కూడా తమ ఊరిని ముంచిన విషయమే ప్రాధాన్యంగా భావించినట్లు అర్థమవుతుంది. ఆ రాజుకూడా తనను ఆశ్రయించిన ప్రజలకు సంతోషాన్ని కల్గించటానికి (2-152) ముందుకు వచ్చి తన నఖంతో ఆ కొండను ఎగజిమ్మేసరికి ఆ కొండ వ్రయ్యలు కాగా శుక్తిమతి యొక్క నిర్బంధం తొలగిపోయిందట. తృప్తిపడిన కోలాహలుడు గుటకలు మింగాడని చెప్పటంతో శుక్తిమతి బలాత్కారానికి గురియైనట్లు స్పష్టమవుతుంది. ఇక చేసేదిలేక కోలాహలుడు ఆ నదితో స్నేహం చేస్తూ అక్కడే పడి ఉన్నాడట. (2-154) అంటే బలాత్కారం జరిగినందుకు రాజు వివాహక్రతువులేని

సహజీవనాన్ని నిర్ణయించినట్లగ అర్థమవుతుంది. ఇది రూపాంతీకరణచెంది ఆధునికకాలంలో అటువంటి స్త్రీ పురుషసంబంధాలను పోలీసువ్యవస్థ పెళ్లితో ముడిపెట్టించి బలవంతపు కాపురాలు చేయించటం కనపడుతుంది. అటువంటి బలవంతపు కాపురం సామాజిక సంస్కృతికి లోబడినా స్త్రీలు సంతృప్తితో ఉండలేరని ఈ కావ్యంలోనే అర్థమవుతుంది. అది ఎప్పటికీ సరిపడని సంగతుల దాంపత్యమే.

బలాత్కారఫలితంగా పుట్టిన కవలల్లో శుక్తిమతి తన కొడుకుకి వసురాజుకు కృతజ్ఞతగా స్వతంత్ర నిర్ణయంతో వసుపాదుడనే పేరుపట్టిందట. కోలాహలుని భాగస్వామ్యానికి విలువను ఇవ్వాలని అనుకోవటం చేతనేమోగాని మునులు ఆ కూతురికి గిరిక అని పేరుపెట్టారట. కోలాహలుడికి ఈవిషయాలేవి పట్టలేదని కూడా అర్థమవుతుంది. కూతురిని శుక్తిమతి శంఖాలతో అలంకరిస్తే, కోలాహలుడు రత్నాలతో అలంకరించాడనీ, దానిని కర్కశాలంకారంగా తల్లి భావించి వాటిని తీసివేసి తామరలను పెట్టిందట. ఇక్కడ కోలాహలుని కర్కశత్వాన్ని శుక్తిమతి మరచిపోలేదని కూడా అర్థమవుతుంది. తల్లి సాహిత్యాన్ని నేర్పిస్తే, తండ్రి సంగీతాన్ని నేర్పించాడట.

తర్వాతికథలో భాగంగా ఆ వసురాజు గిరికమీద మనసు పారేసుకోవటం, పరస్పరం విరహాన్ని అనుభవించటం ప్రబంధాలలో షరామామూలే. వారిద్దరి వివాహవిషయంలో మధ్యవర్తిగా వచ్చిన ఇంద్రుణ్ణి ఎదుర్కోవటానికి కోలాహలుడు గంగాది పుణ్యస్త్రీలతో ఎదురేగినట్లున్నదిగాని శుక్తిమతితో కలిసి రాకపోవటంలో కూడా వారి అన్యోన్య దాంపత్యం అర్థమవుతుంది. గిరిక వసురాజుల వివాహానంతర సంభోగశృంగారాన్ని అంతే రసాత్మకంగా వర్ణించటం జరిగింది. గిరికను అత్తవారింటికి పంపిస్తూన్న సమయంలో కోలాహలుడు కూతురితో పతిధర్మాలను పాటించే స్త్రీయే స్త్రీయని చెప్పటంలోనూ, శుక్తిమతి కూతురితో పగవారయిన ఆడబడుచులుంటారని చెప్పి బ్రహ్మ పగవారితోనే సాంగత్యాన్ని కూరుస్తాడని అనటంలోనూ ఆ దంపతులిద్దరి మధ్య ఇంకా సయోధ్యత కుదరలేదనికూడా అర్థమవుతుంది.

భారత కావ్యకర్త అత్యాచారాన్ని సూచిస్తే, 16వ శతాబ్దపు కవి అత్యాచారపు ప్రక్రియావిధానాన్ని వర్ణించాలనుకోవటంలోని ఆంతర్యాన్ని ఆలోచిస్తే కవి పితృస్వామ్య భోగజీవితానికి అనువుగా వ్రాయాలనుకోవటంగాని లేదా స్త్రీలకు లైంగికభద్రత లేనితనాన్ని నమోదుచెయ్యాలనుకోవటంగాని జరిగి ఉండవచ్చు.

వసుచరిత్రంలోని అత్యాచారబాధితురాలైన స్త్రీవర్ణనలో ఆ స్త్రీయొక్క బాధను అర్థంచేసుకోవటానికి న్యాయమూర్తులు వసుచరిత్ర కావ్యపఠనం చేయగలిగితే స్త్రీకి సరియైన న్యాయం జరగుతుందనిపిస్తుంది. కానిపోలీసు స్టేషన్లలో పెళ్ళిని జరిపించి కావ్యంలోలాగా సహజీవనాన్ని నిర్ణయిస్తే సత్ఫలితాలు కలగవనికూడా అర్థమవుతుంది.

సామాజిక వ్యవస్థను ప్రతిఫలింపజేసేది సాహిత్యం. భారత రచనాకాలం నుండి నేటికీ అనుశ్రుతంగా జరుగుతున్న అత్యాచార అకృత్యాలు స్త్రీకి గౌరవప్రదమైన జీవనహక్కునులేకుండా చేస్తున్నటువంటి ఈ అమానుషత్వానికి ముగింపు పలికే శిక్షలను వేయాలి. చట్టాలున్నా అత్యాచారాలు జరుగుతున్నా యంటే పురుషప్రవృత్తిలోనే మార్పువచ్చే మార్గాలను ఆలోచించాలి. పురుషాధిక్య భావజాలం ఉన్నన్నాళ్ళు జరిగేవిషయాలే కాబట్టి స్త్రీలే ధైర్యంతో ఎదుర్కొనే స్థితిలో ఉండాలి. తోటి స్త్రీలు అటువంటి బాధితులలో ఆత్మవిశ్వాసాన్ని పెంచాలి. నేరస్థులు తప్పించుకోవటానికి వీలులేకుండా వారి నుదుటన 'కామాంధుడు' అనే పచ్చబొట్టును వేయిస్తే కనీసం మిగిలిన స్త్రీలు వాడికి దూరంగా ఉండ గలుగుతారు. యవ్వనంలో ఉన్న యువతీయువకులు ఆకర్షణలకు లోబడకుండా స్వీయనియంత్రణశక్తిని పెంచుకోవాలి. నిస్సహాయస్థితిలో కోలాహలుడివంటి కామాతురులైన యువకులు లైంగికహింసకు పాల్పడుతూ మోసపుచ్చే విధానాన్ని తెలుసుకోవటానికిని యువతులు ముందుజాగ్రత్తగా ఆత్మరక్షణ చేసుకోవటానికిని వసుచరిత్ర కావ్యాన్ని చదవాలి. ఈ కావ్యాన్ని చదవగలిగితే, అటువంటి పరిస్థితులలో వారిద్దరికి పెళ్లిచేయటం కంటేకూడా కేసునే పోలీసువ్యవస్థ నమోదు చేయగలదనీ, న్యాయమూర్తులకు స్త్రీలయొక్క అత్యాచారస్థితి స్పష్టమయి తగిన శిక్ష వేయగలరని భావించవచ్చు.

# 8. తరిగొండ వెంగమాంబ 'నృసింహ శతకం'-
# తరింపజేసేయోగసారం

జీవితసారాన్ని ఒంటబట్టించుకొని తరించిన తరిగొండ వెంగమాంబ 1817 వరకు లేదా 1840లలోకానీ జీవించిందనీ భిన్నాభిప్రాయాలున్నప్పటికీ మొత్తం మీద 18వ శతాబ్దానికి చెందిన మొదటి మహిళాశతకకర్తగా ఆమెను భావించవచ్చు. నాటి చిత్తూరు జిల్లా లోని తరిగొండ గ్రామంలో మంగమాంబ కృష్ణయామాత్య దంపతులకు వెంకటేశ్వరుని వరం వల్ల జన్మించిందట. నృసింహ శతకం ఈమె మొదటి రచన. భాగవతకథను ఆధారంగా చేసుకొని నృసింహ విలాసం, బాలకృష్ణ నాటకం, విష్ణుపారిజాతం వంటి యక్షగానాలను రచించింది. రాజయోగామృతసారం అనే కావ్యాన్ని, ద్విపదలో భాగవతాన్ని కూడా రచించింది. 103 సీసవృత్త పద్యాలలో "తరిగొండ నృసింహదయాపయోనిధీ!" అనే మకుటంతో ఈమె వ్రాసిన శతకంలో తన కవిత్వాన్ని వికల్పకవిత్వమని పలికిన వారలకు నచ్చచెప్పి తన గురుతుగా ధరిత్రి మీద తన శతకాన్ని నిల్పమని తరిగొండ నృసింహ స్వామిని వేడుకొంది.(4)

శతకంలో నృసింహ స్తుతికంటేకూడా మానవ జీవిత లోపాలను పోగొట్టుకునే మార్గాన్ని చూపిన నిర్దేశకురాలు. శరీరంలో ఉన్న ఆత్మశక్తి యొక్క ఆవిష్కారమైన రాజయోగాన్ని, కుండిలినీ విద్యలద్వారా ఇంద్రియ నిగ్రహాన్ని స్థిత ప్రజ్ఞతను పొందే విధానాన్ని ఈశతకం ద్వారా సామాన్యులకు విప్పి చెప్పాలనుకున్న విదుషీమణి. బాలవితంతువుగా శిరోముండనాన్ని

వ్యతిరేకించిందని ఆమెను గురించి చెప్పిన కథలకు ఆధారంలేదు. అసత్యం కూడా. ఎందుకంటే ఆమెయే 103వ పద్యంలో 'ఎలమిని పెంపు, సొంపొదవ ఇంజేట వంశజాన వెంకటాచలపతి నామధేయుడి నిజాంగనగా' చెప్పుకొని తన ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించుకుంది. ఒకవేళ శిరోముండనాన్ని వ్యతిరేకించిన స్త్రీయైతే తనపద్యంలో నిర్ద్వంద్వంగా చెప్పగలిగేది ఎందుకంటే ఈ శతకంలోనే ఆమె

> *"ముట్టన దూరమేగి, యటమూడు దినంబులు బైటనుండి, యా*
> *ముట్టెడఁబాపఁబూని బహుముఖ్యతరంబుగ బొంది నీళ్ళలోఁ*
> *బట్టుగ ముంచివేసినను, పన్నుగ దేహికి ముట్టుపోవునే?*
> *గుట్టొక టుండగాను, తరిగొండ నృసింహ! దయాపయోనిధీ!"*

**(85వ పద్యం)**

స్త్రీలు గుట్టుగా చెప్పుకొనే మూడ్రోజులు ముట్టుతో వారిని విడిగాఉంచి పాపంఅంటూ స్నానాలుచేయించే ఆచారాన్ని విమర్శించి దానిగుట్టు శరీరంలో ఉన్నంతవరకు ముట్టెట్టు పోవును? అని మానవజాతి సృష్టికి మూలమైన ఋతుకాలం, ఋతుస్రావం గురించిన శారీరక ధర్మాన్ని స్పష్టం చేసింది. ధర్మాలను తెలుసుకోమని చెప్పటం జరిగింది. ఆనాటికది ప్రగతి భావనయే. ఈ భావన నేటి అయ్యప్ప భక్తులను ఆలోచింప చేస్తుంది.

ప్రకృతిపరంగా వర్ణనను అలంకారాలలో చెప్తూ "స్వాతివానలకు ముత్యపుచిప్పలు, చంద్రుడి కోసం కలువలు, సూర్యుని కోసం పద్మాలవలె హరి కోసం తన హృదయాంబుజం ఎదురుచూస్తుందనీ, 'ముక్తిని తీసుకో' అని చెప్పటానికి హరి రావటంలేదు ఎందుకని" ఆమె దైవాన్ని ప్రశ్నించింది. 'తానిక సారములేని సంసారమనే సర్పానికి చిక్కి, పాపాలు కోరుకుంటూ ఉంటూ వృథాగా ఆశలు పెంచుకునే ఘోరాన్ని భరించలేన'ని చెబుతుంది. (ప. 25) "నువ్వు నేను" అంటూ తనుభేదము లెంచేవారు, అరిషడ్వర్గాన్ని వశం చేసుకుంటూ దురభిమానాన్ని ఎలా జయించగలరో దారి చూపమని అడిగింది. (ప. 27) జీవికి దేహకాంక్ష ఉన్నంతవరకు వివేకం కలగదని (ప. 30) చెప్పింది. వేడుకకై

ఈరోజు అలంకరించుకున్న దేహం మర్నాటికి కాలుని చేరి మరో శరీరంలోకి చేరుతాడనేది తెలుసుకుంటే అలంకారాలకు ఉన్న విలువ తెలుస్తుందని భావించింది. శరీరంలో ఉన్నది కండలు, ప్రేగులు, అస్థికలు, చీము, నెత్తురు, మలమూత్రములో ఉన్న కడుపు అని తెలిస్తే (ప. 36) శరీర సుఖాన్ని కోరుకోరు. ఇది తెలియాలంటే గురుబోధ అవసరమని, గురువు శిష్యుణ్ణి సన్మార్గంలోకి తేవటానికి సత్త్వరజస్తమో గుణాలను పేని, అవిషడ్వర్గాన్ని దూర్చి, జ్ఞానేంద్రయ, కర్మేంద్రియాలను బిగించి అణిచి వేసే శక్తిని అందిస్తాడని (ప. 38) చెప్పింది. గురువు వల్ల రాజముద్రయోగాన్ని, కుండలినీశక్తి ప్రస్తారాన్ని (ప. 46-56) తెలుసుకోవాలంటుంది. మనోమదాన్ని అణచేవాడు నృసింహుడని (ప. 39) ఆతని కటాక్షాన్ని పొందింప చేసేవాడు గురువని (ప. 41) ఆతనికి నృసింహుడికి అభేదమని (ప. 42) చెప్పింది. బ్రహ్మాండంలోఉన్న చైతన్య స్వరూపుడైన పరమాత్మ మరియు ఇతర దేవుళ్ళు తనలోనే సృష్టమయి ఆ బ్రహ్మాండం తనలో ఉన్నదని (ప. 50) గ్రహిస్తారని, అడవిలో తపస్సు చేయటంకంటే అష్టమదాలను అణచి ఆత్మను దర్శిస్తే భవాబ్ధిని దాటగలరని చెప్పింది. దానికి రాజయోగం ముఖ్యమని భావించి

> *"భూచరుడైననేమి? శివపూజలుచేసి యనేక ముద్రలన్*
> *చూచినఁబుణ్యమేమి? యదిచూడకయుండిన నేమి తక్కువల్?*
> *ఖేచరిముద్రఁగాంచి మదిఁగిన్నరభావము మానసంబులో*
> *గోచరమైన ముక్తి; తరిగొండ నృసింహఁ! దయాపయోనిధీ!"*

**(ప. 57)**

అని ముక్తి మార్గమును తెలియజేసింది. సత్త్వ, రజో, తమోగుణాలను తగ్గించుకుంటే పరమాత్మ తత్త్వాన్ని గ్రహించి వివేకం కలుగుతుందని చెప్పింది. "పుట్టుచు గిట్టుచున్ మఱియు బోధ శరీరునిఁ గాన నేరకున్/వట్టి దురాశలన్ దగిలి వారిజగంధుల మీది ప్రేమచే/నెట్టన కాపురంబులును నిక్కమటంచును నమ్మి యాత్మలో/గుట్టుఁ గనంగలేదు తరిగొండ నృసింహ దయాపయో నిధీ." (ప. 62) అంటూ ఆత్మలోని గుట్టును తెలుసుకోవటమే మోక్షమని చెప్పింది.

లోకరీతిని గురించి చెబుతూ జీవితంలో అందరూ తమ ఇల్లు, వాకిలి శాశ్వతం అనుకొంటారు గానీ, ఆ యింట్లో కుదరని కాపురాలు చేస్తూ మోహ లోభాలు ఎక్కువై చివరికి సంపదలు తగ్గి కొడుకింటికి కుక్కకాపలా కాస్తారని

*"ఎక్కడి రొక్కయోజనము? లెక్కడి భాగ్యము? లెక్కడింటులున్?*
*ఎక్కడి పాఁడిపంటలును? ఎక్కడిబాంధవు? లెల్లనాటికిన్*
*తక్కకవృద్ధరూపమును దాల్చినఁబుత్రకులింటివాకిటన్*
*కుక్కలఁదోలుమంద్రు; తరిగొండ నృసింహ! దయాపయోనిధీ!"*

**(63 పద్యం)**

అని చెప్పింది. "కుదరని కాపురాలను" ఆనాడే బయటపెట్టింది. లోకంలో సామాన్య స్త్రీ ప్రవృత్తి చెప్తూ. స్వారస్యం, నీతి, సాహసం, మేలిమితనంతో పరమపతివ్రతగా ఉన్న భార్యయే యవ్వనంలో భర్తను దేవుడిగా భావించి సేవలు చేస్తుంది గానీ, ఆ యవ్వనం అయిపోతే లెక్కచేయదని భర్త గ్రహించి స్త్రీ(భార్య) తనకోసమే ఉన్నదనే (ప. 64) భావనను తగ్గించుకోవాలని అంది. నేటి స్త్రీవాదులు చెప్పినట్లుగా భార్యమీద భర్త యొక్క 'పొజసివ్ నెస్' ని తరిగొండ వెంగమాంబ ఆనాడే ఖండించింది. అలాగే పురుష ప్రవృత్తిని గురించి చెబుతూ "పాటిగ నగ్నిసాక్షిగా వివాహమైన పతివ్రతామణిన్ నీటున నొల్లకన్ మిగుల నేరము లెన్నుచుఁ గొట్టి తిట్టుచున్ ధాటిగ నన్యకాంతను ముదంబున రక్షణ చేసి దానితోఁ గూటమి పాపహేతు!" (ప. 95) అంటూ కుటుంబంలోని పురుషుల దుశ్చర్యలను నిర్భయంగా చెప్పింది. స్త్రీగా పురుషుల పాపాలను బహిర్గతంచేసి కుటుంబంలోనే పురుషులు ఎంతటి పాపకృత్యాలకు ఒడికడుతున్నారో నిర్భయంగా చెప్పటంతోపాటు కుటుంబహింసను బయట పెట్టగలగటం తరిగొండ వెంగమాంబకే చెల్లుతుంది. ఆమె ఆధునిక స్త్రీ వాదానికి నాందీ ప్రస్తావన పలికింది. భర్తలు సంపదలను భార్య బిడ్డలను కాక మోక్షాన్ని గురించి ఆలోచించాలని చెప్పింది.

కలిమిగలవారు కల్గినవారికే దానాలిస్తారు. అది గొప్పకాదు. కలిమిలేనివారు తమకున్నంతలో దానం చేయటమే గొప్ప (ప. 74) అని

భావించింది. అంతేకాదు డబ్బున్నవారు అసత్యం మాట్లాడితే నిజమంటారు గానీ, పేదవాళ్ళు నిజం మాట్లాడినా అబద్ధం అంటారు అని చెప్పి మానవులు ధనదృష్టితో సత్యాసత్యాలకు విలువనిస్తున్నారనీ వాపోయింది. ఆత్మకు కులము గోత్రము ఉండదని (ప. 79) భావించింది. తమను వేధించే విషయాలను గ్రహించమని చెప్పింది. అభేదభావనతోఉండి బాధలనుభవిస్తున్న తనదేహంలోని భావాలలోకి తొంగి చూసినప్పుడు జీవి అమృతత్వాన్ని పొంది తరువాత సహస్రారంనుండి స్రవించే అమృతాన్ని కుండలినీయోగం ద్వారా పానం చేయవచ్చని (ప. 84) భావించింది. అందుకు తాను అన్నం తింటూ తనతోపాటు దీనదేహాలను లాలన చేసి అన్నంపెట్టే వివేకి తనమనసును ఉన్నతం చేసుకుంటూ ఉంటే శరీరమందే నదులు నిరంతరం ప్రవహిస్తుంటాయని (ప. 91) చెప్పింది. ఇదే "సహనౌభునక్తు". అంతేకాక పుట్టిన భూమిలోపల త్రిమూర్తులుండగా వారిని చూడక తీర్థయాత్రలు చేస్తూ అందరూ చూసేటట్లుగా నీళ్ళలో మునిగి చేతులు ముకుళించి మంత్రాలు చదవితే ముక్తి రాదంటూ (ప. 99), జపతపాలను నిరసిస్తూ ఒక స్త్రీగా చెప్పటం ఆనాటి కాలంలో సాహసోపేతమైన ఆలోచనయే. తరిగొండ వెంగమాంబ ఒక స్త్రీ గా చెబితే సమాజం పెడచెవిని పెడుతుందనీ, అదే నృసింహుడికి శతకం ద్వారా చెప్పి సమాజం అర్థం చేసుకొనేటట్లు చేస్తే వారే ముక్తి మార్గాన్వేషకులు కాగలరని భావించింది.

*– తెలుగు వెలుగు – జులై 2019.*

# 9. భావలింగ శతకం

## దార్ల సుందరమ్మ–భావలింగాత్మకత

అనాదిగా జంతుజాలంనుండి మానవుడు 'మాట' తోనూ మనసున్న మనిషిగానూ భిన్నుడయ్యాడు. కాబట్టి మనిషి మనుగడ సజావుగా జరగాలంటే మాట, మనస్సు ప్రధానం. మనసులోని భావాలను తెలిపే మాటలకు అక్షరా కృతియే శతక రచన. శతకం "శతమానం భవతు" అన్నట్లుగా మానవులు నిండు నూరేళ్ళు ప్రశాంతంగా బ్రతకటానికి కావాల్సిన సంస్కారాన్ని అందించ గలుగుతుంది. నిరక్షరాస్యులైన వారిలోకూడా ఒక్క శతకపద్యమైనా రానివారుండరు. పిల్లల పెంపకంలో ఈ శతక స్ఫూర్తియే మాతృమూర్తులను ప్రథమ గురువుల్ని చేసింది. శతకాలలోని వంద పద్యాలు ఏ పద్యానికా పద్యమే ఆణిముత్యాలు. ప్రతి పద్యంలోనూ 'సంబోధన' ప్రాయంగా 'మకుట' శబ్దాన్ని వాడటంలోనే చెప్పాలనుకున్న విషయాన్ని వెన్నుతట్టి మరీబలంగా చెప్పటం కనపడుతుంది.

గుంటూరు జిల్లాలోని చర్లగుడిపాడులోని పద్మసాలెల కుటుంబంలో జన్మించిన దార్ల సుందరమ్మ తన 30 ఏట అనగా క్రీ.శ.1829 లో 'భావలింగ శతకము'ను వ్రాసినట్లుగా (ప.122) శతకంలో చెప్పబడింది. 'పాపభయవిభంగ భావలింగ' అనే మకుటంతో నూట ఇరువది యొకటి ఆటవెలదులలో ఈ శతకపద్య రచన సాగింది. ఆమె తన అనుభవంలో 'సూటిగా జూచినట్టి' (ప.121) విషయాలను 'ఇంపుగా' (ప.123) చెబితే ముక్తి గల్గుట సత్యమనే నమ్మకంతో

శతకాన్ని వ్రాసినట్లు అర్థమవుతుంది. 'భావ'మంటే అనేకార్థాలున్నా శతక విషయాలను బట్టి మనోభావాలకు 'లింగాన్ని' చిఱునామా చేసికొని వ్రాసిన శతకమిది అని అర్థం అవుతుంది. లింగమంటే 'గుఱుతు' మరియు ప్రకృతి తత్వం అనే అర్థాలు కూడా ఉన్నాయి. మానవ భావాలకు గుఱుతుయే భావలింగం. వ్యక్తిగతనిష్ఠయైన 'ఆధ్యాత్మికతయే' సామూహిక సంస్కారానికి దారి తీయగలుగు తుందని ఈ శతక రచనవల్ల అర్థం అవుతుంది. జీవితంలో మాట, మనస్సుతో జ్ఞానమార్గాన్ని అన్వేషించటమే ఈ భావలింగ శతక విశిష్టతగా భావించవచ్చు. భౌతిక జీవనంలో వేదాంతమైన ఆధ్యాత్మిక సాధనా శతకమిది. దంతవేదాలు గాక, భావవేదాంతానికి ప్రాముఖ్యత నిచ్చిన శతకం ఈ 'భావలింగ శతకం'. తేటతెలుగులో లోతైన భావాలతో ఆటవెలదులలో అలవోకగా చెప్పిన ఈశతకం రచనా కాలనిర్ణయం ఖచ్చితంగా ఉన్న మహిళా తొలిశతకంగా చెప్పవచ్చు. మాటను మనస్సును ప్రక్షాళనచేసే శతకమిది. 'మాట' కున్న విలువను తెలియజేసే శతకం. భావాలు శాబ్దిక శక్తిగా మారటమే 'మాట'. అంటే భావం భౌతికతత్వాన్ని పొందటం. 'మాట'. మనస్సులోని భావాలు భౌతిక ప్రపంచంతో అనుసంధానం కావటంగా అర్థమవుతుంది. అదే మాట యొక్క తాత్వికతను అర్థమయ్యేటట్లు చేస్తుంది. ఈ విషయాన్ని 190 ఏళ్ళ క్రితమే ఒక గ్రామీణ కుటుంబస్త్రీ శతకరూపంలో తెలియజేయటం తెలుగుజాతికి గర్వకారణం. వేమనతో సమానమైన లబ్ధ ప్రతిష్ఠురాలుగా భావించాలి.

మనిషి జ్ఞానానికి భూమిక 'భావం'. ఆ భావానికి వేదిక మనస్సు. ఈ రెండూ అమూర్త భావాలుగా ఉన్నాకూడ మనోభావాలను ప్రతిఫలింపజేసే 'మాట'లుగా రకరకాల మూర్తిమత్వం గల మానవజీవితాలను నడిపిస్తాయి. మనిషి అంతర్ముఖుడై తనలోని అరిషడ్వర్గాలతో ఆవరించిన అజ్ఞానపు పొరలను ఛేదించ గల్గినప్పుడే 'భావాలింగాన్ని' దర్శించ గలరనీ అప్పుడే జ్ఞానాన్ని పొందగలరని అదేమోక్షమని ఈ శతకంలో చెప్పటం జరిగింది. ఇక్కడ 'లింగము' అంటే మానసిక జ్ఞానానికి చిహ్నమని భావించాలి. అదే సత్యమైనది. నిత్యమైనది. 'భావలింగమనే'ది ఒక మానసికతాత్వికతగా భావించే జ్ఞానమార్గంగా

భావించవచ్చు. మానవుని జ్ఞానమే లింగమైంది. తనువు, మనసును ఏకాత్మకంగా చేసే యోగ విధానం. దీనికి వారధి వంటిది 'మాట'. ఎదుటి వారు చెప్పేమాటలు ఎవరూ వినరు కాబట్టి సుందరమ్మ తను చెప్పాలనుకున్న మాటలను జ్ఞానమార్గంలో 'భావలింగానికి' చెప్పింది.

మానవుడు అజ్ఞానంతో చేసే పాపాలవల్ల మనసులో కలిగే భయాలను పోగొట్టగలిగేది ఒక తాత్వికతయే కాబట్టి దానికి చిహ్నంగా "పాప భయ విభంగ భావలింగ", అనే మకుటంలో శతకం ఉంది. మనిషి తన మనస్సు లోపలికి తొంగి చూసినపుడు కలిగే 'ఎఱుక' యే లింగతత్వంగా భావించింది. అందుకే భావానికి లింగ తత్వానికి ఐక్యతయే భావలింగం. వేదాంత పరిభాషలో ఆత్మ పరమాత్మల సంధానత్వం. అయితే ఇటువంటి మౌలికత గలది మనిషి యొక్క 'మాట'. అందుకే

*"భావమెట్టులుండె బలు కట్టి దై యుండ*
*పలుకు లెట్టి వైన బనులు నట్లు*
*పనులననుసరించి ఫలములు చేకూరు*
*పాప భయ విభంగ భావలింగ."* అని **(ప.105)**

చెప్పటం చేత మనసా, వాచా, కర్మణా జరిగే భావసంస్కారంతో మనిషి తన మాటల చేత పనులచేతనే జీవితాన్ని ధన్యం చేసుకోగలుగుతాడు. కాబట్టి చేతలకు మాటలకు తాత్విక భూమిక 'భావమని' స్పష్టం చేసింది. అంటే ఆ మాట అనేది మనిషి యొక్క మనస్సుకు అద్దం కాబట్టి ఆ మాట చాలా సంస్కారయుతంగా ఉండి జంతువుల నుండి మానవుల్ని వేఱుచేయగలుగుతుంది. మంత్రాలతో మాటలను ఉచ్చరించటంకాదు, ఆ మంత్రాలలో దాగియుండే సత్యం తనమనస్సులోని భావాలకు అనుసంధానం కావాలి. అందుకే ఆమె పైపైకి వల్లెవేసే వేదమంత్రాలను నిరసించింది.

"మంచి మాటలెలా" ఉంటాయో, తప్పుడు మాటలెలా ఉంటాయో విశ్లేషణకు పెట్టింది. మాట సత్యవాక్కుగా ఉండాలని భావించింది. మనసులో

కుతంత్రాలు, మాటల్లో మంత్రాలు ఉచ్చరించే ఆధునికతకు అవసరమైన శతకం ఇది. తెలివి, మరియు 'మాట' జీవిని సాధకులుగాను, ఆసాధకులగాను చేస్తుందనీ, మంచిని వీడిన మనిషి దేనిని సాధించలేడనే ఆమె భావనకు తగ్గట్టుగా మాటతత్వాన్ని (ప. 65) గురించిచెప్పింది. ముందుగా మనోభావాలు దాగి యుండేది మనిషిలోనే. మనిషి పుట్టుక గురించిన సత్యాన్వేషణయే 'మాట'. "అన్నాద్భవతి భూతాని పర్జన్యాదన్న సంభవః" అని గీతాచార్యుడు చెప్పిన విషయం లోకవిదితం. భూమండలం మీద మూడొంతులు నీరే ఉందనేది ప్రకృతిసత్యం. దానినే సుందరమ్మ "జలంబులు పొలములోని మన్నుతో కలిసి గింజగా మారి గంజి అయిన బువ్వ వలన నరులు జీవించారని" (ప. 6) మనిషి పుట్టుకను ప్రకృతి బద్ధమైన శాస్త్రీయతలో చెప్పటం జరిగింది ఆ జలంబులో వచ్చిపోయే చేపల వంటి వారు మానవులని జనన మరణాల గురించి చెప్పింది. భూమ్మీద ఉద్భవించి ప్రపంచాన్ని చూసి చూసి చనిపోతున్నారు గానీ తన చూపుకు జగానికి మధ్య ఉన్న 'సందు'ను అదే'లంకె'గా ఉన్న భావలింగతత్వాన్ని తెలుసుకోలేక పోతున్నారని (ప. 8) భావించింది. మనుషులను మట్టిబొమ్మగా మలచి (ప. 12) 'మాటలు' నేర్పిన శివుడ్ని గురించి మహిమలు చూపుతామన్న తాపసుల అజ్ఞానానికి విచారించింది (ప. 16). చెట్లు నీళ్ళకై చెరువుదగ్గర వరకు తమ వేళ్ళను సాచినప్పుడు ఆ చెఱువులు తాము గొప్పఅని విర్రవీగలేదనే ప్రకృతిగత జ్ఞానాన్ని (ప. 19) గ్రహించ మని చెప్పింది. పరస్పర సహకారం ఉండాలిగానీ అహంకారం ఉండకూడదనే భావనను తెలియజేసింది.

సామాజిక జీవితంలో 'మానవ సంబంధాలను' నిలిపేది 'మాట' అని అందరికీ తెలుసు. అందుకే శతకంలో (ప. 26) 'మాట' నిల్పుకొన్నవాడు కోటి యేండ్లు చిరంజీవిగా ఉంటాడని చెబుతూ.

*"మాట నిల్పువాడు కోటి యేండ్లుండును*
*మాట నిల్పడేని మరణ మొందు*
*మాట నిల్పు పదవి మఱి నేర్పడెందుకో*
*పాప భయ విభంగ భావ లింగ."*

మాట నిల్పుకోలేని మనిషి అప్పుడే చచ్చిన వానితో సమానం. ఇక్కడ సత్యహరిశ్చంద్రుడు గుర్తుకువస్తాడు. అంటే మనిషి వ్యక్తం చేసే 'మాటయే' వారి శాశ్వతత్త్వానికి చిహ్నమవుతుంది. సమాజంలో 'మాట' లతోనే మతములు (నమ్మకాలు) పుడుతున్నాయి. 'మాటలు' లోపలే అణిగి ఉంటే మతాలు ఉండేవి కావు. అటువంటి మాటలను అణచి ఉంచగలిగిన వాడే గురువు అని చెప్పటం (ప. 28) జరిగింది ఇది నేటి మతోన్మాదులైన స్వామిజీల ప్రవచనాలకు చెంపపెట్టు వంటింది. 'నేను– నీవు, నీవు– నేను' అనే మాట ఎటు నుంచి చూసినా ఒకటే. అటువంటి మాటయే భావ లింగాన్ని గురించిన 'మాట' గా (ప. 30) భావించింది.

లోపల గాలిని లేకుండా చేసుకుంటే కటకట పడినట్లుగానే. 'మాట' ను 'మఱుగుచేసి' (మర్మంతో) మాట్లాడి ఆ తరువాత క్షమించ మంటూ అడగటం ఎందుకు? అనే భావనను తెలిపింది. లోపల ఒక భావమును, పైకి వేరుగాను మాట్లాడేవారు గుర్తించు కోవల్సిన మాట యిది. కూడు, నీరు కుక్షిలో పడితే వచ్చే కూతల వంటివి వేదాలు (ప. 32). కాని మనల్ని బ్రతికించే కూడు, నీరే వాస్తవమైన జీవన వేదాలని చెప్పింది. కాబట్టి మానవ మనుగడకు అన్నం, జలం ముఖ్యమని (ప. 38) చెప్పింది.

> *"నోటి మాట నాది నొసటి మాటగు నీది*
> *నొసలు పలుకు చుండ నోరుపలుకు*
> *దీని దెలిసి నడువ దీఱుఁ బునర్జన్మ*
> *పాపభయ విభంగ భావలింగ"* అంటూ **(ప. 40)**

నోటితో మాటాడి నొసటితో వెక్కిరించి నట్లుగా ఆ మాట నొసటిలోని హావభావాలను ప్రకటించేదయితే పునర్జన్మ ఉంటుందని చెప్పి, దానిని గ్రహించి మాటలో నిజాయతీ ఉంటే మోక్షజ్ఞానం కలుగుతుందని భావించింది. 'మోక్ష మార్గానికి మనో భావాలను తెలిపే 'మాట'యే దారినిస్తుందని చెప్పింది.

> *"నేనటన్న దప్పు, నీవటన్నను దప్పు*
> *పేరుపెట్టనిదియుఁ బెద్ద తప్పు*
> *తప్పు మాట లాడి తల్లడపడ నేల"* **(ప. 42)**

అంటూ నీవు, నేను అనే భేద భావంతోను, ఎవరిదో ఆమాట అని తెలియ చెప్పటం కూడా పెద్ద తప్పు అనీ అటువంటి తప్పుడు మాటలు పల్కి తరువాత కలత చెందటం అనవసరమని చెప్పింది. అంతే కాదు బయట ఉన్నదంతా 'పరమ' మటంచు ఆటలాడినట్లుగా మాట మాట్లాడినా అదియు 'మాటే కదా. అసలు ఆ మాటనే లయంచేసి సూటిగా చూస్తే తన మనస్సులోనే పరమాత్మ భావలింగంలో కనపడతాడనీ, అదే 'భావలింగ తత్వం' అని దాన్ని దర్శించమని (ప. 43) చెప్పింది. ఏ విషయం గురించియైనా (పదార్థం గాని దేవుడు గాని) 'ఉంది, లేదు' అని మతాలు మాట్లాడు కుంటాయి గానీ 'భావ లింగం' లోనే ఆ రెండు మాటలుంటాయని, ఆ భావమే దైవమని భావించి మానవులు సుఖంగా జీవించ లేక పోతున్నారు అని భావించింది.

*"పుండు గల్గు కోతి పురుగు పాఱిన చేను*
*బురద జిక్కు పడ్డ కరి విధాన*
*'మాట' నెంచు నట్టి మనుజుడు దక్కడు*
*పాప భయ విభంగ భావలింగ"* **(ప.45)**

అంటూ ఎదుటివారి మాటలో తప్పునుఎంచుతూ, తనమాటే నెగ్గాలనుకునే మాట పట్టింపు, పట్టుదల ఉన్న మానవుడు జీవించ లేడని చెప్పింది. అన్న మాటపై పట్టుదల పెంచుకోవటంవేరు, మాట నిలబెట్టు కోవటం వేరని భావించి

*"తెలియునన్న మాట తెలియదన్నను మాట*
*మాట వట్టిదన్న మాట యగును*
*మాట పట్టుదలకు మసియయ్యె లోకమ్ము"* **(ప.53)**

అంటూ విశ్వామిత్రుడు గుర్తుకు వచ్చేటట్లు చెప్పటమే గాక

*"గొప్ప కులము గాదు, గొప్ప ద్రవ్యము గాదు*
*గొప్ప విద్య కాదు, కోటి యేల*
*మాట నిల్పెనేని మాదిగైనను గొప్ప"* అని **(ప.44)**

ఏ కులంలో పుట్టినా 'మాట' ను నిలబెట్టు కోవటమే మానవుని లోని గొప్ప గుణమని చెప్పింది.

వేపచెట్టులో తీపిలేనట్టే మాటల్లో మంచితనం ఉండదు గాబట్టి చెడ్డ మాటలాడి మానవు లెందుకు చెడిపోవటం (ప.47) అని ఆలోచించమంది. ఆధునిక కాలంలో మాటలు కోటలు దాటుతాయి చేతలు గడపలు దాటవనే ప్రజానీకానికి చెప్పుదెబ్బవంటి మాట ఇది. సామాన్య జనవ్యవహారంలోని 'మాట' లోనే మాటయొక్క స్వభావాన్ని చెప్పి ఆ మాటయే లోకవినాశనానికి దారి తీస్తుందని చెప్పిన భావంఇది. నేటి మర ఫిరంగుల యుగంలో కూడా చర్చల ద్వారా ఏమీ సాధించటంలేదనే విషయం లోకవిదితమే. మాట్లాడితే సత్యవాక్కుగా ఉండాలి లేదా మౌనంగా ఉండటం మేలని భావించాలి.

*"కన్ను నిల్పువాడు ఘనయోగి వర్యుండు*
*మనసు నిల్పు వాడు మహిని శివుడు*
*మాట నిల్పువాడు మఱి యెవ్వడౌనొకో"* **(ప.54)**

అంటూ చూపు, మనసు, మాట నిలబెట్టుకొనువాడు శివునిలో భావైక్యత చెందిన జ్ఞానుడవుతాడనేది ఆమె ఉద్దేశ్యమయి ఉంటుంది. చెప్పదగిన మాట జగతిలో లేనప్పుడు జనులెందుకు మాట్లాడి మురిసి పోతున్నారో అర్థంకావటం లేదని మాట్లాడేటప్పుడు ఆలోచించమని (ప.56) చెప్పింది.

బుద్ధిశూన్యతగల బుద్ధిమంతులలో చేరి అంటులేని మాటలు (భేదం లేని మాటలు) నేర్చినట్టి, జీవచ్ఛవాలవంటి సాధువులతోనైనా తననుచేర్చ మని అడిగింది. మనిషికి అవసరమైంది పాండిత్యమనే బుద్ధికాదు జ్ఞానమనే బుద్ధి అని చెప్పింది. మనుషుల మధ్య భేదం లేదనుకునే జ్ఞానులు అనగా భావలింగ తత్వం గల సాధువులతో తనకు సాన్నిధ్యాన్ని కల్పించమని (ప.57) అడిగింది.

*"చెప్పి చెప్పి గురులు చెయి చూపి నోర్మూసె*
*పలికి పలికి శ్రుతులు భంగపడియె*
*తత్వమిట్టిదనుచు దగ బల్క డెవ్వడు*
*పాప భయ విభంగ భావలింగ".* **(ప.59)**

బోధనలుగానీ, వేదాలుగానీ తత్వాన్ని గురించి చెప్పలేక పోయాయి. తత్వమిట్టిదని చెప్పే పలుకు/మాట కావాలంటుంది. మాట ఎప్పుడూ

భావలింగాతత్వాన్ని తెలిపేది అయి ఉండాలని ఆమె ఉద్దేశ్యం అయి ఉంటుంది. అందుకే "చేటులేని దొకటి మూఁటి మిగిలె, అదియె గురునిమంత్ర మీది పంచాక్షరి" అని (ప.70) చెప్పింది. అంటే పలికే 'మంచి మాట' ఒకటే శాశ్వతమైనది. దానినే పంచాక్షరి మంత్రంగా భావించింది. ఆ విధంగా మాట్లాడే వారిలో తనను చేర్చ మని చెప్పింది. పాప భయం, బాధలు లేకుండా నిర్మలత్వం ఉంటే అదే దేవుడ్ని గురించిన 'ఎఱుక' కలిగి యుండటం గా భావించింది.

*"కనులు మూయలేదు కనపడదేదైన*
*చెవులు మూయలేదు చెడుగు మాట*
*మనసు నిల్పిచూడ మఱుగేమియును లేదు"* **(ప.82)**

కళ్ళతో చూసిన దేనినైనా చూస్తారని, చెడుగుమాట విన్న చెవులెప్పుడూ మూయ లేరనీ, కాని మనసు నిల్పి చూడ దాపరికం లేని సత్యం గోచరిస్తుందని చెప్పింది.

*"ఎచ్చట నైన గాని యివి రెండు కనబడె*
*తనువు, మాట వీని దాపనేల*
*తనువు మాటలందు దక్కయుంటివి నీవు"* **(ప.83)**

అన్ని చోట్ల కనబడే ప్రతి తనువు, మాటలలో భావలింగం దాగియున్న విషయం అర్థమయిందని చెప్పింది.

*నీదు దృష్టి గంటి నీ స్థిరత్వము గంటి*
*నీదు బోధ గంటి నిన్ను గంటి*
*కాని నీదుఁ 'మాట' గన లేక భ్రమ గొంటి* **(ప.93)**

అని కళ్ళతో చూసినా, చెవులతో విన్నా, దివ్యదర్శనమైనా కూడా మాటయొక్క తత్వాన్ని తెలుసుకోలేకపొతే మనిషి భ్రమలోనో మాయలోనో బ్రతుకుతాడని, లేని మాటను పట్టుకొని బాధలననుభవిస్తాడని భావించింది. కళ్ళు, చెవులు, నోరు, కాళ్లు, చేతులు, బుద్ధితో వినీ, కనీ భావలింగాన్ని చేరటమే ముక్తిమార్గమని, (ప.99) నిద్ర దాగిన చోట అంటే చైతన్యం ఉన్న చోట ఆ భావలింగం ఉంటుందని (ప.103) భావించింది. మనసు, చేతన, మాటల

స్వభావాన్ని ఒకటిగా చేసుకొని మ్రొక్కిన, మ్రొక్కులతో నిరాకారుడు, ప్రకృతి లభ్యమైన జడపదార్థంగా నిర్వికారంగా ఉన్న రాతిరూపంలో భావలింగాన్ని (ప.108) దర్శించాలంటుంది. అప్పుడే ప్రకృతితత్వంగల భావం అర్థమయి జ్ఞానాన్ని గుర్తించగలుగుతారని ఆమె ఉద్దేశ్యమై ఉంటుంది. శివుడంటే రాయి, జీవుడంటే మన్ను, మాయ అంటే శరీరం అని ఈ మూడింటి ఐక్యంతో లింగాభిషేకం చేసినట్లయితే లింగైక్యతకు మార్గం ఏర్పడుతుందని (ప.115) చెప్పింది. భూమి మీద మానవులు తమ నిశ్చలశరీరంతో దృష్టిని 'రాయి' (జ్ఞానం) మీద పెడితే ముక్తికలుగుతుందని (ప.116) భావించింది. అంటే మనస్సు ఏకాగ్రతను పొందితే జ్ఞానం తనంతట తానే ఉద్భవిస్తుందని ఆమె ఉద్దేశం అయి ఉంటుంది. ఇదే భావలింగ శతకం. మాట్లాడే మాటను భావంలో ఐక్యతనొందించుట ముఖ్యమని భావించింది. మాట విలువ తెలుసుకోవటానికి ఉపయోగపడే శతకమిది. పలుకలమ్మ తల్లికి సుందరసుమధుర కవితానీరాజనం. మనిషికి భాషణం ముఖ్యమైతే ఈ శతకం జ్ఞానమనే వాగ్దేవికి భూషణం. ఈ శతక రచయిత్రి దార్ల సుందరమ్మ మనసు మాట మూర్తీభవించిన జ్ఞానం.

ఆధునిక యుగంలో ప్రేమకైనా ద్వేషానికైనా 'మాట'ను తరచూ ఉపయోగిస్తారు. సామజిక మానవసంబంధాలలోనూ, కుటుంబ సంబంధాలలోను 'మాట'యే మనుషులను విడదీస్తోందనే గ్రహింపుతోనే ఈ శతకం వ్రాసినట్లు అర్థం అవుతుంది. ముఖ్యంగా రాజకీయ రంగాలలో వాగ్దానాలు చేయటానికి బాగా ఉపయోగించే పాశుపతాస్త్రం ఈ మాటయే. కాబట్టి మాట్లాడేటప్పుడు, మాటను వదిలేటప్పుడు తన లోపలి భావపరంపరను తొంగి చూడగలిగితే తన మనసేమిటో అర్థం అవుతుంది. మంచి చెడుల విచక్షణా జ్ఞానం అలవడుతుంది. కాబట్టి మాట్లాడే 'మాట' యొక్క తత్వాన్ని అర్థం చేసుకొని మనసున్న మనిషిగా జీవించటానికి తగిన జ్ఞానమార్గాన్ని బోధించే ఈ శతకం మానవ సంబంధాలను అభివృద్ధి పరుస్తుంది.

*– ఆంధ్రజ్యోతి దినపత్రిక–వివిధ–22.10.2018.*

# 10. మహిళావిద్యకు మైలురాయి – 'మాధవశతకం'

1881–1899 సం.ల మధ్యకాలంలో జీవించిన వేమూరి శారదాంబ 'మాధవ' అనే మకుటపదంతో అల్లిన 101 పద్యాల కూర్పును 'మాధవశతకం'గా 1901 సం.లో మార్చినుండి మే నెల వరకు 'కలావతి' పత్రిక ప్రచురించింది. ఆధునికయుగ ప్రారంభంలో పాత, కొత్త తరాల స్త్రీలసాహిత్యానికి వారధివంటిది ఈ మాధవశతకం. 125 సం.ల క్రితం శారదాంబ తన 14 యేటనే ఇంతటి వైదుష్యంతో, సామాజికస్పృహతో ఉద్యమస్ఫూర్తిగా సమాజాన్ని తట్టిలేపిన సాంఘికశతకం కూడా యిది. ఈమె తన 16 వ యేటనే 'నాగ్నజితీ పరిణయం' అనే ప్రబంధాన్నికూడా వ్రాసింది. భాగవతంలోని కృష్ణుని అష్టభార్యలలో ఒకరైన నాగ్నజితిని అపత్యార్థకంలోనే కాక ఆమెకొక స్వతంత్రవ్యక్తిత్వం ఉండాలనే భావనతోనేమోగాని ఆమెను 'సుదంత' అనే పేరుతో పరిచయం చేసింది. అంతే కాదు, ఆమెను సంగీత, సాహిత్య, చిత్రలేఖన కళాకోవిదురాలిగా ఆత్మికస్పృహతో తీర్చిదిద్దింది. నాగ్నజితిలో సంగీత, సాహిత్యకళానిధియైన శారదాంబ వ్యక్తిత్వం ప్రతిఫలిస్తూ ఉంటుంది. చరిత్రకారుల దృష్టిలో 1860–70 సం.ల తర్వాతి కాలమైన ఆధునిక యుగంలో వేమూరి శారదాంబనే ప్రథమ కవయిత్రిగా గుర్తించాలి.

స్త్రీవిద్యకు దిక్సూచి వంటిది మాధవశతకం. ఇందులో స్త్రీవిద్యా విషయం అంతస్సూత్రంగా ఉన్నా స్త్రీవిద్యాభివృద్ధికై ఒక కార్యాచరణ ప్రణాళికను రూపొందించి స్త్రీవిద్యకు ఒక దిశానిర్దేశం చేసింది. ముందుగా సమాజంలోని

విద్యావంతులను సంస్కరించాలనుకోవటం, సమాజసంస్కృతిని ప్రశ్నించింది., స్త్రీవిద్యవల్ల కుటుంబాలకు ఎంతటి ప్రయోజనం ఉంటుందో చెప్పటం, భర్తలకు ఎంతటి సుఖమో తెలియజెయ్యాలనుకొంది. భార్యయొక్క చదువువల్ల భర్తలలో కలిగే భయాందోళలను పోగొట్టాలను కోవటమేకాక, స్త్రీలలో కూడా తమ విద్యాభివృద్ధికై కాలాన్ని సద్వినియోగపరచుకొనే చైతన్యాన్ని కలిగించటం ఆమె కార్యాచరణ ప్రణాళికగా మాధవశతకం స్పష్టపరుస్తుంది.

స్త్రీల దుస్థితికై తనలో కలిగిన విచారాన్ని పోగొట్టటానికై తాను చెప్పుతున్న (శతకరూపంలో) మాటలను 'చెవిని రిక్కించు' కొని స్త్రీజాతిని బ్రోవటానికి తన దైవమైన మాధవుణ్ణి 'చయ్యన' రమ్మని వేడుకొంది. ఇందులో ఆమెకు స్త్రీజాతిని కాపాడే ఆరాటమేతప్ప వ్యక్తిగతస్వార్థంలేదు. స్త్రీజన క్షేమార్థకంగా స్త్రీల దుస్థితిని పోగొట్టాలంటే ముందుగా స్త్రీకి విద్యనేర్పించాలని, అప్పుడే వారికి జ్ఞానం కలుగుతుందని భావించింది. ప్రతిమనిషి తనని తాను అంచనా వేసుకొవటానికి గాని, తనపుట్టుకకు మిగిలిన వారితో సమానమైన విలువలు గౌరవం ఉన్నాయో లేవోననిగాని తెలుసుకొనగల జ్ఞానం విద్యవల్లనే లభిస్తుంది.

స్త్రీలకు విద్య అనవసరమనే కరుడుగట్టిన భావజాలంతో ఉన్న సమాజాన్ని సంస్కరించాలని తన దైవమైన మాధవుడ్ని మధ్యవర్తిగా చేసుకొని, ఆ మాధవుడికి కర్తవ్యాన్ని సూచించింది. దానికై సద్బుధులవద్ద స్త్రీలకు విద్యను నేర్పించమంది. అయితే అది అంత సులువైన విషయంకాదు. అందుకని ముందుగా విద్యావంతుల మనస్సును ప్రక్షాళనచేసే విధంగా వారు సద్విషయవిచారణ చేసేందుకు వారిని సన్మార్గవర్తనులుగా చేయమని అడిగింది. అంతేకాదు, పురుషులలోని లోపాలను సరిదిద్దమనీ, ముఖ్యంగా స్త్రీలను హింసించే వారి మనస్తత్వాన్ని మార్చమని అడుగుతుంది. స్త్రీవిద్యకు ఆటంకప్రాయమైన సామాజిక మనస్తత్వానికి తగిన చికిత్స అవసరమని భావించింది. అప్పుడే పురుషులలో స్త్రీవిద్యను అంగీకరించే మనస్సు సిద్ధమవుతుంది.

మనువుకూడా స్త్రీలను పూజించమనే 'ముచ్చట' చెప్పాడు గాని స్త్రీలను బాధపెట్టే విషయాలను గురించి పేర్కొనలేదని గుర్తించమంది. స్త్రీవిద్యపట్ల

వ్యతిరేకతగల సమాజాన్ని సామ, దాన, భేద, దండోపాయాలతో సంస్కరించాలని అనుకొంది. అందుకే ముందుగా స్త్రీపురుషులలో మేధోశక్తులు సమానమనే భావనను కలిగిస్తూ

*"వలదనుటెట్లు విద్య మగవారలకెట్టులనట్లేకదా*
*పొలతులు విద్యయందు రుచి పూనకయుండుట తప్పిదంబుగా*
*లలనలు నాలుగక్షరములం జదవంగనె విద్య కాదుగా*
*తెలివి సమమ్ము పూనగను స్త్రీపురుషుల్దరయందు మాధవా!"* **(19 ప.)**

భూమి మీద స్త్రీ, పురుషులలో తెలివితేటలు సమానంగానే ఉంటాయని భావించేటట్లు చేసింది. స్త్రీపురుషుల విద్యపట్ల ఉన్న సామాజిక వివక్షాస్వభావాన్ని వేలెత్తి చూపించింది.

స్త్రీలు చదువుకుంటే వారిలో చెడ్డగుణాలు ఏర్పడతాయనే అపప్రథకు చెంపదెబ్బకొడ్తూ మగవారు చదువుకుంటేకూడా చెడ్డవారైనట్లేకదా అంటూ

*"చదివిన దుర్గుణంబులను జాలగబొందుదురంద్రుగాని య*
*య్యది చెడుబుద్ధులన్ గరపునట్లయినన్మగవారు నేర్వ చె*
*ల్లదుగద విద్యనెట్లు మది రంగుగ నేరుచుచున్నవారలి*
*య్యదనున నందరున్ జెడగునందిరి జూడగదయ్య మాధవా!"* **(72 ప.)**

అని సమాజానికి చురకవేసింది. స్త్రీలు చదువుకొని ఉంటే కుటుంబానికి ఎంతప్రయోజనంగా ఉంటుందో తెలియజేస్తూ విద్యావంతులైన స్త్రీలు కుటుంబంలోని వ్యక్తులతో సత్సంబంధాలతో మెలుగుతుంటారనీ, పిల్లలను మంచిబుద్ధులతో పెంచుతారని చెప్పింది. ఆడపిల్లయొక్క చదువుకు రొక్కాన్ని వెచ్చించటం యిష్టం లేని వాళ్లకు స్త్రీలచదువు లాభదాయకమే అని చెపుతూ, ఒకసారి ఖర్చుపెట్టి ఆడపిల్లను చదివిస్తే ఆమె తరువాత వచ్చే తరతరాల ఆడపిల్లలు తమ తల్లులదగ్గరనే చదువుకోగలరని చెప్పింది. ఆ విధంగా ఆడపిల్ల చదువుకు మాటిమాటికి ఖర్చుపెట్టాల్సిన అవసరం లేదనే భావనను వారిలో కలిగించే ప్రయత్నం చేసింది. చదువుతో స్త్రీలకు శాస్త్రజ్ఞానం ఏర్పడుతుందనీ, దానితో అవసరమైనప్పుడు శిశువులకు స్వయంగా చికిత్స చేయగలిగి వారసులైన బిడ్డలను

కాపాడుకోగలుగుతారని చెప్పింది. పితృస్వామ్య కుటుంబాలలో యింటికి పెద్దయైన మామకు కోడలు చదువుపట్ల నిరసన భావం ఉంటుంది కాబట్టి మామలకు స్త్రీ విద్యాప్రయోజనాన్ని రుచిచూపించాలనుకొని మామ లవణం తెచ్చి వడ్డించమంటే కోడలికి దాని అర్థంతెలియక ఆవుపేడతెచ్చిన విషయాన్ని ఉదాహరణగా ఉటంకించింది. మామగార్లు నవ్వుకొని కోడలుపిల్ల చదువుకోవాలనుకొనే స్ఫురణను వారిలో కలిగించే ప్రయత్నం చేసింది.

ఇక భార్య చదువుకొంటే 'పడతులు విద్యనేర్చినను భర్తలకెంత సహాయులౌదురెయ్యెడలనునైన' అంటూ భర్తకు సహాయకురాలిగా ఉంటుందనీ, 'స్త్రీలకు విద్యనేర్పినను జేకురు సౌఖ్యములెల్ల' అని చెప్పి భర్తకు అది ఎంతో సుఖాన్ని కలిగిస్తుందని చెప్పి వారి మనస్తత్వానికి కావలసిన చికిత్స చేయాలనుకొంది. దానికై మనువు చెప్పినట్లుగా భార్య 'కరణేషుమంత్రి' గా ఉండాలంటే 'ధైర్యము పూని విద్య ప్రమదామణి నేరక మంత్రి యెట్లగున్' అంటూ మంచి మంచి ఆలోచనలను యివ్వటానికైనా భార్య చదువుకొని ఉండాలని తెలిపింది. ఇంటివ్యవహారాలలో సొమ్ములెక్కలు ఆమెయే చూసుకో గలిగితే భర్తకు సుఖంగా ఉంటుందనీ, తీరికలేని పనులుమీద బయటకువెళ్లి అలసివచ్చిన భర్తకు వార్తాపత్రిక చదివి వినిపించి దేశసమాచారాన్ని తెలియజేస్తుందని చెప్పింది. "అంగనలెల్లరుం సహజమౌ తెలివిం దగబొంది యుండగా రంగుగ విద్యనేర్చిననె రాజిలుగా తెలివెందుమాధవా" "ముద్దరాంద్ర కింపలరగ నాల్గురెట్లు మగవారలకన్నను బుద్ధియెక్కుడంచిలదెలుపంగ" స్త్రీలకు చదువెందుకని అనకూడదని చెప్పింది. స్త్రీలకు చదువే హస్తభూషణం అయినప్పుడు భార్యలకు నగలమీది వ్యామోహం తగ్గి నగలకై ధనాన్ని అడగరని చెప్పింది. అన్నిటికంటే ముఖ్యంగా స్త్రీలు చదువుకొంటే వారు దుష్ప్రవర్తనతో ఉంటారనే భావం మగవారిలో నరనరాల్లో జీర్ణించుకొని ఉంటుంది, కాబట్టి దానికి విరుగుడుగా మగవాళ్ళు భార్యలలో కోరుకొనే సత్ప్రవర్తన, నాగరికత స్త్రీలకు విద్యాజ్ఞానం వల్లనే వస్తుందని చెప్పింది.

భర్తలు అంత సులభంగా ఈ విషయాలను అంగీకరించరనే భావనతో కవయిత్రి వారిని నయానాభయానా ఒప్పింపచేయాలనుకొని స్త్రీలకు విద్య

అవసరంలేదనీ, భార్య మూఢురాలిగా ఉంటేనే నయమనుకొనే భర్తలకు మూగఅమ్మాయిలను పెళ్ళిచేసుకొనే అర్హత ఉంటుందని చెప్పింది. అంతేకాదు చదువుకొన్న భర్తలు చదువులేని అమ్మాయిని అర్ధాంగిగా చేసుకొంటే అతని శరీరంలో సగభాగం చచ్చుపడినట్లయి శక్తిహీనుడు అవుతాడని చెప్పి అదే అతనికి పెద్ద శిక్ష అని అర్థంవచ్చేటట్లుగా చెప్పింది.

పితృస్వామ్య కుటుంబాలలో భర్తలు మినహాయింపు కాదు కాబట్టి స్త్రీలు చదువుకుంటే తమ పురుషాధిక్యతకు ముప్పువస్తుందనే భయం వారిలో ఉంటుంది. దానికి మనోవిజ్ఞాన చికిత్స చేయాలనుకొంది. తనని దేవుడంటూ పూజించాల్సిన భార్య చదువుకుంటే తనను గౌరవించే విధమైన యోగ్యతలు తనకు ఉండవనీ, ఇంటిపని చేయకపోతే తననెత్తిమీద ఇంటిచాకిరికూడా పడుతుందనీ, ఆమెలో దుర్గుణాలు ఏర్పడతాయనేటటువంటి అపోహలు మగవాళ్ళల్లో ఉంటాయనీ, వాటికి విరుగుడుగా, స్త్రీలు విద్యావంతులైతే భర్తలను మరింతగా గౌరవిస్తారని చెపుతూ,

*"ముదితలకెల్ల యోగ్యతలు మున్మను గష్టముచేసి యాభువిన్*
*చదువుటవల్ల రావు సహజంబులుగానె లభించునందుర*
*య్యది నిజమైన శాస్త్రములనన్నియు నేల నిరర్థకంబులే*
*మదిగనట్టులైన మగవారలకుం జదువేల మాధవా!"* **(60 ప.)**

అని చెప్పింది. అంతేకాదు, ఇంటిపని మరింత సమర్థవంతంగా చేసుకొంటారనీ, ఆడవాళ్లు చదువుకుంటేనే చెడ్డవాళ్ళయ్యే టట్లయితే, మరి మగవాళ్ళు చదువుకొంటే చెడ్డవాళ్ళయినట్లేనని నిర్ధారించాల్సి వస్తుందని చెప్పింది.

స్త్రీలు విద్యావంతులైతే స్వతంత్రులవుతారనీ, తమ మాటలను పట్టించు కోరనే భయం వారిలో ఉంటుంది కాబట్టి వారి నాడిని పట్టుకొన్న కవయిత్రిగా

*"తరుణులు విద్య నేర్చిన స్వతంత్రములిమ్మటంచుం్రడటంచునం*
*దురే యది కల్ల దాము దగునో యెవి పూనగనెవ్వి గూడదో*
*యెఱింగియె పొందుచుంద్రుగద యెప్పుడు గూడను బాగవిద్యలన్*
*గరచినవారు గాననిది న్యాయమె జెప్పగచూడ మాధవా!"* **(79 ప.)**

అని సామాజిక సంస్కృతిని ప్రశ్నకు పెట్టింది. స్త్రీలకు స్వాతంత్ర్యం యిచ్చేందుకు పురుషులకేమి హక్కు ఉందని ఈనాడు స్త్రీలు చర్చించుకొనే విషయాన్ని ఆనాడే శారదాంబ చెపుతూ స్త్రీలు స్వతంత్రతను తామంతట తామే పొందుతారనీ, బాధ్యతతో ఏ మేరకు స్వాతంత్ర్యాన్ని వినియోగించుకోవాలో వారికి తెలుసని చెప్పిన క్రాంతదర్శి శారదాంబ.

స్త్రీలుకూడా తమవిద్యాభివృద్ధికై కర్తవ్యోన్ముఖులు కావాలని చెపుతూ, తీరిక సమయాలలో పొరుగిండ్ల అరుగుమీద కూర్చొని స్త్రీలు భారతకథలను తమకు తోచినట్లు చెప్పుకోవటంకాక గ్రంథపఠనంచేసి పరిశీలనతో జ్ఞానాన్ని పొందాలని చెప్పింది. అంతేకాక, నోములు, వ్రతాలకు వినియోగించే సమయాన్ని చదువుకై వినియోగించమనే సాంస్కృతిక విప్లవ భావాలను వారిలో రేకెత్తించింది. గర్భిణి, ప్రసవ సమయాలలో తప్ప మిగిలిన కాలంలో స్త్రీలు ధైర్యంతో, పూనికతో విద్యార్జన చేయాలని సూచించింది.

స్త్రీలకు తరతరాలుగా విద్యలేదనే విషయంకూడా ఈ మాధవశతకం వల్ల అర్థంమవుతుంది. క్రీ.శ.1 వ శతాబ్దానికి చెందిన గాథాసప్తశతిలో స్త్రీలు తమ భర్తలు పొరుగూళ్ళకు వెళ్లిన తరువాత రోజులు లెక్కపెట్టటానికై గోడలమీద గీతలు గీసేవారని ఉంది. మాధవశతకంలోకూడా స్త్రీలు పాలలెక్కలకై గీతలు గీసేవారని కవయిత్రి పేర్కొనటంతో, 19 శతాబ్దానికి కూడా స్త్రీవిద్య అదే స్థితిలోనే ఉన్నట్లుగా అర్థమవుతుంది.

125 సం.ల వెనుక రచింపబడిన ఈ మాధవశతకం మహిళావిద్యకు మైలుఱాయివంటిది. సామాజిక సంబంధాలు బలపడేవిధంగా మానవ ప్రబోధాత్మకైన శతకంయిది. స్త్రీవిద్యాభివృద్ధిని ఆటంకపరుస్తూ జరిగే సమాజ తప్పిదాలను తరతరాలకు పాఠకహృదయాంతరాళాలలో నాటుకొనేటట్లుగా చేసిన రచన కూడా. ఈ శతకాన్ని విస్మరించటంవల్లనే, స్త్రీలవిద్యాశాతాన్ని గురించిన కాకిలెక్కలను కాగితం మీద చూపించుకొంటున్నా, ఇంకా పల్లెల్లోను, బలహీన వర్గాలలోను స్త్రీవిద్యాభివృద్ధి జరగాల్సిన దుస్థితి ఉందని అర్థమవుతంది. మాధవ శతకాన్ని మహిళా విద్యకు భద్రాసనంగా చేసి తన 18వ యేటనే నింగికెగసిన వేమూరి శారదాంబ నేటికీ స్త్రీవిద్యకు వేగుచుక్కయై ప్రకాశిస్తూనే ఉంటుంది.

# 11. సాహిత్యవిమర్శ ప్రమాణాలు - కాంతాసమ్మితమా ? కాంతాసమ్మతమా !

కావ్యానికి ఉండవలసిన లక్షణాలు చెప్పితే అది లక్షణ గ్రంథం. కావ్యాన్ని విశ్లేషించి చెప్పితే విమర్శ. కావ్యం వల్ల ఎటువంటి ప్రయోజనాలు కలుగుతాయో చెప్పటం సాహిత్యప్రమాణం అవుతుంది. సాహిత్యప్రయోజనాలు, ప్రమాణాల విషయాలలో స్త్రీల ప్రతిపాదనలు ఏమైనా ఉన్నాయా అనే జిజ్ఞాస మొదలయింది. ఆ క్రమపరిశీలనలో ముందుగా 'కావ్యప్రకాశిక' అనే గ్రంథంలో 'కావ్యం యశసే,....కాంతాసమ్మితతయోపదేశయుజే' అనే శ్లోకంలో యశస్సు, ధనం, వ్యవహారజ్ఞానం కలగటం, అశుభనాశనం జరగటం, తక్షణ అలౌకికానందం పొందటం, కాంతాసమ్మితమైన హితోపదేశం అనేవి కావ్యప్రయోజనాలుగా ఉంటాయని మమ్మటుడు చెప్పిన విషయం స్ఫురణకు వచ్చింది. ఇందులో మొదటి ఐదు వ్యక్తిప్రయోజనాన్ని కలిగించేదయితే, చివరిది మాత్రం ఇంటాబయటా మానవసంబంధాల అభివృద్ధికి ఉపయోగకరంగా ఉండే విషయం. ఇక్కడ కాంతాసమ్మితత్వ ఉపదేశాన్ని కావ్యప్రయోజనం అని ఎందుకు చెప్పారనే ఆలోచన వచ్చింది. కాంతాసమ్మితత్వం అంటే కాంతా సమానంగా అని అర్థం. బహుశ పండితార్థంలో పురుషులు వినాలంటే స్త్రీ లేదా భార్య తాను చెప్పాలనుకొన్న విషయాలను మృదువుగా ప్రియురాలివలె ఒప్పింపచేసే విధంగా హితాన్ని చెప్పే పద్ధతి అని భావించాలి. ఎందుకంటే స్త్రీలు ఏ భావాన్ని వ్యక్తంచేయాలన్నా

ప్రియంగా చెప్పాలని భావించటంచేతనే కదా పితృస్వామ్య సమాజసంస్కృతి స్త్రీలను మృదుస్వభావులుగా తీర్చిదిద్దగలిగినది. 'సమ్మితి' అంటే సమానమైన అనిఅర్థం. నిజానికి కాంతాసమ్మితత్వంలోని 'సమ్మితిత'లోనే 'మితి' కనపడుతుంది. అంటే చెప్పే విషయంలో కాంతాసమానంగా పరిమితిగల రీతిలోనే ఆ హితాన్నో, నీతినో చెప్పాలేమో. లేదా కుటుంబపరిధిలోనే స్త్రీలు ఆ హితాన్ని ప్రేమతో చెప్పే పద్ధతియా అని కూడా ఆలోచించాలి. సాధారణ అర్థంలో కాంత అంటే స్త్రీ అనే అర్థాన్ని తీసుకొంటే స్త్రీలువాచ్యార్థంలో కాక ఆ హితాన్ని ధ్వనింపచేస్తూ స్ఫురించేటట్లుగా నేర్పుగా చెప్పటం స్త్రీలస్వభావం అని భావించాలి. ఒకరి నడతను తీర్చిదిద్దేది హితం. స్త్రీలు మృదువుగానో, ప్రియంగానో ధ్వనింపచేసే రీతిలో హితోపదేశాలు చెప్పగలరనుకొంటే, వాటిని విని బాగుపడ్డ ఉదాహరణలు లేవు.

చారిత్రక సమాజాలు తాత్కాలికమైనా ఆయాసమాజాలను ప్రతిఫలించిన సాహిత్యం సార్వకాలికం. నిజానికి అటు సమాజంలోకాని, ఇటు సాహిత్యంలో కాని స్త్రీలు అవసరమైన హితబోధను చేసినా, వినటం, అంగీకరించటం జరగలేదు. సాహిత్యంలో పితృస్వామ్య ప్రయోజనం ఉన్న సందర్భాలలో తప్ప కన్నతల్లి హితాన్ని చెప్పితే బిడ్డలు విన్నసందర్భాలు కూడా లేవు. దీనికి గాంధారి–దుర్యోధనులే ఉదాహరణ. కాంతాసమ్మితంగా అనేదానికి ప్రియంగా ఒప్పింప చేసేవిధంగా ఆ హితాన్ని స్ఫురింపచేస్తూ చెప్పటం అని అనుకొంటే, ఆ యా సందర్భాలలో కాంతాసమ్మితత్వంతో నేర్పుగా, నైపుణ్యంతో ధ్వనిపూర్వకంగా హితబోధ చేసిన భార్యగా శకుంతల, పెద్దరికంతో నిగూఢార్థంలో నర్మగర్భంగా చెప్పిన నిగమశర్మ అక్కవంటివారి విషయాలలోకూడా స్త్రీలు హితోపదేశం చేసిన సంఘటనలున్నా వాళ్లు ఆ హితాన్ని వినిపించుకొన్నారా అన్న సందేహం రాక తప్పదు. వినిపించుకోలేదు అనేదికూడా స్పష్టం. దానికి కారణం సామాజిక సాంస్కృతిక భావాలలోని పురుషాధిక్యతయే. నాటినుండి నేటి వరకు కొనసాగుతున్న పితృస్వామ్యంలో ఇటువంటి కావ్యప్రయోజనం ఉంటుందని చెప్పటం నిరుపయోగం. కావ్యాలు చదివి కాంతాసమ్మిత హితాన్ని అవగాహన చేసుకొని బాగుపడ్డవారి విషయాన్ని తెలుసుకోవటంకూడా కష్టమే. అంటే 'కాంతాసమ్మిత' ఉపదేశం అనే కావ్యప్రయోజనానికి విలువ లేకుండా పోయింది.

నిజానికి స్త్రీలు వ్రాసే సాహిత్యాన్ని అంగీకరించే మనస్తత్వం సమాజంలో ఉండటమే కష్టం. పైపెచ్చు ఆక్షేపణీయంకూడా. అందుకే తాళ్ళపాక తిమ్మక్క, మొల్ల, ముద్దుపళని, తరిగొండ వెంగమాంబలు, దార్ల సుందరమ్మ వంటి కవయిత్రులు స్త్రీలు చెప్పిన కవిత్వాన్ని ఆక్షేపించవద్దని చెప్పారు. అదే మేరకు వారు కొన్ని సాహిత్య ప్రమాణాలనుకూడా సూచించారు.

16 వ శతాబ్దానికి చెందిన తెలుగుసాహిత్యంలో ప్రథమకావ్యయిత్రిగా చెప్పబడిన తాళ్ళపాక తిమ్మక్క తన 'సుభద్రాపరిణయమ'నే ద్విపద కావ్యంలో స్త్రీల విషయంలో పురుషులు కొట్టుకుచస్తారని చెప్పే సందర్భంలో నారదుని పాత్రచేత 'ఇంతుల కథలైననెంతవారికిని చింతింప మదిలోన చికాకు గదురు' అని అనిపిస్తుంది. ఇక్కడ ఇంతుల కథేంటి, చికాకు కలగించటంమేమిటి అని ఆలోచిస్తే ఇంతులకు సంబంధించిన విషయంలోనే ఆ చికాకు అంతా. అవసరం లేకపోయినా సందర్భాన్ని చూసుకొని తిమ్మక్క చెప్పిందంటే బహుశ స్త్రీలు కథలను చెప్పినా, వ్రాసినా నచ్చని పురుషమనస్తత్వం అర్థమవుతుంది. దాన్ని మనసులో పెట్టుకొనే కాబోలు మొల్ల కూడా తన రామాయణ కావ్యావతారికలో కావ్య లక్షణాలన్నీ తనకు తెలిసినా, తెలియదనీ అంతా దైవకృప అని ఒప్పించే ప్రయత్నంచేసింది. స్త్రీలు తమకు ఏమీ తెలియదంటేనే వారి రచనను కాస్త చదవగలుగుతారని భావించి ఉండవచ్చు.

కావ్యప్రయోజనం సిద్ధించాలంటే మొల్ల కొన్ని ప్రమాణాలను పేర్కొంటూ "తేనె సోకనోరుతీయన యగు రీతితోడనర్థమెల్లుదోచకుండ గూఢశబ్దములను గూర్చిన కావ్యమ్ము మూగచెవిటివారి ముచ్చటగును" "కందువ మాటలు సామెతలందముగాఁగూర్చిచెప్పనది తెలుగునకుంబొందై రుచియై వీనుల విందైమఱి కానిపించు విబుధులమదికిన్" అని చెప్పింది. గూఢశబ్దాలతో కూడిన రచనగాక విన్నవెంటనే అర్థమవగలగాలి అని స్పష్టంచేసింది. పాఠకుల గ్రహింపును దృష్టిలోపెట్టుకొని స్త్రీలు చెప్పిన ప్రధాన ప్రథమ కావ్య ప్రయోజనం. కావ్యప్రమాణం కూడా యిది. పాఠకులకు అర్థమయితేనే కదా కావ్యజ్ఞానం లభించేది. పైపెచ్చు భాషాపరమైన జాతీయాలతో చెప్పితే ఆ జాతిమనస్సున

హత్తుకొని అనుభూతి జ్ఞానాన్ని ఇవ్వగలగటమే సాహిత్యప్రయోజనంగా భావించింది. ఇదే కాంతాసమ్మత మైన ప్రయోజనంగా అర్థమయింది. ఇక్కడ కాంతాసమ్మతం అంటే కాంతల దృష్టిలో ఆమోదయోగ్యమైన కావ్యప్రయోజనం అని భావించాలి. దానితో సాహిత్య ప్రయోజనం సిద్ధించాలంటే ఆ హితం "కాంతాసమ్మితం"గా ఉండాలా "కాంతాసమ్మతం"గా ఉండాలా అనే మీమాంస కూడా ఏర్పడుతుంది. ఇక 'సమ్మతం' అంటే అందరికీ ఆమోదయోగ్యమైన విషయం. ఎందుకంటే ఇది ఒక సాహిత్య ప్రమాణం కాబట్టి.

17 శతాబ్దంలో స్త్రీలు సాహిత్యాన్ని వ్రాసారంటే ఆక్షేపించేవాళ్ళే ఎక్కువ. అందుకనే ముద్దుపళని తాను వ్రాసిన "రాధికాసాంత్వనమ"నే కావ్యంలో "పొత్తముననుండు శల్యములనెత్తివైచి శాస్త్రయుక్తినిగొని భేషజంబు చేయఁగ దగునాక్షేపజీవకులఁ దీర్పఁజనదు కృతులనమంగళజనులు వారు" అని పేర్కొంది. స్త్రీలు వ్రాసిన కవిత్వాన్ని లక్షణశాస్త్రదృష్టితో చూసి ఆక్షేపించేవారిని అమంగళ కవులని పేర్కొంది. ఈ కావ్యాన్ని గురించి కందుకూరి వీరేశలింగంగారు "గ్రంథములో అనేకములు స్త్రీలు వినదగినివియు, స్త్రీనోటినుండి రాదగినవియు గాక దూష్యములై యున్నవి" అని చెప్పటంలో స్త్రీలు ఎటువంటి కవిత్వం రాయకూడదో అర్థమయ్యేటట్లు చేసిన ఆక్షేపణ, ఆతర్వాత ఆ ఆక్షేపణలోని లింగవివక్షా స్వభావాన్ని బెంగుళూరి నాగరత్నమ్మ నిర్భయంగా బయటపెట్టిందనేది అందరికీ తెలిసిన విషయమే.

19వ శతాబ్దంలో ప్రాచీన, ఆధునిక సాహిత్యాలకు వారధిగా ఉన్న మహిళా కవయిత్రులలో తరిగొండ వెంకమాంబ తన "నృసింహశతకం"లో కరుణయులేక "కొందరు వికల్పకవిత్వమటంచు పల్కుదురుసరగున నీవు వారలను సమ్మతిఁజెప్పమ"ని దైవాన్ని వేడుకొంది ఇక దార్ల సుందరమ్మ వ్రాసిన "భావలింగ శతకం"లో తన కవిత్వం గురించి చెపుతూ అనుభవంబున సూటిజూచినట్టి విషయాన్ని వ్రాస్తున్నట్టును, "వినినఁజదువనింపుగా వ్రాసిన సత్యమనుగొంటిని" అని చెప్పింది. అంటే తన అనుభవంలో తాను ఖచ్చితత్వంతో తెలుసుకొన్న సత్యాన్ని కావ్యప్రమాణంగా చెప్పి, విన్నా, చదివినా యింపుగా ఉండేటట్లుగా ఆ

సత్యాన్నిగురించి వ్రాస్తున్నానని చెప్పింది. అందుకే ఆ సత్యాలన్ని మనస్సులలో నాటుకొనేటట్లు ఉంటాయి. అంతేకాదు, "కాసులాసకొఱకుఁ గపటాత్ములకులు వట్టికూతలుకూయువారు కవియే" అని కవులను ఎత్తి చూపించింది. స్త్రీల రచనలను అంగీకరించని మనస్తత్వంగల పితృస్వామ్యంలో కాంతాసమ్మిత ఉపదేశానికి తావులేదని స్పష్టం.

ఆ క్రమంలోనే కొనసాగింపుగా "కాంతాసమ్మత"మైన సాహిత్య ప్రమాణాలను పరిశీలించటం జరిగింది. ఆధునికయుగంలో మారుతున్న పరిస్థితులకు తగ్గట్టుగా సాహిత్యం ఎలా ఉంటే సాహిత్యప్రయోజనం కలుగుతుందో అనేదానికి స్త్రీలు కొన్ని సాహిత్యప్రమాణాలను ప్రతిపాదించారు. వాటిని తెలుసుకొంటేనే 'కాంతాసమ్మితతత్వ ఉపదేశానికి' 'కాంతాసమ్మతత్వమైన కావ్యప్రయోజనానికి' ఉన్న తేడా స్పష్టమవుతుంది.

20 వ శతాబ్దంలో ఎల్లేపెద్ది వెంకమ్మ "కవులేల భార్యలను వర్ణించరు" (ఏప్రిల్ 1928 విద్యానంద పత్రిక) అనే శీర్షికన వ్రాస్తూ కవులు తమ కళ్ళకు రోజూ కనిపించే తమ భార్యలను, వారియొక్క మేధావితనాన్ని వర్ణించకుండా, మనోసృష్టిలో ఊహించుకొన్న దేవతాస్త్రీలను, ఊహాసుందరులను వర్ణిస్తారెందుకని ప్రశ్నించింది. ఇక్కడ రచనలో వాస్తవికత ఉంటేనే సాహిత్యప్రయోజనం సిద్ధిస్తుందనే అభిప్రాయం వ్యక్తమయింది. ఇది ఒక గొప్ప సాహిత్యప్రమాణం.

ఈ సందర్భంలో విద్యానాథుడివంటి అలంకార శాస్త్రజ్ఞులుకూడా వాస్తవికతను పూర్తిగా అంగీకరించలేకపోయారని అతడు వ్రాసిన "ప్రతాప రుద్రీయం"లో అర్థమవుతుంది. అతడు చరిత్రప్రసిద్ధికెక్కిన రాణి రుద్రమదేవి యొక్కమనుమడైన రెండవ ప్రతాపరుద్రుని కాలంలో ఉండికూడా రుద్రమదేవి పరాక్రమం తెలిసికూడా నాయికాభేదాలను పేర్కొనేటప్పుడు "ధీరోదాత్త" అనో "వీరనాయిక" అనియో వాస్తవికనాయికాభేదాన్ని చెప్పలేకపోయాడని అనిపిస్తుంది.

ఆధునికయుగంలో సాహిత్య ప్రమాణాలను వ్యాసాలలోనేకాక వివిధ సాహిత్య ప్రక్రియలలో కూడా చెప్పటం జరిగింది.

కనుపర్తి వరలక్ష్మమ్మ వ్రాసిన 'మూడు తీర్మానాలు' (ఫిబ్రవరి 1935 భారతి) అనే కథలో దేశవిషయాలు, సంఘవిషయాలు, ఆర్థిక విషయాలు, మహాత్ముని వ్యాసాలను కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక, గృహలక్ష్మి, భారతి వంటి పత్రికలో వచ్చినవి స్త్రీలను చదివింపజేస్తున్నాయి కానీ, హాస్యపత్రికలలో స్త్రీలను కించపరుస్తూ, స్త్రీల ఆత్మగౌరవాన్ని తగ్గిస్తూ వ్రాసినందుకు అటువంటి రచయితలను, ఆ రచనలను ప్రచురించిన పత్రికలను నిషేధించి వాటిని చించి పోగులుపెట్టాలని మూడు తీర్మానాలు చేసినట్టు చెప్పింది.

సాహిత్యం సమాజాన్ని ప్రభావితం చేస్తుంది కాబట్టి, సంఘంలోనైనా సాహిత్యంలోనైనా స్త్రీల వ్యక్తిత్వాన్ని, గౌరవాన్ని తగ్గించే రచనలను నిషేధ సాహిత్యప్రమాణంగా భావించారు. నేటి ప్రసారమాధ్యమాలకు తెలియాల్సిన విషయం.

1936 సం.లో కస్తూరి రామలక్ష్మి "సాహిత్యం- దాని మహత్వము" (జులై 1936 గృహలక్ష్మి పత్రిక) అనే శీర్షికన వ్రాస్తూ-సాహిత్యానికి అర్థం జ్ఞానమనీ, భావప్రకటనకు భాష కావాలి కాబట్టి భాషావికాసం సాహిత్యం వల్లనే జరుగుతుందని చెప్పింది. అంతేకాక, జాతియొక్క శక్త్యాశక్తుల సజీవ నిర్జీవత్వాలు, సభ్యతాసభ్యత్వాలు ఆ యా భాషలయొక్క సాహిత్యమునందు నిర్ణయింపబడు చున్నవి. సాహిత్యంలేని భాష, ఆ భాషకు చెందిన జాతి అభ్యుదయజాతియని చెప్పబడదని' పేర్కొంది. అంటే సాహిత్యజ్ఞానానికి అవసరమైన భాషాప్రయోగాన్ని, భాషాప్రయోజనాన్నిబట్టి ఆ జాతి యొక్క అభ్యుదయం నిర్ధారింపబడుతుందని చెప్పింది. అంతేకాదు, 'జాతియొక్క క్షమతాబింబం చూడవలెనంటె సాహిత్య దర్పణమున చూడగలము' అని చెప్పింది. అంటే జాతియొక్క యుక్తమైన జీవనవిధానం సాహిత్యంలో ప్రతిబింబించాలని చెప్పింది. అంటే సాహిత్యంలో ఆదర్శమైన జీవనాన్ని ప్రతిపాదించాలని ఆమె అభిప్రాయం. అంతేకాదు, 'సాహిత్య రసాస్వాదనంలేని మస్తిష్కము క్రియారహితమై నిష్ప్రయోజనమై తుదకు నిర్జీవమగును' అని చెప్పి సాహిత్యం రసానుభూతిని కలిగించకపోతే తెలివి

నిర్జీవమై క్రియారహితమవుతుందని భావించింది. ఇది అలౌకికానందంకంటే భిన్నమైంది. ఆదర్శవంతమైన జీవన జ్ఞానాన్ని, భాషాజ్ఞానాన్ని కలిగించటం, క్రియాశీలదృక్పథాన్ని కలిగించటం సాహిత్యప్రయోజనంగా భావించింది.

అంతేకాక, ఈమె ఇతరదేశాలలోని సాహిత్యలక్షణాలను పేర్కొంటూ "వారి సాంఘిక, రాజకీయ, ఆర్థికసమస్యలందు గొప్పగొప్ప మార్పులకై మహానలమైనటు వంటి అలజడులను సాహిత్యంద్వారా కలగజేసి అచ్చటచ్చట దురాచారాలను త్రుంచివైచి తమ జాతిని రక్షించుకోగలిగారనీ, ఆత్మస్వాతంత్ర్య బీజాలనుకూడా నాటారని" చెప్పింది. అంటే దేశంలోని సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయాలపట్ల విప్లవాత్మక చైతన్యాన్ని సాహిత్యం కలిగించటంతోనే ఆ యా విషయాలలోని సామాజిక సమస్యలను పరిష్కరించుకోగలిగినట్లు చెప్పింది. అందుకే "సాహిత్యం ఉంటే యుద్ధసామగ్రుల అవసరం ఉండదని" ఆమె చెప్పింది. "జాతికి జీవకళను ప్రసాదించేది సాహిత్యమని, ఆర్థిక, సాంఘిక, రాజకీయ సమస్యలందు ఉత్తీర్ణులగుటకు సాహిత్యసంపాదకులను మార్గదర్శకులుగా యెంచుకొన వలయును"అని సాహిత్యాన్ని ప్రచురించే సంపాదకుల అర్హతలనుకూడా పేర్కొంది.

కస్తూరి రామలక్ష్మి మార్పుకు గురిఅవుతున్న సామాజిక చలనసూత్రాలను అర్థంచేసుకొని, ఆయాసమస్యల పట్ల విప్లవాత్మకచైతన్యాన్ని అందించటమే సాహిత్య ప్రయోజనం అని కాంతాసమ్మతమైన అభ్యుదయసాహిత్య ప్రమాణాలను ప్రతిపాదన చేసిందని అర్థమవుతుంది. అప్పటికింకా ఆంధ్రలో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడలేదు.

1938 లో పులిపాక బాలాత్రిపురసుందరి వ్రాసిన "పిల్లికి చరలాటం–ఎలుకకు ప్రాణసంకటం" (మార్చి 1938 గృహలక్ష్మి) అనే కథలో స్త్రీలను ఆటబొమ్మలుగా భావించి పత్రికలలో వేసే వారి చిత్తరువుల విషయంలో కథకులకు, పత్రికాపాలకులకు రచయిత్రి హెచ్చరిక చేసింది. కథానైపుణ్యం, కథాకౌశలం, వాక్చాతుర్యం, చిత్రరచనాదులను సద్వినియోగం చెయ్యకపోతే పత్రికాధిపులను, ముద్రాలయాలను నిషేధించాలని చెప్పింది. అంటే స్త్రీలను

కించపరచే సాహిత్యప్రచురణలను నిషేధించాలనే భావన అర్థమవుతుంది. కాంతాసమ్మతమైన నిషేధసాహిత్యం అంటే ఏమిటో ఈమె నిర్వచించింది.

1938 లో కనుపర్తి వరలక్ష్మమ్మ వ్రాసిన "కథ ఎట్లాఉండాలె" (ఏప్రిల్ 1938 గృహలక్ష్మి) అనే కథలో భార్యాభర్తల సంభాషణలో భాగంగా కథలకు ఉండవలసిన లక్షణాలను, కథాసాహిత్య ప్రయోజనాన్ని పేర్కొంది. కథలు, గేయాలు ఆధునికవిత్వంలోనే రాలేదనీ, ప్రాచీనకాలంలోనే ఉన్నాయనీ, కథలకు మాతృత్వం కలవారు కన్నతల్లులేనని చెప్పింది. కథా కుసుమం పాఠకులను ఆకర్షించేదిగా ఉండాలని చెప్పింది. దానికై కథా లక్షణాలను పేర్కొంటూ 'కల్పన అనే ఆకృతీ, వర్ణన అనే రంగు, శైలి అనే మృదుత్వం, రసమనే పరిమళం, నీతి అనే మకరందం కలిగి ఉండాలని' చెప్పింది. అంతేకాదు, 'కల్పనలో అసభ్యత ఉండకూడదనీ, సహజవర్ణన అని ఉచితానుచితాలు ఎరుగకుండా వర్ణిస్తే అసభ్యమని అనిపించుకుంటుందనీ, పాఠకులకు వెగటుపుట్టిస్తుందని' చెప్పింది. కథలోగాని ఉపన్యాసంలోగాని ఉపయోగించేవారి నేర్పును బట్టి భాష మృదువుగా ఉండాలని చెప్పింది. అంటే సాహిత్యంలో వ్యవహారిక భాష ఉండాలనే అభిప్రాయం అర్థమవుతుంది.

ఇంకా ఈమె రసాత్మకతను పేర్కొంటూ 'రసమెప్పుడు పూలలో తావి వలె వాక్యంలో మిళితమై ఉండాలనీ, ఎంతనర్మగర్భితంగా ఉంటే అంత మనోహరంగా ఉంటుందనీ, హాస్యంకోసం అకటావికటపు వ్రాతలు వ్రాసి నవ్వించకూడదనీ, రసస్ఫురణ హృదయాహ్లాదంగా ఉండాలని' చెప్పింది. 'కథకుగాని ఉపన్యాసానికిగాని మితత్వంగల రసం అవసరమ'ని చెప్పింది. అంతేకాదు, 'ప్రతిరచనలోను, ప్రతిప్రసంగంలోను నైతికమైన లేక వైజ్ఞానికమైన ఒక సత్యవస్తువుండాలనీ, అప్పుడే రచయిత శ్రమ సార్థకమవుతుందని' చెప్పింది. నవీన రచయితలు తాత్కాలికోల్లాసంకోసం ప్రణయవ్యవహారాలు తప్ప వ్రాయ లేకపోతే కథలు కథల పాఠకులు భ్రష్టుపట్టగలుగుతారని తెలిపింది. కథలు మూడురకాలుగా ఉంటాయనీ, శైలిమాధుర్యం, వర్ణనాచాతుర్యం, కల్పనా సౌందర్యం, రసౌచిత్యం, నైతికాదర్శం కలవి ఉత్తమకథలనీ, అన్ని గుణాలున్నా

నైతికాదర్శం లుప్తమైతే మధ్యతరగతి కథలనీ, చిత్తంవచ్చినట్లుగా యువతీ దర్శనంతో భావోద్రేకంలో వ్రాయబడే కథలు అధమతరగతి కథలని' చెప్పింది. 'కథ మంచి బుద్ధివైశిధ్యం, మనోహరవర్ణనా చాతుర్యంతో, పాత్రపోషణా సంవిధానంతో తయారుకావాలని, కళపేరుతో సంభాషణలోగాని, వర్ణనలలోగాని అవినీతిని చొప్పించటం తప్పు' అని చెప్పింది. 'కథ, కావ్యం, గేయం, చిత్రం, శిల్పం గాని మానవ కల్యాణానికి ఉపయోగించగల యుత్కృష్టత దానియందంత ర్గర్భితమై ఉండాలని' చెప్పింది.

కనుపర్తి వరలక్ష్మమ్మ కథాప్రక్రియయొక్క ప్రమాణాలను స్పష్టంచేస్తూ మానవకల్యాణం కథాసాహిత్య ప్రయోజనంగా ఉండాలని చెప్పింది.

1938 లో ఈమెయే వ్రాసిన "స్త్రీలు-పత్రికా రచన" (సెప్టెంబరు 1938 గృహలక్ష్మి) అనే వ్యాసంలో పత్రికారంగం ఎలా ఉండాలో కూడా చెప్తూ వ్యక్తిదూషణలు, అసభ్యపు వర్ణనలు లేకుండా సులభమైన శైలిలో, మానవ కల్యాణ ధ్యేయంగా ఉండాలని చెప్పింది. అంతేకాదు, విద్యావంతులైన స్త్రీలు పత్రికా రచనకు పూనుకోకపోవటం చేతనే మహిళాభివృద్ధికి భంగం కలుగుతోందని అభిప్రాయపడింది. ఏ దేశమందైనా, జాతీయసౌధ నిర్మాణానికి స్త్రీలే పునాదులని చెప్పింది. పైగా ఎవరి జిల్లా వాడుకభాషలో వారు వ్రాస్తే మిగిలిన జిల్లాలవారికి కష్టమనిపిస్తుందని భావించింది. స్త్రీల కష్టాలను ఊహించి వ్రాసేవారు పురుషులనీ, అనుభవించి వ్రాసేవారు స్త్రీలని చెప్పింది. పౌరాణిక స్త్రీలను అవమానపరిచే వ్రాతలు కనిపిస్తున్నాయనీ, స్త్రీలు సంపాదకత్వాన్ని వహించి స్త్రీలఅభ్యుదయాన్ని గురించిన వ్యాసాలు వ్రాస్తారని చెప్పింది. స్త్రీలు పత్రికా సంపాదకులుగా ఉంటే స్త్రీలను అగౌరవపరిచే విషయాలను ప్రచురించరనీ, స్త్రీలమనోభావాలను అణచివేయరనీ, అప్పుడే అవి కాంతాసమ్మత ప్రమాణాలతో ఉంటాయని భావించాలి.

1938 లోనే పసుపులేటి లలితాదేవి "స్త్రీలు పత్రికాసంపాదకులుగా ఉంటే" (అక్టోబరు1938 గృహలక్ష్మి) అనే వ్యాసంలో దేశక్షేమం స్త్రీలపై ఆధారపడి ఉంటుంది కాబట్టి, స్త్రీలకు సులభంగా అర్థమయ్యే రీతిలో లౌకిక,

నైతిక, ఆర్థిక, రాజకీయ విషయాలను బోధిస్తే, కాలానుగుణంగా దేశానుగుణంగా వస్తున్న మార్పులకు తగినట్లుగా స్త్రీల భావాలలో రావలసిన మార్పును సూచించ గలగటమే సాహిత్యప్రయోజనంగా భావించింది. అందుకని స్త్రీలే వ్యాసాలను వ్రాసి పత్రికల ద్వారా తెలియచేయాలని భావించింది.

1938 లో ఆచంట సత్యవతమ్మ "అభ్యుదయానికి అవసరమైన రచనా విధానం" (అక్టోబరు 1938 గృహలక్ష్మి) అనే శీర్షికన వ్రాస్తూ, రాజ్యము, రాష్ట్రము, స్వాతంత్రేచ్ఛ, రాష్ట్రాదాయవ్యయ విమర్శనాదికములు స్వకీయ, పరకీయంగా వ్యయమగుచున్న విషయాలు దేశచారిత్రక విషయాలు, స్త్రీల అభ్యుదయానికి అనుకూలించే విజ్ఞానాన్ని అందించే రచనలు ఉండాలని చెప్పింది. అంటే స్వాతంత్ర్యంయొక్క స్వభావాన్ని, దేశఆర్థికవిషయాలను కూడా రచనలో పొందుపరిస్తే ప్రజలకు అభ్యుదయం ఉంటుందనీ, అలాంటి అభ్యుదయ సాహిత్యం రావాలని ప్రామాణీకరించింది. ఆర్థికవ్యవస్థకు ప్రజల అభ్యుదయానికి ఉన్న సంబంధాన్ని ప్రతిపాదిస్తూ, ప్రత్యేకంగా స్త్రీలఅభ్యుదయం సాహిత్య ప్రయోజనంగా ఉండాలని భావించింది.

1938 లో మో. మాణిక్యాంబ వ్రాసిన "స్త్రీల అభ్యుదయము-రచనలు" నే వ్యాసంలో స్త్రీల అభ్యుదయం కావాలంటే స్త్రీత్వంతో, భారతీయత్వంతో ఉద్రేకపూరితాలయిన రచనల అవసరం ఉందని తెలిపింది. బోనులో మగ్గిన భారతసింహాలను స్వరాజ్యసమరాగ్నిలో దూకించటానికి ఆంధ్రస్త్రీగా వీర, శాంతి, సత్య, దయా, శౌచములను వెల్లడించే రచనలు రావాలంది. ఇది దేశస్వాతం త్ర్యోద్యమ సమయంలో చెప్పిన సాహిత్యప్రమాణం. ఆడంబర రచనలుకాక 'త్రికరణశుద్ధిగా స్త్రీల అభ్యుదయాన్ని కోరే సోదరసోదరీమణులందరు వ్యహారభాషాయుక్తమై హాస్యరసప్రధానమై, ఏకాంకిక, కథానిక, వ్యాసఘటనా, గేయరూపాలతో గూడిన రచనారసగుచ్ఛాలను స్త్రీలోకానికి దయచేయాలి. పసిబిడ్డల జోలపాటల్లో లగాయితు కర్షకుల పొలిపాటలవరకు స్త్రీల అభ్యుదయ భావరసాన్ని నింపాలి. తర్వాత స్త్రీల హృత్తంత్రులను మ్రోగించాలి. స్త్రీల అహంను రేకెత్తించాలి. అట్టి భావరచనలే స్త్రీలఅభ్యుదయాన్ని ఉద్భవింప చేసేవనడంలో

పొరపాటుండదు.' అనిరచయిత్రి నిష్కర్షగా తన అభిప్రాయాన్ని చెప్పింది. అంటే స్త్రీలలో వక్తిస్వాతంత్ర్యాన్ని ప్రబోధించే రచనలు రావాలని భావించింది. అన్ని సాహిత్య ప్రక్రియలలోను వ్యవహారికభాషలో స్త్రీలలో, అన్నివర్గాల ప్రజలలో అభ్యుదయభావాలను రేకెత్తింప చేయటమే సాహిత్యప్రయోజనంగా భావించింది. అప్పుడే సాహిత్యంలో ప్రజాస్వామిక భావాలు అభివృద్ధిచెంది మానవసంధాలు పటిష్టమౌతాయనే కాంతాసమ్మతణంగా అర్థమవుతుంది..

1939 లో గుమ్మడిదల దుర్గాబాయమ్మ "స్త్రీజాతి దృక్పథం" (జూన్ 1939 గృహలక్ష్మి) అనే వ్యాసంలో "స్త్రీజనసమస్యలపై అనేక గ్రంథాలు కనపడతాయి. కాని పురుషజాతి సమస్యపై వెతికిపట్టుకొందామన్నా పుస్తకం దొరకదనీ, వింతయేమిటంటే మహిళాసమస్యలపై గల గ్రంథాలన్ని నిజానికి పురుషజాతి సమస్యలకు సంబంధించినవై – అంటే స్త్రీజనాభివృద్ధికి పురుషులు ఏమి చెయ్యాలి అనే విషయాన్నిచర్చించేవే ఈ అన్ని పుస్తకాలు." అని చెప్పింది. అంటే స్త్రీపురుషుల సమస్యలపరిష్కారానికై పురుషుల కర్తవ్యం సాహిత్యంలో నిర్దేశింపబడటమేసాహిత్య ప్రయోజనంగా చెప్పింది.

1940 లో "స్త్రీ వాఙ్మయము" (జులై 1940 గృహలక్ష్మి) అనే శీర్షికన చేబ్రోలు సరస్వతి వ్రాస్తూ పరదేశీయుల పాలన కారణంగా వాఙ్మయ ప్రపంచంలో మొల్ల, తరిగొండ వెంకమాంబ, ముద్దుపళని కవయిత్రులు చెలరేగే కాలంలో 'స్త్రీ వాఙ్మయమెట్టి పరిణామం చెందియుండునో ఇదమిత్థమని నిర్ణయింప దలచినట్లు ఆధారంలేదు. నేడు ఆంధ్రవనితలు చక్కని పద్యములు, రసవంతమైన గద్యములు వ్రాసి వన్నెకెక్కుతున్నారు కాని తక్కువమంది ఉన్నారని చెప్పింది. ఆంధ్ర వాఙ్మయారామంలో స్వేచ్ఛగా సంచరించే మార్గాలను స్త్రీలు కనిపెడుతున్నారని చెప్పింది. సోదరీమణులు మాతృభాషకు ప్రాధాన్యతనిచ్చి సారస్వత సేవకులవ్వాలని భావించింది జాతీయతకు. వాఙ్మయానికి అవినాభావ సంబంధ మెల్లకాలముంటుందనీ, తొక్కుకవిత్వం, ఖండకావ్యములు వెలువడినంత మాత్రాన సంపూర్ణ వాఙ్మయం కానేరదని భావించింది. రచనయందు సాహితీ లక్షణముల యందును సిద్ధహస్తులైన సోదరీమణులున్నప్పటికీ, స్త్రీవాఙ్మయ

నిర్మాణం జరగలేదనీ దానికై పూనిక వహించాలని పిలుపునిచ్చింది. జాతీయతను, స్త్రీలస్వేచ్ఛను పెంపొందిచటం సాహిత్య ప్రయోజనంగాను, అదే సాహిత్య ప్రమాణంగా భావించింది. అందుకే మరింతగా స్త్రీల సాహిత్యం రావాలసిన అవసరాన్ని చెప్పింది.

1940 లో "సజీవమైన వాఙ్మయం కావాలి-కవిత్వమున్నది కాని నిర్మాణంలేదు" (అక్టోబరు 1940 గృహలక్ష్మి) అనే శీర్షికన రోహిణి వ్రాస్తూ, ప్రాచీన వాఙ్మయంతో తులతూగే విధంగా నేటి వాఙ్మయం ఉండటంలేదనీ, పురుషులతో నిర్మింపబడ్డది ఉందిగాని స్త్రీలచే నిర్మింపబడ్డది ఏదీ లేకపోవటం దౌర్బల్యమని చెప్పింది. వాఙ్మయప్రపంచంలో స్త్రీలకుసంబంధం తక్కువగా ఉన్నదని భావించింది. ఆధునికరచన పూర్వపు దారిని పోయినదేతప్ప స్వతంత్ర రచన కానరావటంలేదనీ, కవిత్వం ఉన్నా నిర్మాణం లేదని భావించింది. భావకవిత్వం తాటాకుమంటల పొంగుగా చూడబడుతోందని సరియైనపంథా లోపించిందని భావించింది. శాశ్వతంగా నిలిచి క్రొత్తదనానికి మార్గదర్శకత్వం కాగలిగిన గ్రంథాలు నిర్మితంకావాలనీ, పరదాస్యప్రకృతి అనే తమస్సులో ఉండక ఇది సజీవమైనవాఙ్మయం, ఇది స్త్రీలచే నిర్మాణమైందని చెప్పుకోగల రచన సృష్టింపబడాలని చెప్పింది. స్త్రీల యొక్కసాహిత్య సృష్టిలో మార్గదర్శకమైన ఒక నూతనత్వం ఉండాలని ప్రతిపాదించింది. దానిని సాహిత్య ప్రయోజనంగా భావించింది. కాలానుగుణంగా నూతన మార్గదర్శకత్వాన్ని సూచించే స్వతంత్ర రచనలు రావటమే కాంతాసమ్మతప్రమాణంగా భావించాలి.

1940 లోనే వట్టికొండ విశాలాక్షి "సజీవమైన వాఙ్మయం కావాలి- అనే శ్రీమతి 'రోహిణి'గారి సారస్వత హెచ్చరికకు కొత్త వెలుగులు" (డిశేంబరు 1940 గృహలక్ష్మి) అంటూ వ్రాసిన వ్యాసంలో మంచి సాహిత్యం సన్నగిల్లటానికి కారణం జాతిదౌర్బల్యం అని చెప్పింది. సాహిత్యమెప్పుడు ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులపై ఆధారపడి ఉంటుందనీ, సాహిత్యవికాసం కలగక పోవడానికి జాతి దౌర్బల్యమేకాని, వ్యక్తిదౌర్బల్యం కాదని చెప్పింది. ఆ యా జాతుల స్థితిగతుల్ని బట్టి, వారి వారి భాషల్లో కాలానుగుణ్యంగా పరిణామం

కల్గతూనే ఉందనీ, సాహిత్యం ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించాలని చెప్పింది. విద్యావిహీనులు కాబట్టి కవులు రాజాశ్రితులుగా ఉన్నారని భావించింది. అందువల్ల ప్రాచీన సాహిత్యంలో ప్రజాభిప్రాయంకంటే రాజాభిప్రాయం రాణించిందనీ, నన్నయ, గురుతుల్యుడనీ, తిక్కన 'గురువు, అమాత్యుడుగాకూడా ఉన్నాడని, శ్రీనాథుడు రాజాభిప్రాయం, ప్రజాభిప్రాయంగలకవి కాబట్టి శృంగారనైషథ' మేకాక, 'పల్నాటిచరిత్ర'ను వ్రాసాడని, రాయలభోగాసక్తినిబట్టి శృగారరసకవిత్వం వచ్చిందనీ, రాజరికం క్షీణత నొందినప్పుడు సాహిత్యం క్షీణతను పొందిదని చెప్పింది. పాశ్చాత్యభాషా సంపర్కంతో సాహిత్యం కావ్యాలు, గేయాలు, నాటకాలు, నవలలు, వ్యాసాలు, కథలు, చరిత్రలు, స్వీయచరిత్రలు మొదలైన సర్వాంగాలతో దినదినాభివృద్ధి చెందుతోందని, అనేక నూతన పంథాలలో రచనలు వస్తున్నాయి కాని స్త్రీల రచనలు తక్కువగా ఉన్నాయని భావించింది. పురుషలతోపాటు స్త్రీలకు రాజకీయ, సాంఘిక, ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవటమేననీ, ఘోషాలు తగ్గి సమానహక్కులు ఉంటే స్త్రీలు ఏమాత్రం రచనలో తీసిపోరని చెప్పింది. ప్రజాభిప్రాయాన్ని వ్యక్తంచేసే సాహిత్యం రావాలని భావించింది. స్త్రీలకు సమానహక్కులు ఉంటే స్త్రీలసాహిత్యం మరింతగా సృజింప బడుతుందని భావించింది. అంటే సాంఘిక, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యం స్త్రీలకు ఉన్నప్పుడు మంచిరచనలు వస్తాయనీ, అప్పుడు ప్రజాభిప్రాయం సాహిత్య ప్రయోజనంగా ఉంటుందని ప్రామాణీకరించింది.

1941 లో భావరాజు రాజరత్నమ్మ వ్రాసిన 'చర్చ' అనే నాటకంలో ఒకస్త్రీ, ఒకపురుషుని సంభాషణలో భాగంగా స్త్రీపురుషుల యందుండే మృదుత్వం ప్రేమవంటి స్వభావాలలో తేడా ఉంటుందనే విషయం దేశభాషలసాహిత్యంలో అర్థమవుతుందనీ, సంఘంవలన స్త్రీహృదయానికి బాధకలిగినప్పుడు ప్రతిక్రియ ఉంటుందనీ, అటువంటి ద్వంద్వాలను తీసుకొని సమస్యామూలకములగు నవలలు రచింపబడుతున్నాయని చెప్పటం జరిగింది. స్త్రీలహృదయంలో ప్రేమస్వభావం ఉన్నా కూడా దానిని బాధిస్తే అక్కడే ద్వేషంకూడా పుడుతుందనీ, అందుకే స్త్రీలకు ఉండే ప్రేమ, పగ అనే భావాలు సాహిత్యంలో ప్రతిఫలిస్తాయని

అభిప్రాయపడింది. అంటే పితృస్వామ్యంలోని సమస్యామూలకములగు విషయాలను వ్యతిరేకించే భావాలతో సాహిత్య రచనలు వస్తేనే సాహిత్య ప్రయోజనం ఉంటుందని చెప్పింది. ఇక్కడ కాంతాసమ్మితత్వానికి, కాంతాసమ్మ తత్వానికి ఉన్న తేడా స్పష్టమయింది.

1943 వట్టికొండ విశాలాక్షి వ్రాసిన "అభ్యుదయగీతాలు" అనే కవితా సంపుటిలో 'నవకవీ' అనే గీతంలో 'వీరవనితల చరిత వేయిరీతులపాడి స్త్రీజాతి మేల్కొల్పి తీర్చుకో నీ ఋణం' అని ఆధునిక కవిని సంబోధిస్తూ తెలిపింది. అంతేకాదు, 'కనుమోయి నీచుట్టు కలత చెందే ప్రజల ఆహారమే లేక అలమటించే ప్రజల' గురించి వ్రాసి సారస్వతాన్ని సత్పథము త్రొక్కింపచేయమన్నది. స్త్రీజాతిని మేలుకొలిపే సాహిత్యం, తిండిలేని పేదప్రజలను గురించిన సాహిత్యం రావాలనీ, అదే అభ్యుదయ కవిత్వమని చెప్పింది.

1946 లో వట్టికొండ విశాలాక్షి వ్రాసిన "శపథం" (తెలుగుతల్లి పత్రిక మార్చి, 1946) అనే కవితలో "హృదయనేత్రముకగుపడేదీ, హృదయసీమల కెగబడేదీ, కష్టనిష్ఠుర లోకవృత్తము కావ్యవస్తువుగా" చేసుకొని జగత్తునకు అభ్యుదయ మొనర్చుమని చెప్పింది. అంతేకాదు, తాను "కష్టములు ఎన్నైనారానీ, నిష్ఠురములెన్నైనారానీ, ఇష్టపడి స్త్రీజాతికొరకే కష్టపడగలన"ని కవితా శపథం చేసింది. అంటే మానవాభ్యుదయం అందులోనూ మహిళాభ్యుదయం సాహిత్యం ప్రయోజనంగా ఉండాలని ఆకాక్షించింది. ప్రజల అభ్యుదయాన్ని కోరుకోవటమే సాహిత్యప్రమాణంగా భావించింది.

స్త్రీలసాహిత్య విమర్శ ప్రమాణాలలో 1936 నుండి మార్క్సిజమ్, సోషలిజమ్ ప్రభావం కనపడుతుంది. 1943లో ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘం ఏర్పడిన తరువాత అభ్యదయ కవిత్వం యొక్క ప్రాధాన్యత పెరిగింది.

ఆధునిక కాలంలో మారుతున్న సామాజిక చలన సూత్రాలకు అనుగుణంగా స్వేచ్ఛా, స్వాతంత్ర్య భావాలు, ప్రజాస్వామిక ఆలోచనలు పెరిగి సమసమాజ హితం కోరుకుంటూ సమాజసంస్కరణ, అభ్యుదయభావాలు

ఏర్పడ్డాయి. ఆ క్రమంలోనే కావ్యతత్త్వానుశీలన దశకు చేరిన విమర్శ సంస్కృతీ సంస్కరణదిశగా సాగటం, మానవసంబంధాలలోని ఆర్థిక అసమానత్వాలు స్పష్టమై మార్క్సిజం దిశగా సాగి సాహిత్యప్రమాణాలను సూత్రీకరించటం జరుగుతోంది.

1960ల నుండి అంతర్జాతీయ ప్రభావంతో మార్క్సిజమ్ దృక్పథంతో సాహిత్య సూత్రాలు అభివృద్ధిచెంది, వాటి మౌలికత విస్తరించి అర్థవాద(ఆర్థిక), అస్తిత్వవాద, స్త్రీవాద, దళితవాద, బహుజనవాద పక్షంగా సాహిత్యం ఉండాలనీ, ప్రాదేశిక సాహిత్యంగాను వన్నెకెక్కుతోందని పలువురు అభిప్రాయపడుతున్నారు. రంగనాయకమ్మ, ఓల్గా వంటివారు సాహిత్యప్రమాణాలను ప్రతిపాదిస్తూ రచనలు చేస్తున్న విషయం తెలిసిందే. చివరకు ఆర్థిక పునరుత్పత్తి రాజకీయాలను గుర్తించిన స్త్రీవాదసాహిత్యం నూతన పోకడలు పోవటం జరిగి, సాహిత్య ఆకాశంలో సగంగా వ్యాప్తిచెందింది. ప్రపంచీకరణసందర్భంలో మారుతున్న ఆర్థిక-రాజకీయ, సామాజిక-సాంస్కృతిక పరిస్థితులలో కుల, వర్గ, ప్రాంతీయముల వంటి అసమానతలను వ్యక్తం చేస్తూ సాహిత్యసృజన విస్తరించింది. కాలప్రవాహంలో స్త్రీలు కొట్టుకుపోకుండా తమకున్న పరిధిలోనే మానవాభివృద్ధి కలిగేలా జాతిని చైతన్యపరచటమనే సాహిత్యప్రయోజనం. దానినే సాహిత్యప్రమాణంగా భావిస్తూ సాహిత్యనిర్మాణం జరగాలి.

# 12. ఆఁడుమలయాళం - అంతర్గత సంస్కారం

జగమెరిగిన సంఘసంస్కర్తయైన కందుకూరి వీరేశలింగం సం.1848 నుండి 1919 వరకు జీవించారు. వీరి రచనగా 1879లో మొదలైన సత్యరాజా పూర్వయాత్రలో ఒక ప్రకరణంగా చెప్పబడిన గాథ 'ఆఁడుమలయాళం'. భారతదేశంలోని స్త్రీలు పురుషులతోపాటు సమానంగా జీవించలేకపోతున్న విషయాన్ని అవగాహన చేసుకొన్న వీరేశలింగం దానికి కారణాలు అన్వేషించారు. ముందుగా స్త్రీ విద్యావశ్యకతను గుర్తించి దానికై పూనుకొని 1873లో 'పురుషార్థ ప్రదాయినీ' అనే పత్రికలో స్త్రీ విద్యను గురించిన వ్యాసం వ్రాశారు. 1874లో స్త్రీ విద్యాప్రచారానికై 'వివేకవర్ధని' పత్రికను స్థాపించారు. 1874 నుండి స్త్రీవిద్యతో పాటు స్త్రీపునర్వివాహాన్ని ప్రతిపాదించారు. ఇది తరతరాలుగా పితృస్వామ్య సంస్కృతిని జీర్ణించుకున్న సమాజానికి కంటకింపుగా తయారయి వీరిని వెలివేయటం కూడా జరిగింది. వారి హేళనకు విరుగుడుగా 'ఆఁడు మలయాళం' అనే వ్యంగరచనకు కందుకూరి వీరేశలింగంగారు పూనుకున్నారని భావించవచ్చు. పురుషాధిక్యతను సమర్థించే వారి వెన్ను విరిచి సరిగ్గా ఆలోచింపచేసే రచన కూడా ఇది.

బ్రిటిష్ పాలన నుండి దేశవిముక్తికై తిరుగుబాటు ప్రారంభించిన రోజులవి. 1858లో బ్రిటిష్ రాణి యొక్క విక్టోరియా భారతదేశంలో ఉదారవాదమానవ సంబంధాలు ఏర్పరచుకోవటానికై వారి భాష నేర్పటానికి పాఠశాలలను, ప్రత్యేకంగా బాలికా పాఠశాలలను ఏర్పాటుచేసింది. స్త్రీలుకూడ

పాఠశాలకు వెళ్ళి చదువుకోవాలని ఈశ్వరచంద్ర విద్యాసాగర్ పూనుకోగా దానికై దక్షిణాదిని వీరేశలింగం నడుంకట్టారు. వీరేశలింగం గారి దృష్టిలో "దేశభక్తి, దేశాభిమానం అంటే దేశంలోని జనులమీద అభిమానం ఉండటం" 'జన సామాన్యముయొక్క స్థితి బాగుపడితేనే దేశాభివృద్ధి ఉంటుందనీ', 'స్త్రీలను పురుషులను సమానంగా గౌరవించుకున్నంతకాలము మనదేశమెంతో యున్నత స్థితిలో ఉండేదనీ', "క్రూరములైన కులాచారములకు దాసులమై మనయింట నుండు స్త్రీల కష్టములను నివారింపలేని వారము రాజ్యాంగ స్వాతంత్ర్యము పొంది దేశము యొక్క కష్టములందెట్లు విహరించగలమని" వీరేశలింగం 1885 లోనే ప్రశ్నించటం వారి క్రాంత దర్శనానికి నిదర్శనం. ఈ నేపథ్యం నుండి వీరేశలింగం గారు రచించిన 'ఆఁడుమలయాళం' రచనను అర్థం చేసు కుంటేనే వ్యంగలక్షణంతో చెప్పిన ఆ గాథలోని అంతర్గత సంస్కారం కనువిప్పును కల్గిస్తుంది. ఏదేశం లోనైనా పురుషులకు గానీ, స్త్రీలకుగానీ ఏకపక్షమైన ఆధిపత్యధోరణి ఉంటే ఆ సమాజం అభివృద్ధి చెందదనీ, ఆంధ్ర దేశములో పురుషాధిక్యత స్త్రీలకష్టాలకు కారణమని భావించి, పితృస్వామ్యాన్ని తిరగమరగ వేస్తే ఎలా ఉంటుందో చూపించాలనుకున్నారు. అందుకని నాటికి మాతృస్వామ్య వ్యవస్థ ఆనవాళ్ళు ఉన్న మళయాళ దేశాన్ని ఉదాహరణగా చెబుతూ స్త్రీల అభివృద్ధికి నిరోధకమైన పితృస్వామ్యాన్ని ఎండగట్టటం చేసారు. ఇదొక సాహస సాహిత్యగద్య ప్రక్రియ. నాణానికున్న బొమ్మను తిరగేస్తే బొరుసు గురించి తెలుస్తుంది. రెండువైపుల పదునున్న కత్తివంటి రచన. తనరచనను పితృస్వామ్య సమాజం చదివితేనే ప్రయోజనం ఉంటుంది కాబట్టి పాఠకుల మనస్సును తనవైపు త్రిప్పుకొనే క్రమంలో వజ్రాన్ని వజ్రంతో కోయాలనుకొని వారి వ్యతిరేక ధోరణికి ఎదురుగా ప్రతిగా వ్యతిరేకధోరణిని తోనే ప్రారంభించి కృతకృత్యులయ్యారు. 'ఆఁడుమలయాళం' పేరు పెట్టటంతో పురుషులకు సహజంగానే ఆసక్తి ఏర్పడుతుంది. అందుకే నాస్తికులు అర్థం చేసుకోరు గానీ, ఆస్తికులు సాంప్రదాయ వాదులైన వారు అర్థం చేసుకుంటారంటూ పాఠకులను ఆకర్షిస్తూ మొదలుపెట్టే క్రమం కనపడుతుంది. మలయాళదేశంలోని స్త్రీలఆధిపత్య ధోరణిని చదువు తున్నప్పుడే దానంతటదే మన ఆంధ్ర దేశంలోని స్త్రీలను నిజంగా కష్టపెడుతున్న

పురుషాధిక్య భావాలు గుర్తుకొచ్చి గుచ్చుకొని మానవసంస్కారాన్ని తట్టి లేపుతుందనటం అతిశయోక్తికాదు. వీరేశలింగం సత్యరాజుపాత్రలో పరకాయ ప్రవేశంచేయటం ఈ 'ఆఁడుమలయాళం'లో కనపడి పాఠక సంస్కారాన్ని తట్టిలేపుతుంది. పితృస్వామ్య సంస్కృతికి గొడ్డలిపెట్టు వంటి రచన ఇది. 'జైమిని' భారతంలో ప్రమీలరాజ్యం వంటిది ఆ 'ఆఁడుమళయాళం' అనే దేశం.

ఆచార వ్యవహారాలుగల బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిన సత్యరాజు హూణ (ఇంగ్లీషు) విద్యనభ్యసిస్తున్న క్రమంలో ఆచారాలను వారసత్వ సంస్కృతిగా ఆచరిస్తున్నా వాటిలోని దోషాలు మనస్సుకు బాధను కలిగిస్తున్నా బింకంగా బతుకుతాడు. భార్య మరణానంతరం ఆర్థిక బాధలెదుర్కొన్న సత్యరాజు అప్పుల బారినుండి తప్పించుకునే క్రమంలో తాను వింతవిషయంగా విన్న మళయాళ దేశానికి చేరుకొంటాడు. 'ఆఁడుమలయాళం' దేశపు వింతలుగా చెప్పుకునే విషయాలలో భాగంగా ఆ దేశంలో స్త్రీలకు మగవాళ్ళ అవసరం లేకుండానే గాలికి బిడ్డలు పుడతారనీ, బ్రాహ్మణులు ఆడపిల్లలకు రజస్వలానంతరం వివాహం చేస్తారనీ, శూద్రస్త్రీలు పైటలు వేసుకోరనీ, స్త్రీలలో చాలామంది పెళ్ళిళ్ళు లేకుండానే మనసుకు నచ్చిన వాళ్ళను ఉంచుకొని మనను వచ్చినప్పుడు వదిలిపెడుతుంటారనీ, పురుషులకు ఆస్తిలో భాగం లేకుండా స్త్రీలకే ఉంటుందనీ, కన్నకొడుకుల కంటే ఆడుబిడ్డకు పుట్టిన కొడుకులే పుట్టింటికి వస్తుంటారనే విషయాలు సత్యరాజు మునుపు వినియుండటంతో వింతగా నూతనంగా అనిపించి ఆ దేశాన్ని సందర్శించాలనుకుంటాడు. ఆంధ్రదేశంలోని పితృస్వామ్య సమాజానికి అదినిజంగా వింతైన విషయమే.

సత్యరాజు కష్టపడి ప్రయాణంచేసి మలయాళదేశాన్ని చేరుకుంటాడు. అక్కడ స్త్రీలు ఆంధ్రదేశంలోని పురుషులవలె లాగు చొక్కాలు వేసుకొని చేతిలో కర్రలతో కనపడి తనని బంధించే సరికి వారిని పురుషులను కుంటాడు. ఆ తర్వాత వారి యొక్క నవనాగరికురాలైన యజమానురాలు వచ్చి ఔదార్యంతో అన్నపానాదులు సమకూర్చుతుంది. వెంటనే వారు ఆడవాళ్ళ వేషధారణలోకి మారుతారు. దానిని చూసి తాను విన్నట్టుగా ఇక్కడ గాలికి పిల్లలు పుట్టే విషయం

అబద్ధమనే నిర్ణయానికి వస్తాడు సత్యరాజు. పాఠకులకు ఆంధ్రదేశంలో స్త్రీల ఉనికికి గుర్తింపు లేనట్లే అక్కడ పురుషులకు గుర్తింపు ఉండదని అతనికి అర్థం అవుతుంది. ఆంధ్రదేశంలో పురుషులలాగా అక్కడి స్త్రీలు ఉన్నారు. యాజమాన్యం స్త్రీలది, రాజ్యపరిపాలన, రాజకీయోద్యోగులు, సైనికులు, విద్వాంసులు అందరూ స్త్రీలే. స్త్రీలే సర్వస్వతంత్రులు. వారికి పురుషులు దాసులు. ఆ మళయాళదేశంలో అలాంటి పరిస్థితిని గ్రహించిన సత్యరాజు ఆ దేశపు పురుషులకు స్వాతంత్ర్యం నిలబెట్టాలనుకుంటాడు. పాఠకులకు వెంటనే మనదేశంలో అలా కష్టపడుతున్న స్త్రీలకు స్వాతంత్ర్యం ఉంటే బాగుంటుందనే అభిప్రాయం కలగక మానదు. ఆంధ్రదేశంలో సంస్కర్తలవలె ఆ మలయాళదేశంలోనూ దొరతనం (బ్రిటిష్) పరిపాలనలో నవనాగరిక స్త్రీలు పురుషుల విద్యావశ్యకతను గుర్తిస్తారు. కాని ఆ దేశపు పూర్వాచారాలను సంప్రదాయాలను కాపాడే స్త్రీలు పురుషులు విద్యను వ్యతిరేకిస్తారు. పురుషులకు విద్యనేరిస్తే చెడిపోతారనీ భావిస్తారు. వెంటనే పాఠకులకు ఆంధ్రదేశంలో కూడా స్త్రీవిద్యను వ్యతిరేకించేవారు కళ్ళముందు కనపడక తప్పదు. ఆంధ్రదేశంలో ఆడపిల్లలను పాఠశాలకు పంపనట్లే అక్కడ పురుషులను పంపరు. పురుషవిద్యను అభివృద్ధి చేయాలని దొరతనం వారు పాఠశాలలు పెట్టి ఉపాధ్యాయురాళ్ళను నియమిస్తారు. కాని వారు పురుషులకు "పత్నీవ్రత ధర్మబోధిని" పత్నీవ్రత ధర్మాలను, పూజలు, నోములను మాత్రమే నేర్పేవారు. బీదరాలైన ఉపాధ్యాయురాలు మాత్రమే పురుషులకు బోధించటానికి ఒప్పుకునేది. స్త్రీలకు పురుషులు బానిసలనే ధర్మాన్ని నేర్పేవారు. ఒకవేళ మన ఆంధ్రదేశంలో కూడ నాడు స్త్రీలను పాఠశాలకు పంపినపుడు, వారికి కేవలం పతివ్రతా ధర్మాలు, ఆచరించవలసిన నోములను మాత్రమే బోధించేవారనే విషయం పాఠకులకు గుర్తుకువస్తుంది.

సత్యరాజు మలయాళదేశము నందలి 'రంఢీ' భాషను నేర్చుకోవటానికి నవనాగరికురాలైన యజమాని సహాయంతో పాఠశాలలో చేరుతాడు. కాని తనతో పాటు వేరొక పురుషుడు మాత్రమే పాఠశాలలో చేరాడు. ఆ మిత్రుడు ఇక్కడ బడిలో పాఠాలు నేర్చుకొన్నా ఇంటి దగ్గర మాత్రం సాంప్రదాయాచారాలు పాటిస్తూ పిండివిసరటం, కూరలు తరగటం, వంట చేయటం వంటి పనులను చేసేవాడు.

పాఠశాలలో చదువుకుంటున్న సత్యరాజును ఆ ఉపాధ్యాయురాలు 'భోగ పురుషుడని' భావించింది. ఆ దేశంలో భోగపురుషులంటే 'స్త్రీలు' తమ లైంగికతకై ఏర్పరచుకున్న వ్యవస్థలోని వారు పాఠకులకు వెంటనే ఆంధ్రదేశంలో స్త్రీలు చదువుకుంటుంటే వారిని వేశ్యలుగా భావించేవారనేది గుర్తుకువస్తుంది. సత్యరాజు చదివే పాఠశాలలో చెప్పే "పత్నీ ధర్మబోధిని" లో విషయాలను పురుష విద్యార్థులకు బోధిస్తూ 'పత్నియే (భార్య) దైవమనీ, పత్నీ సేవ నిరంతరం చేస్తే ఇహపరాలలో సుఖం కల్గుతుందనీ, పత్నికంటే ముందులేచి నదికి వెళ్ళి స్నానం చేసి, ఆ నీళ్ళు తెచ్చి పత్నీపాదసేవనం చేయాలనీ, ఆ పాద తీర్థాన్ని తీసుకోవాలనీ అప్పుడే పురుషులకు మోక్షం వస్తుందని చెప్పటం జరుగుతుంది. దానితో సత్యరాజుకు మన ఆంధ్రదేశంలో చెప్పుకొనే 'నాలాయని' కథ గుర్తుకువచ్చిందట. ఆ కథలో కుష్టువ్యాధిగ్రస్తుడైన ముద్గలుని భార్యయైన నాలాయని, భర్త తిన్న కంచంలో మిగిలిన అన్నాన్ని తింటున్నప్పుడు భర్త వేలు తెగిపడ్డా దానిని తీసి తిన్న పతివ్రతగా చెప్పుకున్న విషయం గుర్తుకు వచ్చింది. సత్యరాజుకు కోపంవచ్చి వారి 'పత్నీధర్మ బోధిని' వంటి కథలు చెప్పే పుస్తకాన్ని తగలబెట్టాలనిపించిందట. ఆంధ్రదేశంలోని 'నాలాయిని' కథను సత్యరాజు తన ఉపాధ్యాయురాలికి చెబితే ఆమె 'మీ దేశంలో స్త్రీలను బాధలు పెట్టటానికి రాక్షసులు సృష్టించిన కథల'ని తేల్చిచెప్పింది. ఇక్కడ రచయితకు పితృస్వామ్యసంస్కృతిపై ఉన్న ద్వేషాన్ని పాఠకులు గ్రహించాలి.

ఒకరోజు సత్యరాజు తన ఉపాధ్యాయురాలితో "మలయాళదేశంలో స్త్రీలు బలవంతులా? పురుషులు బలవంతులా?" అని సందేహనివృత్తి చేసుకోవాలనుకుంటాడు. ఎందుకంటే మనదేశంలో స్త్రీలు శారీరకంగా అబలలనీ, పురుషులు బలవంతులనీ, అందుకే పురుషులకు స్త్రీలు లొంగి ఉండాలనే భావన బలంగా ఉంది కాబట్టి సత్యరాజుకు ఆ సందేహం వచ్చింది. దానికి ఆ ఉపాధ్యాయురాలు 'మా దేశంలో పురుషులు బలవంతులని వారు అలాగే ఉండాలి. ఎందుకంటే పెళ్ళయి భార్య వచ్చే సమయానికి అన్ని పనులు చేయగలిగిన సమర్థులుగా ఉండాల్సిన అవసరం ఉందనీ, వారు స్త్రీలవలె చదువుకొని గ్రంథరచన చేయాల్సిన అవసరం లేద'ని తేల్చి చెప్పింది. పైగా స్త్రీలు బుద్ధిబలం కలవారు కాబట్టి

పురుషులు స్త్రీలకు లొంగి ఉండాలని చెబుతుంది. పురుషులని స్త్రీలు తమ మంత్రబలంతో ఆడిస్తారనీ చెబుతుంది. నవనాగరికులవల్ల కొంతమంది స్త్రీలు పురుషులమాట వింటున్నారు గానీ అది స్వభావవిరుద్ధమనీ చెబుతుంది. పాఠకులకు, మనఆంధ్రదేశంలోని నాటి సమాజంలోని స్త్రీలు చదువుకోరాదనీ, గ్రంథరచన చేయాల్సిన అవసరంలేదనీ, వంటయింటి కుందేళ్ళుగానే స్త్రీలుండాలనే భావనను బలంగా చెప్పే పూర్వాచార పరాయణులు గుర్తుకు రావటంతోపాటు, దొరతనం వారి పరిపాలనలో సంఘసంస్కర్తలై స్త్రీ విద్యను ప్రోత్సహించిన వీరేశలింగం వంటివారు కూడ కళ్ళముందు సాక్షాత్కరిస్తారు.

మలయాళ దేశంలో భార్యచనిపోతే పురుషులకు గడ్డాలు మీసాలు తీయటమే గాక వాళ్ళ ముక్కులను కోస్తారట. ఎందుకంటే అటువంటి వారిని స్త్రీలు భోగపురుషులుగా చూడరట. అక్కడ పురుషులు వ్యభిచారం చేయరట. మనదేశంలో వితంతువులకు నిర్బంధ శిరోముండనం చేసి కురూపులుగా చేసే దురాచారం గుర్తుకువస్తుంది. అయితే ఆదేశంలో మగవారి తలమీద జుట్టును మాత్రం ఉంచటమెందుకంటె అవసరమైతే స్త్రీలు వారి జుట్టుపట్టి వంగదీసి శిక్షించుటకు వీలుగా ఉంటుందని భావించే విషయాలను ఆ ఉపాధ్యాయురాలు సత్యరాజుకు చెబుతుంది. మనదేశంలో కూడా అపత్నీ పురుషులకు ముక్కు కోస్తే జారత్వం ఉండదు కదా అని సత్యరాజుకు అనిపించిందట.

మనదేశంలో చిన్నప్పటి నుండి స్త్రీలమీద ఆంక్షలున్నట్లే ఆ దేశంలో కూడా పురుషులను 12 ఏళ్ళ నుండి 20 ఏళ్ళు వచ్చే వరకు పగలంతా వారిని ఇనుప పెట్టెలలో బంధించి అక్కడ పిండివిసురుట, కూరలు తరిగే పనిచేసేటట్లుగా ఉంచుతారట. అక్కడ దానిని 'ఝూఢా' అంటారట. మనదేశంలో స్త్రీలపట్ల ఉన్న 'ఘోషా' గుర్తుకు రాక మానదు. అక్కడి పురుషులకు స్త్రీలను చంపుదామన్నంత కోపం వచ్చినా చంపరట. ఎందుకంటే వారికి అపత్నీకులకు వేసే ముక్కు కోసే శిక్ష గుర్తుకు వస్తుందట. మన దేశంలో తనను బానిసగా చూసే భర్తను చంపాలన్నంత కోపం స్త్రీకి వచ్చినా, చంపకుండా ఉంటున్నారంటే కారణం స్త్రీలకు విధించే భయంకరమైన వైధవ్యపు నియమాలు గుర్తుకురావటమేనేమో అనిపిస్తుంది. అక్కడ స్త్రీలు మాత్రం వివాహానికి పూర్వం వ్యభిచరించినా

తప్పుగాదట. వెంటనే మనదేశంలో పెళ్ళికి ముందు మగవాళ్ళు భోగస్త్రీల దగ్గరకు వెళ్తారనేది గుర్తుకు వస్తుంది. ఆదేశంలోని స్త్రీల అధికారాన్ని రూపుమాపి పురుషుల స్వాతంత్ర్యాన్ని నిలబెట్టాలని గట్టిగా అనుకుంటాడు సత్యరాజు.

ఒకరోజు సత్యరాజు యొక్క స్నేహితుడు అతనిని ఊరిచివర జరిగే 'పత్నీ, సహగమనం' కార్యక్రమానికి తీసికొని వెడతాడు. 40 ఏండ్లు దాటిన పురుషుని భార్య చనిపోతే 'పత్నీసహగమనం' తప్పనిసరి. ఒక ముసలి భార్య చనిపోగా ఆమెను గోతిలో పడుకోబెట్టి మేళతాళాలతో పూజలు చేసి బ్రతికివున్న ఆమె భర్తను కూడా అలంకరించి ఆమె ప్రక్కన గోతిలో పడుకోబెట్టి స్త్రీలందరూ కలిసి ఆగోతిలో మట్టి వేసి పూడ్చే కార్యక్రమం. దాన్ని చూసిన సత్యరాజుకు మనదేశంలోని 'సతీ సహగమనం' గుర్తుకు వచ్చి దాన్ని క్రైస్తవ మత పరిపాలనలో బెంటింగ్ ప్రభువు ద్వారా రాజారామమోహనరాయలు నిషేధింప జేయటం, ఆ తర్వాత వితంతువుల సంఖ్య పెరగటం గుర్తుకువచ్చిందట.

నవనాగరికులవల్ల మళయాళ దేశంలో సంప్రదాయాలు నశిస్తున్నాయనీ పురుషులకు హితబోధచేసి పూర్వాచారా పరాయణులుగా చేయటానికి జగద్గురువులైన స్త్రీ వచ్చి వేదాలలో చెప్పినట్లు సంప్రదాయాలను ఆచరించమని చెప్పింది. ఆసభకు సత్యరాజుతో పాటు అతని యజమానురాలు కూడా వెళ్ళింది. ఆమె నవనాగరికురాలు కావటంతో ఏవేదంలో అలా చెప్పరనీ, ఆ వేద శ్లోకానికి అర్థం చెప్పమనీ జగద్గురువులను అడగగా అటువంటివి ప్రశ్నలు వేయకూడదనీ కోపం తెచ్చుకొని తన శిష్యురాలి దగ్గరకు వెళ్ళి ఆ సందేహనివృత్తిని చేసుకోమంది. ఆ జగద్గురువులు 'భోగపురుషుల' ఇంటికి వెళ్ళి సుఖాలలో తేలుతుంటారనీ సత్యరాజుకు అర్థమయింది. సత్యరాజు జగద్గురువు యొక్క శిష్యురాలి దగ్గరకు వెళ్ళి వేదార్థమును చెప్పమనగా ఆమె వేదాలకు అర్థాలుండవనీ, కేవలం తాను పురుషుల చేత నోములు నోయిస్తుంటానని తప్పుకుంది. మనదేశంలో మతాచార్యులచేత చదువుకుంటున్న నవనాగరిక స్త్రీలకు హెచ్చరికగా పురాణ స్త్రీలైన పతివ్రతల జీవితాలు చెప్పించటం గుర్తుకువస్తుంది. వేదార్థం గురించి ప్రశ్నించినందుకు ఆ గుంపులో స్త్రీలందరూ సత్యరాజును పడేసి చావగొట్టగా అతని యజమానురాలు అతనికి వైద్యశాలలో ఉంచి 20 దినములు చికిత్స

చేయించగా సత్యరాజు బ్రతికిబట్టకట్ట గలిగాడు. 3ఏళ్ళ 2 నెలల 19 రోజులపాటు మలయాళదేశ నివాసం తరువాత సత్యరాజు ఆంధ్రదేశానికి తిరుగుముఖం పట్టాడు. అప్పుడు సత్యరాజు తన అనుభవం చేత 'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి' స్మృతి వాక్యాలు గుర్తుకు తెచ్చుకోవటం అనేది పితృస్వామ్య సమాజానికి తృప్తినిచ్చే కొసమెరుపు. అయినా దానితోపాటు సమానంగా 'న పురుషః స్వాతంత్ర్య మర్హతి' అని అనిపిస్తే ఆంధ్రదేశం ఎలా ఉంటుందా అని ఊహించక తప్పదు. పాశ్చాత్యులు హిందువులను విమర్శిస్తూ వారు దేశాటనం చేయరనీ, నూతన చరిత్రలు తెలుసుకోరనీ చేసే విమర్శకు విరుగుడుగా సత్యరాజు తానాయాత్ర చేసి నూతన చరిత్రలను తెలుసుకున్న విషయాలను పాఠకులముందు పెట్టాడు.

'ఆఁడుమలయాళం' గాథల్లో మళయాళదేశంలోని పురుషులకు నిర్ణయించిన సాంప్రదాయాలను ఏకరువుపెట్టి ఆచరింపజేయటాన్ని చదివిన పాఠకులకు మనదేశంలోని స్త్రీలు దురాచారాలతో దుష్టసాంప్రదాయాలతో మళయాళదేశంలోని పురుషులువలె అష్టకష్టాలు పడుతున్నారనే స్పృహ కలగకమానదు. అటు స్త్రీలకైనా, ఇటు పురుషులకైన ఆధిక్యత ఉంటే మిగిలిన వారు లింగవివక్షను ఎదుర్కొనక తప్పదనీ అర్థం అవుతుంది. సమాజంలో ముందుగా స్త్రీ, పురుషుల సమానత్వపు ఆలోచనలు పెరగాలనీ, అపుడే సమాన స్వాతంత్ర్యం సద్వినియోగమవుతుందనే భావన కల్గించగలిగిన కందుకూరి వీరేశలింగంగారు క్రాంత దర్శకులు. స్త్రీల అధికార యంత్రాంగాన్ని తెలియచేస్తూ ఆంధ్రసాహిత్య పాఠకులకు పితృస్వామ్య సమాజం తిరగ మరగ అయితే ఎలా ఉంటుందో వ్యంగ్యంగా తెలియజెప్పారు. సమాజంలో స్త్రీలను సమానులుగా చూసే దృష్టి పురుషులోకానికి అలవడాలని సంఘసంస్కర్తయైన కందుకూరి వీరేశలింగంగారి రచనోద్దేశ్యం. దానికోసమే 'ఆఁడుమలయాళం' రచన చేసిన విషయం ఎప్పటికీ పాఠకులను వెన్నుతడుతూనే ఉంటుంది. పురుషులకు ఉండాల్సిన అంతర్గత సంస్కారానికి జీవగఱ్ఱయైనది ఈ 'ఆఁడుమలయాళం" రచన. ఒక జాతిని చైతన్యపరిచే రచన కాబట్టి నేటికీ అభ్యసనీయము.

*(క్రాంతదర్శి, కందుకూరి–చెన్నపురి తెలుగువాణి– 2019)*

# 13. స్త్రీల కవిత్వంలో దేశభక్తి

బ్రిటిష్ పాలనయెడల ప్రజావాహినిలో అసంతృప్తుల బుడగలు పొంగుతూనే ఉన్నాయి. భారతీయులు పరాయిపాలన యొక్క పీడన గురించి మాట్లాడు కోవటానికి ఏర్పరుచుకున్న సమావేశంలో ప్రజలలో ఐకమత్యం పెరగాలనీ, దానికైముందుగా సాంఘిక సంస్కరణలు చేపట్టాలని భావించారు. ఆ సంస్కరణలలో స్త్రీవిద్య ప్రధానమైన భూమిక వహించింది. దానికై స్త్రీలను చైతన్య పరచటానికై స్త్రీలు అనంతసాహిత్యాన్ని సృజించారు. ఆ క్రమంలోనే 1902 లో మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణత సాధించిన వెంకట సుబ్బమాంబ గురించి ఆ పత్రికాధిపురాలైన పులుగుర్త లక్ష్మీనరసమాంబ 'స్త్రీవిద్యా విజయవార్త' అని శీర్షిక కింద పేర్కొంటూ "దేశమునకు నభివృద్ధి దేజరిల్ల".... "మంచి బుద్ధి దేశవృద్ధిగ నీతీరొనర్చె సుతకు" అని చదువుచెప్పించిన ఆతండ్రిని కూడా స్తుతించింది. ఆనాటి రచయితలు స్త్రీవిద్యవల్ల తల్లులు పిల్లలను వీరులుగా తీర్చిదిద్దితే దేశాన్ని దాస్యశృంఖలాల నుండి విడిపించవచ్చునీ, స్త్రీస్వాతంత్ర్యం, సమానత్వం ఏర్పడితేనే స్త్రీలు కూడా దేశాభ్యుదయానికి పాటుపడగలరని భావించారు. స్త్రీలు చదువు కోవటం వల్ల దేశంపట్ల అవగాహన ఏర్పడుతుందని నాటి స్త్రీలు భావించారు. 1910లో స్త్రీవిద్యను గురించి ఉప్పల నారాయణాంబ స్త్రీవిద్యను గురించి, "రమణుల కద్ది వద్దనేడు రాక్షసనీతిని నమ్మరాదుగా కమ్యతము హాయి యొక్కరికీ, హాని మరొక్కరికిం బొనర్చునే" అంటూ ఆలోచనకు పెట్టింది. అంతేకాదు 1910లోనే 'నెలతకు విద్యదగినట్లు నేర్పకున్న దేశమంతంతకును

వచ్చు దీనదశకు' అని దేశాభివృద్ధికోసం స్త్రీవిద్య అవసరమని భావించింది. 1913లో కొటికలపూడి సీతమ్మ "స్త్రీలు విద్య నేర్వ చెడిపోదురను మాట కల్లయనుచు" 1918లో కాలనాధభట్ల సూర్యప్రకాశమ్మ "చదువుచే లేమలు సత్కీర్తిగొనిరన నచ్చమాంబ యదియు సాక్షి" అనీ, అప్పుడే స్త్రీలు స్వాతంత్ర్యోద్యమంలో భాగస్వాములు కాగలరని భావించారు. మోద ప్రసూనాంబ 'మహిళ యనెడు మాట మరచుట యే కాక యామె సేవనెందునరయరైరి, తత్ఫలంబు దేశదాస్యంబు నా నొప్పె'. అని "స్త్రీఅబల కాదు సబల అనీ, భారతాంబ" అనీ మహిళాశక్తిని మేల్కొలిపింది. స్త్రీవిద్యయే స్త్రీలను దేశంపట్ల అవగాహన పెంచుకొనేటట్లు చేసిందనీ, దాని చేతనే స్త్రీలు జాతీయోద్యమములలో భాగస్వాములు కాగలిగారని అర్థమవుతుంది. అందరిలో దేశభక్తి చైతన్యాన్ని నింపగలిగారనేదానికి స్త్రీలు వ్రాసిన కవిత్వమే నిదర్శనం.

1920లో గాంధీ సత్యాగ్రహఉద్యమంలో స్త్రీలు ముందుండాలనీ, అరెస్టులకు గురియైనా బెదరని త్యాగాలు చెయ్యాలనీ, అప్పుడే ఉద్యమం శీఘ్రంగా ఫలితాలనిస్తుందనీ పిలుపునిచ్చాడు. కొంతమంది స్త్రీలు తమ కవితా గానంతో ఉద్యమంలో పాల్గొనా, మిగిలిన స్త్రీలు ఉద్యమంలో పాల్గొనటానికి తగిన చైతన్యాన్ని ఇవ్వటానికై సాహిత్యాన్ని పరికరంగా చేసుకునే ప్రయత్నంలో నాటి కవయిత్రులు వ్రాసిన కవిత్వాన్ని తెలుసుకుంటే ఈనాటి స్త్రీలకు 'దేశభక్తి యెడల గగుర్పాటు కలుగక మానదు. సహాయనిరాకరణలో భాగంగా ఖద్దరు వసన ధారణ బ్రిటీష్ వస్త్రవ్యాపారం పై గండికొట్టే విధంగా భారత స్వరాజ్యలక్ష్మియే ఖద్దరు కట్టినట్టుగా భావించి, 1923లో కనుపర్తి వరలక్ష్మమ్మ.

*"ఖద్దరు వసనమే సదా గట్టుకొనియు*
*పేరు ముద్దు స్వరాజ్యగా బెట్టుకొనియు*
*సరసగాంధీ సందేశంబు సారమేదె*
*యదియ బోధించె నీ బాల నతివ చూడు"*

అని స్వరాజ్యలక్ష్మి కి కవితా తోరణం కట్టింది. సహాయ నిరాకరణ ఉద్యమాన్ని బలోపేతం చేయటానికి పూర్ణస్వతంత్రతను పొందటానికి తగిన ప్రధాన కర్తవ్యంగా గాంధీ చెప్పిన స్వదేశీ విద్య, ఖద్దరు ధారణ, హరిజనోద్ధరణ,

మద్యపాన నిషేధం వంటి విషయాలను దృష్టిలో పెట్టుకొని తోటి స్త్రీలలో చైతన్యం కలగటానికి సాహిత్య సృజన చేశారు. అంతేకాదు వీరనాయికా స్ఫూర్తిని కలిగించా లనుకున్నారు. 1929 లో స్థానాపతి రుక్మిణమ్మ 'ఝాన్సీ లక్ష్మీబాయి' కవితలో

*"వీరలోకంబు జొచ్చిన వీరబాల*
*లక్ష్మీబాయిని సతతమీయిలాతలాన*
*భరత వనితల హృద్వీధి ప్రబలుచుండ*
*ముదముతోడత జేమోడ్చి మొక్కుదాన"*

1930 లో వి.జ్ఞానాంబ మాగంటి అన్నపూర్ణ కృషిని ప్రేరణగా చేస్తూ

*"ఖద్దరు ధరియించి కాల్పుడీ పరదేశ వస్త్రంబు లనిన ప్రశస్తవీవు*
*అంటరాని తనంబు మాటు మాయ మొనరింప*
*నిరతంబు మదినెంచు నెలతవీవు*
*స్వారాజ్యమే స్త్రీల జన్మహక్కని దెలి స్వాతంత్రదీక్షకై సాగితీవు*
*బీదసాదల జూది ప్రేమతో సర్వంబు ధారవోసిన యట్టి దాత్రివీవు*
*విపుల విఖ్యాతి గాంచిన వెలదివీవు*
*సకల విద్యలనేర్చిన చతురవీవు*
*నిన్ను వినుతింప నేరీతి నేర్తుమమ్మ*

*సకల సద్గుణ పూర్ణ! శ్రీయన్నపూర్ణ,"* అని అన్నపూర్ణ జాతీయోద్యమ భాగస్వామ్గాన్ని కొనియాడింది.

1930 లో వెలువోలు వసంతాదేవి

*"బీదలకు గూడు నొసంగు జాలు ఖద్దరున్*
*ధారణమింత జేయుమనన్ దర్కముచేసెదవేల! సోదరీ."* అనీ
*"దినదినమున దరిద్ర దశ తీవ్రత దాల్చుచు దేశనాశ భీ*
*తిని జనియింప జేసెడిని దీరిక కల్గిన వేళలందు ఝ*
*మ్మని మధుర స్వరంబులొలయగ భవదీయకరాంగుళీ విచా*
*లనమున శోభలొల్కగను రాటము త్రిప్పగరాదె సోదరీ!"*

అంటూ స్వదేశీ వస్త్ర తయారీని స్వదేశీవస్త్ర ధారణను వహించే చైతన్యాన్ని పెంపొందించింది.

మన తెలుగు మహిళ దుర్గాబాయి (దేశముఖ్) వంటి మహిళలందరో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని అరెస్ట్ అయి జైలు శిక్ష అనుభవిస్తూ అష్టకష్టాలు పడ్డా సబలలుగా దేశ విముక్తికై నిలబడ్డ విషయం అర్థమయ్యేటట్లుగా 1930లో తల్లాప్రగడ విశ్వసుందరమ్మ

*"కఠిన కారాగార లంకాపురమున*
*బధిరులమయి యున్నాము భయమువీడి*
*అబలలముగాక యెంతయు సబలలమయి*
*భారతదేశ విముక్తిని బడయునొరన్"*

అని జాతీయోద్యమ భాగస్వామ్య స్త్రీగా దేశంకోసం పోరాడే స్త్రీలను చెరసాలలో బంధించినా అధైర్యపడక భారతదేశవిముక్తి కోసం సబలలయ్యామని తమ ఆత్మవిశ్వాన్ని ప్రకటించింది. 'స్త్రీ అబల' అనే దేశభక్తిరహితులకు చెంపపెట్టయిన కవిత ఇది.

1930లో గాంధి దండి నుండి ప్రారంభించిన ఉప్పు సత్యాగ్రహనికి స్పందించిన రాజేశ్వరి తన కవితలో

"లవణ సాగరమథనము" అనే కవితలో
*"ఆ సబర్మతీ తీర ఋష్యాశ్రమంబు*
*బయలు వెడలిన సత్య తపస్వి వెరలు*
*పరువు లిడినది సకల ప్రపంచ దృష్టి*
*ఏ ప్రళయవహి పుట్టునో యేమొయనుచు*
*దారిపొడవున శాంతి స్వతంత్ర సమర*
*జైత్రయాత్ర పురోగామి చరణసరణి"*
*"లవణసాగర మథన వేలా ప్రభూత*
*దర్శనా తీర సర్వ స్వతంత్ర భారతీయ*
*రాజ్యేందిరయే రమాదేవియయ్యె*
*మోహినీమూర్తియై మహాత్ముండు వెలసె"*

అంటూ ఉప్పుసత్యాగ్రహంపట్ల ప్రజలలో చైతన్యాన్ని రగిలించింది.

1930 లో ఓలేటి నిత్యకల్యాణమ్మ "అందరిదీయగు ఈక్షణం భారతీసతి గుండెలను పల్లవించిన స్వేచ్ఛాభావం నిత్యలోకామోదమగుచు నెగడుకావుత లీలగన్" అని స్వేచ్ఛను ఆశించింది.

1930లో ఓలేటి నిత్యకల్యాణమ్మ

*"దర్శనాలవణంపు సత్యా*
*గ్రహమునందున నీవుచూపిన*
*పట్టుదలకల యోరిమికి జూ*
*పరులుగ్రమానడిరి*
*శాంతి రణ భూతలములోనీ*
*స్థైర్య గుణమును గానబరచుచు*
*బాలలబలలు గారటంచును*
*జాటినావు సరోజనీ"* అంటూ

1930లో ఓలేటి నిత్యకల్యాణమ్మ 'దివ్యాశీస్సు' కవితలో

*"భారతీసతి గుండె లందున పల్లవించిన స్వేచ్ఛాభావములే"*
*అంటూ "ప్రజలలోని స్వేచ్ఛా భావములను" గురించి చెప్పింది.*

*ఈమెయే "ప్లేడు కన్య యైన మీరాబాయిని కొనియాడుచూ నీవొక...*
*మహాత్ము నొద్ద కరుదెంచితి జననీ శుభాఘృణీ" అంటూ పేర్కొంది".*

1931లో దేవులపల్లి సత్యవతమ్మ

*"దాస్యాంధకారము తరిమివేయుటకునై*
*ఇద్దరు దీక్షతో గట్టరమ్మ*
*గద్గదస్వరముతో కడు దుఖమందెదు*
*పంచమసుతుల పాలించరమ్మ*
*ఆత్మనాశనమొనర్చునట్టి త్రాగుడు మాని*
*దేశవస్తుల దీక్ష దెల్పరమ్మ*
*మన భాష, మన జాతి మనదేశమభివృద్ధి*

నెనయు మార్గముల నూహింపరమ్మ
మనము పూర్ణ స్వతంత్రత గనెడు వరకు
తీరబోదమ్మ మన పని తెరవలార
మాతృసేవాపరాయణ మహిత దివ్య
కంకణము దాల్చి రారమ్మ గరిత లార!"

అని సత్యాగ్రహపు పిలుపు నివ్వటమంటేనే స్త్రీలు చదువుకుంటే దేశావగహన ఏర్పడి దేశాభ్యుదయానికి పాటు పడగలరనే దానికి ఈ కవితయే నిదర్శనము.

1931లో 'సామవేదుల చిరంజీవమ్మ "దేశసేవిక" ఖండకావ్యంలో' స్త్రీలు సత్యాగ్రహంలో పాల్గొనుటయే 'జాతీయసౌందర్య సంస్కృతి' అనీ విశదీకరించారు.

1931లో గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారము రౌంటేబుల్ సమావేశానికి వెళ్లినపుడు అవటపల్లి కృష్ణవేణమ్మ తన కవితలో "నీవైన శాంతి నొడగూర్చి నెగడుమమ్మా, భారతమాత సంకెళ్ళను విప్పుమ" నీ సంవత్సరాదిని వేడుకుంటూ పండుగ సందర్భంగ కవిత వ్రాసి దేశభక్తి ఆలోచనలను పంచిపెట్టింది.

1931లో వేదవల్లి తాయారమ్మ "శాంతి సత్యాగ్రహములిచ్చి సరవిగొనుము" అని ఉగాదిని వేడుకుంది. పండగ పర్వదినాలలో కూడా దేశభక్తిని నాటి స్త్రీలు మరచిపోలేదనటానికి నిదర్శనమే ఈ కవితలు.

1931లో పి. అప్పల నరసమ్మ "ఆంధ్రవనితామణులు" అనే కవితలో జాతీయోద్యమములో చురుకైన పాత్ర వహించి గాంధీగారి ప్రియపుత్రికగా స్తుతించబడిన మాగంటి అన్నపూర్ణమ్మను స్తుతిస్తూ, ఆమె అమెరికా వెడుతున్న తన భర్తకు యిచ్చిన సందేశంలోని ఆమె దేశభక్తిని స్మరిస్తూ

"నన్ను మరచిన గాని మీదేశమ్ము
మాత్రము మరువవలదని
స్వర్గమునకే వెడలితమ్మా
అన్న పూర్ణమ్మా!"

"నాయకోత్తమ వీరులకావంతయును కాంతలు తీసిపోరని చాటిచెప్పితి" వంటూ దువ్వూరి సుబ్బమ్మనూ, అబలా సచ్చరిత్రాన్ని వ్రాసిన బండారు అచ్చమాంబను, కవితలల్లిన కాంచనపల్లి కనకమ్మను, స్త్రీల దుస్థితి తీర్చటానికి సర్వము ధారపోసిన యామినీ పూర్ణ తిలకమ్మను, స్తుతిస్తూ వ్రాసిన కవిత నాటి స్త్రీలలో స్ఫూర్తికలిగించక మానదు.

అన్నపూర్ణ సుభాషిత రత్నావళి' అనే ఖండికలో 1931లో అయితం ఇందిర, భారతీదేవి అను సోదర కవయిత్రులు

*"దాస్యమరసి స్వాతంత్ర్యంబు దలచినారు*
*దీక్షతో స్వరాజ్యము భారతీయులిచట*
*అమెరికా రాను, నాకిట నర్హమైన*
*దేశసేవా ప్రకాశనదీక్ష గలదు"*
*"కాల్చనిశ్చితి భక్తితో గాంధికేను*
*రెండు వేల్సేయు పట్టు చీరలను మఱియు*
*బెండ్లి చీరెను గూడ నర్పించుకొంటి*
*వలయుచో బ్రాణమే నిత్తు భరతధరకు"*
*"పెండ్లి యుంగరమును గూడ భీతి తోడ*
*తిలకు నిధి కిచ్చినాను మీవిలువ గలుగు*
*చేతిగడియారమిచ్చితి జేతమలర*
*నకట మిమునిచ్చుకొనెడు భాగ్యంబు లేదు"*

అని అమెరికాలో వ్యవసాయ విద్యాధ్యయనానికి వెళ్లిన భర్త బాపినీడుకు భార్య అన్నపూర్ణ వ్రాసిన లేఖలిలా ఉన్నాయని ఈ సోదర కవయిత్రులు అన్నపూర్ణ యొక్క ఉత్కృష్టమైన దేశభక్తిని వ్రాసారు. విదేశాలనుండి వచ్చిన భర్తను జాతీయోద్యమంలో భాగస్వామిని చేసిందని, తాను అరెస్టు అయి జైలులోనే అనారోగ్యంపాలయి మరణించినటువంటి మాగంటి అన్నపూర్ణ దేశభక్తి నేటికీ చిరస్మరణీయం.

అంతేకాక 1931 లో "రథచోదితుండవౌచు రాజిల్లు కేశవున్..." అనుచూ విజయులైన సత్యాగ్రహ నాయకులను మహాభారతంలోని పాండవ నాయకులతో పోల్చి చెప్పిన కవితతో పాటు, గాంధీ శిష్యురాలైన స్లేడు కన్య (మీరాబాయి) అనే విదేశీయువతి భారత స్వాతంత్ర్యోద్యమంలో భాగస్వామురాలై నందుకు ఆమె ఋణం తీర్చుకోలేనిదంటూ చెప్పిన దేవులపల్లి సత్యవతి కవిత మానవాళికి కవితామతల్లి వంటివి.

1931లో గార్లపాటి లక్ష్మీ గంగమ్మ గాంధీనాయకత్వాన్ని స్తుతిస్తూ

*"సరస గంభీర హృదయుండు శాంతి మూర్తి*
*కర్మఫలవర్జితుండు నిష్కపటి యితడు*
*దేశసేవాభిలాషి గాంధీ మహాత్ముడా*
*యురారోగ్యవంతుడై యలరు గాక"* .....

అని ఉద్యమ నాయకులను నమ్మి, ఉద్యమభాగస్వాములు కావాలనీ కోరింది. 1932లో వెంపటి అన్నపూర్ణమ్మ

*గోదావరి పుష్కరాల సమయంలో*
*గోదావరి తల్లి కోర్కెలనొసగె*
*మాదేశ స్వాతంత్ర్యమహిమ మాకొసగ*
*"మొక్కినా వరమీయని మూర్తినేవీడరో*
*గ్రక్కునస్ స్వాతంత్రగరిమ మరించు"* అంటూ

గుడిలో విగ్రహాలకు మొక్కిన వరమీయలేదనీ, భారతదేశంలోని ప్రకృతి యైన నదియైన గోదావరిని మొక్కుకుంటే స్వాతంత్ర్యం సిద్ధిస్తుందని అభిలషించిన దేశభక్తి కవిత తరతరాల పుష్కరాలకు తరగని పూజాపుష్పం.

1933లో పరుచూరి భువనేశ్వరి, అన్నపూర్ణ కలసి వ్రాసిన 'తెలుగుబిడ్డ' కవితలో హరిజనోద్ధార కార్యంబు నాదరించి వారి క్షేమాభివృద్ధికి పాటుపడుచు

*"వారు సోదరుల్ మనకుం జేరదీసి*
*అలరుచుండు మా దేశాల తెలుగు బిడ్డ".*

"గాంధీ మహోజ్వల కఠిన తపస్సు, శీఘ్రకాలమున సిద్ధించుగాక" అని ఆశను వ్యక్తం చేసింది. 1933 లో అనసూయమ్మ

*"అయ్యదియె నేను జన్మించినట్టి పుడమి*
*అల్లదిగొ నన్ను గన్నట్టి తల్లి యంచు*
*మనసున్నంగన బోవని మగువయెపుడు*
*శవసమానంబు! దానిదేజన్మమేల"*

అంటూ స్త్రీజన్మ సార్ధకత దేశభక్తి లోనే ఉందని చెప్పింది.

సత్యాగ్రహోద్యమాన్ని బలోపేతం చేయటానికి, ప్రజలంతా ఐకమత్యంతో పోరాడటానికి దీనులైన హరిజనోద్ధారణ కావల్సిన అవసరాన్ని గుర్తించిన గాంధీ దాన్ని సత్యాగ్రహంలో భాగంచేసారు. మాలల సమస్యలను గుర్తించటంలో భాగంగా చర్ల సుశీలమ్మ 1934లో 'మాలపిల్ల' అనే కవితలో

*"చాలవృద్ధిగ బండిన సస్యమెల్ల*
*గోసికొనె గర్పకుండపు డొక్కక్క గింజ*
*యక్కడక్కడ, బడ బక్షియట్లు మిగుల*
*బ్రీతినేరు చుండెను మాలపిల్ల యొకతే"* అంటూ

మొదలుపెట్టి దారిద్ర్యంలో, ఆకలిలో మాలల బాధకు దుఃఖించు తన మదిని కవితలో తెలియజేసింది. సత్యాగ్రహంలో భాగంగా స్వాతంత్ర్య జాతీయోద్యమంలో చురుకైన పాత్రవహించిన నాయక, నాయికా స్తుతి చేసి ప్రజలలో జాతీయోద్యమం పట్ల స్త్రీ, పురుషులలో వీరస్ఫూర్తిని ఆత్మవిశ్వాసాన్ని కల్గించిన కవయిత్రులున్నారు. 1934లో వీరుబొట్ల రామలక్ష్మమ్మ

*"ఆది నుండియునైకమత్యంబులేని*
*జనులనందర నొక్క గీటునకు దెచ్చి*
*నడుపు చున్నట్టి నీదు ప్రజ్ఞా ప్రపత్తి*
*తెలియగానేరి తరము గాంధీమహాత్మ"*

1934 లో గార్లపాటి లక్ష్మీ గంగమ్మ

*"భారతావని నీసేవ బడయు కొరకు*
*నిన్ను సృష్టించేనా బ్రహ్మ నిక్కముగను*
*ధరను జిరకాల జీవీపై తనరుమమ్మ*
*కమలనాభుని కృపగల్లి గమలనేహర"* అని నెహ్రూభార్యను స్తుతించింది.

మన దేశంలో తయారైన ఉప్పుపై కూడా పన్ను వసూలు చేస్తుంటే భరించలేక గాంధి1930లో దండి నుండి ప్రారంభించి ఉప్పు సత్యాగ్రహాన్ని నడిపించాడు. పన్నులు కట్టకపోయే సరికి గాంధి, ఇర్విన్ల మధ్య ఒప్పందం కుదిరి గాంధిని రెండో రౌండ్ టేబుల్ సమావేశానికి లండన్ వెళ్ళినపుడు, ఇండియా చట్టాన్ని 1935 ను ఒప్పుకోవటం జరిగింది. ఆ చట్టం ప్రకారం భారతీయులు ఎన్నికల్లో పాల్గొనే వెసులుబాటును కల్గించింది. దానితో భారతీయులు శాసనసభా ప్రవేశానికి వీలుకలింది. భారతీయులు పాలనలో రాజకీయ ప్రతిపత్తిని పొందటానికి భారతీయ కాంగ్రెస్ సభ్యులు ఎన్నికలలో నిలబడి విజేతలయ్యారు. అయితే బ్రిటీష్ వాళ్ళ సైనికాధికారులకు లోబడి పరిపాలించాలి కాబట్టి భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యము తెచ్చుకోవాలనే ఆరాటం పోరాటాన్ని ఉధృతం చేసింది. 1938 లో సుభాష్ చంద్రబోస్ సొంత సైన్యంతో ఫార్వర్డ్ బ్లాక్ ను ఏర్పాటు చేశారు. అదే సమయంలో ద్వితీయ ప్రపంచ యుద్ధం 1939లో ప్రారంభమైంది. భారతీయ సైన్యంతో గాని, నాయకులతో గాని సంప్రదించ కుండానే భారతీయులను యుద్ధానికి పంపించాలనుకున్న బ్రిటీష్ పాలకుల నిర్ణయాన్ని భారతీయులు తిరస్కరించారు.

1934లో తుమ్మల చుక్కమ్మ వ్రాసిన కవితలో

*"సతత శోభాపూర్ణ సస్యజాలావృత మేదినీ స్థలముల మిగులనెగడి*
*సర్వసౌఖ్యప్రద సకలార్థముల చేత రత్న గర్భయనంగ రహిని బరగి*
*విమల జలాధారవిహిత గంగా యమునాదిగనదులచే సరయవెలసి*
*ఖండఖండాంతర ఖ్యాతి గాంచిన జ్ఞాననిధులకు నిలయమై పృథివి జెలగి"*

అనీ, "యనిశమును లచ్చికిరవయి యలరినట్టి నీవు పెద్దమ్మకిప్పుడు నిలయమైతి వక్కటక్కట హృదయంబు నొక్కువముగ బ్రద్దలయ్యెడు నెట్లొ భరతమాత" అంటూ సంపదను గుర్తుచేస్తూ నేడు భారతదేశం దరిద్రానికి నిలయమైందని బాధపడూ ప్రజలకు దేశం పట్ల బాధను బాధ్యతను రేకెత్తించింది. 1935 లో చిల్కపాటి సీతాంబ

*"ఆజికిదప్పి శత్రువుల కౌదల లొగ్గితిరేని మేమికన్*
*గాజుల నూడి కత్తులను కత్తళముల్గొని వైరి సేనలన్*
*తేజమడంచి యీ భారతదేశము కున్నతి గూర్చి హైందవ*
*స్త్రీ జన శౌర్యము ల్దెలిపి చేతులు మోడగ జేతుమీతరిన్"*

*"చచ్చిన స్వర్గమే జయముం*
*దెచ్చిన రాజ్యంబో యేదియొ దేల్పక కోటం*
*జొచ్చిన మిమ్మందరగిట*
*వచ్చెద తరలుండ జయము వడయుండ వేగన్"* అంటూ

చావోరేవో తేల్చు కోవాలంది. 1935 లో పోతుల జయలక్ష్మీ 'లెమ్మోయి లెమ్మోయీ' అని కవితలో భారతమాత కొరకే మరణ మొందుట, "భారతమాత కొరకే" అంటూ నిద్రలేపింది.

1936 లో తల్లాప్రగడ విశ్వసుందరమ్మ "మేలు కొలుపు" కవితలో

"మేలుకొనుమో భారతీయుడ
మేలుకొనుమో దేశభక్తుడ
మేలుకొని నీతల్లి దేశపు
ముక్తి *గనవయ్యా"*
*ఈమెయే గాంధీనాయకుడి స్తుతిస్తూ*
*'గాంధియే మన తండ్రి ప్రభువును*
*గాంధియే మన గురుడు నాత్మయు*
*గాంధియే నవభారతంబున ఘన ప్రవక్తగదా'!*

అంటూ గాంధీ నాయకత్వం మీద నమ్మకముంచి సత్యాగ్రహంలో ప్రజలను పాల్గొనమంది.

1938 లో వీరమాచనేని సరోజని 'జయహే భారతమాత' శీర్షికన

*"జయహెూ భారతమాత! నీకీర్తికాంతి ఈ చరిత్రలో వెదజల్లవే మాతల్లి*
*వీరులెందరినో జన్మనిచ్చిన వీరమాతవమ్మా"*

అని భారతమాతను కీర్తించింది.

1940 లో స్థానాపతి రుక్మిణమ్మ 'గీత' అని కవితలో

*జాతీయోద్యమ స్ఫూర్తిని కల్గిస్తూ*
*"పారతంత్ర్య నిర్మూలన పథముద్రొక్కి*
*విశ్వమంతయూ మనముగా విరిసి పోదా*
*తారుమారైన యావదాంధ్ర ప్రశస్తి*
*మరల నెగడునందాక కర్మ ప్రకర్ష"*

స్వాతంత్రసాధనయే ఆంధ్రుల గొప్పతనంగా భావించింది.

అఖిల భారత కాంగ్రెస్ అతివాదులు, మితవాదులుగా విడిపోయారు. తిలక్, అరవిందఘోష్, మొదలు పెట్టిన అతివాద పోరాటానికి కొనసాగింపుగా వారి శిష్యుడైన చంద్రశేఖర్ అజాద్ కలసి శాంతియుత గాంధి సత్యాగ్రహం వల్ల లాభంలేదనీ, సాయుధ పారాటం చేయాలని భావించారు. ఉప్పు సత్యాగ్రహం తర్వాత గాంధీ–ఇర్విన్ ఒప్పందంలో భాగంగా రెండవ రెంటేబుల్ సమావేశానికి గాంధీ లండన్ పోయినపుడు భారతదేశంలో బ్రిటీష్ వాళ సాయుధ పోరాటం చేస్తున్న భగత్‌సింగ్ ని ఉరితీయటం జరిగింది. దానితో కల్లోలం పెరిగి భారతీయులు బ్రిటీష్ వారి పాలనా సంస్థలను ధ్వంసం చేసారు. ఆ సందర్భంలో చంద్రశేఖర్ అజాద్ ను వెదుకుతున్న పోలీసులకు అజాద్ చిక్కకుండా తనని తానే పేల్చుకొని దేశంకోసం ఆత్మబలిదానం చేసుకున్నాడు. దానితోపాటు మునుపు గెరిల్లాయుద్ధం చేసిన మన్యం వీరుడైన అల్లూరి సీతారామరాజును కాల్చి చంపిన

సంఘటనలకు స్పందించిన 'లలిత' అనే కవయిత్రి వ్రాసిన 'మనది భారతదేశం' అనే కవిత వచ్చింది. ఆ కవితలోని సంఘటనలు బట్టి 1857 నుండి మొదలై 1940 క్విట్ ఇండియా వరకు ఉన్న చరిత్రను పేర్కొంటూ 'చావో బతుకో' తేల్చుకోవాలనుకున్న సందర్భంలో వ్రాసినట్లుగా అర్ధమవుతుంది.

1943 లో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. 'లలిత' తన కవితలో పోరాటయోధురాలైన ఝాన్సీ లక్ష్మీబాయి వీరత్వాన్ని స్మరణకు తెస్తూ.

*"భారతీయుల పౌరుషమ్ము*
*భారత స్త్రీ పౌరుషమ్ము*
*భారత స్త్రీల మేధస్సు*
*కంపెనీ సైన్యాన్ని గగ్గోలు పరిచాయి*
*పాశ్చాత్య సామ్రాజ్య పటిమ నెదిరించాయి".*

అంటూ, భారతీయ స్త్రీ శక్తిబలాన్ని గుర్తు చేసింది.

*"జాతి స్వతంత్రతా సంరక్షణకోసమై*
*ఈస్టిండియా మిలిటరీ ఫోర్సునుడికించి*
*వీరధర్మము జూపి మరణించింది తల్లి"* అంటూ ఝాన్సీ లక్ష్మీబాయి వీరమరణ స్ఫూర్తిని రగిలించిందనీ చెప్పింది. అంతేగాక

*"మన జాతికై, మనహక్కుకై*
*మనచంద్రశేఖరుడు మరణించినాడమ్మ"*

అంటూ జాతీయోద్యమ నాయకుల పట్ల ఉండవలసిన ఆత్మీయతను కలిగించింది. ఉప్పు సత్యాగ్రహానంతరం భారతదేశంలో బ్రిటిష్ వాళ్ల అణచివేతను ఎదుర్కొవాలనీ, స్వపరిపాలన కావాలని భావించి స్వతంత్రం కోసం ఆధునిక తుపాకులు, మరఫిరంగులు లేకపోయినా బ్రిటీష్ వాళ్లను ప్రజలు ఎదుర్కోవాలంటూ, మరొక ప్రక్క అంతర్జాతీయ ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం చేయాలంటూ....

*"మనకు మరఫిరంగులు లేవని*
*యుద్ధమంటే భీతి గొనకు"*
*మన గెరిల్లా యుద్ధమంత్రమ్ము శత్రులను*
*మంత్రముగ్ధులచేసి మట్టుపెడుతుంది.*
*స్వాతంత్ర కాంక్షతో చావునకు తెగించి*
*యుద్ధతంత్రమ్మునేర్చి యుద్ధభూమికి రమ్మా*
*ఫాసిజాన్నెగర గొడదాము*
*ప్రజల శక్తిని చూపుదాము.*
*మనది భారత దేశమమ్మా ....*

అంటూ కవయిత్రి ఆధునిక ఆయుధాలు లేకపోయినా గెరిల్లాదాడితో వారిని మట్టుపెట్టవచ్చని నాటి వారిని ప్రోత్సహించటం జరిగింది.

1943లో వట్టికొండ విశాలక్షి ప్రచురించిన "ప్రబోధగీతాలు" అనే అభ్యుదయగీతాల సంపుటిలో "చెలో వీర యువతి" అనే శీర్షిక క్రింద

*'చెలో వీర యువతీ రణానికి చెలో ధీరయువతీ*
*శౌర్యసహిత సద్గుణ జాత, పావన చరిత, భారతవనితా'*
*"ఫాసిజమే నీ ప్రక్కలో బల్లెము*
*ఖండించుము ఈ ఘాతుక భూతము*
*స్వదేశ సంరక్షణ సాధించుము*
*మన స్వాతంత్ర్యమును సంపాదింపక..."*

అంటూ ఫాసిజాన్ని ఎదుర్కోమంది.

ద్వితీయ ప్రపంచయుద్ధానంతరం బ్రిటీష్ వాళ్ళ గెలిచినా బ్రిటీష్ సైన్యానికి ఎక్కువ నష్టం జరిగింది. యుద్ధానంతరం సంపూర్ణ స్వరాజ్యం ఇస్తామని చెప్పి సహాయం పొంది పట్టించుకోనందుకు గాంధీ తిరిగి సత్యాగ్రహం ప్రారంభించేసరికి 'క్రిప్స్' ని రాయబారిగా పంపారు. సంపూర్ణ స్వతంత్రాన్ని యుద్ధానంతరం జరిగే ఎన్నికల్లో భారత శాసనసభలోని మెజార్టీపార్టీ నిర్ణయిస్తుందని ఏరాష్ట్రమైనా విడిగా

కావాలంటే స్వతంత్రంగా ఉండచ్చని చెప్పి భారతీయులను విభజించాలని చూస్తున్న బ్రిటీష్ వారికి చెంపపెట్టుగా వాళ్లని దేశం నుండి పారద్రోలేందుకు, చావో బ్రతుకో తేల్చుకునే విధంగా 1942 లో 'క్విట్ ఇండియా' ఉద్యమం వచ్చింది. ఆగస్టులో విప్లవంగా విజృంభించింది. ప్రజలందరూ బ్రిటీష్ ఆఫీసులను ధ్వంసం చేసారు. గాంధిని అరెస్టు చేసారు. 1944లో విడుదలైన గాంధీతో, ఆనాడు బ్రిటీష్ పాలన చేపట్టిన కార్మికవర్గపు పార్టీ భారతీయులకు స్వాతంత్రం ఇవ్వటానికి నిర్ణయించింది. మహమ్మదీయులకా, హిందూవులకా అన్న చర్చ పెట్టింది. చివరకు గాంధీ హిందూ మహమ్మదీయులకు భారతదేశస్వాతంత్రం పంచటం జరిగి రెండు దేశాలు ఏర్పడ్డాయి.

రెండవ ప్రపంచ యుద్ధంలో బ్రిటిష్ శత్రువులైన జపానువారిని ఓడిస్తే, సంపూర్ణ స్వాతంత్రం ఇస్తామని బ్రిటిష్ పాలకులన్నపుడు వారి మాటలమీద నమ్మకం కుదరలేదు. అందుకే వట్టికొండ విశాలాక్షి తన కవితలో

*"పవిత్ర భారత భూమి మీదనే*
*బాంబుల వర్షం కురియుచున్నది*
*ఆలసించెదవదేల ! సోదరా*
*హతమార్చర నీ శత్రుసైనికుల"*
*"భారతభూమిని పరులకు వదలి*
*బ్రతుకుట కన్న చావే మేలురా"*
*"పరాక్రమములో బిరానలేచి*
*ఫాసిస్టులను పరిమార్చుమురా*
*జై జై భారత భూమికి జైయని*
*జయ దుందుభిని మ్రోగించరా*
*జపాను శత్రువుల జయించి*
*వేగమే జయ కేతనమెగరవేయరా"*
*"హిందూ ముస్లింలకు సందేహాలు*
*ఎందులకోయీమనమందరమొకటై*

*భారతరక్షణ కొరకై మనమిక*
*ప్రజల ఐక్యతకు పాటుపడదాం"*
*"ఆయుధాల్లేకున్న*
*ఐకమత్యమే మంచి*
*ఆయుధమ్మని నమ్మి మనము*
*సమర రంగమున చంపేసి పరుల*
*స్వాతంత్రమును సాధించి*
*శాంతి నెలకొల్పాలి"* అని తన గాఢమైన

సంపూర్ణ స్వాతంత్ర్య కాంక్షను వెలుబుచ్చి నేటి వారికి కూడ గగుర్పాటును, స్ఫూర్తిని కలిగించే కవిత వ్రాసిన వట్టికొండ విశాలాక్షి తన కవితను గట్టికొండగా నిలిపింది. ప్రజలకు రక్షణ మార్గం అదేనని తన కవితలో ప్రబోధించింది. కార్మిక వర్గపు పార్టీ బ్రిటీష్ పాలనలోనికి రావటంతో క్విట్ ఇండియా ఉద్యమ తీవ్రతను అర్థం చేసుకొని 1947లో స్వాతంత్రాన్ని ప్రకటించింది.

బ్రిటిష్ వాళ్ళ యొక్క విభజించి పాలించెడి కుటిలనీతికి అనువుగా నైజాం నవాబు తన సంస్థానాన్ని భారతదేశంలో విలీనం చేయటానికి అంగీకరించనపుడు 'నఫీస్ ఆయేషా బేగం' వంటి ముస్లిం యువతులు నైజాం నవాబుకు వ్యతిరేకంగా నినాదం చేయటం భారత జాతీయతకొక చిహ్నంగా భావించవచ్చు.

భారతదేశ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న స్త్రీ,పురుషులు ఆత్మత్యాగఫలంగా దేశానికి స్వాతంత్ర్యం లభించిన సందర్భంలో సంతోషం పంచుకుంటూ 1947 సెప్టెంబరులో కనపర్తి వరలక్ష్మమ్మ వ్రాసిన 'మహోదయం' అనే కవిత వచ్చింది.

ఉద్యమ దేశనాయకులను కీర్తిస్తూనే

*"పరదేశీయుల పాలనంబుకతనన్ భాగ్యంబు గోల్పోయి హా*
*కరి ద్రామ్రింగిన వెల్గపండు పగిదిన్కాన్పించే దేశంబువే"*

అంటూ స్వాతంత్రం సిద్ధించిన నాటికి భారతదేశపు ఆర్థిక స్థితి యొక్క డొల్లతనాన్ని అందరికీ తెలియజేసి దేశాభివృద్ధి జరగాల్సిన అవసరాన్ని సూచించింది.

చేజర్ల రామరత్నమ్మ, తన కవితలో వీరుల కష్టఫలంగా స్వాతంత్ర్యం సిద్ధించిందని ముఖ్యంగా ఆనాటి మహిళలు జైళ్లలో మగ్గటం నాటి స్త్రీల దేశభక్తికి పరాకాష్ఠమైన విషయంగా చెప్తూ

*చేడేలెందరో మున్ను చెఱసాలకు నేగి.*
*అష్టకష్టంబుల ననుభవించి*
*సతుల సుతుల వీడి సత్యాగ్రహమునల్పి*
*ధనధాన్యముల గూడ ధారవోసి*
*ఆహారనిద్రలు వ్యవహారములు మాని*
*కారాగృహములందు కాలముడిపి*
*మహనీయులెందరో మన దేశ కాంక్షలో*
*లాటీలదెబల కోర్చి"*

అంటూ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రను మరచిపోకూడదనీ,

*'అక్రమంబుగా పాలనమంతమొందే*
*సత్యపాలన మిపుడే సంస్థాపనములనాయె*
*ఎర్రకపీగము లీనాడు తుర్రుమనిరి*
*బడసితిమిగాదే స్వారాజ్య భవనమలను'*

అని సంతోషాన్ని ప్రకటించింది. పొణకా కనకమ్మ తనకవితలో

*"నవ స్వతంత్ర మహామహోత్సవ రథమ్ము*
*విమల కల్యాణ రాజమార్గముం దిరుగ*
*వచ్చె దినమణి ప్రాభాతవర్తనముల*
*అమ్మ! నీచేతి కాగడాయై వెలంగ"*

అని స్వాతంత్ర్యలక్ష్మికి దీప్తిని వెలిగించటానికి సూర్యుడే కాగడా యయ్యాడనీ భావించింది. అంతేకాదు.

*"సత్యమును ధర్మమును నహింసయును ప్రేమ*
*త్యాగమును పంచప్రాణములై స్వరూప*
*మన తరించుచు బాపూమహాత్మ తేజ*
*మెప్పుడు ముందయి మము నడిపింతు గాక"*

అని గాంధి మహాత్ముని స్ఫూర్తిని తరతరాలు గుర్తించుకోవాలని కూడా భావించింది. నేమాని భారతీరత్నాకరాంబ 'భారతీ నక్షత్ర మాలికలో'

*"జాతీయత్వము, దేశభక్తి, స్వమతాచారాభిలాషంబునన్*
*పాతివ్రత్యము, సత్ప్రవర్తనమునన్ సర్వాధరాస్థానమౌ*
*నీతిన గార్యములందు శ్రద్ధ యెద నిండారుటన్ మాపయిన్*
*ప్రీతింజేసి యొసగ వేడెదను*
*తల్లీ నిత్యమున్ "భారతీ" స్వజాతాసక్తినిన్ భారతీ ..."*

అంటూ స్వజాత్మాభిమానాన్ని నిరంతరం కాపాడుకోవటమే భారత స్వాతంత్ర్య రక్షణ అని భావించింది. అంతేకాదు జాతీయతే దేశభక్తిగా భావించి

*"పరదేశానుగతంపు నాగరికతల్ పాటించి, జాతీయతన్*
*వెరపింతేనియు లేక మా పడతుకల్ విద్యావతీ రత్నముల్*
*ధర పాల్చేయుచునున్న వారలుగదా ! దాక్షిణ్య పుణ్యాత్మ వై*
*తరుణీ ! వారలకిచ్చి ప్రోవుమ స్వజాతాసక్తినిన్ భారతీ"*

అని చెప్పటం జరిగింది.

స్వాతంత్ర్యానంతరం భారతరాజ్యాంగం అందరికీ సమాన హక్కులు అందించినా కొంతమంది సంస్థానాధీశులు రాజ్యాంగానికి గౌరవం ఇవ్వక పోవటం కనపడింది.

1948లో భారత ప్రభుత్వపు సైనిక చర్యవల్ల నైజాం ప్రభుత్వం భారత ప్రభుత్వంలో విలీనమవటంతో దేశ స్వాతంత్రపు సాధన పూర్తి అయ్యింది. నిజాం సైన్య రజకార్ల దాడిలో స్త్రీలకు భద్రత లేకపోయిందని భావిస్తూ .

ఆ సందర్భంలో సి. హెచ్ కమల

*"రండ దొరల రజాకార్ల జూచారు*
*ప్రజలు నడుంకట్టి రణమందు దూకారు*
*ముసలమ్మలు ముసలయ్యలు లేచారు*
*వారి చేతి కందిన కఱ్ఱ బడితెలే బట్టారు"* అంటూ కవితను వ్రాసింది.

ఎన్. జ్యోతిర్మయి కొత్త యుగానికి స్వాగతం చెబుతూ

*"అభ్యుదయ జ్వాలల్లో ఆలోచనలను పుటంచెయ్యి*
*మెరుగుపెట్టిన ఆశయాలను*
*మెలిపెట్టి సరికొత్త నగలాంటి*
*మరొక యుగాన్ని సృష్టించు"*

అంటూ క్రొత్త యుగానికి స్వాగతం పలికింది.

స్వతంత్ర భారత మాతను వేడుకుంటూ స్వరాజ్య సంపద నిలుపుకోవటానికి నిరంతర దేశభక్తి అవసరమని భావించి, దేశాభివృద్ధి జరగటానికి ముఖ్యనీతి సూత్రాలు సూచించింది. భారతప్రభుత్వం ఆర్థికాభివృద్ధికైచేసిన పంచవర్ష ప్రణాళికలు వ్యవసాయాన్ని అభివృద్ధిపరచలేదు. పారిశ్రామికాభివృద్ధిలో పెట్టుబడుల వ్యాపారం పెరిగి కొంతమంది ధనవంతులుకాగలిగారు. ధనికుల, బీదల మధ్య అంతరం పెరిగింది. ధనికులచేతిలో భారత ప్రభుత్వాధికారం, మిడుతంబొట్లయ్యింది. స్వాతంత్రం వచ్చిన తర్వాత నాటి దేశభక్తి కరువై, అరాచకత్వం అమానవీయత చోటుచేసుకుందని శారదా అశోకవర్ధన్ 'ఆరవవేదం' అనే కవితలో

*"వర్ణభేదం, ధనిక స్వామ్యం*
*నల్లబజారులో కుళ్ళ లోగిళ్ళూ*
*దానవత ఇనుప చక్రాలకింద*
*మానవత నలిగిపోతోంది"* .. అంటూ

'చెడు' అనే చీకటికడలిలో చుక్కాని లేని నావలా 'మంచి' కొట్టుకు పోతోందనీ. "సమతామమతలో ప్రగతి గీతం పాడాలనీ, కన్నతల్లి కన్నీరు తుడవలేనిఐక్యతాగీతాన్ని" ఆలపించింది. "ఆనందాన్ని అందరికీ పంచమని, అదే ఆరవవేదం" కావాలని భావించారు. స్వాతంత్ర్యానంతరంపెరిగిన వర్గపోరును కోకా విమలకుమారి పేర్కొంటూ

*"స్వతంత్ర భారతి వేడుకుంటున్నా నిన్ను*
*ఈ అకృత్య ప్రజా జీవనం వద్దని*
*నిస్వార్థపు నీడలో సేదదీర్చు*
*మరో మంచి స్వతంత్రభారతిని దరి జేర్చమని"* వేడుకొంది.

"యుద్ధోన్ముఖంగా" అని కవితలో జయప్రభ

*భూమి సర్వమానవాళిది*
*ఏకొందరి గుప్పిట్లో చిక్కుకున్న*
*భూమిని రక్షించాలి*
*దోపిడీ నుంచి .. కాలుష్యం నుంచి*
*మట్టిని సంరక్షించాలి*
*మట్టిజీవచైతన్యానికి ప్రతీక*
*భూమి మానవ జీవన గీతిక"* అంటూ

వాతావరణాన్ని కాపాడుకుంటూ భూమిని ప్రజలను కాపాడు కోవటం కూడా దేశభక్తిలో భాగమనీ, దాని కోసం 'యుద్ధోన్ముఖంగా' సాగే కర్తవ్యాన్ని సూచించింది. ఝాన్సీ, కె. వి. 'ధర్మభూమి' కవితలో

*"తరతరాల దురాచారాలలో*
*తనివితీరని ధర్మభూమి*
*ఆర్థిక అసమానతలకు*
*ఆలవాలమీ కర్మభూమి*
*ఇదే... ఇదే ... మాతృభూమి"* అంటూ

స్వాతంత్ర్యానంతరం దేశస్థితికి దుఃఖించి దేశాన్ని గురించి ఆలోచించటమే దేశభక్తి అని అసమానతలున్న మాతృభూమిని గురించి ఆలోచించమంది.

బ్రిటీష్ వాళ్ళు అంటించి వెళ్ళిన ఇండియా–పాకిస్థాన్ ల మధ్యన కాశ్మీరీ సరిహద్దుల వివాదం చిలికిచిలికి గాలి వానయై ఉగ్రదాడికి దారితీయుటం దానికి ప్రతిగా, దేశసరిహద్దుల రక్షణకై సైన్యం ప్రాణాలకు తెగించి యుద్ధం చేయటం అనేది స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుండి నేటి వరకూ జరుగుతున్న క్రియ. అదే విషయాన్ని ఈనాటి కార్గిల్ యుద్ధం తెలియచేసిందని ఆ సందర్భాన్ని పురస్కరించుకొని 'దేశగౌరవాన్ని కాపాడే సిపాయి' శక్తియే, దేశభక్తియే భారతీయులందరినీ కాపాడుతోందని, సిపాయి భార్యల వేదనలోనూ దేశభక్తి ఎంత ఉందో తెలియజేసే కవితవచ్చింది. 'పెళ్లైన మూడోరోజే యుద్ధానికి బయలుదేరిన సిపాయితో అతని భార్యకు దేశ సైనికుడి గురించిన భావనను, ఆరెళ్ళ వెంకట సుబ్బలక్ష్మి అనే కవయిత్రి 'సిపాయి భార్య' అనే కవితలో

*"మరలి వచ్చినా రాకున్నా*
*వేచియుంటాను మరోజన్మకైనా*
*మరవకోయి నీ కర్తవ్యం*
*తీర్చుకోవోయి నీ జన్మభూమి ఋణం"* అంటూ

దేశరక్షణకై సిపాయి భార్య యుద్ధభూమిలో ఉన్న సిపాయిలో నైతిక శక్తిని పెంపొందించితే, ఆతని దేశభక్తి ప్రజల దృష్టిలో వారిని కాపాడేది 'సిపాయి' అన్న భావన ఏర్పడుతుంది.

ప్రస్తుత ప్రపంచీకరణ సందర్భంలో సాహిత్య ప్రక్రియలలో కవితల కంటే, కథారచనకు ప్రాముఖ్యత పెరిగింది. అయినా క్లుప్తంగా మనసులో నాటుకునేటట్టు వ్రాయాలనుకున్న కవయిత్రులు దేశంలో ప్రవేశపెట్టబడిన ఆర్థిక పెట్టుబడిదారీ విధానంలో పెరిగిన వ్యాపారనాగరికతను, వ్యాపార సంస్థల, వాణిజ్య గణ తంత్రాలను, కుట్రలను బట్టబయలు చేస్తూ 2001లో ప్రచురించిన "కుట్రదారుడి రచన పేరు నాగరికత అనే కవితలో కొండేపూడి నిర్మల వ్రాసిన 'మల్టీనేషనల్స్ ముద్దు' అనే కవితా సంకలనంలో అసంఘటిత ప్రైవేటు రంగాలలోని కార్మికులు

*"పొమ్మన చోటికి పొలోమంటూ చెమట బిందువులు పరిగెత్తటం*
*ఒక గొప్ప నాగరికతా దృశ్యమైతే*
*నాగరికతలు మోసి మోసి మోపు కట్టిన జీవితాలకు*
*దిగులు తప్ప, దివాలా తప్ప లేదనీ"..*
*"ఆకలి తీరని పిల్లా జిల్లా ముసలీ ముతకా తప్ప*
*రాజ్యాంగం మిగిల్చిందేమిటో తెలీదు" అనీ,*

శ్రమజీవన సౌందర్యం వాళ్ళ పాలిట 'ఓ వెక్కిరింత మాత్రమే' అనీ ప్రైవేటీకరణలో శ్రమ దోపిడి ఎక్కువై బీదలు మరింతగా చితికిపోతున్నారని కవయిత్రి భావించింది.

''కూలీలను'' మాతృభూమికి పరదేశిగా మార్చిందెవరో అని ఆలోచించమంది. "అతడెవరంటే ......

*"ఆ కుట్రదారుని రచనపేరు నాగరికత"*
*"నాగరికతంటే నిర్మాణమొక్కటేకాదు*
*కూడుకుంటున్న ఊపిరిని కూల్చివేయ్యటం కూడా*
*నాగరికత చెక్కడమే" అని*

నేటి దేశనాగరికతను ఆలోచించమనీ, "డీ హ్యూమనైజేషన్ ప్రాజెక్టుగా కంప్యూటర్ కల్చర్ మానవత్వాన్ని నశింప జేస్తుందనీ, మానవ సంబంధాలక్షీణతను బట్టబయలు జేస్తూ

*"పోటీ పెరిగిపోయిన కొద్దీ*
*అత్యాచారం మనుషులే చేస్తారన్న*
*అపవాదు పోయింది"*
*నాగరికారణ్యంలో రోజు పొడుగునా*
*డీహ్యూమనైజేషన్ ప్రాజెక్టు*
*సరదాగా మాట్లాడిపెడుతుంది*
*మాటంటే పూర్వపు అర్థం చెరిగిపోయింది*
*నిన్ను నువ్వు అమ్ముకోవడానికో, కొనుక్కోవడానికో తప్ప*
*మాట ప్రయోజనకారి కావటంలేదు"*

*దేశాలమధ్య శత్రువ్యూహాల్ని*
*శవాలు లెక్క తేలుస్తున్నాయి*
*దేశాల మధ్య వ్యాపార సంబంధాలు*
*అంకెలో సహా దొరుకుతాయి*
*"పంటెవరు దోచుకునాసరే*
*బీడు వదలని రైతొక గాడిద" అంటూ*
*ఫలమెవరి పేరిట చెలామణి అవుతున్నా"*

అంటూ నేటి నాగరికతా ప్రపంచాన్ని దానిలోని అమానవీయతను, పీడనను తెలియచేస్తూ 'దేశం ఎటుపోతోందో ఆలోచించటం కూడా దేశ భక్తియే' అని కవితలో స్పష్టంచేసింది.

1994 నాటి గణతంత్ర దినోత్సవ సందర్భంగా జె. కనకదుర్గ వ్రాసినది, స్వీయముద్రణ 2010లో వచ్చిన 'సాహితీ సుమాలు' అనే సంకలనంలోని 'వాణిజ్య గణతంత్రం' అనే కవితలో ప్రపంచీకరణ సందర్భంలో స్వదేశీయతా భావం ఉండాలంటూ

*"వాణిజ్యం వెసులుబాటుకై*
*తప్పని సరిచుట్టమైంది ఒప్పందాలపత్రం*
*వనరుల వినియోగపు హక్కులను*
*కాలరాచే వాణిజ్యాలముసాయిదా*
*విఫణి వ్యవస్థలో విలువలను నేలరాస్తుంది.*
*మానవులను స్వార్థపరులుగా మారుస్తూ*
*మనిషి మనిషికీ మనసులు కలవకుండా చేస్తుందని" ...*

బహు కుతంత్రాల వాణిజ్యాతంత్రానికి గణతంత్రదినోత్సవ మంత్రాలతో వర్ధమాన దేశాల జంత్రగాత్రంతో వర్ధిల్లుతున్న దేశాలకు విలువల అడ్డుకట్ట వేయాలి. పెరిగిన సంపదలే పెంచుతాయి విపణి స్వేచ్ఛనని స్వదేశీయోత్పత్తులతో పురోగమిస్తూ అధోగమన దేశీయ ద్రవ్యవిలువలను అధిగమించాలి .... " అంటూ ప్రపంచీకరణ సందర్భంలో దేశభక్తుల కర్తవ్యాన్ని సూచిస్తూ స్వతంత్రభారతావని ఆర్థిక స్థితిని కాపాడుకోవటం ప్రతియొక్కరి బాధ్యత అని చెప్పటం జరిగింది.

2012లోకూడా జెండాపట్ల తన భక్తి శ్రద్ధలు చూపించి దేశభక్తిని ప్రకటించుకున్న షేక్ బషీరున్నిసా బేగం "మువ్వన్నెల ముచ్చట్లు" కవితలో భారత జెండాలోని రంగుల ఉద్దేశాన్ని తెలిపుతూ

*"ఎర్రని చైతన్యం, తెల్లని శాంతం, పచ్చని స్నేహం*
*మనసున నిండి మనలను ఉరక లెత్తిస్తున్నాయ్.*
*మువ్వన్నెల ముచ్చటైన జెండా రెపరెపలు*
*భారతీయుల హృదయ స్పందనల ప్రతీకమైనాయ్" ...*

అంటూ ప్రజల ఆకాంక్షలను జాతీయ జెండాలో దర్శించింది.

నేటి భారతదేశంలో సామాన్య ప్రజలందరూ 'మరో స్వతంత్ర భారతికై తిరుగుబాటు చేయాల్సి వస్తుందని వారిలో, దేశభక్తి-కవితలు, చైతన్యం నింపితే ప్రపంచీకరణమీద ద్వితీయ భారత స్వాతంత్ర్య సమరం చేయటమే నేటి దేశభక్తిగా స్పష్టమవుతుంది. ముందుగా దేశభుక్తుల చేతిలో నుండి దేశాన్ని రక్షించుకోవటం అంతర్గత దేశీయ దేశభక్తి. ప్రస్తుతం కాస్తో కూస్తో రాజ్యాంగ బద్ధమైన లిఖిత వాచక దేశభక్తి తప్ప ఆచరణలో మనషుల మధ్య మానసిక బంధాన్ని పెంచే దేశభక్తి కొరవడింది. ఆదిశగా భారతీయులు జాతీయ చైతన్యం తెచ్చుకోవాల్సిన అవసరం ఎంతైనాఉంది. దానికి దేశభక్తి సాహిత్యాధ్యయనం అవసరం అని అర్థం అవుతోంది.

జెండా పండుగనాడు స్వాతంత్ర్యోద్యమం నాటి దేశభక్తిని స్మరించుకోవటం కేవలం "మా తాతలు నేతులుతాగారు మా మూతులు వాసన చూడండి" అనిగాక నేడు ఆ దేశభక్తి తగ్గటానికి కారణమైన చుట్టూరా ఉన్న సామాజిక రాజకీయ ఆర్థిక పరిస్థితులను పరిశీలించి సమాజంలో ఉన్న అసమానతలను తొలగించు కోవాలి. మానవతను పెంచుకుంటూ భారతీయులందరికీ స్వేచ్ఛాజీవనం ఏర్పడే పరిస్థితులను కల్పించడంలో భాగస్వాములవటమే నేటి దేశభక్తిగా భావించాలి.

*- మిసిమిమాసపత్రిక-నవంబరు 2018.*

# 14. స్వాతంత్ర్యోద్యమ స్త్రీల సాహిత్యం-రాజ్యాంగ స్ఫూర్తి

స్త్రీలయొక్క స్వతంత్రజీవన సమాలోచనలు విస్తృతమై, స్త్రీల హక్కుల చైతన్యాన్ని నింపుకొని వివక్షారహిత రాజ్యాంగనిర్మాణానికై రహదారులు వేసాయని నాటి స్త్రీలసాహిత్యాధ్యయనం తెలియజేస్తుంది. భారతదేశ రాజ్యాంగానికి మహిళల హక్కుల పరిరక్షణకు అవినాభావ సంబంధం ఉంది. హక్కుల వినియోగమే స్వాతంత్ర్యానికి చిహ్నం. పరాయిపాలనను పారద్రోలి దేశస్వాతంత్ర్య సాధనలో నాటి స్త్రీ, పురుషుల భాగస్వామ్యపు స్మరణ రాజ్యాంగస్ఫూర్తిని కల్గించింది. కాని స్త్రీ, పురుష వివక్షారహితమైన ప్రజాస్వామ్యపు రాజ్యాంగ నిర్మాణానికి సోపానాలు వేసినది మాత్రం స్త్రీల స్వతంత్రజీవన సమాలోచనలే అని నాటి స్త్రీలసాహిత్య అధ్యయనంవల్ల అవగాహన కలుగుతుంది. భారతదేశ న్యాయచట్టాలను రూపొందించటంలో ఈ స్త్రీల సాహిత్యం దిక్సూచి వంటిదని అర్థమవుతుంది. ఆంధ్రప్రాంతంలో స్త్రీజనం చేసిన ప్రాథమిక హక్కుల పోరాటం భారతదేశ రాజ్యాంగానికి రహదారులను వేసిందనేది చారిత్రక సత్యం. ఈసత్యా విష్కరణకు స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి స్త్రీలభావాలను ప్రతిఫలింప జేసిన స్త్రీల సాహిత్యం భూమిక కాగలిగింది. తోటి స్త్రీలను చైతన్యపరుస్తూ స్త్రీల వ్యక్తి స్వాతంత్ర్యసాధనకై, దేశస్వాతంత్ర్య సముపార్జనకు స్త్రీలలో పెరిగిన ఆలోచనల అక్షరాకృతికి కరదీపికగా ఉన్నటువంటి క్రీ.శ.1900 సం. నుండి 1947సం. వరకు తెలుగులో వచ్చిన పత్రికలలోని ఈ స్త్రీలసాహిత్యాన్ని వేదికగా చేసుకోవాలి.

భారతదేశ స్వరాజ్య సంపాదన ప్రధానలక్ష్యంగా రాజకీయస్వాతంత్ర్యానికై పురుషులతోపాటు స్త్రీలు పోరాటం చేస్తూ, అదనంగా స్త్రీలు తమ వ్యక్తి స్వాతంత్ర్యానికై సమాంతరంగా పోరాడవలసి వచ్చింది. ముందుగా స్త్రీలు తమ అస్వతంత్ర జీవనానికి, అవిద్యకు ఉన్న లంకెను గుర్తించి తమ జీవనహక్కుల వినియోగానికై విద్యావంతులు కావల్సిన అవసరాన్ని గుర్తించారు. స్త్రీలకు స్వాతంత్ర్యం ఉంటేనే దేశ స్వాతంత్ర్యం వచ్చినా ప్రయోజనం ఉంటుందని కందుకూరి వీరేశలింగం భావించి స్త్రీవిద్యకు పునాదులు వేసారు. వేమూరి శారదాంబ 1896 లోనే తాను వ్రాసిన 'మాధవ శతకం'లో స్త్రీలను చదువుకోనీయకుండా చేస్తున్న సామాజిక కుటుంబ అసమాన సంస్కృతిని ప్రశ్నకు పెట్టి స్త్రీవిద్యపట్ల ఆలోచనలను రేకెత్తింపజేసింది. ఇవే ప్రజా స్వామిక రాజ్యాంగ సమానహక్కులకు, లింగవివక్షలేని విద్యాహక్కుకు పునాదులు వేసాయని అర్థం చేసుకోవచ్చు. 1898 నాటికే భండారు అచ్చమాంబ స్త్రీలకు పురుషుల వలె శక్తి సామర్థ్యాలు ఉంటాయనే ప్రేరణను కలిగించటానికి చారిత్రక స్త్రీల జీవితాలను "అబలా సచ్చరిత్ర రత్నమాల" అనే గ్రంథంలో పొందుపరిచింది.

క్రీ.శ.1900 నుండి వచ్చిన స్త్రీలసాహిత్యంలో క్రమానుగతంగా వచ్చిన ఆలోచనల పరిణామశీలతను తెలుసుకోవటానికి 1900-1947 వచ్చిన స్త్రీల సాహిత్య అద్యయనం అవసరం. ఆసాహిత్యం ప్రతిఫలించి వారి ఉద్దేశాలను మాత్రం ఇక్కడ ఇవ్వటం జరుగుతోంది.

క్రీ.శ. 1902 లో విద్యావంతులైన స్త్రీలు విదేశీ స్త్రీల జీవితాలను వారి యొక్క రాజకీయ హక్కులను తెలుసుకుంటూ కుటుంబంలో తమ అస్తిత్వాలను గురించిన ఆలోచనలను పెంచుకున్నారు. అందుకే 1902 నుండి స్త్రీవిద్య అభివృద్ధి చెందటానికి 'స్త్రీసమాజాల'నే పేరుతో స్త్రీలు సమాజాలను ఏర్పాటు చేసుకోవటంతో స్త్రీవిద్యాఉద్యమం ఊపందుకొంది. 1902 నుండి వచ్చిన భండారు అచ్చమాంబ రచనలలో స్త్రీలు విద్య ద్వారా జ్ఞానాన్ని పొంది తమ బానిసత్వాన్ని తొలగించుకునే స్వతంత్రపు ఆలోచనలను పెంచుకొని తోటి స్త్రీలకు

పంచాలనుకోవటం జరిగిందని అర్ధమవుతుంది. అందుకే స్త్రీలు పత్రికారంగంలో ప్రవేశించి ప్రత్యేకంగా స్త్రీల సాహిత్యాన్ని ప్రచురించటం జరిగింది. స్త్రీల వ్యక్తిస్వతంత్ర్య సాధనకు, దేశస్వాతంత్ర్య సాధనకు అవసరమైన సాంఘిక-సాంస్కృతిక, ఆర్థిక-రాజకీయ చైతన్యాన్ని రగిలించింది ఈ స్త్రీల సాహిత్యమే. స్త్రీవిద్య స్త్రీలలో ధైర్యస్థైర్యాలను పెంచుతుందని భావించిన స్త్రీలు ఇంట్లో తమ భావాలను స్వేచ్ఛగా వ్యక్తీకరించ గలమనుకోవటమే భారత రాజ్యాంగం నిర్వచించిన ఆలోచనల స్వేచ్ఛకు, భావవ్యక్తీకరణ స్వేచ్ఛకు మార్గాన్ని ఏర్పరచింది. స్త్రీలలో వ్యక్తిత్వస్పృహ పెరిగి స్త్రీల అస్తిత్వకాంక్ష మొగ్గతొడిగింది. 1903 నాటికి స్త్రీలకు ఉన్నత విద్యావకాశాలు పెరగాలనీ, స్త్రీ సమాజాల ద్వారా చైతన్యం కలిగిస్తే స్త్రీజన సామూహిక స్వేచ్ఛ స్త్రీల వ్యక్తిస్వాతంత్ర్యానికి ప్రేరకమవుతుందనీ భావించారు. స్త్రీవ్యక్తి స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా స్త్రీలు స్వయంగా బాలికా పాఠశాలలను నెలకొల్పి స్త్రీ విద్యకు బాటలు వేసారు. అంతేకాదు స్త్రీల చదువుకు వైవాహిక సంస్కృతి ఆటంకంగా ఉన్నదని బాల్యవివాహాలను నిరసించటమే కాక స్త్రీ పునర్వివాహపు హక్కులను గురించిన ఆలోచనలు పెంచుకొని గౌరవప్రదమగు జీవన హక్కులను గుర్తించటం జరిగింది. పురుషులతో పాటు స్త్రీలు సమానంగా జన్మించినా అటు తండ్రియొక్క గాని ఇటు భర్తయొక్క ఆస్తిలో గాని హక్కులేని తనాన్ని గుర్తించి ఆడవాళ్ల యొక్క వారసత్వపు ఆర్థికహక్కుల దిశగా ఆలోచనలు పెంచుకున్నారు. 1904 సం. నాటికే స్త్రీలకు ఆస్తిహక్కు ఉండాలని భావించారు.

దేశస్వాతంత్ర్యం కోసం స్త్రీ, పురుషులు ఐకమత్యంతో పోరాడిల్సిన అవసరాన్ని గుర్తిస్తున్న రోజులలోనే అంటే 1905 లోనే స్త్రీలస్వతంత్రత కోసం స్త్రీలే ఐకమత్యంతో పోరాటం చేసుకోవాల్సిన అవసరాన్ని గుర్తించారు. స్త్రీవిద్యకు, స్త్రీల అస్వతంత్ర జీవనానికి, దేశస్వాతంత్ర్యానికి ఉన్న లంకెను గ్రహించగలిగారు. వితంతు స్త్రీల దుస్థితికి కారణమైన సమాజసంస్కృతిని గుర్తించారు. 1905 లో బెర్లిన్ లో జరిగిన ప్రపంచ స్త్రీల సభలో పాల్గొన్న భారతదేశ స్త్రీలు తమ దేశ అస్తిత్వాన్ని గౌరవాన్ని నిలపటానికి తమ చీర చెంగులను చించి జెండాను తయారుచేసి ప్రదర్శించటమే స్త్రీల స్వతంత్ర నిర్ణయాలకు నిదర్శనమని

భావించవచ్చు. 1906లో లండన్ నుంచి వచ్చిన దాదాభాయి నౌరోజి కోసం ఏర్పాటుచేసిన సభలో భారతదేశ వారసత్వంకల ఒక మేడం కామా అనే పారశీక స్త్రీ పతాక ఆవిష్కరణ చేయటం జరిగింది. 1910 నాటికే స్త్రీల సాహిత్యంలో స్త్రీ, పురుషుల స్వతంత్ర జీవనంలోని తేడాను గుర్తించే ఆలోచనలు స్పష్టమయ్యాయి. అవిద్య, ఆస్తిహక్కులేమియే స్త్రీల అసమానత్వానికి కారణం అనీ, స్త్రీలు అదనంగా సాంఘిక, ఆర్థిక, స్వాతంత్ర్యాలకోసం పోరాడాలని భావించారు. స్త్రీల స్వాతంత్ర్యానికి దేశస్వాతంత్ర్యానికి ఉన్న లంకెను గ్రహించి ముందుగా స్త్రీలు భౌతిక, బౌద్ధిక, మానసిక స్వేచ్ఛను అనుభవించ గలిగినప్పుడే దేశస్వాతంత్ర్య సాధన సులభతరం అవుతుందని భావించారు. స్త్రీల అవిద్యా నిర్మూలనకు కృషిచేస్తూనే, ఆర్థికస్థోమత దిశగా అడుగులువేసే క్రమంలో గృహపరిశ్రమల తయారీతో ఆదాయాన్ని పొందాలనుకున్నారు. స్వరాజ్యసాధనకై తిలక్ ప్రస్తావించిన స్వదేశీవస్తు తయారీలో భాగంగా స్త్రీలు నూలువడకటం, స్వదేశీసబ్బుల తయారీవంటివి నేర్చుకున్నారు. బ్రిటిష్ వారు యాంత్రిక వస్తుతయారీతోనే భారతదేశ ఆర్థికస్వామ్యాన్ని పొందుతున్నారని గ్రహించి దానికి విరుగుడుగా స్త్రీలు గృహపరిశ్రమల ద్వారా తమ ఆదాయాన్ని పెంచుకోవటం చేసారు. విద్యవల్ల స్త్రీలు పాశ్చాత్య జ్ఞానాన్ని పెంచుకోవటంతో 1910 నాటికే ఓటుహక్కును గుర్తించి స్త్రీలు రాజకీయచైతన్యాన్ని పెంచుకోవటం జరిగింది. ఆ నాటికే స్త్రీలు రజస్వలానంతరం వివాహంచేసుకొనే స్వతంత్రతకై ఉద్యమ చైతన్యాన్ని పొందగలిగారు. అంటే 20 వ శతాబ్దపు మొదటి దశకంలోనే స్త్రీలు తమ వ్యక్తిస్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొంటూనే దేశస్వాతంత్ర్య ఉద్యమంలోనూ పాలుపంచుకోగలిగారు.

1911 నాటికి స్త్రీలు తమ ఆరోగ్యం గురించి ఆలోచించటంతో పాటు పురుషుల బహుభార్యాత్వపు సంస్కృతిని నిరసిస్తూ స్త్రీ పురుషులకు కుటుంబంలో సమాన సంస్కృతిగల లైంగిక హక్కు ఉండాలని భావించారు. స్త్రీలు తమ ఆరోగ్యభద్రతకు సంబంధించిన చైతన్యాన్ని పెంచుకున్నారు. 1911లోనే స్త్రీ-పురుషుల సమానత్వపు ఆలోచనలు పెరిగి తమకు పురుషులతోపాటు సమాన

గౌరవస్వాతంత్ర్యాలు ఉండాలనుకున్నారు. 1912 నాటికి 'విడాకుల' ప్రస్తావన తెచ్చారు. తమ సామాజిక హోదా గురించి ఆలోచనలు చేసారు. హిందూవివాహ చట్టాన్ని గురించి ఆలోచనలు నాడే కలిగాయి. విదేశాలలో స్త్రీల విద్యావిధానాన్ని ఆకళింపు చేసుకొన్నారు. దైవభక్తికంటే దేశభక్తి, దేశాభిమానం ముఖ్యమనీ, సంఘదురాచార నిర్మూలనయే దేశాభివృద్ధిమార్గమని భావించారు. 1916 లో స్త్రీలకు సమాన ఆర్జనావకాశాలు గల స్త్రీల స్వతంత్ర జీవనావశ్యకతను గుర్తించారు. వ్యాపారవేత్తలుగా ఎదగాలనుకొన్నారు. 1918 నాటి స్త్రీలు రాజకీయ స్వాతంత్ర్యానికి తాము అర్హులనే భావనను పెంచుకున్నారు. అప్పుడే స్త్రీలు రాజకీయాలలో పాల్గొనేందుకు లింగవివక్ష కారణమనీ గ్రహించారు. 1919లో ఉద్యోగాలలో స్త్రీ పురుషులకు సమాన అవకాశాలు ఉండాలనుకున్నారు. అందుకనే 1919 ఇండియా చట్టం ముస్లిములకు ప్రత్యేక నియోజక స్థానాలను టాయించేసరికి 1919 లోనే స్త్రీలకు ప్రత్యేక నియోజకవర్గ స్వాతంత్రం ఉండాలనే ఆలోచనన చేసారు. ఆ కారణంగానే స్త్రీలు 1920 లో గాంధీజీ పిలుపుతో సత్యాగ్రహోద్యమంలో భాగస్వాములై సహాయ నిరాకరణోద్యమాన్ని ముందుండి నడపగలిగారు. స్త్రీలు ఎదుర్కొనే కుటుంబ హింసను చట్టానికి పట్టించేస్థితికి వారి ఆలోచనలు పెరిగాయి. 1924లో స్త్రీల స్వయంపోషకత్వం తమ స్వతంత్ర జీవనానికి అవసరమని భావించారు.

1925 నాటికి స్వరాజ్య సంపాదన స్త్రీల విద్యుక్తధర్మమని భావించారు. స్త్రీసమాజాలు అభివృద్ధి చెంది 1927 నాటికి రాష్ట్ర, జాతీయ మహిళాసభలు ఏర్పడ్డాయి. 1929 లో స్త్రీని నిర్వచిస్తూ ఆమెకు శరీరముంది, మెదడుంది, హృదయముందనీ, కానీ వాటిపై పురుషుని అధికారం ఉంటోందని, స్త్రీ పురుషుని సొత్తుకాదని భావిస్తూ, స్త్రీలు స్వతంత్రంగా జీవించేహక్కును తమ మానవహక్కుగా భావించారు. 1929 నాటికి విద్యావంతులైన స్త్రీలకు ఓటుహక్కు లభించింది. పురుషులు దేశస్వాతంత్రాన్ని పొందటానికి ముందే స్త్రీ స్వతంత్రురాలు కావాలనుకున్నారు. స్త్రీలకు స్వాతంత్ర్యం జన్మహక్కనీ, మానవహక్కనే ఆలోచనలు పెంచుకున్నారు. 1930 లో స్త్రీలకు పురుషులతోపాటు సమానమైన

గౌరవహక్కులు గల సామాజిక జీవనం కావాలనుకొని చట్టప్రయోజనాలను తెలుసుకుంటూ స్త్రీలహక్కులను సద్వినియోగం చేసుకోవాలనుకున్నారు.

1930 లో ప్రారంభమైన ఉప్పుసత్యాగ్రహంలో స్త్రీలు పాల్గొని రాజకీయ స్వాతంత్ర్యం కోసం పోరాడి జైలుపాలయ్యారు. గర్భిణిలుగాను, ప్రసవవేదనను జైళ్ళల్లో భరించారు. అప్పుడే స్త్రీలు తమ భావస్వేచ్ఛకు సంబంధించి చట్టపరమైన హక్కులను విశ్లేషించుకున్నారు. 1931లో మద్రాసు లోకల్ బోర్డులచట్టం వచ్చింది. గ్రామస్వరాజ్యంలో స్త్రీల భాగస్వామ్యం ఉండాలనుకున్నారు. మున్సిపాలిటిలు, బోర్డులు ఏర్పడ్డ నేపథ్యంలో స్త్రీలు1932 లో పాలనారంగంలోకి అడుగువేయటం, క్రమంగా నామనిర్దేశంగా పదవిని పొందటంకాక స్త్రీలు ఎన్నుకోబడి స్త్రీల సమస్యలను తీర్చటానికి స్త్రీల స్వతంత్ర నిర్ణయాధికారానికి బాటలు వేయాలను కున్నారు. ఆ రకంగా తమకు రాజ్యాధికారాలలోని పాలనహక్కులను పొందాలను కున్నారు. 1932 లోని శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొని బ్రిటిష్ ప్రభుత్వపు పోలీసులచేతిలో మాన, ప్రాణ, జీవనహక్కుల భంగాన్ని అనుభవించినా ఉద్యమ ధైర్యాన్ని కోల్పోలేదు. స్త్రీలు అబలలుకాదు ప్రబలలని నిరూపించుకోవాలను కొన్నారు. 1932 నాటికి స్త్రీలు తాము ఎదగగలిగి తోటివారికి సహాయపడగల స్థితికి చేరుకోవాలనీ, ఆదాయాన్ని పెంచుకోవటానికి వ్యాపారపు మెలకువలు గ్రహిస్తూ ఆర్థికశక్తిగా ఎదిగితేనే దేశ స్వాతంత్ర్యానికి పాటుపడగల సమర్థత స్త్రీలకు ఉంటుందని భావించారు. 1933లో కుటుంబంలోని భర్తల అధికారాలను ప్రశ్నకు పెట్టటంతోపాటు స్త్రీలు తమ వ్యక్తిస్వాతంత్ర్యపు హక్కును సంపాదించు కోవాలనుకున్నారు.

1935లోనే స్త్రీలు తమసామాజిక అస్తిత్వాలకు సంబంధించిన ఆలోచనలు పెంచుకొని సామాజిక సంస్కృతిని నిరసించే విధంగా స్వతంత్ర నిర్ణయాలు చేసుకోవాలని భావించారు. 1935 నాటికి ఎన్నికల ద్వారా శాసనసభ్యత్వంకై స్త్రీ–పురుషులకు సమాన ప్రాతినిథ్యం ఉండాలనే రాజకీయ హక్కుల చైతన్యం అభివృద్ధి చేసుకున్నారు. ఉన్నత విద్యావంతులైన స్త్రీలకే కాక సంతకం చేయగలిగిన స్త్రీలకు ఓటుహక్కును, ఎన్నికల హక్కును విస్తరింప జేయాలనుకున్నారు. రాష్ట్రీయ

స్వాతంత్ర్యానికి, అంతర్గత స్వపరిపాలనకు రాజ్యాంగం ఏర్పాటు చేసుకునే దిశగా స్త్రీలు పురుషులతో పాటు ఉద్యమంలో పాల్గొన్నారు. 1935 లో స్త్రీల హక్కులకై శాసనసభలో బిల్లును పెట్టాలనుకున్నారు. స్త్రీలు తమకు సంపూర్ణస్వేచ్ఛ కావాలనుకున్నారు. 1936 లో సాంఘిక, రాజకీయ, ఆర్థికరంగాలలో స్త్రీ పురుష సమానత్వపు ఆవశ్యకతను గుర్తించి లింగవివక్ష ఉండకూడదనీ రాజకీయ రంగాలలో ఎన్నికకాబడే హక్కు పురుషులకు వలె స్త్రీలకు ఆత్మహక్కని భావించారు. 1936 లోనే స్త్రీలు తాము చేసే ఇంటిచాకిరికి వేతనాలు కావాలని కోరుకున్నారు. 1937లో పురుషులతో పాటు సమానంగా స్త్రీలు ఉద్యమంలో పాల్గొనటానికి స్త్రీల గర్భధారణ ఆటంకంగా ఉన్నదని భావించారు. స్త్రీలు కేవలం సంతానాన్నికనే జీవయంత్రాలు కాదనీ, తల్లినవ్వాలను కోవటంగాని గర్భస్రావం వంటి విషయాలలో గాని స్త్రీలకు హక్కుఉండాలని ఆనాడే గుర్తించటం జరిగింది. విదేశాలలో వలె స్త్రీలు సైన్యంలో కూడా చేరవచ్చనే ఆలోచనలు పెరిగాయి. స్త్రీల వ్యక్తిత్వాలను అగౌరవపరిచే పత్రికా ప్రకటనలను, చిత్రాలను నిరసించారు. 1938 నాటికి ప్రత్యేక నియోజకవర్గాలకు స్త్రీలు శాసనసభ్యులుగా ఎన్నికకాబడి తమ రాజకీయహక్కులను పొందాలనుకోవటం జరిగింది. దానితో రాజకీయాలకు, స్త్రీలస్థితికి ఉన్న సంబంధాన్ని గుర్తించారు. అంతేకాక పెళ్ళిళ్ళు రిజిష్టర్ చేయబడాలని కోరుకున్నారు. 1938 నాటికి శాసనసభ సభ్యత్వానికి ఎన్నుకొనబడే హక్కును సాధించుకున్నారు. సామాన్యస్త్రీలు కూడా కాస్త చదువుకోవటంచేత ఓటును వేయగల హక్కును వారు సంపాదించుకున్నారు. 1938 నాటికే స్త్రీలు న్యాయచట్టాల యొక్క లింగవివక్షా స్వభావం స్త్రీలకు పురుషులతో సమానంగా జీవించేహక్కు లేకుండా చేసిందని గ్రహింపు కలిగి సాంఘిక, ఆర్థికన్యాయాలను ప్రశ్నకు పెట్టటం జరిగింది.

1938 నాటికే స్త్రీ సమస్యలన్నీ పురుషుల సమస్యలలో కలిసి ఉన్నాయనీ గుర్తించటమే కాక స్త్రీలు పురుషులు సమానంగా జీవించేహక్కు కలిగిఉంటేనే స్త్రీల స్వతంత్రపు జీవనహక్కుకు రక్షణ ఉంటుందని భావించారు. ఆర్థికవిధానం మారాలని స్త్రీలకు ఆర్థిక, సాంఘిక, రాజకీయ హక్కులు కావాలని స్త్రీలకు

స్వాతంత్ర్యం జన్మహక్కని భావించారు. 1940-41 లో వ్యక్తి సత్యాగ్రహోద్యమం లోనూ, 1942లో జరిగిన క్విట్‌ఇండియా ఉద్యమంలోనూ పురుషులతో పాటు సమానంగా స్త్రీలు భారతీయజెండాను చేపట్టి ఉద్యమం చేయటం జరిగింది. 1947 ఆగష్టు 15వ తేదీన ఎగురవేయబోయే భారతదేశ స్వాతంత్రపు జెండాను తెలుగింటి కోడలైన సరోజనీనాయుడు, నెహ్రూకు అందించటం జరిగింది. డా.అంబేద్కర్ రూపొందించిన రాజ్యాంగ నిర్మాణ సంఘసభ్యురాలిగా ఆంధ్రవనిత యైన గుమ్మడిదల దుర్గాబాయి (దేశముఖ్) స్త్రీలకు సమానహక్కులు, సమాన న్యాయం ఉండాలని సూచించటమే ఒక ప్రక్క స్త్రీలస్వతంత్రతకు, దేశస్వాతం త్ర్యానికిని, మరొకవైపు స్త్రీలహక్కుల చైతన్యానికి స్వతంత్ర భారతదేశ రాజ్యాంగ నిర్మాణానికిఉన్న అవినాభావసంబంధం అర్థమవుతుంది.

70 ఏండ్లు దాటినా కూడా భారత ప్రజాస్వామిక రాజ్యాంగంయొక్క అమలులో స్త్రీలు పురుషులతో సమానంగా జీవించలేని దశలో ఉండటానికి కారణాలు విశ్లేషించుకుంటూ స్త్రీలు తమ హక్కుల పరిరక్షణకై మరింతగా కృషిచేసే దిశగా సాగటానికి స్వాతంత్రోద్యమం నాటి స్త్రీల సాహిత్య పఠనం అవసరం. స్త్రీలసాహిత్యంలో ప్రతిఫలించిన వారిఆలోచనల పరిణామాన్ని స్మరించుకోవటానికి వివిధ సాహిత్య ప్రక్రియల రూపంలో పాత తెలుగు పత్రికలలో నిక్షిప్తమై విస్తృతంగా, విస్మృతంగా పడియున్న నాటి స్త్రీలసాహిత్యం ఇచ్చిన చైతన్యం నేటికీ స్ఫూర్తిదాయకం. కాలానుగుణంగా వచ్చిన స్త్రీల సాహిత్యంలో ప్రతిఫలించిన స్త్రీల స్వతంత్ర జీవన హక్కుల చైతన్యం, స్త్రీ, పురుషులు చేసిన దేశస్వాతంత్రపు స్వరాజ్య హక్కుల పోరాటం కలిసివెరసి వివక్షారహితమైన భారతదేశ ప్రజాస్వామిక రాజ్యాంగ నిర్మాణానికి దారిదీపాలుగా భాసించాయనే స్పృహకలిగి, నేటికీ స్త్రీలహక్కుల పరిరక్షణ దిశగా సాగటానికి అది అవసరమని అర్థమవుతుంది. ఈ సాహిత్యాన్ని తెలుసుకోవటానికి ముందుకు సాగాలి.

*- ఆంధ్రజ్యోతి దినపత్రిక-వివిధశీర్షిక 8.03.2020*

## 15. అమరావతి కథల్లోని ఆకాశంలోసగం

చారిత్రక ప్రభాత సంధ్యలో మానవ వికాసం సాధించిన పరమార్థం 1978లో రచింపబడిన 'అమరావతి కథల'లో స్పష్టమయింది. గుంటూరు జిల్లాలోని కృష్ణానదీ తీరపు అమరావతిలో పుట్టి పెరిగి ఆ ప్రాంత సామాజిక జీవనాన్ని పరిశీలించిన శంకరమంచి సత్యం తన భావ చైతన్యాన్ని 'అమరావతి కథల' సంపుటిలో నిక్షిప్తం చేసారు. అర్ధభూస్వామ్య, అర్ధ పెట్టుబడిదారీ వ్యవస్థ రాజ్యమేలుతున్న నాటి మానవజీవన సంస్కృతిలోని వర్గ సంఘర్షణలు, దోపిడీ స్వభావం, లింగవివక్ష, మతం, యంత్రీకరణతో వృత్తిపనులకు విలువలు తగ్గటం వంటి విషయాలు అమరావతికథలలో ప్రతిఫలించాయి. రచయితకున్న సామాజిక సంబంధాలవల్ల అమరావతిలోని మానవజీవనాన్ని వాస్తవికంగా వర్ణించేటప్పుడు సామాజిక చలన సూత్రాలకు అనుగుణంగా మారిన స్త్రీ–పురుష సంబంధాలు అప్రయత్నంగానే చోటుచేసుకుంటాయి. ఆ మార్పుల నేపథ్యమే అత్యాధునిక సమాజంలోని మహిళల చైతన్యం ఆకాశంలో సగాన్ని పొందటానికి అవసరమైన అభ్యుదయభూమికగా కనపడుతుంది.

అమరావతి ప్రాంతంలోని సమాజానికి అద్దం పట్టే అమరావతి కథలు వందవరకు ఉన్నా వాటిలో కొన్ని కథలు చాపకిందనీరులాగా మహిళా సాధికారికత దిశగా చైతన్యాన్ని కల్గిస్తాయి. ఆడపిల్ల పుట్టుకకు, చదువుకు, శ్రమ శక్తికి విలువనివ్వటం, స్వీయశ్రమతో మహిళలు పరాధీనత నుండి విముక్తిని

పొందాలనుకునే వ్యక్తిత్వపు ఆకాంక్ష స్పష్టమవుతుంది. చిన్నచిన్న కుటీర పరిశ్రమలలో మహిళల యాజమాన్య నిర్వహణా సమర్థత, నిర్ణయాత్మకత, మతఘర్షణల నివారణలో స్త్రీలమేధాశక్తిని ఈ కథలు ప్రతిఫలించాయి పురుషులతో పాటు సమానమైన అవకాశాలను, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు కావాలను కున్న మహిళలుగా వారు సాధించిన జీవన వికాసానికి అమరావతి కథలు అద్దం పడతాయి.

లింగ వివక్ష కారణంగా నేటికీ ఆడపిల్ల పుట్టుకను స్వాగతించని సామాజిక పరిస్థితులు ఉన్నప్పటికీ అమరావతికథలలో మాత్రం ఆడపిల్ల పుట్టుకను అపురూపంగా భావించటం 'నిండుకుండ బొమ్మ' కథలో కన్పడుతుంది. అల్లారు ముద్దుగా పెంచుకున్న ఆడపిల్ల నీటికుండలోపడి చనిపోతే ఆ కుండనే బొమ్మ చేసి గజ్జెలు పెట్టి ఆ బొమ్మలోనే కూతురుని చూసుకొని మురిసిపోవటం కన్పడుతుంది. ఒక్క సంతానమైనా నేటికీ కూతుర్ని పెళ్ళి చేసి పంపించి, తండ్రి తన గుండెలమీద కుంపటిని దించుకున్నట్టుగా భావించటం కన్పడుతుంది. తద్భిన్నంగా 'అంపకం' కథలో తండ్రి శివయ్య, ఆడపిల్లకు పెళ్ళి చేసి పంపించిన తరువాత మనసంతా శూన్యమైనట్లు దిగులు చెందటం కన్పడుతుంది. అల్లుడు కూతుర్ని సరిగా చూసుకుంటాడో లేదోనని ఆందోళన చెందుతున్న సమయంలో అతని భార్య ఓదారుస్తూ తన తండ్రి కూడా ఒకనాడు నీ చేతిలో పెట్టి బాధపడినా, నువ్వు నన్ను చల్లగా చూసినట్లే నీ అల్లుడు కూడా చూస్తాడులే అని అతని మనసులోని శూన్యాన్ని ఆందోళనను పోగొడుతుంది. భర్త భార్యను ప్రేమగా చూసుకుంటే ఆ యింట్లో, ఆ భర్త తండ్రిగా కూతురినికూడా బాగా చూసుకుంటాడని, ఆడపిల్ల పుట్టుకకు విలువలుంటాయని అర్థం అవుతుంది.

'లేగదూడ చదువు' ఆడపిల్లల చదువుకు విలువ ఉంటుందని తెలియచేసే కథ. ఇంట్లో కొడుకు చిరుతిండ్లకు అలవాటుపడి సరిగా చదువుకోడు. పైగా తన అక్కయైన 'బాల' చదువుకొంటుంటే 'ఆడపిల్లలకు చదువెందుక'ని దుర్మార్గంగా మాట్లాడినా, పట్టించుకోక 'బాల' స్కూలు కెళ్ళి శ్రద్ధగా చదువుకోవటం కథలో కన్పడుతుంది. అంతే కాదు బాల చెల్లెలు చిట్టిలాంటి ఆడపిల్లలకు చిన్నప్పటి నుండి బడికి పోయి చదువుకోవాలనే ఆకాంక్ష ఉండటమే గాక తన చదువును

ప్రకృతితో అనుసంధానం చేయగలతత్త్వం ఆడపిల్లల్లో ఉంటుందని చిట్టి చదువు ద్వారా అర్థం అవుతుంది.

"కొడుకైతే వృద్ధాప్యంలో తల్లిదండ్రులను పోషిస్తాడు" అనే నానుడికి భిన్నంగా "పచ్చగడ్డి భగ్గుమంటుంది" కథలో గడ్డికోసి అమ్మి తండ్రిని పోషించే లచ్చి, "కాకితో కబురు" కథలోని జువ్వి అంట్లుతోమి తండ్రిని పోషించటం, "మట్టి–ఒరిమట్టి" కథలో సీతాలు కుండలు చేసి తండ్రిని పోషించటం కనబడుతుంది. ఆ రకంగా కూతురు కూడ తన శ్రమ శక్తితో తల్లిదండ్రులను పోషించగలదని తెలియచేస్తూ ఆడపిల్లల పుట్టుకకు మరింత విలువనివ్వటం కన్పడుతుంది.

"పట్టుత్తరీయం" కథలో మంగి పుట్టింటినించి తెచ్చుకున్న డబ్బుతో కూతురుకు గౌను కొందామనుకునేసరికి అదే సమయానికి బయట నుంచి వచ్చిన ఆమె భర్త వీరేశం ఆ డబ్బుతో బట్టల మూటలో నుండి తీసిన పట్టుత్తరీయాన్ని కొనుక్కోవాలని ఆమె దగ్గర డబ్బు తీసుకుంటుంటే మంగి ఒప్పుకోదు. కాని తన భార్య మీద, ఆమె డబ్బు మీద కూడా తనకు అధికారం ఉందనే భావనతో వీరేశం ఆ డబ్బును లాక్కొంటాడు. అతడు అలా తన డబ్బు లాక్కొని పట్టుత్తరీయం కొనుక్కున్నందుకు మంగి నిరసన తెలియచేస్తూ అతడితో మాట్లాడదు. దానికి భయపడిన భర్త ఆ పట్టుత్తరీయంతో కూతురికి రెండు గౌన్లు తెస్తాడు. ఈ కథలో మంగి నిరసనలో ఆమె తెచ్చుకున్న స్త్రీధనాన్ని తన యిష్టానుసారం వాడుకోవాలని, సొంత డబ్బును వాడుకునే విషయంలో తనకే నిర్ణయాధికారం ఉండాలని మంగి భావించటం కన్పడుతుంది. తన డబ్బు మీద భర్తకు అధికారం లేదని భావించటం స్త్రీ యొక్క ఆర్థిక స్వాతంత్ర్య భావనకు పునాది ఈ కథ. నేటికీ మహిళలు ఉద్యోగినిగా ఉన్నా తమ యిస్టానుసారం ఖర్చు పెట్టుకోలేని స్థితిలో ఉన్నారు.

తెలుగు గడ్డపై అమరావతి కథల రచనాకాలం నాటికి (1978) స్త్రీ వాదంకానీ, రంగనాయకమ్మ వ్రాసిన "జానకి విముక్తి" నవల గానీ వెలుగులోనికి రాకమునుపే అమరావతి కథలలో "పక్కవీధి జన్మంతదూరం" అనే కథ రావటం

ఆశ్చర్యం. ఈ కథలో ఒక స్త్రీ కుటుంబసంబంధాల కంటే కూడా వ్యక్తిత్వంతో ఒక మహిళగా, స్వతంత్రంగా జీవించటానికి ప్రాధాన్యత యిస్తుంది. చక్కగా వండిపెడుతున్నా రంగమ్మను ఆమె భర్త దేవుడు పేరుకేగాని ఆమెను విసుక్కుంటూ తను చెప్పిన రంగు చీర కట్టుకోవాలంటూనూ, వంటల విషయంలోనూ చీటికి మాటికి ఆమెను మానసిక హింసకు గురిచేస్తాడు. దానితో రంగమ్మ ఒక రోజు ఇంటి పనులు చేయటం మానేసి తన విలువేంటో భర్తకు తెలియచేయాలను కుంటుంది. కాని, పితృస్వామ్య సంస్కృతి వంటపట్టించుకన్న దేవుడు ఆమె మీద కోపం తెచ్చుకుని పక్కవీధిలో ఇల్లు తీసుకుని వేరుగా ఉంటూ, ఈమెకు బియ్యం, పప్పు పంపిస్తూంటాడు. అతడు వెళ్ళిపోయినందుకు ఆమె బాధపడదు కాని నాలుగు రోజుల అనంతరం అలా పరాధీనంగా ఉండటం యిష్టం లేక అతడు పంపించిన బియ్యం పప్పును తిరిగి పంపించేస్తుంది.

రంగమ్మ పొలంలో కూలి పని చేసుకుని బ్రతుకును గడపాలనుకుంటుందే కాని తనకు విలువ లేని అతడి యింటికి వెళ్ళాలనుకోదు. అతడు రెండవ పెళ్ళి చేసుకున్నా బాధపడదు. కొన్నాళ్లకి అస్వస్థత వచ్చి, లేవలేకపోయిన పరిస్థితిలో, సవతి రమ్మన్నా పక్క వీధిలో ఉన్న భర్త ఇంటికి వెళ్ళక తన వ్యక్తిత్వానికి విలువను నిలుపు కుంటుంది. ఇక్కడ రంగమ్మ భర్తతో కుటుంబ చట్రంలో ఉన్నప్పుడు పని విభజనలో భాగంగా అతనికి వండిపెట్టి ఇంటి పనులు చేస్తూ ఉండటంతో, తను చేసే ఇంటిపనులకొక ఆర్థిక విలువలున్నాయనే భావనతో అతడు తెచ్చిన బియ్యం వండి వాటిని ఉపయోగించగలిగింది. అప్పుడు తను చేసిన యింటి పనులకొక ఆర్థిక విలువలున్నాయనే భావనతో కూడిన వ్యక్తిత్వం ఆమెది. కాబట్టే అతడు ఇంట్లో ఉండనప్పుడు అతనికోసం యింటి పనులు, వంటపని చేయాల్సిన అవసరం లేనప్పుడు, అతడు పంపించే బియ్యం, పప్పు తీసుకోవాలని ఆమెకు అన్పించదు. పరాధీనురాలుగా గానీ కుటుంబ హింసను గానీ భరిస్తూ తన జీవితాన్ని గడపటం యిష్టంలేని ఆమె, భర్త అలా చేసినందుకు బాధపడదు. తన శక్తిని పొలంలో కూలి పనులకు వెచ్చించి సంపాదించుకుని బ్రతకాలను కొంటుంది. 1978 నాటికి మహిళలు తమని తాము మనుషులుగా

భావించుకుని, తమకూ వ్యక్తిత్వాలు ఉంటాయనే స్పృహతో ఉండటం, మహిళలు కుటుంబ చట్రంలో కుటుంబ హింసకు ఒదిగి పరాధీనులుగా బానిస బ్రతుకు బ్రతికే కంటే కూడా ఆర్థికంగా పుంజుకొని స్వతంత్ర వ్యక్తిత్వంతో బతికి తమ జీవితాలకు విలువనిచ్చుకోవాలని భావించడం జరిగింది.

ఇన్నాళ్ళు భర్తకు వండిపెట్టి చేసే ఇంటిపనులకు ఉపయోగించిన శక్తిలో సగం పొలంలో కూలీగా వినియోగించి స్వతంత్ర వ్యక్తిగా బ్రతకాలనుకోవటం, తనమనసుకి, తనశరీరానికి, జీవితానికివిలువ నివ్వటంగా భావించింది. కుటుంబ హింస భరించేకంటే ఆర్థికంగా నిలదొక్కుకుని స్వతంత్ర అస్తిత్వంతో బ్రతక గలిగితేనే మహిళల జీవితాలకు ఒకసాధికారికత ఏర్పడుతుందనే చైతన్యాన్ని కలిగించే కథఇది. కుటుంబంలో మహిళా సాధికారికత సాధించితే ఆ సాధికారికతే సమాజంలో విస్తృతమవుతుందనేది సత్యం. “ఆరేసిన చీర” కథలో కూడా ‘లచ్చి’ తన భర్తకిష్టమైనట్టుగా కాక, తనకిష్టమైన పద్ధతిలో అలంకారం చేసుకుని, తన శరీరం మీద తనకే హక్కుందనే స్పృహ ఉన్నట్లుగా అర్థం అవుతుంది.

ప్రపంచీకరణ సందర్భంలో పెరిగిన పారిశ్రామిక వ్యాపార నాగరికతలో భాగంగా మహిళలకు సంస్థల యాజమాన్య నిర్వహణ అప్పగిస్తే ఆర్థికాభివృద్ధి ఉంటుందని ఆలోచించే నేటి తరుణంలో ఆనాటి అమరావతి కథలలోని “ఎవరికీ చెప్పబోక!” అనే కథ మహిళా మేనేజ్మెంట్ కొక ఆదర్శనమూనా.

ఈ కథలో సుబ్బమ్మ తన భర్త శంకరయ్యతో కలసి హోటల్ నడుపుతుంది. తాను టిఫిన్ల తయారీ రంగంలో ఉంటే భర్త సర్వీసింగ్ రంగంలో ఉంటాడు. ధరనిబట్టి ఆదాయానికి నష్టం వచ్చే విధంగా ఎక్కువ చట్నీ వేయటంగాని, ఉప్మాలో జీడిపప్పు వేయటం గాని చేసేదికాదు. ఒక రోజు కొందరు యువకులు వచ్చి ఉప్మాలో జీడిపప్పు లేదని దౌర్జన్యం చేస్తూ హోటల్‌లో కుర్చీలు విరగకొడుతుంటే వారిని ఎదుర్కోలేకపోగా, అలా చేయొద్దని శంకరయ్య వాళ్ళ కాళ్ళావేళ్ళా పడతాడు. అది చూసిన సుబ్బమ్మ, భర్తని తనకొచ్చిన ఇంగ్లీషు ముక్కలతో ‘బ్లడీఫూల్’ అని తిడుతుంది. అలా భార్య తిట్టటమే గాక, ఇంగ్లీషులో

తిట్టినందుకు మరీ బాధపడతాడు. భర్తని మాతృభాషలో తిట్టే సాహసం ఏ భారత స్త్రీ చేయగలుగుతుంది? ఆ భర్త తన బాధను బజార్లోకి వెళ్ళి అక్కడ ఉన్న మల్లి తో చెప్పుకుంటాడు. (మగవాళ్లతో ఆ విషయం చెప్పుకోలేడు కదామరి!) శంకరయ్య వచ్చి ఆమెతో మాట్లాడినందుకు, మల్లి అతడిని పోలీసులకు పట్టిస్తుంది. వారు అతనిని కొంత సమయం పోలిస్ స్టేషన్లో ఉంచిన తరువాత యింటికి పంపిస్తారు.

జైల్లో నుంచి తిరిగి వచ్చిన శంకరయ్య తాను మల్లితో మాట్లాడిన విషయం, మల్లి పోలీసులకు తనను పట్టించిందనే విషయాన్ని ఎవరికీ చెప్పబోక' అంటూనే ప్రచారం చేసుకునేసరికి, చివరకు ఆవిషయం సుబ్బమ్మ వరకు వస్తుంది. తన భర్త మల్లితో మాట్లాడిన విషయంతెలిసి అతనికి శిక్ష వేసే క్రమంలో సుబ్బమ్మ భర్తను వారం రోజులపాటు అంట్లుతోమమంటుంది. అటు హోటల్ గురించి దుష్ప్రచారంచేసినందుకు, ఇటు పరాయి స్త్రీతో పనిగట్టుకుని మరీ మాట్లాడి నందుకుగాను సుబ్బమ్మ తన భర్తను శిక్షించటం చాల ఆశ్చర్యమనిపిస్తుంది. యాజమాన్య నిర్వహణలో భాగంగా ఆమె ఆ పని చేసి భర్తను క్రమశిక్షణలో ఉంచటమేగాక హోటల్కున్న గుడ్విల్ పోకూడదని అది 'మార్కెటింగ్' మీద ప్రభావం చూపగలదని భావించటంగా అర్థం అవుతుంది. గురజాడ చెప్పినట్లుగా మహిళ చరిత్రను తిరగరాస్తుందన్న విషయం స్పష్టం అవుతోంది.

"తంపులమారి సోమలింగం" కథలో, మనుషుల మధ్య చిచ్చు పెడుతూ బతికిన సోమలింగం తన తదనంతరం కూడా ప్రజలు కొట్టుకోవాలని భావించి, ఆఖరి కోరికగా తన శవాన్ని ఘోరి ప్రాంగణంలో పూడ్చి పెట్టమంటాడు. కాని దానికి ముస్లింలు ఒప్పుకోకపోతే ఆ విషయం చివరికి మత ఘర్షణలకు దారితీసిన సమయంలో ఒక వృద్ధ మహిళ వచ్చి సోమలింగం ఆఖరి కోరిక లోని రాజకీయ లౌక్యం తెలియచేసి అమరావతి తీరంలో దహనం చేయించి మత ఘర్షణలను నివారించుతుంది. శాంతియుత సమాజస్థాపనలో స్త్రీల మేధాశక్తి, సమన్వయ ధోరణి ఎంతగా ఉపయోగపడుతుందో తెలిపే కథ ఇది.

"అప్పడాల అసెంబ్లీ" కథలో కూడా స్త్రీలు కలిసినప్పుడు ఈర్ష్యా అసూయలతో కొట్టుకున్నట్టు కన్పడ్డా చివరికి పిల్లల్ని యిచ్చి పుచ్చుకోవాలనే అంతరంగం గల స్త్రీలుగా కన్పడి స్త్రీకి స్త్రీ శత్రువు కాదని నిరూపించటం కన్పడుతుంది. కుటుంబంలో స్త్రీలకు సమానావకాశాలుండాలని భావించిన కథ "చెట్టుకొమ్మనున్న కథ" అలభ్య శాసనాలలో ఉన్నదని చెప్పుకునే కథగా ఈ కథ అర్థం అవుతుంది. రాజ్యం సుభిక్షంగా ఉండేందుకు అమరావతి పాలించిన ముక్కంటి పల్లవుడికి సిద్ధులు మంత్ర పూరిత లేపనం యివ్వగా రాజు రోజూ కాశీవెళ్ళి గంగాస్నానం చేసివచ్చి రాజ్యపాలన చేస్తుంటాడు. ఆ విషయం తెలుసు కున్న రాణి, తన పుట్టింటి మతానికిచెందిన జైనసిద్ధులను పిలిపించుకొని లేపనాన్ని రాసుకుని రాజుకు తెలియకుండా తానూ గంగాస్నానంచేసి వస్తుంటుంది. అయితే ఒకసారి గంగా స్నానానంతరం ఋతుక్రమం రావటంతో లేపనం పనిచేయదు. ఇంతలో రాజుచూడగా క్షమాపణ అడుగుతుంది. అయితే దాని నివారణకై కాశీలో సిద్ధులు భవిష్యత్తులో కాశీలోని క్షామమొస్తే అప్పుడు దక్షిణ దేశానికి వస్తామని, తమను ఆదరించమనీ ఒప్పందం చేసుకుంటారు. ఆమె 'లైంగికతా' విషయాన్ని వీరి జీవితభద్రతకు లంకె పెట్టటం ఆశ్చర్యం అనిపించినా, రాణి మాత్రం రాజుతో పాటు తనకూ సమాజధర్మాలలో సమానఅవకాశాలు ఉండాలని ఆరాటపడటంగా అర్థం చేసుకోవచ్చు. ఈనాటికీ మహిళలు దేవాలయ ప్రవేశాలలో పురుషులతో సమానఅవకాశాల కోసం పోరాడుతూనే ఉన్నారు.

కుటుంబ నిర్వహణ సంస్కృతిలో స్త్రీలు ఒదిగి ఉండి ఏదోవిధంగా జీవితాలు గడుపుతున్నప్పటికీ అవసరమైతే స్త్రీలు కుటుంబ నిర్మాణపు గోడలు బద్దలు కొట్టగలరని తెలిపే కథగా "నేను మేల్కొనే ఉన్నాను" అనే కథలో, ఉద్యోగమే ఆధారంగా గల వెంకన్న ఫ్యాక్టరీకి రాత్రిపూట కాపలాదారుగా పని చేస్తూంటాడు. అతని భార్య సుబ్బి రోజూ రాత్రిపూట అలా ఒంటరిగా గడపాల్సి వస్తుంది. ఒకరోజు రంగడితో లేచిపోతుంది. తనకొక శరీరం ఉందనే స్పృహతో లైంగిక స్వేచ్ఛకై రంగడితో వెళ్ళిపోయినట్లుగా అర్థంఅవుతుంది. అలాగే "దూరంగా సారంగధర" కథలో లక్ష్మమ్మ కూడా లైంగిక స్వేచ్ఛకై తపన పడటం కనిపిస్తుంది.

"ముద్దేలనయ్యా మనసు నీదైయుండ" కథలో కనకాంగి సర్వేశ్వరరావుతో గడపి నగలు నాణాలు సంపాదించినా అది అతని ఆనందం కోసమేనని తన ఆనందం కోసం చాకలి సాంబడితో గడపాలనుకోవటం కన్పడుతుంది. "అబద్దం – చెడిన ఆడది" కథలో మీనాక్షి సుందరరావుతో గడపి నగలు, నాణాలు ఉన్నా ఉపయోగం లేదని భావిస్తుంది. అతడు చనిపోయిన తరువాత తనకు రోజూ వండి పెట్టగల బ్రాహ్మణుడితో ఉండాలనుకుంటుంది. ఆమె, తన శరీరం మిగిలిన వాళ్ళకి ఉపయోగపడుతోంది. కానీ, తన శరీరపోషణకు కావాల్సిన విషయంగా ఉన్న ఆరోగ్యకరమైన జీవితం తనకు ఉండాలనే స్పృహతో వంటపనిని పీడాకరంగా భావించింది. అందుకే వంట మనిషిని పెళ్ళి చేసుకోవాలనుకోవటం కన్పడుతుంది. మామూలు వేశ్యలుగా గాక, ఆరోగ్యకరమైన, శారీరక స్పృహ కల్గిన వ్యక్తిగాను మీనాక్షి అర్థం అవుతుంది. "పందిరి పట్టెమంచం" కథలో వేశ్య కూతురైన చినముత్తాలు మాత్రం డబ్బు లేని బుల్లి రామయ్యను యిష్టపడి, అతనిని కోరుకుని కుటుంబ సంబంధాలలో ఉండాలనుకోవటం జరుగుతుంది.

సమాజకుటుంబ సంస్కృతిలో భాగంగా భర్త మరణానంతరం స్త్రీలు బొట్టు పెట్టుకోకూడదనే ఆంక్ష ఉంది. అయితే దాన్ని భర్త జీవికకు చిహ్నంగా కాకుండా ముఖకళ కోసం బొట్టును పెట్టుకోవచ్చంటూ భావించి, కళకు మతాలతో గాని, భర్త జీవికతో గానీ సంబంధం లేదని, మహిళల ముఖాలకు సంబంధించిన కళాత్మకతపట్ల ఉన్న దుష్టసంస్కృతిని పీడనగా స్త్రీలు భావించారు. ఆ సంస్కృతిని తిరస్కరించటంగా తపాలా మాస్టారు, పూల్ సుల్తాన్ కథలలో కన్పడుతుంది. మహిళలు తమ శరీరం మీద, తమ అలంకారాల మీద తమకే హక్కులుండాలనీ, అవి తమ భర్తయొక్క జీవికకు సంబంధం లేని విషయంగా నాడే భావించడం ఒక మహిళా చైతన్య స్వరూప సౌందర్యమే!

అయితే సమాజం పితృస్వామ్య సంస్కృతికి విరుద్ధమైన మహిళా చైతన్యాన్ని చూస్తూ ఊరకే ఉండదు. కుటుంబంలో పురుష ప్రయోజనాలకు వీలుగా భార్య ఎన్ని కష్టాలు పడ్డా భర్త దగ్గరే జీవితాన్ని గడపాలనే రామాయణ ప్రవచనాల

ద్వారా ప్రబోధం చేస్తుంటుంది. ఆ ప్రవచనాలనువిన్న ప్రభావంతోనే, అత్తగారింట్లో కష్టాలకు భర్త మీద కోపం వచ్చి పుట్టింటికి వచ్చిన రుక్మిణి, ఎన్ని కష్టాలు పడినా రాముడితో అడవికేగిన సీతను ఆదర్శంగా భావించి తాను కూడా ఎన్ని కష్టాలున్నా సరే భర్త దగ్గరే తన జీవితం గడపాలనుకుంటుంది. భార్య తన వ్యక్తిత్వాలను, అస్తిత్వాలను చంపుకోవటానికి సిద్ధపడి భర్త దగ్గరకు వెళ్ళాలను కోవటంగా చెప్పి ప్రవచనాలలో చెప్పబడుతున్న పరమార్థాన్ని ప్రవచన ప్రభావాన్ని రచయిత స్పష్టం చేయటం జరిగింది. అటువంటి పురాణ కథల్లోని పతివ్రతల జీవితాలు నేటికీ ఆదర్శమా, ఆచరణ సాధ్యమా అనేది ఆలోచించాల్సిన విషయం.

అమరావతి ప్రాంతమందలి సామాజిక జీవన సంస్కృతిలోని స్త్రీ-పురుష సంబంధాలలోని డొల్లదనాన్ని పోగొట్టుకొని, గట్టి వ్యక్తిత్వంతో స్త్రీలు బ్రతకొచ్చనే భావనను ఈ అమరావతి కథలు కలిగిస్తాయి. కుటుంబంలో సంతానాన్ని కనిచ్చే యంత్రంగా మారి బానిసగా ఉండటం కంటె కూడా, స్వీయశ్రమశక్తితో, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని, వ్యక్తిత్వాన్ని నిలుపుకోటానికి అవసరమైన చైతన్యాన్ని మహిళలు తెచ్చుకోవాల్సిన అవసరాన్ని ఈ కథలు తెలియచేస్తాయి. మేనేజ్ మెంట్ చదువులు చదివినా కుటుంబనిర్వహణలో నిర్ణయాత్మకశక్తులుగా ఉండలేని నేటి మహిళలకు, ఆనాడే చిన్న పరిశ్రమలు, ఉత్పత్తి సేవలు, అమ్మకాలు వంటి విషయంలో యాజమాన్య నిర్వహణ సమర్థులుగా ఉన్న సుబ్బమ్మ వంటి స్త్రీలు సాహిత్య కరదీపికలు కాగలరు. ఆ సమర్థతతోనే కుటుంబంలో కూడా మహిళా సాధికారితను సాధించిన మహిళగా “ఎవరికీ చెప్పబోక!” కథ అర్థం అవుతుంది.

మహిళలు సమాన అవకాశాలు పొందుతూ వ్యక్తిత్వం గౌరవంగల మనుషులు గాను, మేధావంతులుగాను యాజమాన్య సమర్థులుగా ఉండగలరనే దృష్టితో మహిళలను చూడాల్సిన అవసరాన్ని, జెండర్ సెన్సిటైజేషన్లో భాగంగా నేటి పితృస్వామ్యానికి అవసరమైన సమాజ భావచైతన్యాన్ని ఇవ్వగల కథలు ఈ “అమరావతి కథలు”.

*- ఆంధ్రజ్యోతి దినపత్రిక-వివిధ-07. 03. 2016.*

# 16. తెలుగు సాహిత్యంలో మహిళాచైతన్యం

సాహిత్యం సామాజిక ప్రతిఫలనంగా ఉంటూ, తరతరాల సామాజిక జీవనాన్ని ప్రభావితం చేయగలుగుతుంది. రాజకీయ– ఆర్థిక చలన సూత్రాలకు అనుగుణంగా సామాజిక–సాంస్కృతిక జీవనం పరిణామం చెందటమనేది చారిత్రకసత్యం. కాలానుగుణ సమాజ పరిణామం గల సాంస్కృతిక జీవనమే సాహిత్య చరిత్రలోని స్త్రీ పాత్రల స్వభావ పరిణామశీలంగా ప్రతిబింబిస్తుంది. తెలుగు సాహిత్యంలోని స్త్రీ పాత్రలు ఆ యాకాలాలలోని సామాజక సంస్కృతిలో భాగంగా లింగవివక్షకు గురి అవుతూ, దానిని ఎదుర్కొనే క్రమంలో కాలాను గుణంగా పరిణామంచెంది చైతన్యం తెచ్చుకోవటాన్ని సాహిత్యం తెలియచేస్తుంది. సాహిత్యంలో స్త్రీలు తమకు తామే చైతన్యం తెచ్చుకుని నేటి మహిళలకు స్ఫూర్తిదాయకంగా నిలిచారు.

సామాజిక చరిత్రలో ఉత్పత్తి సంబంధాలలోని వచ్చిన మార్పు అంచె లంచెలవారి అధికారవ్యవస్థ లింగవివక్షను జీవనసంస్కృతిగా చేసింది. ఈ లింగవివక్ష సమాజంలోని స్త్రీ–పురుష సంబంధాలపై అనుశ్రుతంగా ప్రభావం చూపుతూ మహిళల లైంగికతపై అదుపురూపంలో స్పష్టం అవుతుంది. అడపిల్ల పుట్టుక పెంపకం, చదువు, పెళ్ళి, గర్భధారణవంటి లైంగికతకు సంబంధించిన విషయాలలో స్త్రీల మనసు, ఆలోచనలు, శరీరాల చుట్టూ అదుపురూపంలో ఉన్న భావజాలమే లైంగికత. స్త్రీలకు గౌరవప్రదమైన స్వతంత్రమైన జీవితం

లేకుండా చేయటమే లైంగికతపై అదుపుగా భావించవచ్చు. ఈ అదుపులోనే జీవించటం తమ స్వభావముగా చేసుకున్న స్త్రీలు కాలానుగుణంగా పరిణామం చెందుతూ, అ అదుపును అధిగమించాలనుకోవటం, నిరసించటం, చైతన్యం తెచ్చుకొని ఉద్యమాలు చేయటంగా తెలుగు సాహిత్యం అవగాహనను కలిగిస్తుంది. నేటి ప్రపంచీకరణ సందర్భంలో స్త్రీపాత్రలు తమ వ్యక్తిత్వాలకు విలువ ఉండాలనుకోవటం, సృజనాత్మకశక్తుల వికసనం చేసుకోగలగటం, సామర్థ్యాలను పెంపుచేసుకుంటూ నిర్ణయాత్మకశక్తులుగా ఎదగాలను కోవటంగాను పరిణామం చెందటం కనబడుతుంది. అనాదిగా స్త్రీ తల్లి, భార్య, కూతురు, అత్త పాత్రలలో జీవిస్తూ సంతానోత్పత్తికి, ఇంటిచాకిరికి పరిమితం అయితే, ఆధునికకాలంలో ఉద్యోగినిగా కూడా కొత్తపాత్రను పోషిస్తోంది.

'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి' అంటూ అనాదిగా సామాజిక కుటుంబపు పునాది రాళ్ళలోనే ఉంచబడిన స్త్రీ, నేడు రోదసిలో రాకెట్లు నడిపే చైతన్యస్థాయికి చేరుకుని, ఆకాశంలో సగభాగస్వామ్యాన్ని కోరుకుంటున్న విషయం తెలిసిందే. ఆ చైతన్య ప్రస్థానంలోనే మహిళల స్వేచ్ఛాకాంక్ష అర్ధమవుతుంది. మానవ ప్రగతికి స్వేచ్ఛ, స్వాతంత్రం ముఖ్యం అని గ్రహించిన మహిళలు, తాము పురుషులతో పాటు సమానంగా ఎదగలేక పోవటానికి కారణాలను అన్వేషించారు. ఆ క్రమంలో లింగ వివక్ష పోషించిన స్వేచ్ఛా రాహిత్యం ప్రధాన కారణమని గ్రహించారు. స్వేచ్ఛ అంటే భౌతిక స్వేచ్ఛ, బౌద్ధిక స్వేచ్ఛను కలిగి ఉండటం. స్త్రీలు తమ అస్తిత్వాలకు, ఆలోచనలకు విలువలేనితనమే తమ సమస్యలకు మూలకారణమనే అవగాహన స్త్రీలకు కలిగింది. పితృస్వామ్య సంస్కృతీ చట్రంలో తాము బందీలు అయ్యామనే జ్ఞానంతో దాని నుండి విముక్తి చెందటానికి ఆంక్షల సంకెళ్లను వదిలించుకునే చైతన్యాన్ని తెచ్చుకుంటేతప్ప స్వేచ్ఛావాయువులను పీల్చలేమనీ అర్థంచేసుకున్నారు. స్త్రీల సమస్యలు సామాజికమైన జటిల సమస్యలుగా తయారయ్యాయి. పుట్టుక, చదువు, పెళ్ళి, కుటుంబం, ఉద్యోగం, నిర్ణయాత్మకత, సాధికారికత వంటి విషయాలలో స్వేచ్ఛ లేకుండాచేసి మహిళలను అనేక సమస్యల వలయాలలో చిక్కుకునేటట్టు చేసిన సమాజసంస్కృతిపై శంఖారావంచేసారు.

హక్కుల పరిరక్షణ చైతన్యమొక్కటే స్త్రీలకు స్వేచ్ఛా స్వాతంత్రాలను ఇవ్వగలుగు తుందని భావించారు.

చారిత్రకంగానే పని విభజన, స్త్రీల పాతివత్యం ప్రాతిపదికలుగా కుటుంబ నిర్మాణం జరిగింది. ఋగ్వేదం నాటికే పితృస్వామ్య సంస్కృతిలో భాగంగా తండ్రినుండి భర్తకు స్త్రీలపై హక్కుల బదలాయింపుగా వివాహక్రతువును నిర్వహించేందుకు సూర్యుడు తన కుమార్తె అయిన తపతిని సంవరణుడికి యిచ్చి పెళ్ళి చేయటం జరిగింది. అంటే, అమె పరాధీనురాలుగ చెప్పబడింది. పరాధీనత స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు గొడ్డలి పెట్టు వంటి విషయం. అందుకే, యుగయుగాలుగా మహిళ పితృస్వామ్యపు సంకెళ్ళను విదిలించు కోవటానికి తన పరిధిమేరకు చైతన్యం తెచ్చుకున్న విషయాన్ని తెలుగు సాహిత్యం అద్దం పడుతోంది. ఆధునిక తెలుగు సాహిత్యంలో ప్రతిఫలించిన మహిళా చైతన్యానికి ఒక చరిత్ర ఉంది. అదొక వారసత్వ చైతన్య ప్రవంతిగా తెలుగు సాహిత్యంలో నేటికీ కనబడుతోంది. కుటుంబ నిర్మాణ చరిత్ర కలిగిన దేవుళ్లుగా భావించబడ్డ శివకేశవులకు ఆడపిల్లల పుట్టుక శూన్యం. ఆంధ్రుల చరిత్రలో ఒకటవ శతాబ్దానికి చెందిన కృష్ణా, గోదావరి ప్రాంత మహిళలు 'గాథాసప్తశతి' అనే ప్రాకృత గ్రంథంలో కుటుంబ సంస్కృతిలో పురుషుడివైపు నుండి కొఱవడిన 'ప్రేమ, నమ్మకం' అనేవాటిని పాటల రూపంలో ప్రశ్నకు పెట్టటంగా గ్రామీణ మహిళా చైతన్యం ప్రారంభం అయ్యింది. ఆనాటి నగరవాసులుగా ఉన్నత వంశాలకు చెందిన స్త్రీలు తమ అస్తిత్వాలకు వ్యక్తిత్వాలకు విలువనిచ్చుకునే దిశగా రామాయణభారతేతిహాస భాగవత కావ్యాలలో కన్పడతారు.

అనాదిగా సమాజంలో స్త్రీలపై అదుపు కలిగియుండటమే పితృస్వామ్య కుటుంబసంస్కృతిగా ఉంటుంది. సామాజిక జీవనంలో స్త్రీ-పురుషసంబంధాలకు నిలయమైన కుటుంబం ఏర్పడటానికి వివాహతంతు ప్రాధాన్యతను వహించింది. తండ్రి నుండి భర్తకు స్త్రీల జీవితంపై హక్కుల బదలాయింపుగా ఈ వివాహం ఋగ్వేదకాలం నాటికే చెప్పబడింది. పితృస్వామ్యకుటుంబ నిర్మాణసంస్కృతి అయిన పాతివ్రత్య నియమాలను పాటిస్తూ జీవించటమే జీవితాశయంగా స్త్రీలు

భావించారు. రామాయణంలో శక్తిమంతురాలైన కైక తన అస్తిత్వానికి విలువ ఉంటుందనే భావనతోనే రాముడు, భరతుడు ఒకేరోజు పుట్టారు కాబట్టి తానెందుకు రాజమాతగా గౌరవాన్ని పొందకూడదనే ఆమె చైతన్యమే రామాయణ కథను మలుపు తిప్పింది. భారతంలో గాంధర్వ వివాహం చేసుకున్న దుష్యంతుడి చేత పది మందిలో తనని అతని భార్యగా ఒప్పింప చేసి శకుంతల చైతన్య వంతురాలై కుటుంబంలోని తన హక్కును కాపాడుకుంది. రాజ్యమదంతో పరస్త్రీ అయిన ద్రౌపదియొక్క మానానికి ముప్పు తెచ్చే ప్రయత్నం చేసిన దుర్యోధనుడు యుద్ధంలోచచ్చిపోవటమే న్యాయమని భావించిన అతని తల్లిగాంధారి యొక్క న్యాయ చైతన్యం గొప్పది. నేటి న్యాయ కోవిదులకు కరదీపిక. అలాగే భాగవతంలో రుక్మిణి తన పెళ్ళి విషయంలో తన యిష్టానికి నిర్ణయానికి విలువనిచ్చుకున్న చైతన్యం ఆమెను అంత:పురం దాటి వెళ్ళగలిగేలా చేసింది.

మధ్యయుగాలలో దాదాపుగా అన్ని వర్గాల, వంశాలకు చెందిన గ్రామీణ, నగరయువతులు పురుషుడికి అన్యస్త్రీ సంబంధాలను ఏర్పరచుకొనే అవకాశం యిచ్చిన పితృస్వామ్యంలో తాముకూడా రహస్య సంబంధాలు పెట్టుకొని కోర్కెలు తీర్చుకొనేస్వేచ్ఛఉంటే తప్పేమిటి అని సంస్కృతిని అధిగమించే వ్యతిరేక చైతన్యం తెచ్చుకొన్నారు. కాని రాజ్యం ముందుకు వచ్చి, స్త్రీలను శిక్షకు గురిచేయటాన్ని కథాకావ్యాలు అద్దం పడతాయి.

క్రీ.శ.14వ శతాబ్దానికి చెందిన మంచెన వ్రాసిన 'కేయూరబాహు చరిత్రమనే కావ్యంలో, 'నిపుణిక' అనే సామాన్య గృహిణి పాత్ర గర్భధారణ స్త్రీకి బాధాకరమని భావించి భాగస్వామియైన భర్త ఆ గర్భభారాన్ని మోయాలని తన గర్భాన్ని భర్తకు బదలాయించి, ఆమె స్వేచ్ఛగా జీవించాలనుకుంది. స్త్రీకి పునరుత్పత్తి శక్తి ఆరాధనీయంకంటే కూడా బాధాకరమనే విషయాన్ని భర్త, సమాజం గుర్తించేటట్లుగ చేస్తుంది. అంతేకాదు, వైశ్యబాలిక కుటుంబస్థాయిలో ఉంటూనే వ్యాపారపు తెలివితేటలను అభివృద్ధి చేసుకున్న స్త్రీగా అర్థమవుతుంది.

శ్రీనాథుని 'శృంగారనైషధం' అనే కావ్యంలో దమయంతి స్వయంవరానికి వచ్చిన ఏక రూపత కలిగిన పంచనలీయంలో నలుణ్ణి గుర్తించటంలోను, ఆ

తరువాత భర్తచేత విడువబడిన దమయంతి, ఒంటరిగా అడవిలో భర్తను అన్వేషించటం, ద్వితీయ స్వయంవరం ప్రకటించుకొని భర్తను చేరుకోవటంగా ఆమె తన మేధాశక్తికి పదునుపెట్టిన స్త్రీచైతన్యంగా అర్థచేసుకోవచ్చు. కేతన రచించిన నాసికేతోపాఖ్యానమునంద. అవివాహితఅయిన స్త్రీ గర్భధారణ విషయంలో పురుషులపాత్ర ఉంటుందనీ, దానిని పదిమంది ఎదుట పురుషుడు ఒప్పుకొనితీరాలని తెలియచెప్పే చైతన్యం నేటికీ ఆదర్శప్రాయమే..

క్రీ.శ.15వ శతాబ్దానికి చెందిన పిల్లలమర్రి పినవీరభద్రుడు 'జైమిని భారతం'లో స్త్రీలు సతీసహగమనాన్ని అధిగమించేచైతన్యాన్ని తెచ్చుకోవటం, పితృస్వామ్య కుటుంబసంస్కృతికి గాని, లైంగిక సంబంధాలకు గాని లోబడకుండా యుద్ధవిద్యలునేర్చుకొని తన తోటిస్త్రీలకుకూడా నేర్పి వారిని చైతన్యపరచి పురుషుల లైంగికతపై సవాల్ విసిరే ధీశాలిగా చైతన్యంతెచ్చుకోవటం కనపడుతుంది

16వ శతాబ్దపు సాహిత్యంలో సమాజంలోని పురుషప్రయోజనాలకు వీలుగా బహుభార్యాత్వపు సంస్కృతి ప్రబలంగా ఉంది. ఈ అసమనైతిక సంస్కృతివల్ల కుటుంబంలోని ప్రేమసంబంధాలు బీటలువారాయి. ప్రబంధాలలో స్త్రీపాత్రలు తమ శారీరకసౌందర్యానికి ప్రాధాన్యతనిచ్చి స్త్రీలసౌందర్యానికి నమూనాగా కనబడతారు. అయితే తిమ్మన వ్రాసిన 'పారిజాతాపహరణము' అనే ప్రబంధంలో బహుభార్యాత్వపు సంస్కృతిపట్ల సత్యభామ నిరసనచైతన్నాన్ని వ్యక్తం చేయటంగా స్త్రీల భావపరిణామశీలతను అర్థంచేసుకోవచ్చు.

17 వ శతాబ్దంలో వచ్చిన స్వతంత్రకథా కావ్యాలలో వ్యాపారాభివృద్ధి నిమిత్తమై పురుషులు దూరప్రాంతాలకు వెళ్ళటంతో కుటుంబసంబంధాలకు దూరమై వేశ్యలతోసంపర్కం ఏర్పరచుకోవటంతో సామాన్యకుటుంబస్త్రీలు కూడా రహస్యసంబంధాలు పెట్టుకుని లైంగిక స్వేచ్ఛను పొందాలనుకున్నట్టు అర్థమౌతుంది. మధ్యయుగాలనాటి కథాకావ్యాలలో స్త్రీలు కుటుంబంలో ఒదిగి ఉంటూనే భర్తలయొక్క అన్యసంబంధాలకు ధీటుగా తాముకూడా ఏర్పరుచుకొని పితృస్వామ్యసంస్కృతికి సవాలుగా పరిణమించారని అర్థమవుతుంది.

18వ శతాబ్దానికి చెందిన ముద్దుపళని రచించిన 'రాధికాసాంత్వనము' అనే కావ్యంలో స్త్రీలు లైంగిక సంబంధాలను గురించి బాహాటంగా మాట్లాడగల స్వేచ్ఛను పొంది 'లైంగికన్యాయాన్ని గుర్తించి కృష్ణుణ్ణి ప్రశ్నించటంగా రాధ, ఇళ పాత్రల చైతన్యం అర్థం అవుతుంది. అంతేగాదు పునరుత్పత్తి శక్తిసామర్థ్యం గల స్త్రీగా బాలికలు ఎదగాలంటే ఎటువంటి ఆహారాన్ని తినాలో ఇళకు చెప్పిన వైద్యురాలిగా రాధపాత్ర వైజ్ఞానికంగా ఎదగటం అభినందించాల్సిన అంశం.

క్రీ.శ.20 వ శతాబ్దంలో స్త్రీలు తమ విద్యాస్వాతంత్ర్యాలపట్ల చైతన్యాన్ని తెచ్చుకొని భారతదేశ స్వాతంత్ర్యోద్యమంలో ఉద్యమభాగస్వాములవటంగా వారి చైతన్యం విస్తరించింది. వీరేశలింగంగారి 'రాజశేఖర చరిత్రం' అనే నవలలో చదువుకున్న రుక్మిణి తన కుటుంబమంతా చిన్నాభిన్నమై దూరమైనప్పుడు తన లైంగికభద్రతకై పురుషవేషం ధరించి సమాజంలో ఒంటరిగా సంచరించగల స్థాయికి చేరుకొని తన కుటుంబసమస్యలను తీర్చిన బాధ్యతాయుతమైన స్త్రీగా పరిణామం చెందటం అర్థంఅవుతుంది.

20వ శతాబ్దంలో ఆర్థిక, రాజకీయ సామాజిక చలనసూత్రాలకు అనుగుణమైన చైతన్యం స్త్రీలలో ఏర్పడింది. దేశస్వాతంత్రసాధనలో ముందుగా స్త్రీలు చదుకోవాలనే చైతన్యం నేటి స్త్రీల స్వాతంత్ర్యానికి పునాది వంటిది. స్త్రీల స్వేచ్ఛ, వ్యక్తిస్వాతంత్ర్యాలసాధనకై అన్నిప్రక్రియలలో స్త్రీలసాహిత్యం వచ్చింది. భండారు అచ్చమాంబ రచించిన "దంపతుల ప్రథమకలహం" అనే తొలి కథలోనే స్త్రీ అంటే బానిసకాదని, కుటుంబ స్థాయిలో స్త్రీల అస్తిత్వపు విలువలను అంచనా వేయగల స్త్రీపాత్ర ఉంది. ఆమె రచనలలో స్త్రీపాత్రలు విద్యావంతులై ఆర్థికస్వావలంబనకై అడుగులు వేసినవారుగా అర్థమవుతారు.

స్వాతంత్ర్యానికి పూర్వంవచ్చిన సాహిత్యంలో అధికసంఖ్యలో రచయిత్రుల రచనలలోని స్త్రీపాత్రలు తమ వ్యక్తిస్వాతంత్ర్యసాధన, దేశస్వాతంత్ర్యసాధనలకై సామాజిక–సాంస్కృతిక, ఆర్థిక–రాజకీయ జీవనహక్కుల చైతన్యాన్ని తెచ్చుకొన్న పాత్రలుగా అర్థమవుతారు. కుటుంబంలోని పనివిభజన, స్త్రీల ఉద్యోగం, విడాకులు, ఆస్తిహక్కు వంటి విషయాలలోనేకాక, స్త్రీలు న్యాయవ్యవస్థలోని లింగవివక్షను ప్రశ్నించే చైతన్యంతో స్పష్టమవుతారు.

కాళ్లకూరి నారాయణరావు 'వరవిక్రయం' నాటకంలో కాళింది, కమలలు చదువుకోవటం చేతనే మహిళా జీవితాలకున్న విలువల విషయాన్ని ఆలోచించటం చేయగలిగారనీ, వరకట్న విషయంలో కమలకు న్యాయశాస్త్రాన్ని కూడ ప్రశ్నకు పెట్టే చైతన్యం కలిగిందని తెలియజేసారు. ఈ చైతన్యం లింగవివక్షా సంస్కృతి నుండి ఆవిర్భవించిన "స్పృహ".

చలం సాహిత్యంలో స్త్రీ పాత్రలన్ని లైంగిక స్వేచ్ఛను కోరే చైతన్యం తెచ్చుకొన్న స్త్రీలుగా కనబడతారు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన "అరికాళ్ళకింద మంటలు' కథలో బాల వితంతువైన రుక్మిణి తనకు జరుగబోయే శిరోముండనం క్రియను వ్యతిరేకించి, తన జుత్తు మీద తనకే అధికారముందని నిరూపించుకోవటం, పితృస్వామ్య కుటుంబసంస్కృతిని పునర్వివాహం చేసుకోవా లనుకొన్న ధైర్యవంతురాలిగా స్త్రీ చైతన్యం తెచ్చుకోవటం ఆనాటి వ్యవస్థకు విస్తుకలిగించే పరిణామమే. స్త్రీలు చదువుకై సమాజంలోకి రావటంతో స్త్రీలకు లైంగిక భద్రత కరువు అయింది. శ్రీపాదవారి 'కొత్త చూపు' కథలో మహిళలు స్వేచ్ఛగా ఏపని చేయాలన్నా లైంగిక దాడులు ఉంటాయనే భయాల నుండి విముక్తికై, ఆత్మరక్షణకై కుస్తీ పట్లు సాము గరిడీల వంటి సాహస విద్యలు నేర్చుకొని స్త్రీలు అబలలుకారని ప్రబలలనే వారి చైతన్యం స్వేచ్ఛాకాంక్షకు వజ్రాయుధం వంటి చైతన్యమే. 1935లో కనుపర్తి వరలక్ష్మి వ్రాసిన మూడు తీర్మానాల కథ, పులిపాక బాల త్రిపుర సుందరి వ్రాసిన 'పిల్లికి చెరలాటం–ఎలుకకు ప్రాణసంకటం' వంటి కథలలో స్త్రీల ఆత్మగౌరవానికి భంగం కలిగే వాటిని బహిష్కరించాలనీ, స్త్రీలు సంఘాలుగా ఏర్పడి వివక్షా సంస్కృతిని తిరస్కరించాలనే స్త్రీలచైతన్యం స్త్రీలసామాజికస్వేచ్ఛకు బాటలు వేయించింది. స్వాతంత్ర్యోద్యమ సమయంలో వచ్చిన స్త్రీలసాహిత్యంలో స్త్రీల విద్యాహక్కు వైవాహిక స్వాతంత్ర్య చైతన్యాన్ని కలిగించింది. అంతేకాక, అది ఆర్థిక స్వావలంబన దిశగాసాగి స్త్రీల సాంఘిక, ఆర్థిక, రాజకీయ హక్కుల చైతన్యం స్త్రీలస్వేచ్ఛా స్వాతంత్ర్యాల సాధన దిశగామారింది. ఆ చైతన్యమే స్త్రీలను దేశస్వాతంత్ర్య ఉద్యమంలో భాగస్వాములను చేయకలిగింది. పాకల రాజమణి వ్రాసిన "నా స్వప్నం" అనే కథలో స్త్రీలు న్యాయశాస్త్రాలలోని లింగవివక్షను ప్రశ్నించే చైతన్యం తెచ్చుకొన్నారు.

కొడవటిగంటి కుటుంబరావు రచించిన "పంచకళ్యాణి" అనే కథలో జానకిపాత్ర కుటుంబంలోని భర్తపెత్తనాన్ని నిలదీసే చైతన్యశీలిగా అర్థమవుతుంది. "పిన్ని" కథ లో పిన్నిపాత్ర తనకు కుటుంబలోని ఆర్థిక వ్యవస్థలో అధికారం ఉంటే విలువఉంటుందని భావించి కుటుంబంలో స్త్రీలసాధికారానికి చైతన్య బీజం వేసింది.

20 వ శతాబ్దంలో స్వాతంత్ర్యానంతరం సమాజంలో తండ్రులు తాగుడు వ్యసనానికి బలయి, ఆర్థికంగా చితికిపోయి కుటుంబాన్ని పట్టించుకోని స్థితిలో ఉంటే స్త్రీలు ఉద్యోగాలు చేయాల్సి వచ్చింది. సామాజిక సంస్కృతికి లోబడకుండా తమ జీవితాలమీద తామే పట్టు సాధించే క్రమంలో తమ స్వాతంత్ర్యానికి, స్వేచ్ఛకు అడ్డురాని వ్యక్తిని వివాహమాడాలనుకొని స్వతంత్ర జీవన వ్యక్తిత్వం గల పాత్రగా ఇందిర డా. శ్రీదేవి రచించిన 'కాలాతీత వ్యక్తులు' నవలలో కనబడుతుంది.

1948లో ఐక్యరాజ్య సమితి చేసిన మానవ హక్కుల ప్రకటన పౌరహక్కులను ఆలోచింప చేస్తున్న సమయం. 1950లో బ్రిటిష్ వాళ్ల పాలన నుండి సంపూర్ణ స్వేచ్ఛ పొంది దాని అమలుకై భారత రాజ్యాంగ నిర్మాణం జరిగి స్త్రీలు పురుషులు అందరూ సమాన పౌరులే అనీ, సామాజిక, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యాలు సమానమేనని, భావస్వేచ్ఛ వ్యక్తిత్వస్వేచ్ఛ సమానమని లిఖించింది. అయితే పితృస్వామ్య సంస్కృతి నేటికీ ఆచరణలో ఉండటంతో స్త్రీలకు స్వేచ్ఛ స్వాతంత్రాలు కొరవడి అసమాన సంస్కృతీ చట్రంలో సమస్యలను ఎదుర్కొంటూ విముక్తికై, స్వేచ్ఛకై జండర్ స్పృహతో సంఘటిత పోరాటం చేస్తున్న చైతన్యశీలత దాని కొనసాగింపు నిత్యం జరిగే కార్యకలాపమే.

1964 ప్రాంతాలలోనే వచ్చిన రంగనాయకమ్మ కథలలో స్త్రీగా పుట్టినందుకు సార్థకత లేక, వ్యక్తిత్వం లేక మొగుడి దయాదాక్షణ్యాలపై జంతువులా బ్రతుకుతున్నామన్న వ్యక్తిత్వస్పృహ ఏర్పడి పురుషులు మహిళలను అర్థం చేసుకొంటేనే స్త్రీల అస్తిత్వాలకు ఒక విలువ ఉంటుందనీ, అదే స్వేచ్ఛనిచ్చే మార్గమనే చైతన్యం తెచ్చుకుంటుంది.

1970ల లోనే పి. సత్యవతి వ్రాసిన కథలలో "ఇల్లలకగానే" .... అనే కథలో స్త్రీ తన అస్తిత్వ చైతన్యాన్ని గుర్తిచటం, స్త్రీలు జీవితాలలోని పరాధీనతను అధిగమించి తాము స్వతంత్రంగా జీవించాలనుకోవటం కన్పడుతుంది.

1978 ప్రాంతంలో సత్యం శంకరమంచి వ్రాసిన 'అమరావతి కథల' లోని ఒకటైన 'ప్రక్క వీధి జన్మంత దూరం' కథలో స్వతంత్రంగా బతకాలని నిర్ణయించుకొని కూలి పనులకు వెళ్లి తనను తాను పోషించుకుంటూ భర్త పెత్తనం, అధికారం క్రింద నలగకూడదని భావించే స్త్రీ చైతన్యం కనపడుతుంది. భార్య-భర్త సంబంధాలలో ప్రేమ లేని చోట ఉండేవి అధికార సంబంధాలనీ ఆ రూపంలో ఉండేవి యజమాని-కూలి/సేవకసంబంధాలని అర్థంచేసుకుంటుంది. ఆ చైతన్యమే ఆమెలోని నిర్ణయాత్మక శక్తిని వెలికి తీయించి స్వేచ్ఛావాయువులను ఆస్వాదించేటట్టు చేయగలిగుతుంది.

స్త్రీల చదువు అభివృద్ధి చెందే క్రమంలో చదువుకున్న అమ్మాయిలుగా ఇల్లిందల సరస్వతీ దేవి వ్రాసిన "పెళ్ళికూతుళ్ళు" నవలలో కుటుంబ హింసను చర్చకు పెట్టి ఆహింసను ఎదుర్కొనే శిక్షణ స్త్రీలకు అవసరమనీ దానికై సంఘాలుగా ఏర్పడాలని ఆలోచించే పాత్రలు గాను, మానసిక పరిపక్వత చెందిన పాత్రలుగాను అర్థం అవుతారు.

తురగా జానకీ రాణి 'నా జీవితం నాకు ఇయ్యి' అనే కథలో కుటుంబంలో భర్త హింసతో విడాకులు తీసుకోవాలని భావించి తను అతని సాహచర్యంలో కోల్పోయిన విలువైన జీవితాన్ని తిరిగి తీసుకొవాలనే చైతన్యం వచ్చింది. అబ్బూరి ఛాయాదేవి 'శ్రీమతి ఉద్యోగిని' కథలో ఉద్యోగిగా ఉన్నా, కుటుంబంలో తన స్థానం రెండవ పౌరురాలి స్థాయిలో ఉందని గ్రహింపగల చైతన్యాన్ని ఇస్తుంది.

ఇల్లిందల సరస్వతీదేవి 'పెళ్లి కూతుళ్లు' అనే నవలలో ఉద్యోగినులైన స్త్రీలకు పురుషులతో పాటు సమానహక్కులుండాలని స్త్రీ భావిస్తుంది. మగవాడే స్త్రీసమస్యలకు కారణమయితే స్త్రీలను సమస్యలనుండి భర్త ఎలా విముక్తి కల్గిస్తాడని ఆలోచించమనే చైతన్యం కల్గిస్తుంది. ఇదే నవలలో పితృస్వామ్యపు

వివాహవ్యవస్థలో స్త్రీలు కుటుంబహింసకు గురి అవుతున్నారని, స్త్రీని అణగదొక్కే భర్తను ఎదుర్కొనే ధైర్యసాహసాలు స్త్రీకి కావాలనీ, పురుషుడు తన ధీమానంతా మరచిపోయేటట్లుగా భర్తని నియంత్రణ చేయగల శిక్షణ స్త్రీలకుకావాలనీ, అటువంటి శిక్షణ తల్లిదండ్రులు కూతుళ్లకు ఇప్పించాలనీ, కుటుంబంలో భర్త నిజాయితీగా, సహభాగస్వామిగా ఉండాలని కోరుకొనే చైతన్యాన్ని కలిగించిన నవల.

జొన్నలగడ్డ లలితాదేవి రచించిన 'అగ్నిపుత్రి' నవలలో లైంగిక దోపిడిపై కేసు పెట్టి పోలీసులకు అప్పగించే చైతన్యం అర్థమవుతుంది. పొత్తూరి విజయలక్ష్మి రచించిన 'అబలాయానం' అనే నవలలో మూడు తరాల స్త్రీల కుటుంబ చరిత్రకు సాక్షీభూతంగా నిలచిన స్త్రీ పాత్ర స్త్రీల సమస్యలన్నిటికి అజ్ఞానం కారణమని భావించి, స్త్రీలకు అక్షరాస్యతవల్ల ప్రపంచజ్ఞానం పెరుగుతుందని అప్పుడే స్త్రీలు తమ వ్యక్తిత్వాలను నిలుపుకోగలుగుతారని భావించటంగా స్త్రీలలో కలిగిన చైతన్యానికి అద్దం పడుతుంది. వాసిరెడ్డి సీతాదేవి రచించిన 'వైతరణి' నవలలో స్త్రీకి అస్థి హక్కు లేకపోవటమే స్త్రీల జీవితాన్ని నరకప్రాయము చేస్తున్నదనే చైతన్యాన్ని తెచ్చుకోవటం అర్థమవుతుంది.

రంగనాయకమ్మ 'జానకి విముక్తి' నవలలో కుటుంబంలో భర్తపెట్టే హింస నుండి విముక్తి చెందే చైతన్యం స్త్రీలకు ఉండాలనీ, స్త్రీ పురుష సంబంధాలలో సమానత్వాన్ని కోరుకొనే చైతన్యాన్ని కలిగించిన నవల. పెళ్లి అనేది పురుషుడికి స్త్రీమీద అధికారాన్ని కలిగియుండటమే కుటుంబ హింసకు కారణమని గ్రహించి సమస్థాయీ సంబంధాలు కలిగిన కుటుంబజీవనాన్ని కోరుకున్న స్త్రీల చైతన్యం ఆధునికమైనది.

లక్ష్మీ సుహాసిని కవితలో చెప్పినట్టుగా 'నేను మౌనంగా ఉండిపోను, ఆడవారి మీద సాగే ప్రతి అణచివేత, అత్యాచారాల మీద అక్షర యుద్ధం సాగిస్తాను' అంటూ స్త్రీవాదం ముందుకొచ్చింది.

1980ల తరువాత పెళ్లి వల్ల వచ్చే పరిణామాలలో భాగంగా స్త్రీల మీద పురుషుడి అధికారాన్ని నిలబెట్టేదయితే ఆపెళ్ళిని తిరస్కరించాలనీ, స్త్రీ

లైంగికానుభవాన్ని పొందటంలోనే గాక తన యొక్క శరీరం మీద, బ్రతుకు మీద భర్తకు అధికారం ఉండ కూడదనే చైతన్యాన్ని కలిగిస్తూ, స్త్రీల శరీరం స్త్రీది కాకుండా చేస్తున్న స్త్రీల స్వేచ్ఛారాహిత్యాన్ని ప్రతిబింబిస్తూ ఓల్గా రాజకీయ కథలువచ్చాయి. స్త్రీలకు భౌతిక స్వేచ్ఛను, బౌద్ధిక స్వేచ్ఛను లేకుండా చేసి ఆర్థిక స్వావలంబన లేకుండా చేసిన వివక్షా సంస్కృతిని ఎదుర్కొనే క్రమంలో ఆ సంస్కృతిని అమలు చేయటానికి ప్రాథమిక వేదిక కుటుంబం అనే అవగాహన కల్గింది. ఇక్కడ శీలా సుభద్రా దేవి కవితలో చెప్పినట్టుగా – "ఎన్నో ఏళ్లుగా నిద్రించిన మా వ్యక్తిత్వం తుళ్లిపడిలేచింది. ఆవులించి జూలువిదిల్చింది స్వేచ్ఛ కోసం పెనుగులాటలో సంప్రదాయపు తాళ్లు తెగిపడ్డాయి" అనే చైతన్యం అభివృద్ధిచెందింది.

ఓల్గా వ్రాసిన "సహజ' అనే నవలలో కుటుంబ హింసను భరించలేక భర్త నుండి విడిపోయి ఉద్యోగం చేసుకుంటూ పిల్లలను పోషించుకునే స్థాయికి చేరుకోవటమే గాక తనకు ఇష్టమైన వ్యక్తిని మళ్ళీ 'పెళ్ళి' చేసుకుని సమాజంలో నిలదొక్కుకున్న స్త్రీ చైతన్యం కనిపిస్తుంది. ఓల్గా రచించిన 'మానవి' అనే నవలలో వసంతపాత్ర తన భర్త అన్యసంబంధాలు పెట్టుకోవటంతో ప్రేమలేని కుటుంబ సంబంధాలలో ఉండటం అనవసరం అని భావించి కుటుంబానికి దూరమై స్వతంత్రంగా జీవించటమే మేలు అనే చైతన్యము తెచ్చుకొన్న స్వతంత్రజీవికగా అర్థమవుతుంది.

ఓల్గా రచించిన ప్రయోగం అనే కథలో పితృస్వామ్య కుటుంబనిర్మాణం ఏర్పడటానికి నిర్ణయించిన పెళ్ళిని నిరసించి సహజీవనాన్ని కోరుకున్న స్త్రీచైతన్యం స్పష్టం అవుతుంది. అధికార సంబంధాలు లేని స్వేచ్ఛాయుత స్త్రీ–పురుష సంబంధాలు సామాజిక కుటుంబాలలోఉండాలనీ పిల్లలను కనటం ఒక సామాజిక బాధ్యత అనీ, దాన్ని ఆలోచించి తీసుకోవాలనీ కుటుంబాన్ని గురించిన బలమైన అభిప్రాయాలను 'ప్రయోగం' కథలో రచయిత్రి 'ఓల్గా ఒక ప్రయోగం చేసి చూపారు. పిల్లల్ని కనిపెంచే సామాజిక బాధ్యతలో ఉద్యోగిని అయిన స్త్రీ ఉంటే అదొక పీడనగా మారుతోందవి భావించి భౌతిక స్వేచ్ఛకై ఓల్గా వ్రాసిన

'కేసు' అనే కథలో 'స్త్రీలకు ప్రసూతి శెలవు ఆరు నెలల వరకు ఇవ్వాలనటంతో పాటు 'ఆతర్వాతి కాలంలో కుటుంబంలో భర్తకూడా పిల్లల్ని పెంచే బాధ్యత వహించటానికి ఆమెకు, అతనికి చెరొక నాలుగు గంటల పనిదినాలు మూడేళ్ల పాటు ఉండాలని కేసు పెడుతుంది. పిల్లల్ని పెంచే పని తను వహించటానికి ఇష్టంలేని ఆమెభర్త ఆమెను, ఆ కేసు' వెనక్కి తీసుకోకపోతే విడాకులు యిస్తానని బెదిరిస్తాడు.

ఉద్యోగిగా ఉన్న స్త్రీకి సామాజిక భద్రత లేకపోవటంతోపాటు, ఆర్థిక స్వాతంత్రం కూడా లేదని అమె శరీరాల మీద, అలోచనల మీద అమెకు హక్కు లేకుండా పోతోందని, స్త్రీల లైంగికతపై ఉన్న పితృస్వామ్య భావజాలాన్ని ప్రశ్నించే స్త్రీలుగా, 'నీలిమేఘాలు' అనే స్త్రీ వాద కవితా సంపుటిలో కవయిత్రుల చైతన్యమే సామాజిక స్త్రీల చైతన్యంగా అర్ధమవుతుంది. మరుగుదొడ్ల కొరత పల్లెలో స్త్రీలమీద అత్యాచారాలకు కారణమౌతోందని పరిశుభ్రత లేని జీవితాలను స్త్రీలు గడపాల్సి వస్తోందని భావించి తమకు ఆరోగ్యకరమైన లైంగిక భద్రత గల జీవితాలకై పోరాడే దిశగా ఉద్యమాన్ని చేపట్టిన సంఘటితంగా శక్తిమంతులైన స్త్రీలు 'ఓల్గా' రచించిన "ఆకాశంలో సగం" నవలని అక్రమించుకుంటారు.

కొండవీటి సత్యవతి వ్రాసిన 'ముందడుగు' అనే కథలో మహిళాసమస్యల పట్ల అలోచించేందుకు వీలుగా సర్పంచ్ బాధ్యతలను నిర్వహించాలనుకొని గ్రామవ్యవహారాన్ని తనే చూసుకొనేందుకు తోటిమహిళా సర్పంచులతో మీటింగు పెట్టుకొనే చైతన్యాన్ని తెచ్చుకొంటుంది. స్త్రీలు తమ సామర్థ్యాలను పెంచుకొనే దిశగా సంఘటిత శక్తిగా మారిన చైతన్యం కనపడుతుంది.

పి.సత్యవతి 'బదిలీ' కథలో స్త్రీ కుటుంహానికి దూరమై భౌతిక, మానసిక స్వేచ్ఛను పొందాలనుకొంటుంది. ఈమె వ్రాసిన మరొక కథ 'మంత్రనగరి'. ఇది నాల్గుతరాల స్త్రీల కథ. కుటుంబంలో సంతానాన్నికనే యంత్రస్థాయిలో ఉన్న తన స్తితిని గుర్తించి, తన వారసురాలిలో అస్తిత్వచైతన్యం కలిగిస్తే, ఆమె కూతురు తన శరీరం మీద, ఆలోచనల మీద తనకే హక్కులుండాలంటూ స్త్రీల భౌతిక, బౌద్ధిక స్వేచ్ఛకై ఉద్యమాలు చేస్తుంది. కాని, ఈమె వారసురాలు మాత్రం

ప్రపంచీకరణలో మార్కెట్ శక్తులప్రభావంతో స్త్రీకి సౌందర్యం ముఖ్యమనీ, మొగుడి మాటకు ఎదురు చెప్పకుండా ఉండాలనే ప్రబోధానికి ప్రభావితురాలై అలా ఉండాలను కుంటుంది. అనగా ప్రపంచీకరణ సంస్కృతి స్త్రీల స్వేచ్ఛకు అడ్డుకట్ట వేస్తూ స్త్రీల చైతన్యాన్ని నిర్వీర్యం చేయటానికి కంకణం కట్టుకుందని అర్థం అవుతుంది. ఇలాంటి విషయాన్నే ఈ మధ్యనే ప్రచురింపబడ్డ వివిన మూర్తి గారి 'ఎవరి సంకెళ్లు వాళ్లవే' అనే కథ అద్దం పడుతుంది.

నల్లూరి రుక్మిణి 'మృత్యుస్పర్శ' కథా సంపుటిలోని 'భరించలేని అస్తిత్వం' అనేకథలో ప్రపంచీకరణ వలన మారిన మానవ సంబంధాలలో స్త్రీలు మరింతగా స్వేచ్ఛను కోల్పోయిన విషయాన్ని ప్రతిఫలింప చేస్తూ వ్రాసింది. దీనిలో ఉద్యోగినిగా ఉంటూ ఇంటిపనివత్తిడికి గురిఅయి అస్తిత్వవ్యక్తిత్వ సమస్యకు గురిఅయి స్త్రీల అస్తిత్వాలను పురుషులు భరించలేరనీ అర్థం చేసుకుంటుంది. స్త్రీల మీద జరిగే అన్ని రకాల దాడులను ఎదుర్కొనే చైతన్యం మహిళల్లో వస్తేనే మహిళలు స్వేచ్ఛా వాయువులు పీల్చుకోగలరనే భావ చైతన్యాన్ని కలిగించిన కథ. కుప్పిలి పద్మ వ్రాసిన 'పొద్దుకెదురు తిరిగిన పువ్వు' కథలో స్వేచ్ఛను అనుభవించాలన్నా, ఇంకొకళ్ల స్వేచ్ఛను కాపాడాలన్నా మనోధైర్యం అవసరమనే చైతన్యాన్ని, ఆడపిల్లలు రోడ్డుమీద స్వేచ్ఛగా నడిచే స్థితిలో ఉండాల్సిన సామాజిక బాధ్యతలై రావల్సిన జనచైతన్యాన్ని గుర్తుచేస్తుంది ఈ కథ.

ప్రపంచీకరణం పరోక్షంగా స్త్రీల స్వేచ్ఛపై బుసలు కొడుతున్న విషయాన్ని కుప్పిలి పద్మ వ్రాసిన 'కుబుసం' కథలో స్త్రీ తన అస్తిత్వం మీద, తన భావస్వేచ్ఛకు అడ్డంవచ్చే పురుషసంస్కృతిని, ప్రపంచీకరణ సంస్కృతిని ఎదుర్కొనే చైతన్యం తెచ్చుకుంటుంది ఈమె రాసిన "ఆకాంక్ష" అనే మరొక కథలో స్త్రీ తనకున్న యాజమాన్య నిర్వహణ నైపుణ్యాన్ని వ్యక్తం చేసుకోవటానికి సెమినార్ హాలులో గుర్తింపు పొందటానికి అడ్డుగా ఉన్న పురుషఅధికారి కుట్రను ఎదుర్కొని, ఆధునిక వ్యవస్థలో ఉద్యోగాలలోని 'గ్లాస్ సీలింగ్' ప్రభావాన్ని బద్దలుకొట్టి ఉన్నత యాజమాన్య పదవిని పొందిన పరిణామశీల చైతన్యం కనబడుతుంది.

ఈమెయ రాసిన "సర్వస్వము" అనే కథలో తోటిమహిళలను గౌరవించే విధముగా జండర్ సెన్సిటివిటిని కలిగించే శిక్షణ ఇవ్వాలనుకోవటమే స్త్రీలలైంగిక సమస్యలకు అసలుసిసలైన పరిష్కారముగా భావించటం ఒక గొప్ప సామాజక పరిణామానికి దారితీసే చైతన్యముగా అర్థమవుతుంది. సమ్మెట ఉమాదేవి 'సహానా' కథలో ఆడపిల్ల చదువుకోటానికి బయటకు వెడితే వెంటాడే వీధి కుక్కల్లాంటి మగమృగాలబారి నుండి ఆడపిల్లను రక్షించుకొని, చదువు సజావుగా సాగాలని పోలీసులకు ఫిర్యాదు చేయాలను కొనే తల్లి చైతన్యమే 'ఆడపిల్లకు బ్రతుకు రాగాన్ని యిస్తుందని భావిస్తుంది. .

సాహితి రచించిన 'లివింగ్ టుగెదర్' అనే కథలో ప్రియురాలు మోజులో ఉన్న భర్త తనను పట్టించుకోకపోయేసరికి, తన పిల్లలను, తనను గౌరవముగా చూసే వ్యక్తిని పెళ్ళి చేసుకొని స్థిరపడి స్వతంత్ర వ్యక్తిత్వముతో బ్రతుకాలనుకొన్ని చైతన్యం అర్థమవుతుంది. ఆరే సీతారామయ్య రచించిన 'సావాసము–సహవాసము అనేకథలో స్త్రీతన భర్తను వదిలిపెట్టిన తర్వాత అమె ఉద్యోగము చేసుకుంటూ ఉంటుంది. ప్రేమలేని కుటుంబసంబంధాలు ఏర్పరచే పెళ్ళి అనవసరమని ప్రేమ, గౌరవము అనే భావైక్యతగల సావాసునితో సహవాసం చేస్తూ, సహజీవనం చేయటమే మేలు అని అవసరమైనపుడు విడిపోవచ్చనే భావచైతన్యాన్ని తెచ్చుకోవటముగా అర్థంఅవుతుంది.

నేటి ప్రపంచీకరణ సందర్భంలో వచ్చిన అక్కిరాజు భట్టిప్రోలు రాసిన 'నందిని' కథలో స్త్రీ తన సృజనాత్మక శక్తుల వికాసానికి అడ్డుగా ఉన్న వివాహాన్ని తిరస్కరించి విదేశాలకు వెళ్ళి నూతన ఆవిష్కరణలు చేసి అణువణువునా ఆత్మవిశ్వాసంగల చైతన్యాన్ని తెచ్చుకొంటుంది. వివాహం చేసుకుంటే విడాకుల ఖర్చు తప్ప మరేమీ వుండదనీ, వివాహంతంతు లేకుండానే తనకు బాగా నమ్మకం ఏర్పడిన వ్యక్తితోనే సహజీవనం చెయ్యాలనుకోవటం కనపడుతుంది. వీలైన సమయంలో గర్భాన్ని ధరించేవిధంగా తన జీవితం మీద తన ఆలోచనల మీద తనకే హక్కు ఉండాలనే పరిపూర్ణ స్వతంత్ర వ్యక్తిత్వచైతన్యం ఉండటం

అర్థమవుతుంది. నమూనాగా నిల్చిన నందిని పాత్ర నేటికీ 'స్టాట్యూ అఫ్ లిబర్టీ' కి సాహిత్య ప్రతీకగా కనబడుతుంది.

కె.యన్. మల్లీశ్వరి వ్రాసిన 'శతపత్ర సుందరి' కథలోనూ, 'నీల' అనే నవలలోనూ నీల పాత్ర సహజీవన చైతన్యం కనపడుతుంది. శతపత్ర సుందరి కథలో శతవిధాలుగా తమ వ్యక్తిత్వవికాసం చేసుకోవాలనే ఆకాంక్ష గల స్త్రీ తనతో సహజీవనంలో ఉంటున్న వ్యక్తిలో మిగిలిఉన్న పితృస్వామ్య సంస్కృతిని ఎదుర్కొనే చైతన్యం కనబడుతుంది. కాని నీల అనే నవలలో స్త్రీ పెళ్ళితో ఏర్పడిన భర్తృ సంబంధాన్ని వదిలించుకొన్న ఏకకాల, ఏకనిష్ఠ స్త్రీ-పురుష సంబంధాలు గల సహజీవన సంస్కృతిలో జీవించాలనుకోవటం కనబడుతుంది. నేటితరం యువత సామాజిక అవసరాలకు కృషిచేయాలనుకుంటూ స్నేహంతో సహజీవన సంబంధాలలో ఉండటమనేది సహజీవన సంస్కృతీ చైతన్యపు కొనసాగింపుగా అర్థంఅవుతుంది. కానీ జి.లక్ష్మి రచించిన 'మూడోకన్ను' కథలో సహజీవన సంస్కృతిలో వివాహేతర సంబంధాలు పెట్టుకోవచ్చని పురుషుడు తనతో చెప్పి ఆమెను కూడా పెట్టుకోమని చెప్పటంతో తనపిల్లల మీద అటువంటి సహజీవన సంస్కృతిగల వివాహేతర సంబంధాల నీడపడకుండా తన మూడోకన్నుని నిఘాగా పెట్టుకోవటం అర్థమవుతుంది. అంటే సహజీవన సంస్కృతి ఆచరణలో అసాధ్యమనే చైతన్యాన్ని తెచ్చుకోవటంగా అర్థంచేసుకోవచ్చు.

మార్కెట్ శక్తుల ప్రకటనలో స్త్రీలను సౌందర్య ఉత్పత్తి వస్తువులుగా చేసి స్త్రీలను తక్కువ చేయటాన్ని నిరసించే చైతన్యం చాలా అవసరం. ఆర్థిక శక్తులుగా స్త్రీలను చైతన్యవంతులుగా చేస్తూ ఆర్థికాభివృద్ధికి అవసరమైన ఉత్పత్తి, సేవల రంగాలలో స్త్రీ భాగస్వామ్యాన్ని కోరుకుంటూ స్త్రీలను అర్థికస్వావలంబనులుగా చేయగల చైతన్యాన్ని పత్రికారంగం కలుగజేస్తోంది. ఆ చైతన్య ప్రస్థానంలోనే మహిళల స్వేచ్ఛాకాంక్ష అర్థమవుతుంది. "నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అంటూ అనాదిగా సామాజిక కుటుంబపు పునాది రాళ్ళలోనే ఉంచబడిన స్త్రీ, నేడు రోదసిలో రాకెట్లు నడిపే చైతన్యస్థాయికి చేరుకుని, ఆకాశంలో సగభాగస్వామ్యాన్ని కోరుకుంటున్న విషయం తెలిసిందే.

తెలుగు సాహిత్య చరిత్రలోని స్త్రీలు పితృస్వామ్య సంస్కృతిని ఎదుర్కొనే దశలో సమాజంలో తమ వ్యక్తిత్వాలకు, అస్థిత్వాలకు విలువలు సంతరింపచేసు కోవటంగా స్పష్టమైన స్త్రీల చైతన్య పరిణామశీలత నేటి మహిళలకు దిశానిర్దేశం చేయగల చైతన్యాన్ని అందించగలుగుతుంది. తరతరాలుగా లింగవివక్షను ఎదుర్కొంటూ స్త్రీలెంత ప్రయత్నిస్తున్నా పురుష స్వభావంలో మార్పు రానంతవరకు ఫలితం ఉండదు. స్త్రీలు కూడా మానవులే అని వారికి సమాన గౌరవం ఇవ్వాలనే ప్రజాస్వామిక దృక్పధం కల స్త్రీ-పురుష సంబంధాలుగల సామాజిక సంస్కృతి సాహిత్యంలో ప్రతిఫలించగలిగిననాడు ఏర్పడే మానవీయ సంస్కృతి అమోదయోగ్యము, అభివృద్ధికరం, అభినందనీయం.

*- తెలుగువెలుగు-మార్చి 2013.*

## 17. సాహిత్యంలో 'సహజీవనం'- నవజీవనం

సామాజిక కుటుంబాలలో "స్త్రీలు ఆస్తి హక్కు కలిగియున్నా పురుషులతో పాటు సమానమైన గౌరవాన్ని పొంది స్వతంత్రంగా జీవించే హక్కు ఉన్నప్పుడే మహిళా ప్రగతి ఉంటుందని" నోబెల్ గ్రహీత అమర్త్యసేన్ భావన. ఆ భావనయే మహిళా హక్కుల పరిరక్షణ దశాబ్దంలో స్ఫూర్తి దాయకమైంది. సమాజంలో నేటికీ కొనసాగుతున్న పితృస్వామ్య సంస్కృతి ఇంటా బయటా స్త్రీల బాధలకు కారణమవుతూంటే మహిళలు జీవించే హక్కును కోల్పోతున్నారనేది నిత్య సత్యం. భారత రాజ్యాంగం పురుషులతో పాటు సమానంగా మహిళలకు విద్యా, ఉపాధి, ఆస్తి హక్కులతో పాటు స్వేచ్ఛగా జీవించే హక్కు ఉండాలని నిర్దేశించింది. అయినా ఆచరణలో ఆ హక్కులను వినియోగించుకొని స్వేచ్ఛగా జీవించే హక్కు మహిళలకు హుళక్కి గానే ఉంది. దీనికి ప్రధాన కారణం లింగవివక్ష అనీ, దాన్ని సజావుగా ఆచరణలో పెట్టటానికి మౌళిక మైన భూమిక 'కుటుంబం' అని ఆధునిక మహిళా చైతన్యం గుర్తించింది. నేటికీ వివాహ సంస్కృతికి బలి అవుతున్న స్త్రీల గురించి ఒక ప్రక్కచెప్పుకుంటుంటే మరో ప్రక్క 'సహజీవన సంస్కృతి'కి బలి అవుతున్న మహిళలను గురించి వినబడుతూ ఆందోళన కల్గించే విషయమైంది. అందుకే నివారణ చర్యలు ఆలోచించే అవసరం ఏర్పడింది.

మానవ నాగరికతలో భాగంగా చారిత్రకంగానే స్త్రీ-పురుషులు యిష్టమైనంత కాలం జతకూడి ఉండే మానవసంబంధాలుఉండేవి. అయితే ఆ

యిద్దరిలో ఎవరికైనా అటువంటి లైంగికసంబంధాల కొనసాగింపు యిష్టం లేకపోతే విడిపోయి స్వేచ్ఛగా జీవించే జీవన విధానం ఉండేది. అయితే అలా వెళ్ళిపోయేటప్పుడు తల్లితో పాటు పిల్లలు కూడా వెళ్ళిపోవటాన్ని నియంత్రించే క్రమంలో, స్త్రీల లైంగికతను అదుపు చేసే విధంగా 'పెళ్ళి' తంతుగల 'కుటుంబం' ఉనికిలోకి వచ్చింది. పని విభజన పాతివ్రత్యం పూనాదులుగా ఉండే కుటుంబంలో స్త్రీల శరీరాలమీద మనస్సుల మీద పెరిగిన లింగ వివక్ష 'లైంగికత'పై అదుపు రూపంలో కుటుంబసంస్కృతిగా స్థిరపడింది.

ఆధునిక మహిళలు తమ పుట్టుక నుండి పెంపకం వరకును, వైవాహిక జీవితంలోను తమ అభివృద్ధికి ఆటకంగా నిలిచిన లింగ వివక్షగల సంస్కృతిని నిరసించే క్రమంలో దానికి ప్రధాన వేదికయైన 'కుటుంబ నిర్మాణాన్ని, ప్రశ్నకు పెట్టారు. దానికి మూలమైన 'పెళ్ళితంతు'ను విమర్శకు పెట్టటం జరిగింది. లింగ వివక్షగల కుటుంబసంస్కృతి ఏర్పరచిన పాత విలువలను పారద్రోలి మహిళల స్వేచ్ఛాయుత జీవన హక్కులకై నూతన విలువలు ఏర్పడాలనే క్రమంలో  సాహిత్యంతో కూడా మానవ సంబంధాలలో 'సహజీవన సంస్కృతి' ప్రయోగాలు జరిగాయి.

సమాజంలో మేధావులు, సంపన్నులు, ప్రముఖులు సహజీవనాన్ని ఆచరణలో పెట్టినప్పుడు అబ్బురమనిపించినా కొంతమంది విషయంలో చివరి వరకూ కొనసాగలేక ఆ సంస్కృతి వైఫల్యాన్ని పొందటం కన్పడుతోంది. వివాహితలుగా కుటుంబంఉన్న వారు కూడా సహజీవన రూపంలో రహస్య సంబంధాలు ఏర్పరచుకోవటం జరుగుతోంది. అవివాహితలతో భార్య ఉన్న విషయం దాచిపెట్టి లైంగిక సంబంధాలు నెరిపిన మగవారితో సహజీవనం చేసిన స్త్రీలు ఉంటున్నారు. అన్ని సందర్భాలలో వైఫల్యాలే కనపడుతున్నాయి. అంతేకాక మహిళలు మానసిక, శారీరక దాడులకు గురిఅవుతూ, జీవించే హక్కును కూడా కోల్పోవటం జరుగుతోంది. ఏస్థాయిలో పెళ్ళి, కుటుంబం మహిళలను పీడనకు గురిచేస్తోందని భావించారో. అదే స్థాయిలో ప్రస్తుత సమాజంలో సహజీవన సంస్కృతికి మహిళలు బలి అవుతున్నారు. సాహిత్యంలో

సత్ఫలితాలిచ్చిన సహజీవన సంస్కృతి సమాజంలో విఫలంగా కన్పడుతోంది. సాహిత్య సమాజంలోని స్త్రీ–పురుష సంబంధాల లోని జీవనవాతావరణం ప్రస్తుత సమాజంలో లేదు. ఆ సంస్కృతీ స్వభావాన్ని అవగాహన చేసుకొనే మేధావులుగా సమాజం ఎదగగలిగిననాడు ఈ సహజీవన సంస్కృతి సఫలం అయ్యే అవకాశముఉంది.

సాహిత్యంలోనూ సహజీవన సంస్కృతి అనేక ఆటుపోట్లకు గురిఅయి చివరికి స్థిరరూపాన్ని పొందింది. 1930 లో దర్శి అన్నపూర్ణ వ్రాసిన "సుశీల" కథ సహజీవనసంస్కృతిని ప్రతిబింబించిన మొదటి కథ. అయితే అది వివాహ వ్యవస్థలోనే లైంగికసంబంధాలులేని స్నేహసంబంధాలుగల సహజీవనసంస్కృతి. ఇది నేటి సహజీవనసంస్కృతికి భిన్నమైనది. 1977–83 మధ్య వచ్చిన రంగనాయకమ్మ వ్రాసిన 'జానకి విముక్తి' నవలలో అది విస్తరించింది. ఆ నవలలో సైద్ధాంతిక ప్రాతిపదికగా సొంత ఆస్తి లేని ఆర్థిక సంబంధాలు గల సమాజంలో బానిస–యజమాని సంబంధాలుండవనీ, అప్పుడు ఒకరిపై ఒకరు పెత్తనం వహించే అధికారం ఉండదనీ, ఫలితంగా స్త్రీ–పురుష సంబంధాలు సహజీవనంలో ప్రేమసంబంధాలుగా ఉంటాయనీ భావించారు. పరస్పరం ప్రేమ, నమ్మకం కలిగిన స్త్రీ–పురుషులు 'పెళ్ళి తంతు' లేకుండా ఒక యింట్లో సహజీవనం చేయగలరనీ, సమాజాభివృద్ధిలో భాగస్వాములు కాగలరనీ, ఈ నవలలోని శాంత–సూర్యం సంబంధాలలో వ్యక్తమయిన విషయం. దాని ప్రభావంతో పెళ్ళిని నిరసించే ఆలోచనలు వచ్చాయి. వేదకాలం నుండి మహిళలపై హక్కుల బదలాయింపుగా వచ్చిన 'పెళ్ళితంతుకు' పుట్టకీళ్ళు కదలటం మొదలైంది.

ఆ క్రమంలోనే 1993 లో 'ఓల్గా'రాసిన 'ప్రయోగం' అనేకథలో స్త్రీ–పురుష లిద్దరికీ పెళ్ళి అనే ప్రయోగం పాతవిలువల కొనసాగింపుగానే ఉంది స్త్రీ–పురుష లిద్దరికీ సుఖశాంతుల నివ్వటం లేదనీ, నరేంద్ర–సంధ్యల జీవితాల వల్ల అర్థ మౌతుంది. ఆర్థికస్వాతంత్రంతో వ్యక్తిగత చైతన్యంగల సునంద విడివిడిగా ఉంటూనే పెళ్ళి తంతులేకుండా ఒక ఇంట్లో అవసరము వచ్చినప్పుడల్లా కలుసు కోవచ్చుఅనీ, కనాలనుకున్నపుడు పిల్లలని గురించి ఆలోచనచేయవచ్చు అని స్నేహం, ప్రేమగల స్త్రీ–పురుష సంబంధాలుఉండగల నూతనప్రయోగం చేసింది.

ప్రపంచీకరణ సందర్భంలో విస్తృతమైన మానవ సంబంధాలు వ్యాపార సంస్కృతి పెళ్ళికి నూతన నిర్వచనాన్ని ఇవ్వటం జరిగింది. 2002 లో ముద్రత మైన 'ఓల్గా' రాజకీయ–కథలు '2' కి కొనసాగింపుగా వచ్చిన 'ప్రయోగం' అనే కథా సంపుటిలోని 'పెళ్ళి' అనే కథలో 'రజనీ–వివేక్ పాత్రల ద్వారా పెళ్ళి 'తంతు' అంటే 'వ్యాపారమనీ' కుటుంబంలో లాభ నష్టాల బేరీజు వేసుకొనే స్థితి అని చెప్పి, పెళ్ళిని నిరసిస్తూ స్త్రీ– పురుషులు కొత్త యింట్లో కలిసి బతకాలను కోవటంగా సహజీవన సంస్కృతి అర్థం అవుతుంది.

2002 లోనే అమెరికా కథల 'సంపుటి' లో వచ్చిన ఆర్. సీతారామయ్య వ్రాసిన 'సావాసం– సహవాసం' కథలో అమెరికాలో ఉండే కమలా, సుబ్బారావులు స్నేహంతో, ప్రేమతో, గౌరవంతో కూడిన భావైక్యతతో కలిసి జీవించటానికి 'పెళ్ళి' తంతు అవసరం లేదనీ, ఒకరి మీద ఒకరికి బాగా నమ్మకం ఉంటే స్నేహం, ఇష్టం చాలా బలీయంగా ఉంటుందనీ అప్పుడు పెళ్ళి సంబంధమైన లీగాలిటీ అవసరంలేదనీ, ఇష్టం లేనపుడు విడాకుల గొడవలేకుండా విడిపోవచ్చునీ అంటారు. స్నేహం, ప్రేమగల సహజీవనం సత్ఫలితాలనిస్తుందని తెలియజేసారు.

సాహితి రచించిన 'లివింగ్ టుగెదర్' అనే కథలో మాజీ ప్రియురాలిని తెచ్చి భర్త ఇంటిలో పెట్టుకోవటంతో భార్య పిల్లలతో సహా కుటుంబానికి దూరముగా లండన్‌లో ఉద్యోగం చేసుకుంటూ బ్రతుకుతున్న క్రమంలో తన పిల్లలను గౌరవముగా చూసే విదేశీయుడ్ని పెళ్ళి చేసుకొని స్థిరపడి స్వతంత్ర వ్యక్తిత్వముతో బ్రతుకుతుంది.

ప్రపంచీకరణ ఫలితంగా అంతర్జాతీయంగా విస్తృతమైన సమాజ సంబంధాలలో మహిళల స్వేచ్ఛ ప్రధాన జీవిక కాగలిగింది. 2004 లోవచ్చిన అమెరికా కథల సంపుటలో వచ్చిన అక్కిరాజు భట్టిప్రోలు వ్రాసిన 'నందిని' కథలో భౌతిక బౌద్ధిక, మానసిక స్వేచ్ఛను సంపూర్ణంగా అనుభవించ గలిగి లైంగిక హక్కును కలిగిన నందిని ఒక అమెరికన్ తో సహజీవన సంబంధాలలో సంతోషాన్ని పొందగలుగుతుంది. స్త్రీల ఎదుగుదలకు 'పెళ్ళి' ఆటంకమనీ పెళ్ళి చేసుకోకపోతే ఇష్టం లేనపుడు స్త్రీ– పురుషులు విడిపోయే స్వేచ్ఛ ఉంటుందనీ,

స్త్రీకి పిల్లల్ని కనే హక్కు విషయంలో కూడా సంపూర్ణ స్వేచ్ఛ ఉంటుందనీ నందినిపాత్ర జీవితమే ఉదాహరణ. సహజీవనంలో   భాగంగా మహిళల హక్కుల పరిరక్షణ ఉంటుందని'నందిని' కథలోని స్త్రీ- పురుష సంబంధాల ద్వారా అర్థం అవుతుంది. ఆ రకంగా అటు వివాహ సంస్కృతి స్థానంలో సహజీవన సంస్కృతి అనే నూతన ప్రయోగం కూడా అనేక విమర్శలకు ఆలవాలమైంది. నేటికీ సహజీవన సంస్కృతికి సంబంధించిన సాఫల్య వైఫల్యాల మీద అనంత సాహిత్యసృజన జరుగుతునే ఉంది. 'పెళ్ళి' మహిళల జీవితానికి భద్రతనిస్తుంది అనేది మిథ్యా అని చాలా జీవితాలనుంచి వెలుగులోకి వచ్చిన విషయమే. అయితే మహిళలకు విస్తృతమైన సమాజసంబంధాలలో ఏర్పడిన సహజీవనంలోను స్త్రీలు అభద్రతకు  గురిఅవుతున్నారు.

2015 లో వచ్చిన కథల సంపుటిలో కె.ఎన్. మల్లీశ్వరి వ్రాసిన 'శతపత్ర సుందరి' కథలో సహజీవనసంస్కృతిలో పురుషులకున్న పితృస్వామ్య సంస్కృతి భావజాలం వారిని అభద్రతకు గురిచేస్తుందని అర్థం అవుతుంది. శతపత్ర రేకులగా విచ్చుకునే నేటి మహిళా శక్తులు సంపూర్ణ స్వేచ్ఛతో జీవించాల్సిన అవసరాన్ని గుర్తుజేస్తూ, స్త్రీ-పురుష సంబంధాలలో పరస్పరం ఎదుటివారియొక్క అన్నివిధాల స్వేచ్ఛలను గౌరవించటం ప్రాతిపదికగా నీల, సదాశివం సహజీవనాన్ని ప్రారంభిస్తారు. నీల, సదాశివంలకు విస్తృతమైన సమాజసంబంధాలలో సహజీవన సంస్కృతి అటుపోట్లుకు గురిఅవుతున్నా స్త్రీ మాత్రం నిలకడగా ఉండగలుగుతుంది కాని పురుషుడు అభద్రతకు లోనవటం ఈ కథలో కన్పిస్తుంది. సహజీవన సంస్కృతిలో ఉంటూ స్త్రీ తన అభివృద్ధికి కారకులు అయినవారికి అభిమానంతో హృదయంలో ఒకజాగానిస్తే, పురుషునిగా అతడు భరించలేకపోయాడు. పితృస్వామ్యపు అనుమాన ప్రవృత్తి తరతరాలగా రక్తంలో జీర్ణించుకు రావటంతో పురుషునికి అభద్రత ఏర్పడి నీల శరీరంపై తన హక్కును స్థిర పరచుకునే విధంగా అతడు నీలతో జరిపిన లైంగిక సంబంధాలలో సునామీ ప్రయత్నం చెయ్యటంలోనే 'సహజీవనంలో' పురుషులు అభద్రతకు గురిఅవటం కన్పడుతుంది.

2018 జనవరి లో కె.ఎన్. మల్లేశ్వరి వ్రాసిన 'నీల' నవలలో పెళ్ళి, కుటుంబ సంస్కృతిలోఉన్న మహిళలు భావ స్వేచ్ఛలేక భౌతిక, మానసిక దాడులకు గురి అవుతూ జీవించే హక్కును నిలుపు కోలేని స్థితిలో ఉన్నారు అని నీల విషయంలోనూ, నీల తల్లి విషయంలోను అర్థం అవుతుంది. అందుకే 'నీల' తన మానవ హక్కుల పరిరక్షణలో భాగంగా శారీరక, మానసిక దాడులను తప్పించుకొని జీవించే హక్కును కొనసాగించు కోవటానికి కుటుంబసంస్కృతి నుండి విముక్తి పొందుతుంది. అలాగే పిల్లను పెంచుకునే హక్కును లీగల్ గా వినియోగించుకుంటూ సమాజ కార్యక్రమాలలో పాల్గొంటూ తన ఉనికిని, తన శక్తిని, గురించిన ఆలోచనలు పెంచుకుంటుంది. సమాజ పరిశోధనలో భాగంగా స్నేహితునితో ఏర్పడిన పరిచయాలలో 'ప్రేమ' అనే అనుభూతిని పొందుతుంది. అతనితో కలిసి జీవించాలనుకున్న సమయంలో అతనికి 'లైవ్ రిలేషన్స్' ఉన్నాయని తెలిసికొని స్వీయానుభవంతో, మూడవ వ్యక్తిగా పరదేశిజీవితంలో ప్రవేశించకూడదనుకుంది. తన ఉద్వేగాలను నియంత్రించుకొని అతనితో సంబంధాల విషయాలలో వెనకడుగు వేస్తుంది.

గతంలో వృత్తిపర పరిచయాలతో వసుంధరతో తాత్కాలిక సంబంధాలున్న సమయంలోనే సదాశివకు నీలతో పరిచయ మవుతుంది. కొన్నాళ్ళ తరువాత నీలను కలిసిన సదాశివకు నీలతో స్నేహంపెరిగి, ప్రేమ ఏర్పడింది. జీవితాంతం కలిసి సహజీవనంలో ఉండాలని కోరుకుంటారు. అయితే నీల ఇద్దరికి యిష్టమైనన్నాళ్ళు కలిసిఉండాలంటే అదే సమయంలో అతనికి అన్యులతో లైంగిక సంబంధాల ప్రమేయంలేని ఏకకాల సంబంధాలు ఉండాలని కోరుకుంటుంది. ఒకరితో ఒకరు జీవితాంతం యిష్టంతో కలసి ఉండాలని సహజీవనాన్ని ప్రారంభిస్తారు. ఒకరి స్వేచ్ఛను మరొకరు గౌరవించుకుంటూ సహజీవనంలో ఉంటారు. పరదేశి విషయంలో నీలకు ఒకవేళ అసంపూర్ణమైన కోరికలు ఉంటే తీర్చుకోమని అది తృప్తిని కల్గిస్తేనే నూతనశక్తి ఉద్భవిస్తుందని సదాశివ అనేంత స్థాయిలో నీలను తన లైంగిక హక్కును వినియోగించుకోమని

అంటాడు. అంతగా నీలస్వేచ్ఛను సదాశివ గౌరవించినా కూడా సహజీవనంలో నీలవేణి చలించని స్థిరత్వంతో ఉంటుంది. నీల నిర్భయంగా స్వీయనియంత్రణ తోనూ జీవితం మీద ధైర్యాన్ని, విశ్వాసాన్ని పెంచుకుంటుంది. ఒకరి మీద ఆర్థికంగా ఆధారపడని విధంగానూ స్వేచ్ఛగా స్నేహంతోను, ప్రేమతోను జీవించే వాతావరణంలో నీల సహజీవనాన్ని కోరుకొంటుంది. పరస్పరం మానవీయతను అభివృద్ధి పరచుకుంటూ సహజీవనాన్ని సఫలం చేసుకోవటంగా నీల–సదాశివల సహజీవన సంస్కృతికి ఉన్న నూతన విలువల స్వభావాన్ని రచయిత్రి అవగాహన కలిగిస్తుంది. 'సహజీవనం' అంటూ భార్యబిడ్డలతో కుటుంబం కలిగి ఉంటూనే స్త్రీలతో రహస్య సంబంధాలు పెట్టు కోవాలనుకునే రామారావు, హరి ప్రవీణ్‌లకు చెంపపెట్టుగా అజిత ఏకకాల ఏక వ్యక్తి నిష్ఠంగా ఉండాలనుకొని తన లైంగికత మీద తనకే స్వేచ్ఛ ఉండాలనుకుంది. ఆ భావనతోనే అజిత 'సింగల్ వుమన్' గా జీవించాలనుకుంటుంది.

ప్రపంచీకరణలో భాగంగా పరిణామం చెందుతున్న రాజకీయార్థిక సాంస్కృతిక చలనసూత్రాల కనుగుణంగా స్త్రీ–పురుషులసంబంధాలలో పెనుమార్పులుచోటు చేసుకుంటున్నాయి. అంతర్జాతీయ సంబంధాల వరకు మహిళల చైతన్యం విస్తృతమైంది. సామాజిక బాధ్యతను వహిస్తూ స్త్రీలు, పురుషులు కలిసి ప్రకృతిని పరిరక్షించుకొనే దిశగా సాగాలనుకొని నీల కూతురైన మునో 18 ఏళ్ల ప్రాయంలోనే సహచరుడైన షాలెంతో సహజీవనం చెయ్యాలి అనుకోవటంగా స్త్రీ పురుష సంబంధాలలో సహజీవన సంస్కృతి కొనసాగింపుగా ఉంటూ నూతన విలువలను సంతరించుకుంటుంది. స్త్రీలు తమ హక్కును పరిరక్షించుకునే దిశగా సాగుతున్న దశలో పితృస్వామ్య అసమ, అనైతిక సంస్కృతికి కాలం చెల్లక తప్పదు. స్త్రీలు స్వేచ్ఛాయుత జీవితాన్ని పొందుతూ స్త్రీ– పురుష సంబంధాలో కూడా తమ భౌతిక, బౌద్ధిక మానసిక హక్కులను కాపాడుకోగల చైతన్యం విస్తారమవుతున్న కొద్దీ పురుషలలో అభద్రత ప్రారంభమవుతుంది. స్త్రీలు తమ లైంగికహక్కులను కాపాడుకోగలిగే స్త్రీ–పురుష సంబంధాలలో స్త్రీలను

కీలు బొమ్మలుగా చేసి అనుభవించటం కుదరదు. అందుకే పురుషులు సెక్స్ రోబోలను తయారుచేసుకునే స్థితిలో ఆలోచనలు చేస్తున్నారనిపిస్తుంది.

'కుటుంబం' మన భారతీయ సంస్కృతికి అనువుగా ఉండాల్సిందే అనే సమాజంలో రోబో స్త్రీలను మధ్యవర్తిగా పెడితే ఆ కంప్యూటర్ బుర్రలే మగవాళ్ళలోని అమానవీయతను బయటపెట్టగలవు. మానవీయతపై యాంత్రికత పైచేయి కావాలనుకోవడం దురదృష్టకరం. మహిళలు, తమ హక్కుల పరిరక్షణకై చేసే పోరాటాలలో స్వేచ్ఛాయుత జీవితానికి దారులు ఏర్పడుతున్న తరుణంలో జీవితానుభవాలే సహజీవన సంస్కృతిలోని బలాలను, బలహీనతలు బయట పెట్టాయి. ఆ సంస్కృతి నిలబడేంత స్థాయిలో మేధాశక్తి, ధైర్యం, స్థిరత్వం, ఆర్థిక స్వాతంత్రం పొందగలగాలి. ముందుగా మానవ సంబంధాలలో స్నేహం, ప్రేమ, సమాన గౌరవ దృక్పథాన్ని అభివృద్ధి చేసుకోవాలి. పరస్పరం జీవితాంతం ఇష్టంతో కలిసి జీవించగలమనే నమ్మకంతో గౌరవప్రదమైన లైంగికసంబంధాలు ఏర్పడకపోతే సమాజంలోస్త్రీ-పురుష సంబంధాలు ఆనారోగ్యానికి గురిఅవుతాయి. పెళ్ళితంతులోని లింగవివక్ష మూలకారణంగా జరిగే పెళ్లిళ్ళు, కుటంబాలు ఎప్పటికి నిలబడవు. అలాగే లైంగిక దోపిడికి వీలుగా చేసుకొన్న సహజీవన సంస్కృతి కూడా పితృస్వామ్యంలో సత్ఫలితాలను ఇవ్వలేదు. అంటే పితృస్వామ్యం ఉన్నంతవరకు పెళ్ళిగాని, సహజీవనంగాని సత్ఫలితాలను ఇవ్వలేవు కాబట్టి ముందుగా పితృస్వామ్యం అంతరించే మార్గం అవసరం. దీన్ని ప్రతిఫలిస్తూ వచ్చినదే జి. లక్ష్మి వ్రాసిన మూడోకన్ను అనే కథ. దీనిలో సహజీవన సంస్కృతిలోని విచ్చలవిడితనం మీద నిఘా ఉంచగలిగిన మూడోకన్ను అవసరమవుతుందని, అటువంటి అవసరము తనకూతురి మీద పడకుండా చూసుకోవాలని చెప్పటం అంటేనే సహజీవస సంస్కృతి యొక్క తిరోగమనాన్ని సూచిస్తుంది.

లింగవివక్షలేని సమాజంలో మహిళలకిచ్చే గౌరవం, మహిళలపై లైంగిక దాడులు లేని వాతావరణాన్ని ఏర్పరచుకుంటేనే వివాహ సంబంధాలైనా, సహజీవన సంబంధాలైన స్త్రీ-పురుష సంబంధాలకు నూతన విలువలను

సంతరింప జేసుకుంటాయి. లింగవివక్షలేని ప్రజాస్వామ్యంలో మాత్రమే ఇవి మనుగడ సాగించగలవు. ముఖ్యంగా స్త్రీ- పురుషులు పరస్పరం సామాజిక జీవన విధానాలలోని అన్ని స్వేచ్ఛలను, మానవ హక్కులను గౌరవించుకుంటూ జీవితాంతం ఇష్టంతో, స్నేహంతో నిజాయితీగా జీవించాలి. వివాహ సంస్కృతిలో ప్రేమకంటే శారీరక సుఖాలకే ప్రాధాన్యత వుంటే, సహజీవన సంస్కృతిలో సమాన లైంగిక హక్కులతోపాటు మానసిక అనుభూతికి ప్రాముఖ్యత ఉంటుందని సాహిత్యం తెలియజేస్తోంది. స్వీయనియంత్రణ కలిగి ఏకనిష్ఠమైన, ఏకకాల లైంగికసంబంధాలు స్థిరంగా ఉండగలిగే సహజీవన సంస్కృతిని ఏర్పరచుకోవాలి. సామాజిక బాధ్యతలేని స్వేచ్ఛాయుత స్త్రీ-పురుష సంబంధాలు సమాజానికి అనర్థదాయకంగా పరిణమిస్తాయనే ఆలోచన కూడా అవసరం. అంతిమంగా కుటుంబాలలోగాని, సహజీవనాలలో గాని లైంగిక దోపిడికి గురికాకుండా మహిళలు తమ జీవనహక్కును కోల్పోకుండా చూసుకోగల విజ్ఞత ముఖ్యము.

*– తెలుగువెలుగు మాసపత్రిక–నవంబరు 2018.*

## 18. తెలుగు సామెతలలో 'సమిధలు'- చైతన్య దీప్తులు

సమాజంలోని జీవన సంస్కృతిని ప్రతిబింబించేది భాష. తమ మాతృ భాషలో వ్యవహరించే వారందరూ ఆయా ప్రాంతాలలోని జీవన విధానానికి ప్రతీకలుగా నిలుస్తారు. మాతృభాషా వికాస దశలో పుట్టినవి సామెతలు. తరతరాల నుండి వస్తున్న మాతృభాష ఒక వారసత్వపు సంపద. సందర్భాను సారంగా ఉపయోగించే లోకోక్తులు భాషకు పట్టు కొమ్మలు. అక్షరజ్ఞానం లేకపోయినా లోకవ్యవహార జ్ఞానంలోనుంచి పుట్టుకొచ్చినవే సామెతలు. అందుకే ఈ సామెతలు భాషకు జవసత్త్వాలనిస్తాయి. వ్యక్తినిష్ఠంగా గాక సామాజిక జీవనవిధానంలోని ఆర్థిక, సాంస్కృతిక విషయాలకు అద్దం పడతాయి. పెద్దలు సామ్యంతో ప్రాసలతో చెప్పిన సామెతలు కాబట్టి మనసుకు బాగా హత్తుకుంటాయి. అల్పాక్షరముల అనల్పార్థ రచనగా లోతైన నిగూఢార్థలు గల సామెతలు సామాజిక జీవితాన్ని బాగా ప్రభావితం చేయగలుగుతాయి. అందుకే సామెతలో సామాజిక నేపథ్యం తొంగి చూస్తూ ఉంటుంది. పట్టాణాలలో మాతృభాషలో మాట్లాడటమే నామోషి కాబట్టి సామెతల ప్రయోగానికి అవకాశంతక్కువ కాని పల్లెలోని మానవ సంబంధాలలో సందర్భాలకు తగ్గట్టుగా సామెతల పదప్రయోగం ఉంటూ సమాజ సంస్కృతిపై ప్రభావం చూపగల్గుతుంది.

సమాజంలోని మానవ సంబంధాలలో భాగంగా స్త్రీ- పురుష సంబంధాలు ఎలా ఉన్నాయో సామెతల వల్ల అర్థం చేసుకోవచ్చు. సామెతలు సమాజ

వ్యవహారంలోంచి పుట్టటం చేత అధికార వ్యవస్థగా ఉన్న పితృస్వామ్యానికి సహజంగానే ప్రోద్బలకంగా ఉంటాయి. సామెతలు మానవనైజానికి అద్దం పడుతూ స్వార్థపరశక్తులైన మగవాయిల సామూహికత్వంలో పుట్టిన లోకోక్తుల రూపంలో ఉంటాయి. కాబట్టి స్త్రీల స్థాయిని తగ్గించే విధంగానే ఉంటాయి. స్త్రీల హృదయాలకు స్పందన ఉంటుంది కాబట్టి వారి బాధను అభివ్యక్తీకరించే సామెతలు మగువల మనస్సు నుండి వెలికివచ్చినా ప్రచారంలో ఉండవు. స్త్రీలను ఎదగనీయకుండా చేసే భావాలే సమాజంలో చోటు చేసుకుంటాయి కాబట్టి స్త్రీలు సామాజిక సంస్కృతికి బలి అవుతూ సమిధలుగా చేయబడతారు. అయితే సమిధలుగా వ్రేల్వబడినా, మంటల రూపంలో విజృంభించిన కారణంగా మహిళలు తమ ప్రతిఘటనా స్వరాన్ని ఆ సామెతలలోనే వినిపించారు. సామెతల రూపంలో అణిచివేతకు గురి అవుతున్న స్త్రీలలో చైతన్యపు జ్వాలలు రావటం సహజంగా జరిగే పరిణామమే. సామాజిక చలన సూత్రాల కనుగుణంగా పరిణామాన్ని పొందే మానవ సంబంధాలలో సామెతలు కొన్ని వ్యవహార నిషేధానికి గురి కాబడాలి. మార్పును సంతరించుకోవాలి. స్త్రీల పాలిట శాపాలుగా ఉన్న సామెతలు తెలుగు భాషకు వెలుగు నివ్వలేవు. పైపెచ్చు సామాజిక సంస్కృతిని దిగజార్చేవిగా ఉంటాయి. ఆరుద్ర చెప్పినట్లు "గతానుభవాన్ని దృష్టిలో వుంచుకొని వర్తమానాన్ని ఆలోచిస్తూ భవిష్యత్తుకు వర్తించేవి" సామెతలు కాబట్టి సామెతల ప్రయోగం జీవితాలను వికసింప చేసే చైతన్యాన్ని ఇవ్వాలి. దానికై సామెతలలో స్త్రీల పుట్టుక, పెంపకాన్ని గురించినవి, స్త్రీల వివాహవ్యవస్థ, మాతృత్వం, స్త్రీ-పురుష సంబంధాలలో స్త్రీలకున్న విలువ, స్త్రీల లైంగికతపై అదుపు, ఆ అదుపును భరించలేక స్త్రీలలో వచ్చిన ప్రతిఘటనా చైతన్యం, ఆ చైతన్యంపై నీళ్ళుచల్లే సామెతలను పరిశీలించగలగాలి. స్త్రీల ప్రగతి నిరోధకమైన సామెతలు స్వీయ వ్యవహార నిర్బంధానికి గురి అవ్వాలి. స్త్రీల జీవితాలను సమిధలుగా చేయబడటం చేత పుట్టిన మంటలనే పితృస్వామ్యం తన గొడుగుగా చేసుకుంటున్న విషయాన్ని గుర్తించాల్సిన అవసరం కూడా ఉంది.

నాటి నుండి నేటికీ ఆడపిల్ల పుట్టుకను నిరసించే భావజాలం సమాజంలో సామెతల రూపంలో వ్యవహరింపబడటంచేత ఆడ పిల్లలు ఆగర్భ మరణాలకు

గురిఅవుతూ పిండ దశలోని జీవించే హక్కుకు కోల్పోవటం తెలిసిన విషయమే. ఆడపిల్ల పుట్టటమే మహా అపరాధంగా భావింపబడి తండ్రికి శిక్షాప్రాయం చేస్తూ, 'అబద్ధాలాడితే ఆడపిల్లలు పుడతారనే' సామెత పుట్టింది. అబద్ధాలాడే మానవ స్వభావాన్ని ఆడపిల్లల పుట్టుకకు లంకెపెట్టి స్త్రీ పుట్టుకను నిరసించటం పితృస్వామ్యానికే చెల్లు. 'ఆడ చెత్త-మగ బంగారం', 'ఆత్రానికి పోతే ఆడపిల్ల పుట్టిందీ', "ఇంటికి ఆడపిల్ల ముప్పు". 'తల్లి కడుపులో చేరక మునుపు దయ్యాలదేవత, భూమ్మీద పుట్టిన తర్వాత యమదేవత' అంటూ ఆడపిల్ల పుట్టుక భయాందోళనను కలిగించే విధంగా సామెతల ప్రయోగం జరిగింది.

పుట్టుకలో ఆడ, మగా సమానమైనా కూడా సమాజభావాలలో ఆడపిల్లలు వివక్షకు గురి అవటానికి సామెతలు ప్రోద్బలకంగా ఉన్న విషయం అర్థం అవుతూ ఉంటుంది. 'మగ పిల్లవాడు బంగారపుపుల్ల', 'మొగ పిల్లలున్న యిల్లు మోదుగులున్న అడవి అందమనే' భావనలలో మగపిల్లవాడి పుట్టుకకు విలువ నివ్వటంతో మగపిల్ల వాడి తండ్రి స్థాయి పైన ఉండి ఆడపిల్లను కన్న తండ్రి స్థాయిని తక్కువ చేసింది. 'ఆడ-పిల్ల నిచ్చినవాడు ఈగ, పుచ్చుకున్న వాడు పులి' అన్న భావాలు తండ్రుల చేత ఆడపిల్ల పుట్టుకను నిరసింపజేసాయి. 'ఆడ పిల్ల పుట్టిందంటే ఆయువు సగం కృంగి పోయిదనటం' 'ఆడపిల్లను కన్నవారు ఐదు బిరుదులు తెగ కోసుకోవాలనటం' తో తండ్రి కూతురిని గురించి 'ఆరో నెల్లో పుట్టిన దయ్యం', అని భావించేటట్లు చేసాయి ఈ సామెతలు.

ఆడపిల్ల పుట్టుక యొక్క ఆరంభం నిరసనకు గురి అవటంతో పెంపకంలో కూడా అవాంఛనీయిత కన్పడుతుంది. ఆధునిక కాలంలోని మార్పుల కనుగుణంగా ఆడపిల్లల చదువుకు ప్రాధాన్యత పెరిగినా, నేటికి పల్లెల్లో మగ పిల్లలను చదువించినట్టు ఆడపిల్లలను చదివించటంలేదు. 'వీరేశలింగం గారి కాలానికి' ఆడపిల్లలు చదువుకుంటే వైధవ్యం వస్తుందనే భావాలను చొప్పించటం జరిగింది. ఆడపిల్లల చదువును గురించిన ఆలోచనలు తక్కువ కాబట్టి ఆ రకమైన సామెతల ప్రయోగం తక్కువగానే జరిగింది. అయితే ఆడపిల్లల చదువుకు

అక్కడక్కడా ప్రాధాన్యత పెరుగుతున్న సమయంలో ‘తగునే కరకుట్లును, జంక పొత్తమున్’ అంటూ ఆడపిల్లలకు చదువు ఉండకూడదనీ, స్త్రీలు చదువుకుంటే జరిగే పరిణామాలను ఉహిస్తూ “చదువనేర్చిన ఆడవారి తోనూ, వంట నేర్చిన మగవారి తోనూ నోపలేమనే” సామెతలు పుట్టాయి. స్త్రీలు చదువుకుంటే ఇంటి పనులు చేయరనీ పని విభజనకు అనుకూలంగా జరిగిన కుటుంబ సంస్కృతికి వ్యతిరేకమనే భావన ఆ సామెతల్లో తొంగి చూస్తుంటుంది.

సామాజిక అసమ నైతికసంస్కృతిలో భాగంగానే స్త్రీల పుట్టుక నిరసింపబడి, ప్రసవానంతరం వడ్లగింజవేసి చంపబడటంతో పాటు ప్రసవాలలో మాతృమరణాలు ఎక్కువై ఆడపిల్లల నిష్పత్తి తగ్గింది. తాతలు కూడా పెళ్ళిచేసుకునే సమాజ సంస్కృతి ఉండటంతో కన్యాశుల్కం చోటుచేసుకుంది. నెనరు, న్యాయం విడనాడి తండ్రి బాలికలను ముసలాళ్ళకు కట్టపెట్టటంతో అభం శుభం ఎరుగని అష్టవర్ష ప్రాయలైన కన్యకలు, ప్రకృతి సహజమైన మానవ స్వభావ వికసనానికి దూరమవటం జరగింది. సంస్కృతి రూపంలో స్త్రీలు పీడనకు గురి కాబడేటట్లు చేయటం సామెతల ప్రయోగంలో అర్థం అవుతుంది. సమాజంలోని అసమ నైతిక సంస్కృతి వల్ల, ‘తాత తలచిననాడే పెళ్ళి’, ‘ఏలేవారికి ఏడు పెళ్ళిళ్ళు’, ‘తలకొట్టేవాడికి కూడా మూడు మనువులున్నాయనటం’ ‘ముద్దుగుడుపు ముదిపెళ్ళికొడుకా అంటే పెళ్ళికి వచ్చిన వాళ్ళంతా నా పెళ్ళాలే అన్నాడట’ అనే సామెతలో పురుషుడు జీవితాంతం ఎన్ని పెళ్ళిళ్ళైనా చేసుకోగల స్థితిలో ఉన్నట్లు అర్థం అవుతుంది. ఇప్పటికీ పల్లెల్లో ఆ సంస్కృతి అక్కడక్కడా కనపడుతూనే ఉంటుంది. ‘సూర్యోదయాన మాంగల్యధారణ శుక్రోదయానికి మాంగల్య విసర్జన’ జరిగేవి. చైత్రవైశాఖలలో ‘పెళ్ళి, కావిళ్ళు, భాద్రపద శ్రావణాలలోదినం కావిళ్ళు పట్టటం’ జరిగేవి ‘అదిగో పసుపు, ఇదిగో ముసుగు’?, అనేటట్లు ఉండేది. ‘ఆడవాళ్ళను చూస్తే రిమ్మతెగులు’ పుట్టేది. కుటుంబ వ్యవస్థలో స్త్రీ ప్రాతివ్రత్యం ప్రధాన విషయమైంది. బాల్య వివాహాలు జరిగిన వ్యవస్థలో ఆడపిల్లకు పెళ్ళి అంటే భర్త అంటే అవగాహన లేకపోయినా, ముసలిభర్త చనిపోయిన తరువాత ప్రాయం వస్తే అందంగా ఉంటుందనీ, బాల వితంతువుకు

ప్రాతివ్రత్య భంగం అవుతుందని భావించి శిరోముండనంతో, విరూపులుగా చేయబడేవారు. దానిని మహిళలు పీడనగా భావిస్తుంటే నిర్దయంగా 'కొండంత మొగుడు పోతే బాధ లేదుగానీ, పిడికెడు బొచ్చు పోయినందుకుఏడ్చిందట', 'కొండంతరెడ్డి పోగా, చేతికి గాజుల కేడ్చిందట' అనే సామెతలు పుట్టాయి. 'మూడునాళ్ళ ముత్తైదు తనానికి ఆరు జోళ్ళు లక్కాకు లెందుకని', 'ఐదవ తనం లేని అందం అడుక్కు తినటానికా' అనీ, 'తాళిబొట్టు బలం వల్ల తలంబ్రాలవరకైనా బ్రతికాడు' అను సామెతలు వచ్చాయి. పైగా 'అమ్మగారి గృహ ప్రవేశం అయ్యవారి శ్మశానప్రవేశం'' అని పుట్టించారు'. కుటుంబ సంస్కృతిని నిందించకుండా కుటుంబంలో వితంతువులకు స్థానం లేకుండా చేయటానికే గాజుల చెయ్యి గలగల లాడితేనే ఇల్లు కళకళలాడుతుందని "వెధవముండను వేరుగా ఉండ మన్న"ట్లు వంటి సామెతలు పుట్టాయి.

ఆడపిల్లలకు పెళ్ళి చేయటం అంటే తండ్రికి 'గుండెల మీద కుంపటి దించుకోవటం' వంటిదయింది. ఆడపిల్ల పుట్టకకు విలువలేకపోవటంలో అత్తవారింటికి పంపేటప్పుడు తండ్రి చెల్లించాల్సిన నష్టపరిహార రూపంగా కట్నం చోటు చేసుకుంది. కుటుంబం ఏర్పడటానికి జరిగే 'పెళ్ళి తంతు'తో లింగ వివక్షా సంస్కృతి పెరిగి పెద్ద దయింది. 'అశ్వమేధయాగం చేయవచ్చు గానీ, ఆడపిల్ల పెళ్ళి చేయలేం'. 'ఆడపిల్లపెళ్ళి అడుగుదొరకని బావిఅంతం చూస్తాయ'ని, 'పెళ్ళి చేసి చూడు, ఇల్లు కట్టి చూడు' అనే సామెతలు పుట్టాయి. సమాజంలో మగ పిల్లవాడి పుట్టుకకు విలువ ఉండటంతో మగపిల్లవాడ్ని కన్నవారికి అందలం పట్టడం పెళ్ళిలో సాంప్రదాయమయింది. 'కూతుళ్ళను కన్నవారికి కుర్చీలు, కొడుకులను కన్నవారికి కుక్కి మంచాలు' అనే సామెతలు పుట్టాయి.

అత్తవారింట్లో ఆడపిల్ల బ్రతుకు ఎంతో కష్టంగా ఉండబట్టే స్త్రీ 'అత్తవారింట్లో ఐశ్వర్యం కన్నా పుట్టింట్లో గంజి మేలనుకుంది'. 'అటు అత్తింటికి కోడలుకాక ఇటు పుట్టింటికి బిడ్డ కాను'! అంటూ బాధపడుతుంది. 'ఆడదై పుట్టేకంటే అడివిలో మ్రానై బ్రతకటం మేలు' అని స్త్రీలు 'అత్తవారింట సుఖం మోచేతి దెబ్బ వంటిదని'

భావించారు.' స్త్రీలు తమ పుట్టుకను తామే నిరసింప జేసుకునేటట్లుగా ఈ సామెతలు వచ్చాయి. 'చాలని బట్ట అయితే చినిగే వరకు దుఃఖం, చాలని మొగుడంటే జీవితాంతం దుఃఖం' అని భావించింది.

ఆడపిల్ల పుట్టుక అంటే అమ్మలు పుట్టటమే, అనీ సంతానాన్ని కనిపెంచటానికే సృష్టింపబడిన బొమ్మలు అని భావించేవారు. అందుకే 'ఇంటి కోడలు తిన్నది, కోళ్ళు తిన్నది వృథాగా పోదనే' సామెత పుట్టింది. 'బిడ్డలను కన్నమ్మ, భిక్షను పెట్టినమ్మ చెడదు', అనే వారు. కొడుకు పుట్టే వరకు స్త్రీలు ఎన్ని కాన్పులైనా కంటూ ఉండాలనే భావనతో 'కోడలు కొడుకును కంటానంటే వద్దనే అత్త ఉంటుందా' అనీ, 'ఇంటి నిండా గంపెడు సంతానం ఉండా' లంటూ సామెతలు వచ్చాయి గానీ ఆ ప్రసవాల వెనుక నున్న పీడనను పితృస్వామ్యాం పట్టించుకోలేదు. స్త్రీలు 'చంకను బిడ్డ కడుపున పిల్లతో కన్పడేవారు'. ప్రసూతి వైద్యం లేని చోట శిశుమరణాలు చోటు చేసుకొనే చోట నెపం స్త్రీల మీదనే పడేది అందుకే 'కన్న కడుపు చల్లని దైతే వచ్చిన గండం వైదొలుగుతుందనే వారు' 'అమ్మ! అమ్మ! నొప్పులెత్తు తున్నప్పుడు నన్ను లేపవే అంటే అలాగే పడుకో బిడ్డ, ఊటగా నొప్పులెత్తు కుంటే ఊరెల్ల నీవే లేపుతావు అందట' శిశుమరణాల సందర్భంగా 'గుంటలో బిడ్డ, కడుపులో బిడ్డ' స్థితిలో ఉన్నప్పుడునూ, ప్రసవ వేదనను మాటిమాటికీ భరించలేని స్త్రీ 'పుట్టిన బిడ్డల్లా చచ్చేదాని కంటే మగడే చచ్చేదిమేలు' అనుకునేదట. భార్యాభర్తలలో భర్త లోపం వల్ల సంతానం కలగక పోయినా స్త్రీ యే నిందకు గురికాబడటం నేటికీ చూస్తూనే ఉన్నాము. ఆ క్రమంలో పుట్టిన 'గొడ్రాలి కేమి తెలుసు కాన్పునొప్పులు, గొడ్రాలికి గొంతు పెద్ద', 'నలుగురూ చేతులేస్తే గొడ్రాలికి బిడ్డ పుడతుంది' అనటం కన్పడుతుంది. 'స్త్రీ సంతానం కనటమే ప్రధానం కాబట్టి పాతివ్రత్య విషయాలలో మినహాయింపు ఉండటం ఇతిహాస కాలం నుండి ఉన్న విషయమే.

భార్య మీద భర్తకు ప్రేమ ఉందన్న దానికి ఋజువుగా అతడు భార్యను గౌరవించే విధానాన్ని బట్టి ఉంటుంది. భార్యకు గౌరవం ఇవ్వటం ఇష్టంలేక

పోవటం, ఆమె ఉనికికి విలువ ఇవ్వటం ఇష్టం లేక 'భార్యను ఒసే అని సంభోదిస్తే, బయటవారు తుసే' అని సంబోధించారట. అందుకే భార్య. 'ఎన్నడూ నా మగడు ఎల్లీ, ఎల్లీ అనలేదు గాని, ఇల్లు కాలిననాడు ఎల్లీ! ఎల్లీ అన్నాడట' అంది. ఆమె ఇల్లు కాలిన ప్రమాదానికి బాధ పడుతూ కూడా భర్త తనను పేరు పెట్టి పిలిచినందుకు ఆమె సంతోషపడినట్లు అర్థం అవుతోంది. భర్తకు ఆమెను 'ఒసే' అనే పిలిచేఅధికారం ఉందనీ, ఆమెపై చనువుకు అధికారానికి చిహ్నాం చేసుకోవటం వల్లనే 'నా పెండ్లాన్ని లేవదీసుకుపోతే పోయాడు గానీ, పది మందిలో 'ఉసే' అంటాడేమోనని భయంగా ఉన్నదన్నాడట'. అనే సామెత ఆమె మీద తన అధికారంపోతుందనే బాధతో వచ్చింది.

స్త్రీలకు 'వివాహం' చేయటం అంటేనే తండ్రి దగ్గర నుండి అల్లుడికి స్త్రీల శరీరాలు, మనసుల మీద హక్కుల బదలాయింపుగా వేదాల నాటికి చెప్పబడింది. నేటికీ అనుశ్రుతంగా వస్తూనే ఉంది.అందుకే 'భర్త బడాయి భార్యమీదనే' ఉంటుంది. 'న స్త్రీ స్వాతంత్ర మర్హతి' అని మనువు నుండి వచ్చిన ధర్మమే స్త్రీల శరీరాల మీద మనస్సుల మీద, మెదళ్ళ మీద అదుపు చేయటంగా రూపుదిద్దుకుంది. 'అమరితేనే ఆలి, అమరకపోతే గాడిద' అని,' ఆలిని అదుపు ఇంటికి మదుపు' అని, 'ఆలికి అలుసవ రాదనీ' 'ఆలికి చనువిస్తే చంక నెక్కుతుందనీ' 'ఆలి మాట విన్నవాడు అడవిలో పడ్డాడనీ', 'ఆలిని అదుపులో పెట్టనివాడు అందరినీ ఎలా అదుపులో పెడ్తాడనీ' చెపుతూ, అవసరమైతే, 'అదుపురాని ఆలిని అందిరాని చెప్పును విడనాడమ'నీ సామెతలు పుట్టించారు. 'మాట వినకపోతే దాసికి తలగొరిగింపు, భార్యకు దండన, పడక వెలితేత' అని పుట్టించారు. "అలివిగాని ఆడదాన్ని కట్టుకొని అడవిలో చచ్చాడ్రా/మురిగి చచ్చాడ్రా" అనే సామెతలు పుట్టాయి.

పితృస్వామ్య మనుగడకై భార్యను అదుపులో పెట్టటం భర్త కర్తవ్యంగా సమాజ సంస్కృతి నిర్దేశిచింది. భార్యను అదుపులో పెట్టటంలో భాగంగా భౌతిక దాడి చేసే క్రమంలోనే 'మొగుడు కొట్టినందుకుకాదు తోడికోడలు నవ్వినందుకు' బాధపడింది. మొగుడు తనను హింసించటం తన జీవితానికి విలువ తగ్గటంగా

భావిచింది. అంతేగాదు "మొగుడు 'ముండా' అంటే ముష్టివాడు ముండా" అంటాడనే సామెత వచ్చింది. అంతేకాదు 'పెట్టి పోయని మొగుడు కుట్లు వెడల పొడిచాడే' 'మొగుడు కొట్టినాడని మల్ల వాని దగ్గరకు పోతే మల్లవాడు తెల్లవార్లు కొట్టాడట' అనే సామెతలు వచ్చాయి. అందుకే 'కుల హీనమైనా వర హీనం' కాకూడదన్నారు. ఇక్కడ తనని కొట్టే హక్కు భర్త కెలా ఉందీ, ఎవరిచ్చారని స్త్రీ ఆలోచించే మానవీయ సంస్కృతికి ఆస్కారం లేని రోజులు అవి. ఆలోచింపనీయని రోజులు కూడా.

'తల్లిని చూస్తే కూతురు', అంటూ తల్లిప్రవర్తన కూతురు నేర్చుకోవటానికి వీలుగా భార్యను అదుపులో పెట్ట గలిగితే సమాజంలోని స్త్రీలందరి మీద అదుపు కలిగి పితృస్వామ్యం సజావుగా కొనసాగుతుంది. ఇంట్లో తమ మీద జరిగిన హింసలకు ఎవరితోనూ చెప్పుకొని ఉపశమనం పొందటం గానీ, సానుభూతిగానీ పుట్టకుండా ఉండేందుకు "అల్లుడికి బెట్టు- ఇల్లాలికి గుట్టు' ఉండాలనీ, 'సంసారం గుట్టు- రోగం రట్టు' అనే సామెతలు పుట్టాయి. అందుకే 'అమిరితే ఆడది, అమరక పోతే గాడిద' అని భావించేవాడు భర్త. భార్యను అదుపులో పెట్టటానికి పితృస్వామ్యానికి వున్నా ప్రధాన ఆయుధం స్త్రీల పాతివ్రత్యాన్ని శంకించటం. దానికై భర్త నిరంతరం భార్య లైంగికత పై అనుమాన ప్రవృత్తితో వేధిస్తుంటే ఆ స్త్రీ పాతివ్రత్యాన్ని అధిగమించలేదని భావించారు. అంటే స్త్రీల శరీరాన్ని, మనస్సు చుట్టూ లింగ వివక్షతో అల్లిన భావాల చట్రంలో స్త్రీల స్వేచ్ఛను బిగించటం వంటిది జరిగింది. అందుకే 'అయిదేళ్ళ ఆడపిల్ల మూడేళ్ళ మగపిల్లవాడికి లోకువ' గా చూడబడేది. ఈ లైంగికతలో భాగంగానే, భర్త భార్యతో 'పచ్చి కుండలో నీళ్ళు ఇచ్చి నీ పాతివ్రత్యాన్ని నిరూపించు కో'మంటాడు. ఒక వైపు కుటుంబంలోని అసమ నైతిక సంస్కృతి, మగవానికి ఎంతమంది స్త్రీలతో నైనాయధేచ్ఛగా తిరిగే స్వేచ్ఛనిచ్చి, మరోవైపు స్త్రీలవిషయంలో 'ఆడది నీతి తప్పితే అంతేమిటి, ఇంతేమిటి' అంటూ భావించింది. ఆరకంగా 'అంకు నేర్చినమ్మ బొంకు తుందని' 'ఆడది బొంకితే గోడ పెట్టినట్లుంటదనీ' భావనను మగవారు ప్రచారం చేసారు అందుకే ప్రాయంలోఉన్నస్త్రీలు 'పడుచులకాపురంచితిమంటలతోసమానమని" భావించారు.

భర్త అనుమానించటాన్ని భరించలేని భార్య 'దయా దేవరా ! నా మొగుడ్ని పట్టుకు పో' అనీ మొర పెట్టుకునేది. ఆ క్రమంలోనే 'మ్రొక్కిన మ్రొక్కు చక్కనై మగని కండ్లు' రెండుపోతె ఆరుకాళ్ళ' జీవాన్ని దేవునకు అర్పితం చేస్తానన్నదట' అనే సామెతలు పుట్టాయి. 'అనుమానంతో మొగుడు వీపున కట్టుకుంటే పెళ్ళాం మొగుడ్ని కొప్పులో పెట్టు కుందట' అనే సామెతలు వచ్చాయి.

స్త్రీల లైంగికతపై అదుపులో భాగంగా భర్త తరపు బంధువులైన అత్తా, మామ, ఆడబడుచులు, సవితి కూతుర్లు యొక్క నిఘా ఉండటంతో 'అత్తవారిల్లు కత్తుల బోనుగా' భావించేది. 'అల్లుని కత్తికి రెండు వైపులా పదునుంటే అతని అప్పకు ఆరు వైపులా పదునుండేదట' 'పిండి బొమ్మను చేసి పీట మీద ఉంచితే ఆడబడుచు తనాన అదిరి పడిందట' అనే సామెతలు వచ్చాయి. 'అత్తా! అత్తా! ఎప్పుడు నిద్రపోతా వంటే నిన్ను చూసి నిద్రపోతానందట'. అందుకే 'అత్త నెత్తుకు పోతే ముత్యాలమ్మ ! ఆరు గాళ్ళ జీవాన్ని ఇస్తానందట' ఆ కోడలు. గుడ్డి మామ గారికి నమస్కార మయ్యా! అంటే 'పోరుకు ప్రారంభమా రంకు కోడలా' అనే సామెత వచ్చింది. తరుచుగా వాడబడే సామెత 'అరిటాకు వచ్చి ముల్లు మీద పడ్డా ముల్లు వచ్చి అరిటాకుమీద పడ్డా అరిటాకు' కే నష్టమనే వారట. అందుకే స్త్రీలకు "అత్తవారింటి కాపురం మోచేతి దెబ్బలాగా" అనిపించింది. 'అత్తారింట్లో ఆరళ్ళ హింస' అనే సామెత వచ్చింది. నామగనికి నా పై ఎంత ప్రాణమంటే 'తెచ్చెరామెడ కోనం' (ఉరి) అని భర్తకు తనని చంపుటమే ప్రేమ అని చెప్పుకునేది.

భార్యకెపుడూ ఆర్థికసంబంధాలలో భాగస్వామ్యం ఉండేది కాదు. "ఆడదాని చేతిలో అర్థం – మగవాని చేతిలో బిడ్డ బ్రతకదంటూ" స్త్రీకి ఇంట్లో పిల్లల పెంపకం, ఇంటి చాకిరీని నిర్ణయించి, ఆర్థిక వ్యవస్థపై హక్కు మగవాడికే కట్టబెట్టారు. 'ఆడపెత్తనం తంబళ్ళ దొరతనం' అనేవారు. ఆమెకు ఆస్తి హక్కు లేదు. ఎప్పుడైనా పుట్టింటికి వెడితే 'ఆడపిల్ల ఆశ, మూలవాసం గుంజుకు పోయే వరకు తీరదు' అంటారు.

చీకట్లో బంధిస్తే ఎంతటి పిల్లి అయినా తిరగబడక మానుతుందా! అన్నట్లు భార్యా భర్తల మధ్య దూరం ఆమడ దూరం పెరిగి, మనస్సు పంచుకొనే మగడు కరువయే సరికి సంసారం అంటే విరక్తి పుడుతుంది. స్త్రీలు ఆ యింట్లోనే ఉండి తిరగబడాలనుకునేవారు, అది కుదరక పోతే ఇల్లు విడిచి వెళ్ళిపోవాలనుకునేది. కాని 'ఇల్లు విడిచి ఆడది లోకానికి లోకువ' అవటం నిందకు గురి అవటం' 'ఇల్లు విడిచిన తర్వాత ఇల్లాలు అవుతుందా' అని సామెతలు వచ్చాయి. పైగా 'కుక్కలు చింపిన యిస్తరిలాంటి దవుతుందని' భయపెట్టేవారు. 'ఉవిదలకు బుద్ధి పెడతల ఉంటుంద'నే ప్రచారం జరిగింది. అందుకే భార్య 'అధముడికి ఆలి అయ్యేకంటే బలవంతునికి బానిసగా బ్రతకటం మేలు' అనుకునేది స్త్రీ.

ఇల్లు వదిలి వెళ్ళిపోకముందే చిన్నచిన్నగా ఆమెలో భర్తని ప్రతిఘటించే చైతన్యం చోటు చేసుకొనేది. భర్తకు వేళకు అన్నంపెట్టానికి కూడా యిష్టం ఉండేదికాదు. 'మగవాడి బ్రతుకు చిప్పనిండా మెతుకనీ' 'ఆడవారి బ్రతుకు గంజిలో మెతుకని' గ్రహించి చద్దన్నం పెట్టుకు తింటే 'చద్దన్నం తిన్న అమ్మ మొగుడి ఆకలెరు గదనీ' సామెతలు వచ్చాయి.

స్త్రీ కుటుంబ సంస్కృతి మీద తిరగబడాలనుకొని, దాన్ని అమలు పరుస్తున్న భర్త, అత్త మీద తన నిరసనను తెలియచేసే విధంగా 'ఎడ్డెం అంటే తెడ్డెం'గా మాట్లాడేది! 'కోడలా కోడలా కొడుకు కోడూరు వెడితే నీకు కోకెక్కడిద అంటే, అత్తా అత్తా మామ మడమనూరు పోతే నీకు మెట్టెలెక్కడివని' అని ప్రతి వచనం పలికేది. ముఖ్యంగా తనని అదుపులో పెట్టే వాడు మొగుడనీ, అతనికి ప్రేమ ఉంటే అలా చేయడనీ, అతనికీ ఆ హక్కును కల్గించింది కేవలం ఆతను తన మెళ్ళో తాళి కట్టం చేతనే అని గ్రహింపుకు వచ్చి 'మనసుకు నచ్చినవాడు మగడుకానీ, మంగళసూత్రం కట్టగానే మగడు కాదు' అనేది. పైగా 'మరులున్న వాడే మగడు' అనే నిర్ధారణకు వచ్చింది. దానికి భర్త 'నేను లేకపోతే ఎవడ్ని పెళ్ళాడుతావు అంటే నీ అబ్బంటి వాడింకోడు పుట్టేవుంటాడుగా' అనేది. మొగుడు కొడుతుంటే 'కరణం, కాపుప్రక్కనుంటా కొట్టరా' అని సవాల్ విసిరింది. 'మొండి

దానా నీ మొగుడేమి చేస్తాడే' అంటే 'అటుకొట్టి ఇటు కొట్టి అటే పోయాడనేది' కాని ఏడ్చి కుములి పోయేది కాదు. 'కూచుంటే లేవలేదు, కూరలమ్మ లేదు కొట్టస్తాడమ్మ నా మగడు' అని పరిహసించేది. అందుకే ఎదురు దాడిలో భాగంగా 'అత్తను కొట్టి అటకెక్కింది మొగుడ్ని కొట్టు మొగసాల కెక్కింది' అనే సామెత వచ్చింది.

భర్తతో సంసారం ఇష్టం లేదని చెబుతూ 'తాకట్టు మొగుడా, తంటాల మొగుడా నీ తనువుండగానే నన్ను మనువీయరా' అనేది. 'కాముని పున్నమినాడు పాతమొగుడేనా' అంటూ భర్తపై విరక్తి పుట్టేది. 'చవిసారంలేనికూడు చట్టి నిండా, మగతనం లేని మగడు మంచంనిండా' అని అనుకునేది. 'చాదస్తం మొగుడా నీచారెడు నీవే వండుకో' అని సహాయ నిరాకరణ చేసేది. 'మొగుడి మీద కోపంతో మాదిగవాని వెంటపోయింది'. అంటే భర్త కంటే అతను నయం అనుకున్నది కాబట్టి అలా చేసింది. ఎవరైనా అడిగితే "మాయింటాయనకు మగతనం ఉంటే పొరుగింటాయనతో పొందెందుకు' అని ఎదురు ప్రశ్న వేసింది. 'గుణం మానవే గూటాలపోలీ, అంటే నామనువైనా మానుతా గానీ, నా గుణం మాననని'మొండి తనం అలవాటు చేసుకుంది. అంతేకాది 'ఓలి యిచ్చిన మగడి కంటే కూలి యిచ్చిన మగడే ఎక్కువ'నుకుంది. ఆ మొగవాడు మోసం చేస్తే నిభాయించు కుంటూ, 'మిండ వాడు డబ్బివ్వకపోతే మొగుడే పోయాడను కుంటూ' నందట. అంటే 'తాళి కట్టిన మొగుడి దగ్గరైన, మిండడి దగ్గరైనా విలువలేని వ్యభిచారంగానే భావించింది. 'మొండి కెక్కిన దాన్ని మొగుడేమి చేయగలడు, రచ్చకెక్కిన దాన్న రాజేమి చేయగలడు' అన్నట్టుగా ప్రవర్తించేది. 'ఏమి వాడి దగ్గరపడుకున్నవా? అంటే అంత పెద్ద మనిషి చేయిపట్టుకుంటే/ పెద్దిరెడ్డి కొంగుపట్టుకొంటే వదిలేదెట్లా' అనేదట. "వగలాడి నీకెందరే మగలు? అంటే తొలి మగనితో తొంబైతొమ్మి" దని పరిహసిస్తూ ప్రతిఘటనను స్వేచ్ఛగా వినిపించేది.

బయటకు పోతే స్త్రీకి రక్షణ తక్కువ అనేది తెలుసు. 'భర్త చచ్చి ఏడుస్తుంటే మిండడొచ్చి రాళ్లు రువ్వే' సమాజంలో స్త్రీ బ్రతకటం కష్టం అయినా ఆ ఇంట

గడప దాటి కుటుంబాన్ని బద్దలు చేయాలనుకునేంతగా తన చైతన్యం నింపుకుంది. భవిష్యత్తులో ఒక వేళ మళ్ళీ పెళ్ళి చేసుకున్నా కూడా ఆ భర్త మగవాడే అనీ అతడు కూడా తనను అదుపులో పెట్టటం జరుగుతుందని తెలుసు. కాని తన స్వేచ్ఛను వదులు కోకపోయేది. తాను రెండో పెళ్ళిచేసుకుంటే అతడు కూడా 'రోజూ మొదటి మొగడి ముచ్చట్లనే' అడిగేవాడు. నిజంగా మొదటి భర్తను మరిచిపోవటానికి స్త్రీ రెండో వివాహము చేసుకుంటుంది. కాని రెండో భర్త దగ్గర ఆమెకు మొదటి మొగడే నయమనిపించే పరిస్థితి ఏర్పడుతుంది. ఆధునికకాలంలోని వితంతు వివాహాలు, విడాకుల పునర్వివాహాలు జరిగినప్పుడు భర్తలో కలిగే పితృస్వామ్యపు అనుమాన బీజాలు ఉండటంతో అతను అనుమానించేసరికి స్త్రీ తన 'పాతివ్రత్యం గురించి నా మొదటి పెనిమిటిని అడగమనేది'. 'ముక్కు కోసినా మొదటి మొగుడు మేలు' అని ద్వితీయ భర్త మీద తన అభిప్రాయాన్ని నిష్కర్షగా, నిజాయితీగా, ధైర్యంతో చెప్ప గలగింది స్త్రీ. అవసరమైతే నోరు పెట్టుకు బ్రతకాలనుకుంది.

పాత సామెతలలో స్త్రీలు సమిధలైతే ఆ మంటల వెలుగులే ఆధునిక కాలపు స్త్రీల చైతన్యపు జ్వాలలుగా మారాయి. పరిణామం చెందిన సామాజిక చలన సూత్రాల కనుగుణంగా స్త్రీల చైతన్య స్థాయి పెరగటం, చదువు, ఉద్యోగం, ఆర్థిక స్వావలంబన దిశగా అడుగులు వేస్తున్న ఈ తరుణంలో స్త్రీల స్థాయిని తగ్గించే పాత చింతకాయ వంటి సామెతలకు చోటు ఉండ కూడదు. ఆధునిక మహిళ చరిత్రను తిరగవ్రాస్తుంది కాబట్టి సామెతలు కూడ తిరగబడితే 'ఆడ పద ప్రయోగం దగ్గర మగ' అనే మార్పు చేస్తేనే ప్రజాస్వామ్యపు విలువలు అర్థం అవుతాయి. ఆధునిక స్త్రీల విషయంలో పాత సామెతలు వాడితే పప్పులుడకకపోగా ప్రజాస్వామ్యంలో జీవించే స్త్రీల ప్రతిఘటనా చైతన్యం మరింతగా విజృంభిస్తుంది. తస్మాత్ జాగ్రత్త'– ఆడమగ సమానమే, పిల్లలను పోషించి సమాజానికి మంచి పౌరులను అందించే ఆడవాళ్ళు మరింత సమానమనే సామెతలు పుడ్తాయి.

*– ఆంధ్రప్రభ దినపత్రిక – సాహితీ గవాక్షం 10.06.2018.*

## 19. 'శమంతకమణి'లో సతీమణులు

ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు 2018 సంలో వ్రాసినది ఈ 'శమంతకమణి' అనే ఆధునిక తెలుగు పద్యకావ్యం. భాగవతం లోనూ, వినాయక వ్రత కథలోనూ ప్రసిద్ధమైన శమంతకమణిని గురించిన కథ ఆబాలగోపాలానికి తెలుసు. కవి శమంతకమణి వృత్తాంతాన్ని నిస్సందేహపూరితంచేస్తూ నవీకరించి, నవరసకాంతులను ప్రతిఫలించే 'సమష్టిమణీంద్రం'గా వ్రాసి "సతీమణుల శక్తికేంద్రం" గా వారసత్వపు 'శమంతకమణి'ని తీర్చిదిద్దారు.

ప్రసిద్ధేతివృత్తంగల ఈ 'శమంతకమణి' అనే కావ్యం పంచమాశ్వాస భరితము, భాగవతంలోని ఇతి వృత్తాంతాన్ని గ్రహించి నేటి స్త్రీల శక్తి యుక్తులను శమంతకమణి కాంతులతో ప్రతిఫలింపజేయటం నవీకరణ. నారదుని సమక్షంలో సముద్రుడు శమంతకమణిని ఇస్తూ దానియొక్క గొప్పతనాని చెప్పి దానిని యోగ్యుల దగ్గర వుంచాలనేసరికి కృష్ణుడు దానిని సత్రాజిత్తుకు ఇప్పిస్తాడు. ఆ తర్వాత ఆ మణిని సత్రాజిత్తు తమ్ముడు మెడలో వేసుకొని వేటకు వెళ్ళగా మణిని మాంసఖండమని భావించిన సింహం అతడ్ని చంపటం, ఆ సింహాన్ని భల్లూకం చంపి ఆ మణిని తన గుహలో భద్రంగా ఉంచడం జరిగింది. అయితే ఈలోపు సత్రాజిత్తు కృష్ణుని సందేహించి నింద వేయటం, ఆ నిందను పోగొట్టుకోవటానికి కృష్ణుడు మణిని అన్వేషించే క్రమంలో జాంబవతిని చూడటం జరుగుతుంది. ఆమె కృష్ణునితో మల్ల యుద్ధానికి ముందుకు రాగా ఇద్దరి మధ్య మన్మథ

బాణములు పడటంతో ప్రేమచిగురించి ఆ పోరాటం వీగిపోతుంది. ఆ తర్వాత కృష్ణుడు జాంబవతి ఉన్న గుహలోకి వెళ్ళి మణిని చూసి తీసుకోబోతుంటే జాంబవంతుడు వచ్చి పోరాడటం, జాంబవంతుడు అలసిపోయి చివరకు త్రేతాయుగంలో ఉన్న రాముడితో తాను యుద్ధం చేయాలని కోరుకోవటాన్ని గుర్తుకు తెచ్చుకొని ఈ పోరాటానికి అదే కారణం అని కృష్ణుడితో చెబుతాడు. అంతేగాక మణితో పాటు తన కూతురైన జాంబవతిని ఇచ్చి పెళ్ళి చేస్తాడు. ఆ మణిని కృష్ణుడు సత్రాజిత్తుకుఇస్తాడు. ఆ తర్వాత సత్రాజిత్తు సత్యభామను కూడా కృష్ణునికిచ్చి పెళ్ళి చేయటం జరుగుతుంది.

సత్యభామను పెళ్ళాడాలనుకొని భంగపడిన శతధన్వుడు సత్రాజిత్తుని చంపి ఆ మణిని కాశీలో ఉన్న అక్రూరుని దగ్గర దాచటం దానిని తెలుసుకొన్న బలరామాకృష్ణులు శతధన్వుని జాడ తెలుసుకోవటం కృష్ణుడు ఎడారిలోకి వెళ్ళిన శతధన్వుని చంపటం జరిగింది. కాని కృష్ణునికి శతధన్వుని దగ్గర మణి కన్పించలేదు. కృష్ణుడు శతధన్వుని చంపి మణి ని తీసుకురానందుకు బలరాముడు కృష్ణుని సందేహించి తాను జనకుని దగ్గరకు వెళ్తాడు. జనకుని దగ్గర ఉన్నప్పుడు బలరాముడు బంగారు కొమ్ములుగల ఆవును మేపేవ్యక్తియైన అక్రూరుని గుర్తించి అతని వలన శమంతకమణి కాశీలో ఉన్నట్లు గ్రహిస్తాడు. శమంతకమణి ఇచ్చిన బంగారాన్ని అక్రూరుడు దానధర్మాలకై వినియోగించాడు. ద్వారకలో అనావృష్టి ఏర్పడటంతో వర్షాలకై వృష్ణివంశజుడైన అక్రూరుని ద్వారకకు పిలిపిస్తాడు. అతడు మణిని శతధన్వుడు తన దగ్గర ఉంచిన విషయాన్ని చెప్పాడు. మణిని తనదగ్గర ఉంచుకున్నందుకు తనను శిక్షింపమని అక్రూరుడు అడిగినప్పుడు తప్పు తెలుసుకొని పశ్చ్యాత్తాప పడుటమే పెద్దశిక్ష అని సత్ప్రవర్తనతో స్వార్థరహితుడుగా ఉన్నందుకు శిక్షనుండి అతనిని తప్పిస్తున్నట్లు చెప్పటంతో శమంతకమణి చుట్టూ అల్లిన కథ ముగుస్తుంది.

కావ్యంలోని స్త్రీల పాత్ర చిత్రీకరణ చాల నూతనంగా ఉంటుంది. మహాపతివ్రత అని మాత్రమే పోతన భాగవతంలో తెలిసిన రుక్మిణికి చదరంగం, ఈత గొట్టే విద్యలు తెలుసనిచెప్పటం(4-89, 90, 91) నూతనత్వం.

*చతురంగంబుననెంతటి*
*చతురత భైమిది శకటును సాప్తియుఁజాలున్*
*ప్రతిరాజు ను బంధించును*
*సతతమ్మేనోడిపోయి సంబరపడుటే?* *(4-89)*

*జలకాలాడుటయందును*
*జలజాయత నేత్రకెంత చాతుర్యంబో*
*జలమున నీకొసమునుగుం*
*బలువడి నాకొసనుదేలు మఱునిముసానన్?* *(4-90)*

*నిరతము జపములుఁ దపములు*
*నిరతము గౌరమ్మ పూజ నియమావళుల*
*త్తరుణీ మణితో సహసం*
*చరణమ్మది నిత్య నూత్నసంసరణంబే?* *(4-91)*

అలాగే సత్యభామ యొక్క ధనుర్విద్యను ఎర్రన, పోతన రచనలలో తెలిసినా సంగీత సాహిత్య కోవిదురాలుగాను పలు భాషవేత్త అని (4-92, 93, 94) చెప్పటం ఈ కావ్యంలో అదనపు కొత్తదనాన్నిచ్చింది.

*సత్యాదేవికిఁగలవై*
*యాత్యంబులనెన్నఁదరమె యభినయమును సా*
*హిత్యము సంగీతమ్మును*
*నృత్యముఁబలు భాషలాడు నేర్పరితనమున్ -* *(4-92)*

*క్రీడల సాత్రాజితికై*
*వాడము వీక్షించి తీరవలయుసుమా? పూ*
*బోడికి నిష్వసి విద్యా*
*ప్రౌఢలనేనైన సాటివత్తునొరానో?* *(4-93)*

*గారాబముగాఁ బెరిగిన*
*నారీమణి సత్యభామ నాపై నెపుడం*
*గారము గురియునొ లలి శృం*
*గారమ్మొలికించునొ పసికట్టుగనౌనే?* *(4-94)*

ముఖ్యంగా ఆదివాసి స్త్రీగా జాంబవతిని భావించి ఆమెను యుద్ధ క్రీడా నిపుణురాలుగానూ, వృక్ష, లతికా, మృగ భాషావేత్తగాను, చిత్రకళా నిపుణురాలుగా నవీకరణ చేసి (4-95, 96, 97) వర్ణించటం కావ్యానికి అదనపు ప్రయోజానాన్ని సిద్ధింపజేసింది. కావ్యంలో రుక్మిణి, సత్యభామలు నగర స్త్రీలుగా తమ వ్యక్తిగత చైతన్యాన్ని శక్తిని చూపించగలిగారు కాని అడవిలోని గుహలలో ఆదివాసి స్త్రీగా పెంచబడటంతో ఆమె తనలాంటి వనితలను కూడగట్టుకొని సైన్యాన్ని తయారు చేసుకోవటం సాముహిక ఆదివాసి స్త్రీల శక్తియుక్తులను ప్రతిఫలింపజేయటం నవీకరణ.

*చిత్తరువులు వేయుటలో*
*నత్తెరవకు జాంబవతికి నన్యులు సరియా?*
*యెత్తరి గోడల పైనెవా*
*మెత్తును పలు రంగులద్ది మెఱియను బొమ్మె (4-95)*
*యుద్ధ క్రీడాకళలను*
*నద్దీరయు సిద్ధహస్త, నాతిమృదులయీ*
*షద్దాన సమంచిత తాన*
*యుద్ధలు జూపించు చుంటనుపగూఢమునన్ (4-96)*
*తరువుల లతికలసుమనో*
*భరముల మౌనోక్తలు ఖగవనమృగభాషల్*
*గఱచిన విదుషీయగుసతితో*
*సరసోపవనీనిహృతికి సరియవ్వరుటే'* అంటూ (4-97)

జాంబవతి యొక్క వనమృగ భాషావిద్యలే శమంతకమణి అన్వేషణకు ఆయువు పట్టుపు వంటిగా చెప్పటం జరిగింది. దానిలో భాగంగా మణిని తస్కరించిన శతధన్వుడు ఎడారిలోకి వెళ్ళిన విషయాన్ని ఆమె తెలియజేయటం శమంతకమణి కావ్యంలో పతాక స్థానాన్ని వహించింది. నేటి క్రీడారంగంలోని స్త్రీల నిపుణతను పురాణస్త్రీలకు ఆపాదింపచేసి కథలో జాంబవతిని యుద్ధ క్రీడా

నిపుణిరాలుగాను అడవిలో ఉండే ఆదివాసిలకు తెలిసే వనమృగ భాషలను జాంబవతికి తెలిసివట్లుగా చెప్పటం అంటే ఆదివాసి స్త్రీలకు పెద్దపీట వేయటమే. కథలో స్త్రీ పాత్ర ప్రాముఖ్యతను పెంచటం జరిగింది. అంతేకాదు కృష్ణుని భార్యలందరూ సమవుజ్జీలే అని తెలిసింది. ఒకరి కొకరు ఎవరు తక్కువ కాదని చెప్పటం జరిగింది. అయితే రుక్మిణి, సత్యభామలు నగర స్త్రీలుగా చెప్పబడితే జాంబవతి ఆదివాసి స్త్రీగా పాఠకులకు కనపడటం, అలా అడవిలో ఆ మూల గుహలలో అగృహీతంగా ఉన్న స్త్రీల శక్తి యుక్తులను వారి తెలివి తేటలను జాంబవతి పాత్రద్వారా వెలుగులోకి తేవాలనుకోవటంతో, అంతకుపూర్వ మెన్నడులేని జాంబవతి పాత్రకు ఈ కావ్యంలో ప్రత్యేక గుర్తింపు తెచ్చింది. అదే ఈ కావ్యం యొక్క నవీకరణ లోని గొప్పదనం. జాంబవతి చెలికత్తెలచేత ఈలలు వేయించటం పితృస్వామ్య సమాజనికి ఇక స్త్రీ,పురుష అసమానత్వం ఇక చెల్లదంటూ

*"వీరవనితలే యీలలు వేసినారు*
*చతురగతులను జప్పటుంచ్ జరిపినారు"* (2-87)

హెచ్చరిక చేయటం జరిగింది. జాంబవతి గుహలో ప్రవేశించిన కృష్ణునితో 'నీయత్తారిల్లా, అమ్మమ్మ యిల్లా' అంటూ తెలుగు నుడికారాలతో ప్రశ్నించటం ఆత్మీయతను కలిగిస్తుంది.

జాంబవతిని చూసిన కృష్ణుడు 'మీననయనా' అని సంబోధిస్తే 'మీనకేతనా' అని కృష్ణుడు సంబోధించేటట్లు (2-95) చేస్తూ

*అంసభాగానఁ జిబుకంబు నాన్చి యతడు*
*వేడి యూర్పుల గిలిగింత వెట్టుచపుడు*
*"భళిర! మీననయన" యంచుఁ బలవరించెఁ*
*బడతి "మీనకేతన" యంచు బరవశించె"* అనటం

వారి శృంగార భావాలకు సంకేతంగా మీనాంకధ్వజుని జెండాని రెపరెప లాడించేటట్లు చేయటం చేయితిరిగిన కవికిమాత్రమే సాధ్యం.

నేటి స్త్రీల వివాహవయసు 18 ఏండ్లు ఉండాలి కాబట్టి జాంబవతి 18 ఏండ్ల ప్రాయం వచ్చేటట్లు చేయటంలోని ఆధునికతతోబాటు, తోడేలుకు అందమైన జాంబవతి కూతురుగా ఉండటం ప్రకృతి విరుద్ధం కాబట్టి ఆ సందేహాన్ని తీరిస్తూ ఆమె తులసి వనంలో లభ్యమైన లక్ష్మీ రూపిణిగా చేసి గోదాదేవికి మాతృకగా తలపింపజేసారు. లౌకిక వ్యవహారంలో పెంచి పిల్లనిచ్చి పెళ్ళి చేసిన తల్లికి అత్తచీరపెట్టి సరిపెడ్తారు కాని కృష్ణుడు జాంబవతిని పెంచిన దాదికి శిశువై (4-135)

*యశోద యొడిభాగ్యమె భాగ్యము! కన్నతండ్రి! నా*
*యొడికి నొసంగదే మగ శిశూత్తము నెత్తిన యట్టిభాగ్యమున్!*

మోక్షమిప్పించి అల్పపాత్రకు గొప్పదనాన్ని ఆపాదించటం అంతరాంతరాలోని సంస్కారాన్ని తట్టి లేపుతుంది.

తెలుగు సాహిత్యంలో ఎర్రన హరివంశంలోనూ, పోతన భాగవతంలోను నగరవాసియైన సత్యభామను వీరనారిగా సృష్టిస్తే, రామబ్రహ్మంగారు అడవిలో ఉన్న జాంబవతిని యుద్ధనిపుణరాలుగా, మహిళా సేనానాయకిగా జైమిని భారతంలోని ప్రమీలను తలపిస్తూ చిత్రించటం అంటేనే అట్టడుగున చీకట్ల నుంచి ఆదివాసీ స్త్రీల శక్తియుక్తులను వెలుగులోకి తెచ్చేటట్లు చేయటంగా భావించవచ్చు, ఆధునిక మహిళాసైన్యానికి మరింత స్ఫూర్తినిచ్చే విషయంగాను 'శమంతకమణి'కి మరింత వన్నెను చేకూర్చటంగాను భావించవచ్చు.

*- మిసిమి మాసపత్రిక-జనవరి 2019.*

## 20. మహిళా యాజమాన్య సామర్థ్య నిర్మాణం - సాహిత్య ప్రతిఫలనాలు

1990 దశకంలో అభివృద్ధి చెందుతున్న దేశాలలో మానవాభివృద్ధి ఆశించినస్థాయిలో లేదనే విషయం మానవాభివృద్ధి సూచిక వల్ల స్పష్టం అయింది. అందుకని ఐక్యరాజ్యసమితి మానవ జీవన ప్రమాణ స్థాయిలో అభివృద్ధి జరగాల్సిన అవసరాన్ని గుర్తించింది. మహిళాభివృద్ధి కారకమైన మహిళా సాధికారికత మరింతగా తక్కువ స్థాయిలో ఉన్నట్లు జండర్ రిలేటెడ్, ఉమెన్ ఎంపవర్ మెంట్ సూచికలు తెలియ జేసాయి దీనికి ప్రత్యామ్నాయంగా ఐక్య రాజ్య సమితి అభివృద్ధి కొరకు ప్రణాళికను రూపొందిస్తూ "అభివృద్ధి జరగాలంటే సామర్థ్యాల వృద్ధి అవసరమని" పేర్కొంది. అందుకే సామర్థ్యనిర్మాణం అనేది ఒక సామాజికాభివృద్ధికి సంబంధించిన సిద్ధాంతంగా పరికరంగా పరిశోధనగా ప్రతిపాదించబడిన అంశం అయింది. విద్య ఆరోగ్యం ఆదాయార్జనలను ప్రధానాంశాలుగా చేసుకుని మానవాభివృద్ధి సూచికలో దేశాల స్థాయి నిర్ణయింప బడుతుంది మానవుల ఆరోగ్య ప్రదమైన జీవనాన్ని, వారి సృజనాత్మక వికసనాలను ఆధారంగా చేసుకుని మానావాభివృద్ధి సూచికలో దేశాల స్థాయి నిర్ణయింప బడుతుంది. మానవులు ఆరోగ్య ప్రదంగా వుంటేనే సృజనాత్మక వికసనం గల గౌరవప్రదమైన దీర్ఘకాలిక జీవనకాల ప్రమాణాన్ని అనుభవించే అవకాశాలు వుంటాయని అటువంటి మానవాభి వృద్ధి జరగాలనీ ఐక్యరాజ్యసమితి

భావించింది. అయితే ఈ జీవన అవకాశాలు ఆయా దేశాల ఆర్థికాభివృద్ధి మీద ఆధారపడి వుంటాయి. దానికై ప్రపంచ బ్యాంకు సహకారంతో ఆర్థిక పెట్టుబడిదారి విధానం గల ఉత్పత్తులకు ప్రపంచీకరణ అంతర్జాతీయ మార్కెట్లకు అవకాశం కల్పించింది. ఈ సందర్భంలో జరిగిన దేశాల ఆర్థిక పునర్వ్యవస్థీకరణ క్రమంలో ఎగుమతి దిగుమతుల విధానంలో వచ్చిన సరళీకరణ, చోటు చేసుకున్న ప్రైవేటీకరణల ఫలితంగా వాణిజ్యరంగంలో ఉనికిలోకి వచ్చిన 'గ్యాట్' ఒప్పందం ఉత్పత్తి విధానంలో పెనుమార్పులు తీసుకొని వచ్చింది.

ఉత్పత్తి శక్తులు మారినప్పుడల్లా ఉత్పత్తి సంబంధాలలో మార్పు రావటం, తత్ఫలితంగా మానవ జీవితాలను ప్రభావిత చేసే ఆర్థిక రాజకీయ సామాజిక చలన సూత్రాలలో కూడ పరిణామం చోటు చేసుకోవటం అనేది చారిత్రిక వాస్తవం. ఇది అందరికీ తెలిసిన విషయమే. నిరంతర పరిణామ శీలమైన సామాజిక చలన సూత్రాల కనుగుణంగా మెరుగైన జీవన విధానం కోసం ఎప్పటికప్పుడు సామర్థ్యాలను పెంచుకోవల్సిన అవసరము ఏర్పడుతుంది. ఏ దేశాల ఆర్థికస్థాయి అయినా ఆయా దేశాలలోని మహిళల జీవన స్థాయిని బట్టి ఉంటుందని భావించటంతో మహిళాభివృద్ధికి, మహిళా సాధికారికతకు బాటలు పడ్డాయి. అవి బీటలు వారకుండా వుండాలంటే మహిళలు నైపుణ్యాలను పెంచుకునే దిశగా వారి సామర్థ్య నిర్మాణం జరగాలి.

వ్యక్తులు, సంస్థలు, సమాజాలు వారి కార్యనిర్వహణ సామర్థ్యాన్ని పెంచుకుంటూ సమస్యలను పరిష్కరించుకుంటూ నిర్దేశిత గమ్యాలను చేరుకునే విధంగా లక్ష్యాలను నిర్ణయించుకుంటూ నిరంతరం ముందుకు సాగటమే సామర్థ్యనిర్మాణంగా ఐక్యరాజ్యసమితి భావించింది. సామాజిక చలనసూత్రాల మార్పులకు అనుగుణంగా వ్యక్తులు తమకున్న పరిజ్ఞానాన్ని నైపుణ్యాన్ని పెంచుకుంటూ సామాజికాభివృద్ధిలో భాగస్వాములు కాగలిగే అవకాశాలు కలిగివుండటమే వ్యక్తి పరమైన సామర్థ్య నిర్మాణంగా భావించటం జరిగింది. అందుకే ఇది ఒక నిరంతర ప్రక్రియ. సామర్థ్యాలనిర్మాణానికి మహిళాభివృద్ధికి పరస్పర సంబంధం ఉంటుంది అప్పుడే స్త్రీలు నిర్ణయాత్మక పాత్రలో ఉండగలిగి

యాజమాన్యనిర్వహణ చేయగల ఉన్నతపదవులను చేరుకోగలుగుతారు తత్ఫలితమే మహిళాభివృద్ధి. మహిళాభివృద్ధి దానంతట అదే మహిళా సాధికారికతకు దోహదం కాగలుతుంది. అందుకే ఐక్యరాజ్యసమితి 2000 సం॥ను అంతర్జాతీయ మహిళా సాధికారికతా సంవత్సరముగా ప్రకటించింది. అయితే దారిద్రంతో పాటు స్త్రీ–పురుష అసమానసంస్కృతి మహిళాభివృద్ధికి పెను సవాలుగా నిలిచింది. ఆదాయార్జన వుంటే మహిళల దారిద్ర్యం తీరుతుందని భావించటమే కాక సామర్థ్యపు దృష్టి కోణంలో కూడా ఆలోచించి మానవ జీవనాభివృద్ధికున్న అవకాశాలను మహిళల అనుభవించటానికి వీలులేని పరిస్థితులు కూడా వున్నాయని ఆర్థికనిపుణులు భావించారు. ప్రాధమిక అవసరాలు తీరటంతో పాటు తమ జీవితాన్ని ప్రభావితం చేసే సామాజిక ఆర్థిక, రాజకీయ, విధాననిర్ణయాలలో పాలు పంచుకునే భాగస్వామ్యం, వ్యక్తిగత భద్రత మహిళలకు వుండాలని భావించటం జరిగింది. ముందుగా స్త్రీ–పురుష అసమానతల్ని నిర్మూలించాల్సిన అవసరాన్ని గుర్తించి 1991లో అంతర్జాతీయ బాలికా సంవత్సరాన్ని ప్రకటించింది. ఆ క్రమంలోనే 1994 లో పంచాయితీరాజ్ లలో స్త్రీలకు స్థానిక సంస్థలలో 33% రిజర్వేషనును కలిపించింది అయినా ఆశించిన స్థాయిలో మహిళాభివృద్ధి జరగలేదు దానికి కారణం స్త్రీలు పితృస్వామ్య సంస్కృతిని ఎదిరించగల చైతన్య స్థాయిలో లేక పోవటమే అని సమాజ పరిశీలనలో తేట తెల్లమయింది.

సామాజిక చైతన్యం కలిగించగల శక్తి సాహిత్యానికి వుంటుంది. సామాజిక వాస్తవ జీవితాన్ని ప్రతిబింబించగల కథానికా సాహిత్యానికి ఆ శక్తి మరింతగా వుంటుంది. అందుకని మహిళా సమస్యల పట్ల నిబద్ధతగల మహిళా రచయితల కథానికలను పరిశీలించటం జరిగింది. కొండవీటి సత్యవతి రాసిన “మొదటి ఆడుగు” అనే కథలో స్త్రీలు సామాజిక అభివృద్ధికి పాటూ పడాలనుకునే క్రమంలో రిజర్వేషన్ సౌకర్యాన్ని వాడుకుని ఆ గ్రామ సర్పంచిగా పదవిని పొందుతారు. అప్పటి వరకు ఆ అధికారాలను అనుభవించటానికి అలవాటు పడ్డ సర్పంచుల భర్తలు పంచాయితీ అభివృద్ధికి సంబంధించిన విషయాల వివరాలను

చెప్పకుండానే చెక్కుల మీద సంతకాలు పెట్టించుకుంటూ వాళ్ళు బయట కాలు పెట్ట కూడదనే ఆంక్షలు పెడతారు. అంతేగాక ఆ మండలములోని అన్ని పంచాయితీలలోను మండల స్థాయి మహిళాచైర్మెన్‌ల పరిస్థితిలోను వారి వారి భర్తలే అధికారాలను అనుభవిస్తూ భార్యల మీద ఆంక్షలు పెడతారు. అయితే పర్యవేక్షణకు వచ్చిన అధికారిణి ఆ మహిళాసర్పంచులను పంచాయితీ ఆఫీసుకు వెళ్ళి గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొనాలనీ, మహిళా సమస్యల పరిష్కారానికై నిర్ణయాలు తీసుకోవడానికి ఆవూరి మహిళలనుకూడా భాగస్వాములు చేస్తూ సమావేశాలు జరపాల్సిన కర్తవ్యాన్ని ఒకమహిళా సర్పంచికి సూచిస్తుంది. ఆమె తోటి మహిళాసర్పంచులను కలుపుకొని పితృస్వామ్య అధికారాన్ని సామూహిక శక్తితో ఎదుర్కొని, సర్పంచి పదవులను బాధ్యతాయు తాంగా నిర్వహిస్తూ తమసామర్థ్యాన్ని నిరూపించుకోవాలనే నిర్ణయానికి వస్తారు.

ఈ కథలో స్త్రీలు గౌరవ ప్రదమైన స్వతంత్ర జీవనం చేసే అవకాశం లేనట్టునూ దానికి స్త్రీ–పురుష అసమానతలే ప్రధాన కారణంగానూ కనిపిస్తుంది. ఈ కథలో మహిళాభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించడానికి మహిళలను భాగస్వాములను చేసే విధంగా సమావేశాలలో పాల్గొని సర్పంచిపదవిలో కథానాయిక పాత్ర వహించగలిగే నాయకత్వ లక్షణాలను ఏర్పడే విధంగా ప్రోత్సహించటం, వారిని చైతన్యపరచి క్రియాశీలులుగా చేయటం మహిళా యాజమాన్య సామర్థ్య నిర్మాణమే. అందుకే ఈ సందర్భగా నోబెల్ బహుమతి గ్రహీత అయిన అమర్త్యసేన్ మాటలు గుర్తుకు రాక మానవు "కుటుంబ వస్తు సముదాయాన్ని వనరులను స్త్రీ పురుషుల ఎంత పరిమాణాన్ని వినియోగించు కుంటున్నారనేది కాక మానవ జీవనానికి అత్యంత సహజము కీలకము అయిన ఆరోగ్యమైన గౌరవప్రదమైన జీవనం కలిగి సృజనాత్మక శక్తుల వికాసం వంటి అవకాశాలను వారు అనుభవించటంలోని అసమానతలను పోల్చిచూడటం ద్వారానే స్త్రీ పురుష అసమానతలను బాగా అర్థంచేసుకోవచ్చునీ, వారు అనుభవించే స్వాతంత్ర్యాల భిన్నత్వాన్నికూడా అది గోచరింపచేస్తుందని అమర్త్యసేన్ చెప్పిన మాటలు చిరఃస్మరణీయాలు. కుటుంబంలో స్త్రీ–పురుష సమానతను కోరుకుంటూ 1995 లో అంతర్జాతీయ కుటుంబ సంవత్సరం వచ్చింది.

నల్లూరి రుక్మిణి రచించిన "గెలుపు బాట" అనే కథలో స్థానిక సంస్థలలో స్త్రీల నిర్ణయాత్మక పాత్రను బలోపేతం చేయటంతో పాటు రాష్ట్ర జాతీయ స్థాయిలోని రాజకీయ రంగాలలో కూడా స్త్రీలు భాగస్వాములు కావలనుకుంటుంది ఒక స్త్రీ. అభివృద్ధికి ఎంత పాటుపడినా ఒక స్త్రీ జాతీయస్థాయి పార్టీ వ్యక్తులతో ఇంగ్లీషులో గాని హిందీలో గాని మాట్లాడి వారిని ఒప్పించి టికెట్టు ఇప్పించుకోలేక పోతుంది. ఇంగ్లీషులో మాట్లాడగల సామర్థ్యంగల మరొక ఆమెకు ఆ సీటు ఖాయమయ్యే సరికి తనకు టిక్కెట్టు రాకపోవటానికి ఇంగ్లీషులో మాట్లాడే నైపుణ్యం తనకి లేదని భావిస్తుంది. టికెట్టు రాకపోవడానికి కేవలం ఇంగ్లీషు రాకపోవటమే కాక మధ్య తరగతి నుండి వచ్చిన తాను డబ్బును పెట్టి ఆ సీటును కొనుక్కోలేకపోవటంతో పాటు రాజకీయ రంగంలో అండదండలు లేక పోవటంగా కూడా కారణమని భావిస్తుంది. అంతేగాక ఆమె భర్త ఇంగ్లీషు టీచరుగా ఊళ్ళో వాళ్ళందరికి ఇంగ్లీషు నేర్పుతున్నా భార్య మీద గ్రిప్ పోవటం ఇష్టం లేక అతడ్ని తాను ఆడిగినా ఇంగ్లీషు నేర్పనందుకు కోపం వచ్చి బయటకు వెళ్ళి ట్యూషను చెప్పించుకుని ఇంగ్లీషులో మాట్లాడే సామర్థ్యాన్ని పెంచుకుంటుంది. సామర్థాల పెంపులో భాగంగా సాంకేతిక అంతర్జాలంతో అనుసంధానము జరిపి పరిజ్ఞానాన్ని పెంచుకోవటానికినీ ప్రపంచ వ్యాప్తంగా ఎప్పటికప్పుడు మారుతున్న సామాజిక చలన సూత్రాలను అవగాహన చేసుకునేందుకు ఇంగ్లీషుతో పాటు కంప్యూటర్ సాంకేతిక సమాచార జ్ఞానాన్ని పెంచుకోవటం కూడా సామర్థ్య నిర్మాణంలో భాగం అయింది. అంతేకాదు దానికి ఆటంకమైన పితృస్వామ్య సంస్కృతిని ఆచరించే భర్తను అధిగమించే సామర్థ్యాన్ని కూడా పొందిందని అర్థమవుతుంది.

ప్రపంచీకరణ సందర్భంలో వ్యాపార సంస్థల నిర్వహణకు అవసరమైన మేనేజుమెంటు అకౌంటింగ్, ఫైనాన్సు కంప్యూటర్ నందు ఉన్నతస్థాయి నైపుణ్యపు విద్యలు అవసరమయ్యాయి. ఆ విద్యా పరిజ్ఞానం లేకపోతే ఉద్యోగాలు రావటం కష్టం అయినప్పుడు కుటుంబ పోషణకై స్త్రీలు తక్కువ ఆర్జనల గల లేబరు మార్కెటుకైనా వెళ్ళటం జరుగుతుంది. కొంతమంది అమ్మాయిలైతే అందాన్ని

అర్హతగా చేసుకుని పర్యాటక రంగంలో గైడ్‌లా స్థిరపడటం కూడా జరిగింది. విదేశీ పెట్టుబడులను ఆకర్షించే క్రమంలో అభివృద్ధి పరచిన పర్యాటక రంగంలో విదేశీయుల లైంగికానుభవాలకు వీలుగా సాలభంజికల వంటి అమ్మాయిలను నియమించే విషయాలను ప్రతిఫలిస్తు వచ్చిన కథ కుప్పిలి పద్మ వ్రాసిన 'సాలభంజికలు'. పేదరికంలో నైపుణ్యాన్ని పెంచే విద్యలను, చదవలేక అమ్మాయిల కుటుంబ పోషణకై పర్యాటక రంగంలో గైడ్స్ లాగ వుద్యోగాన్ని పొందుతారు. అందమైన అంజలి తన అందమే అర్హతగా, ఆత్మ గౌరవాన్ని భంగపరచినప్పటికీ తప్పని పరిస్థితులలో ఆవృత్తిని కొనసాగిస్తూచివరకు ఎయిడ్స్‌బారినపడి చనిపోతుంది. అంటే ఆరోగ్యప్రదంగా జీవించేహక్కును కూడా అంజలి కోల్పోయిందని అర్థం అవుతుంది. వ్యాపారసంస్థలలో గౌరవప్రదమైన ఉద్యోగం చేసే నైపుణ్యాలను ఆమె అభివృద్ధిచేసుకునే అవకాశాలు ఆమెకు లేకపోవటమే ఆమె చావుకు మూల కారణాలుగా భావించవచ్చు.

ప్రభుత్వ ప్రైవేట్ రంగాలలో మేనేజిమెంటు పదవులలో టాప్ ఎగ్జిక్యూటివ్‌లు గానూ, సీనియర్ మేనేజర్లు గానూ, ట్రేడ్ యూనియన్ల లోనూ నిర్ణయాత్మక పదవులలో స్త్రీలు తక్కువగా ఉన్నారనే విషయాన్ని ఉన్నతస్థాయి ఉద్యోగినుల చిట్టా తయారు చేసే ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ పేర్కొంది. కార్పొరేట్ కల్చర్ కారణంగా గ్లాస్‌సీలింగ్ ఏర్పడటమే దానికి కారణంగా భావించటం జరిగింది అంటే బోర్లించిన గాజుపలక నుండి వస్తువును చూపినప్పుడు అది గాజు పలక అంచును తాకినట్లు కనపడుతుంది. కానీ అది గాజు పలకను తాకదు. అలాగే కార్పొరేట్ కల్చర్ వారిని ఉన్నత పదవులకు చేరుకోనీయదని భావించేటట్లు చేస్తుందనీ 'వాల్‌స్ట్రీట్' జర్నల్ గ్లాస్‌సీలింగ్ విధానాన్ని పేర్కొనటం జరిగింది.

తక్కువ వనరులు ఉన్నప్పుడు కూడా మహిళ తన నైపుణ్యంతో ఇంటిల్లిపాది వారిలో కొట్లాటలు, అసంతృప్తులు లేకుండా సమన్వయ పరచి సంతృప్తి పరచే విధంగా చేయగలగుతారు. రెండు షిఫ్టుల పనితో గృహ నిర్వహణ బాధ్యతలో సఫలీకృతం కాగల స్త్రీలు వృత్తి నైపుణ్యాన్ని పెంచుకోగలరనీ సహజంగానే సహనం,

సమన్వయీకరణ శక్తిగల మహిళలు కార్మిక సంబంధ నిర్వహణ సమస్యలను అక్కడి కక్కడే పరిష్కరించ గలరనీ ఉత్పత్తి నైపుణ్యపు పెంపు స్త్రీలలో అధికంగా ఉంటుందని ఈ మధ్య కార్పొరేట్ సంస్థలు భావించటం జరిగింది. వ్యాపార రంగంలో కాలవ్యవధి, వనరులు తక్కువగా ఉన్నప్పుడు  వాటిని లాభదాయకంగా వినియోగించే నైపుణ్యం (Time Management, cost effectiveness, cost optimization) స్త్రీలకు మాత్రమే వుంటుందని భావించి కార్పొరేట్ సంస్థలు ఉన్నత యాజమాన్యపు పదవులను స్త్రీలకు ఇవ్వటం ప్రారంభించాయి.

ఈ విషయాన్ని ప్రతిఫలిస్తూ వచ్చిన కథ కుప్పిలి పద్మ వ్రాసిన 'ఆకాంక్ష' అనే కథ. కంప్యూటర్ నైపుణ్యం, సంభాషణాచాతుర్యంతో ఎదుటి వారిని ఒప్పించి గల సామర్థ్యం కల ఆకాంక్ష అనే అమ్మాయి ఒక మార్కెటింగ్ సంస్థలో డి.జి.యం. క్రింద పని చేస్తూ వుంటుంది. ఈమెలోని సామార్థ్యాలను తన జి.యమ్. ప్రొమోషన్ కోసం ఉపయోగించుకోవాలని ఆలోచించిన ఆ వ్యక్తి ప్రతిస్త్రీని ప్రేమిస్తున్నట్లుగా నటించి వాళ్ళ సృజనాత్మకతను సభలలో తన ప్రతిభగాకింద భావింప చేసుకొంటాడు. రెండవరోజుకూడా అలా చెయ్యాలనుకొన్న ఆతని కుట్రను ముందుగా గ్రహించిన ఆకాంక్ష మరునాటి సెమినార్ కి మార్కెటింగ్‌కి సంబంధించిన నాలుగు కొత్త ప్రతిపాదనలు చేస్తూ పేపరును ప్రిపేర్ చేసుకుంటుంది. ఆమె ప్రజంటు చేసిన ఆ పేపరును అందరు అభినందించటం జరిగింది. అంతేకాదు ఒక వ్యాపారసంస్థ ఆకాంక్షను జి.యుమ్.గా నియమించటంతో ఆకాంక్ష ఉన్నత పదవిని చేరుకో కలుగుతుంది.

స్త్రీల సృజనాత్మక శక్తులలను, మేధాశక్తిని పురుషులు తాము పదోన్నతికి పొందటానికి వీలుగా ఉపయోగించు కోవాలనుకునే కార్పొరేట్ 'కల్చర్' ఇక్కడ అర్థం అవుతుంది. ఆలాంటి పరిస్థితులలో స్త్రీలు ఉన్నత పదవులను చేరుకోవటం కష్టం అవుతుంది. స్త్రీలు తెలివిగా తమమేధా శక్తి దోపిడీకి గురికాకుండా చూచుకునే నైపుణ్యం కూడా పెంచుకోవాలి. ఆమెయొక్క సృజనాత్మక శక్తి తమసంస్థకు లాభాలు చేకూర్చ కలగలం భావించిన వ్యాపార సంస్థ ఆమెకు

జి.యమ్. పదవులను ఇవ్వడానికి సిద్ధపడింది. నైపుణ్యాన్ని పెంచుకున్న స్త్రీలకు సృజనాత్మక శక్తి వికసనం జరుగుతుందని ఆ సామర్థ్యంతోనే వారు ఉన్నత పదవులనుచేరుకోగలరనీ అర్థంఅయి సామర్థ్య నిర్మాణం యొక్క విలువలు స్పష్టంగా అర్థంఅవుతాయి. కుటుంబంలోని పితృస్వామ్య సంస్కృతి స్త్రీలు ఉన్నతపదవులకు పొంద నీయకుండా చేస్తుందని పి. సత్యవతి వ్రాసిన 'బదిలీ' అనే కథలో అర్థం అవుతుంది. రజనీకి ఉద్యోగరీత్యా హైద్రాబాద్ ట్రాన్స్‌ఫర్ అవుతుంది. భర్తని వదిలి పెట్టివెళ్ళటం యిష్టం లేక పోయినా హైద్రాబాద్ వెడితే ఉన్నత పదవి వస్తుందని ఆశపడుతుంది. భర్త ఒప్పుకోకపోయినా తను గమ్యానికి చేరుకోవడానికి నిర్ణయాన్ని మాత్రం మార్చుకోదు. ఆమెని అనుమానించిన భర్తయే మూడు ఏళ్ళ తరువాత ఆమె దగ్గరకు ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటాడు. ఈ కథలో రజనీ ప్రమోషన్ స్థాయీ పోస్టును చేరుకోవటానికి కుటుంబ పితృస్వామ్యపు అణచివేత అవరోధంగా అడ్డు తగిలినా దానిని ఆమె ఎదుర్కొనే సామర్థ్యాన్ని పెంచుకోవటంగా ఇక్కడ అర్థంఅవుతుంది. సందర్భయుతంగా సవాళ్ళను ఎదుర్కొనే సామర్థ్యాన్ని పెంచుకోవటం సామర్థ్యనిర్మాణంగా భావించవచ్చు.

ప్రపంచీకరణ సందర్భంలో సాంకేతికపరమైన ఉత్పత్తి స్థాయి పెరగటంతో వృత్తి నైపుణ్యం పెరగాల్సిన అవసరము ఏర్పడింది. ఉత్పత్తిఖర్చుల తగ్గింపులో భాగంగా కంప్యూటర్ల ఉపయోగం పెంచుకోవాల్సిన అవసరం వచ్చింది. ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేట్ రంగ సంస్థలకు మధ్యన ఒక ఇంటర్మీడియట్ సెక్టార్ వచ్చింది. ఇది ఉన్నత స్థాయి సాంకేతిక విధానం పునాదిగా ఏర్పడింది అకౌంటు, ఇన్స్యూరెన్స్, లీగల్, ఫైనాన్సింగ్, మార్కెటింగ్ ఏజంట్లకు కంప్యూటర్ స్పెషలిస్టులను తయారు చేయడం ఈ పరిశ్రమల విధానం. ఉన్నత విద్య వృత్తిపరమైన శిక్షణవ్యాపార సంస్థలనిర్వహణనైపుణ్యాన్ని అందుకునే స్థాయికి స్త్రీలు ఉండాలంటే అటువంటి రంగాలలో కూడా శిక్షణను పొందాల్సిన అవసరము వుంటుంది. స్త్రీ, పురుష అసమాన నైతికసంస్కృతి గల వ్యవస్థలో స్త్రీలు అటువంటి శిక్షణా కార్యక్రమాలకు టూర్లు వెళ్ళినప్పుడు తోటి పురుష ఉద్యోగులలో తను మాట్లాడిన విషయాన్ని భార్య చెప్పినప్పుడు భర్త భార్యకు విడాకులు ఇవ్వాలనుకునే

కథలుకూడా వచ్చాయి. కాబట్టి వీటికి ప్రత్యామ్నాయకంగా ఒక ప్రక్క స్త్రీ పురుషుల అసమానతలు పోగొట్టుతూ మరొక ప్రక్క స్త్రీలు ఉన్నత పదవులు చేరుకునే మెట్ల మార్గాలను సరళీకరించుకుంటూ ముందుకు వెడితే గాని స్త్రీలలో యాజమాన్య నిర్వహణా సామర్థ్యం పెరగదనే స్పృహని కూడా ఈ కథాసాహిత్యా ధ్యయనం కలిగిస్తుంది. పితృస్వామ్యాన్ని తొలగించుకోవటానికి సంస్కృతీ సరళీకరణను మొదటి మెట్టుగా స్త్రీలు భావించారు.

స్త్రీలు ఉన్నతస్థాయి ఉద్యోగాలలో నిలదొక్కు కోవాలంటే నాయకత్వ లక్షణాలను పెంపొందించు కోవాలి. అయితే స్త్రీల నాయకత్వాన్ని ఆమోదించలేని పురుష మనస్తత్వం స్త్రీలను లైంగిక వేధింపులకు గురి చేయడానికి ప్రయత్నిస్తుంది కాబట్టి ఉద్యోగస్తులలో 'జెండర్ సెన్సిటివిటీని' కలిగించాల్సిన అవసరాన్ని తెలియజేస్తూ వచ్చిన కథ కుప్పలి పద్మ రచించిన 'సర్వస్వం' స్త్రీల సర్వస్వాన్ని దోచుకుంటే స్త్రీలు ఇంక ఏమీ చేయలేరనే భావనలో ఉన్న పితృస్వామ్యంలో స్త్రీ నిరాశా నిస్పృహలను జయించి 'సెటిలైట్' ఛానల్ పెట్టే సంస్థలో ఉద్యోగాన్ని నిర్వహిస్తూ. 'జెండర్ సెన్సిటివిటీ' కార్యక్రమాలకై 'జెండర్ సెన్సిటివిటీ' శిక్షణను ఇవ్వాలనుకొంటుంది. అంటే స్త్రీలను లైంగికంగా దోచుకుని 'సర్వస్వాన్ని' దోచుకోవచ్చనీ, మహిళలను విలువ లేకుండా చేయాలనుకునే భావన కలిగిన పురుషుల విషయంలో కూడా 'సర్వస్వం' ఉంటుందనీ, మహిళలనాయకత్వాన్ని గౌరవించే రోజే దాని విలువ దానికి ఉంటుందని తెలియచేస్తుంది. ఆ విధంగా పురుషుల స్వభావాలను మార్పుకుగురిచేస్తూ ముందుకు వెళితేనే మహిళలకు వ్యాపారసంస్థలో తమ సృజనాత్మకత శక్తులను, సామర్థ్యాలను పెంపు చేసుకునే అవకాశాలను గాని వాతావరణం గాని ఉంటుందని భావించవచ్చు.

స్త్రీల మేధోవికాసం ఆర్థికాభివృద్ధికి ఎంత అవసరమని భావించవచ్చు. అందుకే మహిళాభివృద్ధికి స్త్రీ–పురుష అసమానతలు అవరోధాలుగా నిలిచాయి కాబట్టి ఆ విషయంలో పురుషులకు 'జెండర్ సెన్సిటివిటీ' మీద శిక్షణఇవ్వాల్సిన అవసరాన్ని వ్యాపార సంస్థలు గుర్తించి తమ వ్యాపారాభివృద్ధికి స్త్రీల మేధో శక్తులను ఉపయోగించుకోవాలనుకున్న భావన కూడా అర్థం అవుతుంది. స్త్రీల

సృజనాత్మక వికాసానికి అవకాశాలను కల్పించడం కూడా సామర్థ్య నిర్మాణంలో ఒక భాగమే అంతే గాక లైంగిక వేధింపులు లేని వాతావరణంలోనే స్త్రీలు తమ నాయకత్వ లక్షణాలను పెంచు కోగలరని కూడా ఈ కథ వల్ల అర్థం అవుతుంది. అప్పుడే మహిళా సాధికారికత సాధించ వచ్చని గ్రహించి ఐక్యరాజ్యసమితి 2000 సం.ను అంతర్జాతీయ మహిళా సాధికారికత సంవత్సరంగా ప్రకటించింది.

నేటి ప్రపంచీకరణ సందర్భంలో సామర్థ్యాల పెంపు వ్యాపార సంస్థల అభివృద్ధికి అవసరమని భావించటంలో భాగంగా స్త్రీల మేధో శక్తి సృజనాత్మకత శక్తి వ్యాపార అభివృద్ధికి మరింతగా దోహదం చేస్తుందని భావించారు. వీటికి చారిత్రక మూలాలు మనకు 13 వ శతాబ్దంలో కనపడతాయి. 13 శతాబ్దంలో రాజ్యపాలనా నిర్వహణ సామర్థ్యం కలిగిన స్త్రీగా రాణి రుద్రమదేవి ప్రపంచ చరిత్రలోనే ప్రథమోదాహరణగా చెప్పవచ్చు. కాకతీయురాలైన గణపతిదేవ చక్రవర్తికి కొడుకులు లేనందున పెద్ద కుమార్తె రుద్రమ దేవి తనకు ముగ్గురు కుమార్తెలు పుట్టిన తర్వాత ఖడ్గ విద్యలు యుద్ధ విద్యలు నేర్చుకొని సింహాసనాన్ని అధిష్టించిన విషయాన్ని మహిళల శక్తి సామర్థ్యాల పెంపుకు సామర్థ్యాల నిర్మాణానికి జరిగిన ప్రయత్నానికి ప్రథమ చారిత్రక ఉదాహరణగా భావించవచ్చు. అయితే ఇది రాజ కుటుంబీకులకు వీలయ్యే విషయంగ భావించుతారు. కానీ అదే 13 శతాబ్దంలో వ్యాపార వర్గాల అభివృద్ధి జరగటం కూడా చారిత్రిక వాస్తవం. రాజకీయ విషయాలలో అపాయంలో ఉపాయం చెప్పగల వారి కోసము అన్వేషణ జరుగుతున్న సమయంలోనే ఒక వైశ్యుడు కూడా ఆటువంటి తెలివి తేటలు గల అమ్మాయిని కోడలిగా చేసుకోవడానికి అన్వేషణ సాగించిన విషయం 13 శతాబ్దానికి చెందిన మంచన అనే కవి వ్రాసిన “కేయూర బాహు చరిత్రం” అనే కావ్యంలో కన్పడుతుంది. బియ్యానికి సరి సమానంగా నూనె ఇవ్వగల అమ్మాయి కోసము పరీక్ష పెట్టాలనుకున్న ఆ వ్యాపారి దండోరా వేయిస్తూ తిరుగుతుంటాడు. అది లాభసాటి కాని విషయమని ఎవ్వరూ ముందుకు రారు. అయితే ఒక బాలిక మాత్రం ముందుకు వచ్చి ఒక పళ్ళాన్ని తెచ్చి దానిలో ఎత్తుగా బియ్యం పోసి తీసుకుని అదే పళ్ళెంలో నూనెను పోసి ఇస్తుంది.

తూనికలోని విలువల తేడాను గమనించిన ఆమె పళ్ళెంలో పోసిన పదార్థాల పరిమాణంలోని అంతరంతో నష్టం లేకుండా పదార్థాల విలువలు సరిసమానం చేయగలిగింది. ఆమె తెలివికి మెచ్చి వ్యాపారి ఆమెను తన కోడలుగా చేసుకోవాలనుకుంటాడు. అదే విధంగా నేటి ప్రపంచీకరణ సందర్భంలో కూడా మహిళ సామర్థ్యాల పెంపు వ్యాపార సంస్థల అభివృద్ధికి మరింతగా దోహదం చేస్తుందని భావించారు. అంతే కాదు గృహనిర్వహణలో సమర్థురాలైన స్త్రీల సామర్థ్యాలను వ్యాపార సంస్థల నిర్వహణలో కూడ వినియోగింప బడితే ఆర్థికాభివృద్ధి జరుగుతుందనే. నమ్మకం ఏర్పడుతున్న రోజుల్లో స్త్రీల సామర్థ్యాల పెంపు జరిగే దిశగా నిర్మాణం జరగాల్సిన అవసరం ఏర్పడిందనేది కాదనలేని సత్యం. అయితే అడుగడుగునా అవరోధంగా నిలిచే పితృస్వామ్య సంస్కృతి సవాళ్ళను అధిగమిస్తూ స్త్రీలు తమ నైపుణ్యాలకు పరిజ్ఞానాన్ని పెంచుకో కలిగితేనే మహిళల సామర్థ్య నిర్మాణం జరుగుతుంది. పరిజ్ఞానాన్ని పెంచుకుంటూ వృత్తి నైపుణ్యాన్ని పెంచుకునే శిక్షణను పొందుతూ సృజనాత్మక శక్తులను వికసింప చేసుకుంటూ నాయకత్వ లక్షణాలతో నిర్ణయాత్మక పాత్రలలో మహిళలు భాగస్వాములు కాగలగటమే మహిళల ముందున్న కర్తవ్యం. మహిళలందరూ తమ సామర్థ్యాలను పెంచుకునే దిశగా సాగటమే మహిళాసాధికారిక దశగా భావించవచ్చు.

సింగరేణి భూగర్భగనిలో మహిళా నియామకం నిషిద్ధం. ఒకానొకప్పుడు భూగర్భ గనులలో పనిచేసిన మహిళలపై జరిగిన లైంగిక వేధింపుల ఫలితంగా ఈ నిర్ణయం తీసుకోవడం జరిగింది. కాని తల నొప్పికి మందుగా మోకాలికి చికిత్స చేయటం వంటిది ఇది. కాబట్టి ఆ చట్టబద్ధమైన నిర్ణయాన్ని మార్చవలసిన అవసరం నేడు ఏర్పడింది. మెకానికల్ ఆటోమిషన్, ఇంజనీర్లైన మహిళలకు గనిలో లైంగిక వేధింపులు లేని వాతావరణాన్ని కలిగించాలి. దానితో పాటు 1951 మైన్స్ చట్టాన్ని సవరించగలిగితే సింగరేణి కుటుంబ స్త్రీల సామర్థ్యాల అభివృద్ధి కూడా జరుగుతుంది. ఆ పని చేస్తున్నట్లు అర్థమవుతోంది. సున్నపురాయి ముగ్గుగల బరువైన తట్టలను తలపై పెట్టుకొని సింగరేణి రైలెక్కి, దిగి అమ్మే

మహిళలు గనిలో బొగ్గు తట్టలను మోయగలరనేది సింగరేణి గనులకు సంబంధించిన చారిత్రక వాస్తవం. అంతరిక్షంలోకి దూసుకుపోగలిగిన మహిళలు సైన్యంలో రాణించగలిగిన స్త్రీలు, సముద్రాలలో ఈదగలిగిన మహిళలు భూగర్భగనులలో కూడా తన శక్తి సామర్థ్యాలను నిరూపించుకో గలిగి భూమ్యాకాశాలను ఒకటిగా చేయగలరనేది అర్థమవుతుంది. ఈ మధ్యనే బొగ్గుగనులలో స్త్రీనియామకాలు జరుగుతున్నాయి. భూమిలోను ఆకాశంలోను సగంగా స్త్రీశక్తిసామర్థ్యాలు అభివృద్ధిచెందుతున్నాయి.

పల్లెల్లో గానీ, పట్టణాలలో గానీ స్త్రీలు అక్షరాస్యులు, విద్యావంతులై లోకానుభవాన్ని సంపాదించుకోవటంగా ముందడుగూ వేయాలి. తమ అభిరుచులను గుర్తుంచుకుంటూ చుట్టూరా ఉన్న సామాజిక సమస్యల పట్ల స్పందిస్తూ పితృస్వామ్య సంస్కృతిని ఎదుర్కొనే చైతన్యంతో పది అడుగులు వేస్తూ, స్త్రీలు అన్ని రంగాలలో తమ సామర్థ్యాలను పెంపొందించుకుంటుంటే మహిళా భివృద్ధి, మానవాభివృద్ధి, దేశాభివృద్ధి జరుగుతుందనటంలో అతిశయోక్తి లేదు.

*– తెలుగు వెలుగు మాసపత్రిక– మార్చి 2014.*



## 21. 'యశో బుద్ధ' - మానవత్వ బౌద్ధికత

2017 లో బుద్ధ జయంతి సందర్భంగా వెలువడిన ఓల్గా రచన 'యశో బుద్ధ' అనే నవల. ప్రసిద్ధ స్త్రీ వాద రచయిత్రిగా ఓల్గా పాఠకులకు సుపరిచితురాలు. బుద్ధుడు ఒక గొప్ప చారిత్రక వ్యక్తి. సిద్ధార్థుడిగా చేసిన ఆధ్యాత్మిక అన్వేషణా మార్గంలో సహకారాన్ని అందించిన మానవత్వం మూర్తీభవించిన ఆమె ఆతని భార్య యశోధర అని తెలియజేసే నవల ఇది. చరిత్ర నిర్మాణంలో మరుగున పడిన స్త్రీల చారిత్రిక నీడలపై వెలుగును ప్రసరింప జేసినప్పుడు, చరిత్రను నడిపించటంలోని స్త్రీల ఆలోచనలను, వారి భాగస్వామ్యాన్ని వ్యక్త పరచిన రచన కూడ. ఆధ్యాత్మిక సంపాదనకు పురుషులే వారసులని భావించే కాలంలో వారి అపోహలను పటాపంచలు చేయగలిగి స్త్రీలు కూడా విశాల ప్రపంచంలోకి వచ్చి మానవత్వంతో ఆధ్యాత్మిక సాధన చేయగలరనీ యశోధర పాత్ర ద్వారా నిరూపించిన నవల ఇది. రచయిత మాటలలోనే "స్త్రీలను బంధితులుగా చూసే దృక్పథాన్ని మార్చి సామాజిక అభివృద్ధిలో వారి పాత్రకు గుర్తింపును తేవాలని ప్రయత్నించటం ప్రపంచాన్ని స్త్రీల దృష్టి నుండి చూసేందుకు తన రచన దోహదపడాలనుకోవటాన్ని" అర్థంచేసుకోవచ్చు.

"ది హిందూ" దిన పత్రికలో ప్రచురితమైన సుమనరాయ్ వ్యాసంలో ఆధ్యాత్మిక మార్గం పట్టిన బుద్ధిడ్ని కీర్తించినట్లుగా, యశోధర ఇల్లువదలి పెట్టి

ఆధ్యాత్మిక సాధన చేస్తే సామజికామోదం ఉండేదా అనే ఆమె సందేహానికి ముందుగా సిద్ధమైన సమాధానమే ఈ నవల. బంధనాలనుండి విముక్తి చెందటమే 'స్వేచ్ఛ'గా భావించే బౌద్ధ భిక్షుణిలు 'నేను స్వేచ్ఛా జీవిని' అనే దాన్ని మకుటంగా చేసుకొని పాడటంలోని ఆంతర్యం ఈనవలలో స్పష్టమయింది. కొడుకును పెంచే బాధ్యత నిర్వహించిన తరువాత యశోధర సంసార బంధనాలనుండి విముక్తి చెంది మానవసమాజంలో సేవచేయాలనుకోనే 'స్వేచ్ఛా' ప్రవృత్తియే జ్ఞాన మార్గంగా చెప్పబడింది. స్త్రీల వ్యక్తిత్వాల మీద, వారి ఆత్మ గౌరవం మీద అచంచల విశ్వాసంగల ఓల్గా చారిత్రిక స్ఫురణతో యశోధరను 'యశోబుద్ధ'గా తీర్చి పాఠకహృదయాలను ఒప్పింప చేయగలిగారు.

సిద్ధార్థుని జ్ఞానతృష్ణ ప్రకృతి సహజమై తనకు జన్మనిచ్చిన తల్లి స్పర్శను గురించిన అన్వేషణతో ప్రారంభమవుతుంది. ఆధ్యాత్మక అన్వేషణలో అంతర్గత మానవ ప్రేమను నింపి జ్ఞానమార్గం వైపు నడిపించే మనస్తత్వం ఏర్పడటానికి పునాదిగా సిద్ధార్థుడిలోని సమబుద్ధిని వెలుగులోకి తేవటం ఆపాత్రకొక విశిష్టతను కలిగించింది. పశుపక్షాదులయెడల అతనికి ప్రేమ. దానిలో భాగంగానే గౌతముని యొక్క యజ్ఞపశువులను తన అధీనంలో ఉంచుకోవాలనుకుంటాడు. లోకాన్వేషణలో భాగంగా మానవులకు శోకం లేకుండా చేయాలనుకుంటాడు. ఆ క్రమంలోనే సమాజంలో శాంతి కావాలంటే నీరు, ఆహారం, సంపదల సమృద్ధి కావాలని అర్థమైంది. సిద్ధార్థుని దృష్టిలో సమృద్ధి అంటే "సమవృద్ధి" జరగటమే. భోగభాగ్యాలు పరాక్రమ శక్తి ఉన్నా అహింసాతత్త్వంతో పరస్పర యుద్ధాలను నివారించే దిశగా ప్రజలకు అవగాహన కల్పించి శాంతిని నిలబెట్టే క్రమంలో సిద్ధార్థుడి జ్ఞానాన్వేషణదశ విస్తృతమైంది. యుద్ధాలను ఆపటమంటే ఇరుపక్షాలకు జయాన్ని కలిగించటమనేదే యుద్ధం, అనే నూతన భాష్యం చెప్పటం జరిగింది. యుద్ధం చేయటం నీళ్ళ కోసం అయినా ఒకళ్ళనొకళ్ళు చంపుకోవటం కోసమేనా? లేదా నీళ్ళు వృథా కాకుండా నిల్వ చేసుకుంటే ఉపయోగమా? అని బుద్ధుడు ఆలోచించమనగానే ఆ యుద్ధం ఆగిపోవటం జరిగింది. ఇదే శాంతి సమృద్ధి

మార్గం. సమాజంలోని మానవుల వేదనను నివృత్తి చేసే దిశగా ఆలోచించే టట్లుగానూ, యుద్ధాల మరణాలకు కారణం మానవాహంకారం అనీ దాన్ని వదిలిపెట్టి సమస్యలను సదవగాహన చేసుకొంటే శాంతి ఏర్పడుతుందనే బోధన చేసినట్లుగా పాత్ర చిత్రణ చేయటం అనన్య సాధారణం.

వేదికపై ధ్యాననిమగ్నుడైన సిద్ధార్థుని, తొలిచూపులో యిష్టపడటమే యశోధర హృదయావగాహనకు భూమిక అయింది. స్త్రీల మెదడుకు జ్ఞానముంటుందని నిరూపితమైన సాహిత్య రచన. సిద్ధార్థునికి యశోధరపై ఉన్న ఆకర్షణలో స్నేహభావం ఏర్పడింది. అందుకే పెళ్ళి అనేది పరస్పర అంగీకారంతో ప్రవేశించే మానసిక బంధం అని భావించడంతో స్వయంవరంలో పోటిపడి యశోధరను గెలుచుకోవాలని సిద్ధార్థుడు భావించలేదు. అందుకే యశోధరతో సిద్ధార్థుడు పెళ్ళికి ముందుగానే తమ బంధం శాశ్వతం కాదని తను ఎప్పటికైనా ఆమెను వదిలి వెళ్ళవచ్చని చెబుతాడు.

యశోధర తండ్రి బింబానుడు యజ్ఞం మొదలుపెడుతున్నట్లు కబురు పంపితే యశోధర ముందుగా వెళ్ళి ఆ యజ్ఞాన్ని ఆపాలనుకుంటుంది. యజ్ఞం రూపంలో ఉన్న కాసిన వనరులను బూడిద పాలు చేయవద్దని అగ్నికి ఆహుతి చేసే ధాన్యాన్ని బానిసలకు ఇస్తే వ్యాధులు తగ్గి ఆరోగ్యవంతులు అవుతారని చెబుతుంది. పైపెచ్చు పేదల పశువులను బలవంతంగా లాక్కుని బలివ్వటం చేస్తే యజ్ఞం వల్ల మంచి ఫలితాలుంటాయా అని ప్రశ్నిస్తుంది. భార్య అయిన యశోధర మాటలు సిద్ధార్థుని జ్ఞానార్తిని మరింతగా ప్రజ్వలింప చేస్తాయి. అదే బుద్ధుని త్రిసూత్రాలకు మూల సూత్రమైంది. అదే స్థాయిలో సిద్ధార్థుడికి తగ్గట్టుగా యశోధర కూడా అతనిని అవగాహన చేసుకునే క్రమంలో అతని జ్ఞాన మార్గాన్ని అనుసరించాలనుకోవటంతోబాటు, సిద్ధార్థుడి కుటుంబ బాధ్యతలను స్వీకరించే విధంగా సహకారం ఇవ్వటం, బుద్ధుడి జ్ఞానాన్వేషణకు బలంగా మారింది.

ముందునుండే యశోధరకు తండ్రి బింబానునికి స్త్రీలంటే గౌరవభావం లేదని ఆమెకు తెలుసు. అందుకే సిద్ధార్థుడంటే ఏమిటో తెలుసుకోవాలనే అన్వేషణను యశోధర మొదలు పెడుతుంది. తనకు లోకాన్ని అర్థంచేసుకోవటం కంటే కూడా ముందుగా ప్రశాంతంగా స్త్రీగా అవమానపడకుండా గౌరవంగా బ్రతికే జీవితం కావాలనుకుంటుంది. పురుషులు ఆడవారి మాటలకు విలువనివ్వనపుడు స్త్రీలు తమ వేదనతో అపమార్గంలో ప్రవేశించి జీవితాలను నిరర్థకం చేసుకుంటున్నారని, మగవారి పట్ల బాధ్యత తీసుకోవటం వలనే స్త్రీలు వివేకవంతులౌతారని గౌతమిపాత్ర ద్వారా రచయిత పాఠకులకు ఒక సామాజిక అవగాహనను పెంచాలనుకుంది.

స్త్రీలను ఆలోచన పరులుగా, సత్యాణ్వేషకులుగా సమాజము ఆమోదించదు కాబట్టి స్త్రీలను గురించిన సత్యాన్ని కనుక్కోవాలని సిద్ధార్థుడితో యశోధర అంటుంది. స్త్రీలకు జ్ఞానమార్గాన్ని నిషేధించకుండాచేస్తేనే సత్యం బోధపడుతుందనీ, దానికై సిద్ధార్థుడు చేసే అన్వేషణ మొదలు పెట్టేందుకు బంధాలనుండి బయటపడమని చెబుతుంది. సిద్ధార్థుడు తాను గ్రామమంతా తిరిగినప్పుడు మానవులు జనన మరణాలనే దుఃఖ సముద్రములో మునిగి యున్నారని ద్వేషం, అసూయ, అశాంతి, పగతో నిండిన దుఃఖపథంలో సమాజం నిండియున్నదనీ ప్రేమ, కరుణ అరుదుగా ఉన్నాయని యశోధరతో చెపుతాడు. అప్పుడు ఆమె మానవులను ఆ దుఃఖపథంలోనుండి ముక్తి మార్గంలోకి మళ్ళించాలని దానికి తన సహకారం ఉంటుందని స్త్రీలకున్న సత్యానేషణ మార్గాన్ని కనుగొంటే స్త్రీలకు దారి లభిస్తుందని యశోధర చెబుతుంది. స్త్రీలు గృహంలోనే ఉండటం వల్ల వారి బుద్ధి వికసించలేదని దానికై ప్రతి ప్రాణిని ప్రేమించే జ్ఞానం కావాలని చెప్పింది.

ఏ వ్యక్తి ఒక్కరాత్రిలో భార్యబిడ్డలను పరిత్యజించి సన్యాసి కాలేదు. అంచెలంచెలుగా సామాజికానుశీలంలో పొందిన మనోపరిపక్వతతో సిద్ధార్దుడు

జ్ఞానాన్వేషణకై బయలుదేరటానికి ముందు అతని కుటుంబ బాధ్యత వహించ గలనని చెప్పిన యశోధర సహకార ధీరత్వబలంతో, బుద్ధుడు నిశ్చింతగా జ్ఞాని కాగలిగాడని నవల తెలియజేస్తుంది. స్త్రీల ఆలోచనలకు విలువనిచ్చినప్పుడే ఆధ్యాత్మక అన్వేషణను స్త్రీలు సదవగాహన చేసుకోగలరనీ, వారు కూడా ఆ జ్ఞాన మార్గంలో ప్రయాణంచేయగలరని నవల నిరూపిస్తుంది. ఆధ్యాత్మిక తత్వంలో అంతర్వాహినియైన ప్రేమ సంఘహితం కోరుకుంటుంది. అటువంటి స్త్రీ – పురుష సంబంధాలు సమాజాభ్యుదయ దిశగా సాగితే మానవ ధర్మం ప్రకాశిస్తుందనీ తెలియజేసే నవల. పేదలను, జీవులను బలిపెట్టిచేసే యజ్ఞయాగాదుల పట్ల యశోధర సిద్ధార్థుల నిరసనయే ప్రజాహిత ధర్మంవైపు అడుగులు వేయించటంతో యశోధర తన ఆధ్యాత్మిక అన్వేషణను విస్తృతంచేసింది. సమాజాన్ని బాగు చేయటమే ధర్మప్రబోధ లక్ష్యమనీ దానికి నిస్వార్థత తోడు కావాలని భావించిన యశోధర సిద్ధార్థునితో 'చివరగా తనతో చెప్పకుండానే మహాభినిష్క్రమణం చేయమని' చెప్పిన యశోధర ధీరవనితగా నిలిచింది.

ఓల్గా తాను వ్రాసిన 'విముక్త' అనే కథలో చెప్పినట్లుగా 'ఎవరి అధికారానికి లొంగక ఎవరిమీద అధికారం చూపించవప్పుడు ఏవ్యక్తి అయినా తనను తాను విముక్తం చేసుకోగలుగుతాడనీ, అదే ఒక ఆనందం గొప్ప శాంతిని, ప్రేమని కలిగిస్తుందని, అప్పుడు వ్యక్తి తనకి తానుగా మిగలటం జరుగుతుందనే' భావన ఇక్కడ నిరూపితమవుతుంది. అంతేకాదు 'సత్యాన్వేషణ సత్యాగ్రహంతో మొదలవుతుంది. మొదలు పెట్టినపుడు అది ఆగ్రహమే. కాని క్రమంగా అది సత్యం కోసం తనలో తాను, తనతో తాను చేసుకునే అన్వేషణగా మారుతుంది' అనే భావనతో బుద్ధుడి జ్ఞానాన్వేషణ మార్గంలో గౌతమిని భాగస్వామ్యురాలిగా చేసి, కొడుకును పెంచిన తర్వాత బుద్ధుడి అడుగుజాడలో నడిచేటట్లు చేస్తుంది. తోటి స్త్రీలను కలుపుకొని వారిని బౌద్ధ భిక్షుణిలుగా చేసి తాను వారితో కలసి అనారోగ్య పీడితులకు సేవలుచేస్తూ 'యశోబుద్ధ' అనే స్థితికి యశోధర

చేరుకొన్నట్లుగా కుశాల పాత్ర ద్వారా చెప్పించటం జరిగింది. యశోధరను మదర్ థెరిస్సాకు మాతృక అన్నట్లుగా పాఠకుల హృదయాలలో నిలబడేటట్లుగా రచయిత్రి తన ఆలోచనలకు పదును పెట్టటం అందరినీ ఆలోచింప చేస్తుంది. జ్ఞానానికి బుద్ధుడు, యశోధర రెండు సమపార్శ్వాలని యశోబుద్ధను పాఠకులచేత భావింపజేయుటం పరిపక్వమైన రచనకు తార్కాణం. ఆధ్యాత్మిక అన్వేషణ మార్గంలో స్త్రీలను భాగస్వామ్యం చేసిన తెలుగు చారిత్రక నవల ఈ యశోబుద్ధ. బౌద్ధమత పారిభాషికా పదాలు లేకుండా సులభశైలిలో సాగిన ఈ రచన పాఠకుల మానవీయధర్మాన్ని ఉత్తేజింప చేయగలుగుతుందనేది నిస్సందేహం.

*– ఆంధ్రజ్యోతి దినపత్రిక–వివిధ–08. 04. 2019.*

రచయిత : **జంధ్యాల కనకదుర్గ**



పుట్టినతేది : 10-04-1953

తల్లిదండ్రులు : జంధ్యాల కుమారస్వామి, లక్ష్మీప్రసన్నమ్మ

**విద్యార్హతలు :**

1) ఎమ్.ఏ - ఆంధ్రా విశ్వవిద్యాలయం (బంగారుపతకం) 1974
2) ఎమ్.ఫిల్ - కాకతీయ విశ్వవిద్యాలయం (రెండు బంగారు పతకాలు) 1990
3) పి.ఎచ్.డి - కాకతీయ విశ్వవిద్యాలయం 1994

**వృత్తి అనుభవం :**

34 సం.లు - లెక్చరర్, రీడర్, ప్రిన్సిపాల్ -
సింగరేణి కాలరీస్ మహిళా డిగ్రీ కళాశాల, కొత్తగూడెం, ఖమ్మంజిల్లా.
సత్కారం - ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు ఉత్తమ ఉపాధ్యాయిని పురస్కారం, 1994
మరియు ఇతర సంస్థల పురస్కారాలు

**పరిశోధనలు :**

1) యు.జి.సి. రీసెర్చ్ ఫెలోషిప్ అవార్డు - 1975
2) యు.జి.సి.మైనర్ రీసెర్చ్ ప్రాజెక్టు-సింగరేణి గనికార్మికజీవన చిత్రణ 1998
3) యు.జి.సి.మేజర్ రీసెర్చ్ ప్రాజెక్టు- ప్రపంచీకరణ సందర్భంలో
స్త్రీ పురుష సంబంధాలు-2004
4) BOLT అవార్డు ఆఫ్ ఎయిర్ ఇండియా

**ప్రచురణలు :**

పుస్తకాలు 7-(1) కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక (2) తెలుగు స్వతంత్ర కథాకావ్యాలలో మహిళా జీవన చిత్రణ (3) తెలుగు సాహిత్యం-మహిళా చైతన్య ప్రస్థాన (4) సింగరేణి సాహిత్యం-గని కార్మిక జీవనం (5) సాహితీ సుమాలు (6) సాహిత్యం-సత్త్వదర్శిని (7) స్వతంత్రత నుండి... స్వాతంత్ర్యానికి - (తెలుగులో స్త్రీల సాహిత్యం 190 1947)

వివిధ పత్రికలలో ప్రచురింపబడిన విమర్శ వ్యాసాలు - 40

అభిరుచి - నిరంతర తెలుగు సాహిత్యాధ్యయనం - పరిశోధన

సాహిత్యాన్ని సత్యదర్శినిగానేకాక సత్త్వదర్శినిగా కూడా దర్శించింది కనకదుర్గ. ఈ సత్త్వం స్త్రీ సత్త్వంకూడా. పురాణాలు, కావ్యాలు, కథల్లో చీకటికోణం 'అట్టడుగునపడి కాన్పించని' నిగూఢసత్యాలను సాహసించి వెలికితీసింది ఈ రచయిత్రి. అందులో అణగారిన స్త్రీమూర్తుల 'భయంకర బాధల పాటల పల్లవి' విన్పించింది. ఈ ఇరవై వ్యాసాలు చదువుతుంటే ఇంతకాలంగా మనం మామూలుగా చదువుతూ వస్తున్న సాహిత్యంలోనే యిన్ని స్త్రీసంబంధ నిగూఢ విషయాలు దాగున్నాయా అని ఆశ్చర్యం కలిగింది... ఇటువంటి సద్విమర్శనాత్మక రచనలు ఎంత విరివిగా వస్తే అంతగా మన సాహిత్యలోకం సంపద్వంతమవుతుంది.

– పాపినేని శివశంకర్

సాహిత్యంతో పాటు, సమాజాన్ని, సామాజిక పరిణామాలను ఎంతో సునిశితంగా గమనించే కనకదుర్గగారు ఈ వ్యాసాల్లో ఒక్క సాహిత్య విమర్శకురాలిగానే కనిపించరు. ఒక సామాజిక, చారిత్రక శాస్త్రవేత్తగా కూడ కనిపిస్తారు..ఇద్దరు మహిళా శతక కర్తల గురించి రాసిన వ్యాసాలు (దార్ల సుందరమ్మ, వేమూరి శారదాంబ) కొత్త విషయాలను ప్రతిపాదిస్తాయి. శతక కర్తలుగా స్త్రీలను ఇంత లోతుగా చర్చించిన వారు నాకు తెలిసి ఎవరూ లేరు. విమర్శను, పరిశోధననూ సమానంగా అందించిన రచన ఇది.

– డాక్టరు మృణాళిని

కథావస్తువులోని వక్రత సృష్టించిన శూన్యతలో యిమిడియున్న అస్పష్టమైన సత్యాన్ని వెలికితీసి నూతనవిలువలనే జ్ఞానకాంతుల లక్ష్యంగా సాగిన వ్యాసాలను 'సాహిత్యం-సత్త్వదర్శిని' అనే పుస్తకరూపంలో కూర్చి ప్రచురించి పాఠక సహృదయులకు అందించాలనుకోవటం జరిగింది.ఇక్కడ సత్త్వదర్శిని అంటే సాహిత్యాంశంలోని జ్ఞానప్రకాశనం అని అర్థం. సాహిత్యం ఒక ఊటబావి. ఎప్పటికప్పుడు అందులోని సాహిత్యాన్ని అందుకుంటూ, అందుబాటులో ఉన్నదాన్ని ఆశ్రయించటం జరిగింది. తెలుగుసాహిత్యాన్ని అన్వేషించే కొద్దీ లభ్యమయ్యే సాహిత్యం ఇంకా మిగిలే ఉంటుంది.

– డాక్టరు జె. కనకదుర్గ